# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం-1857

భారతదేశాన్ని బ్రిటిష్ కబంధ హస్తాలు నుంచి విముక్తం చేయడం కోసం జరిగిన తొలి సంగ్రామంగా 1857 తిరుగుబాటు విశిష్టతను సంతరించుకుంది. నిరంకుశత్వం, దోపిడి అణువణువునా నిండిన వలస పాలకులకు బెదురు పుట్టించి వారి నిష్క్రమణకు నాంది పలికిన ఈ తిరుగుబాటుకు కారణాలనేకం. 1848 నుంచి 1856 వరకు గవర్నర్ జనరల్‌గా పని చేసిన డల్హౌసి అమలు చేసిన రాజ్య సంక్రమణ విధానం తిరుగుబాటుకు ప్రధాన ప్రేరకంగా మారింది. దత్తత ద్వారా రాజ్యాధికారాన్ని అందుకునే అర్హతను తిరస్కరిస్తూ డల్హౌసి 1848లో సతారా, 1849లో జైపూర్-సంబల్‌పూర్, 1850లో భగత్, 1852లో ఉదయ్‌పూర్, 1853లో జాన్సీ, 1854లో నాగపూర్ సంస్థానాలను ఆక్రమించాడు. పాలన అసమర్థతను కారణంగా చూపి అయోధ్య నవాబును తొలగించడంతో పాటు, మొఘల్ చక్రవర్తి రెండో బహదూర్ షాను కూడా తొలగించాడు. ఈ పరిణామాలు భారతీయ పాలకుల్లో బ్రిటిషర్లపై వ్యతిరేకతను పెంచాయి.

వీటికి తోడు పెరుగుతున్న పన్నుల భారం, ఉపాధి అవకాశాలు తగ్గిపోవడం, పెచ్చుమీరిన అసమానతలు, నేతన్నల బతుకులు దుర్భరంగా మారిపోవడం వంటి కారణాలన్నీ ఆనాటి సమాజంలో ఆంగ్లేయుల పాలనపై అసంతృప్తిని రాజిల్లచేశాయి. మరోవంక క్రైస్తవ మతాన్ని వాయువేగంతో దేశంలో వ్యాప్తిచేయడం కోసం ఆంగ్లేయులు చేసిన ప్రయత్నాలు భారతీయుల్లో తీవ్ర ఆందోళనను రేకెత్తించాయి. 1833 చార్టర్ యాక్ట్ మిషనరీ స్కూళ్ల విస్తరించడం, క్రైస్తవాన్ని స్వీకరించిన వారికి కూడా ఆస్తిలో హక్కు ఉంటుందని 1850లో ప్రవేశపెట్టిన చట్టం భారతీయ మేధావి వర్గంలో పునరాలోచనకు కారణమైంది. మరో వంక రెండు లక్షలకు పైచిలుకు ఉన్న భారతీయ సేనానుల పట్ల ఆంగ్లేయులు అనుసరిస్తున్న అణచివేత ధోరణి తిరుగుబాటుకు ఆజ్యం పోయడానికి ముఖ్య కారణమైంది. అతి తక్కువ జీతాలు, వర్ణ వివక్ష, అవమానాల వంటివన్నీ దేశీయ సైనికుల్లో ఆగ్రహానికి కారణమయ్యాయి. సైనికులందరూ జుత్తును చిన్నగా కత్తిరించుకోవాలంటూ 1856లో కానింగ్ ప్రవేశపెట్టిన నిబంధన సనాతన సంప్రదాయాలను అనుసరించే సిపాయిల్లో ఆవేశాన్ని రగిల్చింది. ఆవు కొవ్వు, పంది కొవ్వు పూసిన తూటాను ఉపయోగించాల్సిందేనంటూ 1856లో తీసుకున్న నిర్ణయం హిందూ, ముస్లింల మనోభావాలను తీవ్రంగా గాయపరచింది.

### వీరోచిత పోరు...

1857 మార్చి 29న 34వ బెటాలియన్‌కు చెందిన మంగళ్ పాండే బ్రిటిష్ అధికారిపై తిరగబడి, కాల్పులు జరిపాడు. ఆ పరిణామం తర్వాత ఏప్రిల్ 8న అతడిని బహిరంగంగా ఉరితీశారు. అనంతరం 1857 మే 10న అనేకమంది సిపాయిలు తిరుగుబాటు చేసి ఖైదులో ఉన్న తమ సహచరులను విడిపించుకొని ఢిల్లీ బాట పట్టారు. జనరల్ బఖ్త్‌ఖాన్ ఆధ్వర్యంలో ఢిల్లీ చేరిన భారతీయ సేనానులు మే 11న మొఘల్ పాలకుడైన రెండో బహదూర్ షాను చక్రవర్తిగా ప్రకటించారు. వెనువెంటనే తిరుగుబాటు దేశం నలుమూలలకు పాకింది. ఢిల్లీని పునరాక్రమించుకుంటే మినహా తమకు అస్తిత్వం లేదని భావించిన బ్రిటిష్ పాలకులు నైవెలిన్, చాంబర్లీన్‌ల సారథ్యంలో సేనానులను పంపారు. సెప్టెంబర్ 20న రెండో బహదూర్ షాను, అతని భార్యను బంధించి వారిని రంగూన్‌కు తరలించారు. అత్యంత కీలకమైన ఘట్టంగా కాన్పూర్ తిరుగుబాటు చరిత్రలో నిలిచిపోయింది. తాంతియాతోపే, నానాసాహెబ్‌ల నేతృత్వంలో అత్యంత వీరోచితంగా జరిగిన పోరాటాన్ని కాలిన్ కాంప్‌బెల్, అతని సహచరుడు హావలాక్‌లు ఎట్టకేలకు అణచివేశారు. అయోధ్య నవాబు వజీద్ అలీషా ల తొలగింపును నిరసిస్తూ జరిగిన తిరుగుబాటుకు ఆయన భార్య బేగం బజరత్, మౌల్వి అహ్మదుల్లాలు నాయకత్వం వహించారు. జనరల్ ఫ్రాంక్, కాంప్‌బెల్, బహదూర్ జంగ్ గూర్ఖా సైన్యం కలిసికట్టుగా నిర్వహించిన దాడిలో అయోధ్య బ్రిటిష్ ఏలుబడిలోకి వెళ్లిపోయింది. జాన్సీకి నేతృత్వం వహిస్తున్న లక్ష్మీబాయి ఉదంతం 1857 తిరుగుబాటులో ఓ స్ఫూర్తిదాయక ఘట్టం. తాంతియాతోపె సహకారంతో లక్ష్మీబాయి జరిపిన పోరాటాన్ని హ్యూగ్‌రోస్ ఆధ్వర్యంలోని బ్రిటిష్ సేనలు ఎదుర్కొన్నాయి. హోరాహోరి పోరులో 1858 జూన్ 18న జరిగిన పోరాటంలో లక్ష్మీబాయి బ్రిటిష్ సైన్యం చేతిలో మృతిచెందింది. 1859 ఏప్రిల్ 19న తాంతియాతోపెను ఉరితీశారు.

### కారణాలు..

తిరుగుబాటు జాతీయ రూపాన్ని సంతరించుకోకపోవడం, సంఘటితంగా జరగకపోవడం, భారతీయ రాజులు-జమిందారులు, బ్రిటిషర్లకు సహకరించడం వంటి కారణాల వల్ల 1857 తిరుగుబాటు విఫలమైంది. కానీ తిరుగుబాటు కొత్త శకానికి నాంది పలికిందని చెప్పవచ్చు. కంపెనీ పాలన రద్దయి దాని స్థానంలో బ్రిటిష్ ప్రభుత్వ ప్రత్యక్ష పాలన ప్రారంభమయింది. గవర్నర్ జనరల్ స్థానంలో వైస్రాయి వచ్చారు. బ్రిటన్‌లో ప్రభుత్వ కేబినెట్‌లోని మంత్రిని భారత ప్రభుత్వ రాజ్య కార్యదర్శిగా నియమించారు. 1861 ఇండియన్ కౌన్సిల్ చట్టంతో న్యాయ చట్టం, పోలీస్ చట్టం అమల్లోకి వచ్చాయి. సైనిక వ్యవస్థలోనూ గణనీయమైన మార్పులు వచ్చాయి. ఫిరంగి

దళం పూర్తిగా బ్రిటిష్ అజమాయిషీలోకి వెళ్లింది.

## ప్రాక్టీస్ ప్రశ్నలు...

**1.ఢిల్లీలో తిరుగుబాటుదారుల సమాచారాన్ని ఎప్పటికప్పుడు బ్రిటీష ర్లకు చేరవేసి 1857 ఉద్యమాన్ని నీరుగార్చిన మొఘల్ చక్రవర్తి భార్య ఎవరు?**

ఎ) హజ్రత్ మహల్ బి) జిన్నత్ మహల్

సి) ముంతాజ్ మహల్ డి) ఫాతిమ బేగం

**2.తిరుగుబాటు చెలరేగిన ప్రాంతాలను వరుసక్రమంలో గుర్తించండి?**

1) మధుర 2) జాన్సీ

3) బరేలీ 4) కాన్పూర్

**కింది వాటి నుంచి సమాధానాన్ని గుర్తించండి**

ఎ) 1,3,4,2 బి) 2,4,1,3

సి) 3,2,1,4 డి) 4,2,3,1

**3.తిరుగుబాటు కాలంలో భారత గవర్నర్ జనరల్ ఎవరు?**

ఎ) డల్హౌసి బి) వెల్లస్లీ

సి) కానింగ్ డి) జాన్ నికల్సన్

**4.కిట్టూర్ తిరుగుబాటుకు నేతృత్వం వహించింది ఎవరు?**

ఎ) ధర్ రావ్ పవార్ బి) మధుకర్ షా

సి) చిట్టూర్ సింగ్ డి) చెన్నమ్మ

**5.1857 తిరుగుబాటుకు కేంద్రస్థానం కాని ప్రాంతమేది?**

ఎ) ఢిల్లీ బి) లక్నో

సి) ఆగ్రా డి) గ్వాలియర్

**6.1857 తిరుగుబాటులో చిట్టచివర లొంగిపోయిన నాయకుడెవరు?**

ఎ) రాణీ లక్ష్మీబాయి బి) బేగం హజ్రత్ మహల్

సి) తాంతియాతోపె డి) అజీముల్లా

**7.బహదూర్ షా నేతృత్వంలోని ఢిల్లీలో సేనానులకు నాయకత్వం నెరపింది ఎవరు?**

ఎ) బఖ్త్‌ఖాన్ బి) అజీముల్లా

సి) ఖాన్ బహదూర్ ఖాన్ డి) కన్వర్ సింగ్

**8.1857 తిరుగుబాటును భారత తొలి స్వాతంత్ర్య సంగ్రామంగా గుర్తించడానికి నిరాకరించిందెవరు?**

ఎ) అశోక్ మెహతా బి) వీర్ సావర్కర్

సి) ఎస్.ఎం. సేన్ డి) ఆర్.సి. మజుందార్

**9.తిరుగుబాటుకు మద్దతు తెలపని వర్గాలేవి?**

ఎ) వడ్డీ వ్యాపారులు బి) రైతులు

సి) మధ్య తరగతి విద్యావంతులు

డి) సంస్థానాధీశులు

**10. సిక్కు మతంలో సంస్కరణలు, సిక్కుల సార్వభౌమత్వాన్ని నెలకొల్పడమే లక్ష్యంగా 'కుకా' ఉద్యమాన్ని ప్రారంభించింది ఎవరు?**

ఎ) టిప్పు బి) భగత్ జవహర్‌మల్

సి) కరమ్‌సింగ్ డి) రాయ్ సింగ్

**11. నీలిమందు కార్మికుల పక్షాన నిలిచి 1858-60 ఉద్యమాన్ని నిర్వహించింది ఎవరు?**

ఎ) దీనబంధుమిత్ర బి) హరీశ్ చంద్ర ముఖర్జీ

సి) సిసిర్ కుమార్ ఘోష్

డి) బిష్ణు చరణ్ బిశ్వాస్, దిగంబర్ బిశ్వాస్

**12. బుందేల్‌ఖండ్‌లో తిరుగుబాటుకు నేతృత్వం వహించిందెవరు?**

ఎ) హసన్ ఖాన్ బి) పిర్ అలీ

సి) ఖాన్ బహదూర్ ఖాన్ డి) కన్వర్ సింగ్

**జవాబులు**

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| B | A | C | D | C | C | A | D | C | B | D | C |

# చరిత్రలో స్వర్ణయుగ రాజ్యం - గుప్తులు

మౌర్య సామ్రాజ్య పతనానంతరం దాని శిథిలాలపై ఎన్నో చిన్న, పెద్ద రాజ్యాలు ఆవిర్భవించాయి. మగధ మహాసామ్రాజ్యంపై మౌర్యుల స్థాయిలో ఏకమొత్తంగా ఎవరూ పట్టు సాధించలేకపోయారు. మౌర్యుల ఆఖరి రాజైన బృహద్రథుడిని వధించి పుష్యమిత్ర శుంగుడు శుంగ వంశాన్ని స్థాపించాడు. కేవలం మౌర్య సామ్రాజ్య తూర్పుభాగంపై మాత్రమే శుంగవంశం అజమాయిషీ చెలాయించగలిగింది. చివరి శుంగరాజైన దేవాభూతిని అతని మంత్రి వాసుదేవ కణ్వుడు క్రీ.పూ. 75లో వధించి కణ్వ సామ్రాజ్యాన్ని నెలకొల్పాడు. ఇదే సమయంలో కళింగ(ఒరిస్సా)ను కేంద్రంగా చేసుకొని చేదివంశం పాలన ప్రారంభమైంది. ఈ వంశంలో మూడోరాజైన ఖారవేలుడు అత్యంత ప్రసిద్ధుడు. భువనేశ్వర్‌కు సమీపంలోని ఉదయగిరి కొండ గుహల్లోని హాథిగుంఫా శాసనం ఖారవేలుడి గొప్పతనాన్ని, విజయాలను చెబుతోంది. జైన మతాభిమాని అయిన ఖారవేలుడు కుమారగిరిపైన జైనపరిషత్‌ను ఏర్పాటు చేశాడు. ఖారవేలుడి అనంతరం చేది వంశ చరిత్ర సమాప్తమైంది. మరోవంక బాక్ట్రియా నుంచి వచ్చి భారత వాయవ్య ప్రాంతాల్లో సామ్రాజ్య స్థాపన చేసినవారు ఇండో గ్రీకులు. వీరిలో అత్యంత ప్రసిద్ధుడు మినాండర్. ఈయననే బౌద్ధ గ్రంథాల్లో 'మిళిందుడు' అని వ్యవహరించారు. పాళిభాషలోని 'మిళిందపన్హ' (మినాండర్ ప్రశ్నలకు– బౌద్ధ గురువు నాగసేనుడి జవాబులు ఉన్న గ్రంథం) ఈయన గురించి వివరిస్తోంది. క్రీ.పూ. 50లో శకుల చేతిలో ఓడిపోవడంతో ఇండోగ్రీకుల కథ ముగిసింది. శకులలో మొదటి రాజు మావుస్. తక్షశిల రాజధానిగా ఈయన పాలన సాగించాడు. ఇతనికి 'రాజాధి రాజు' అనే బిరుదు ఉంది. శకుల అనంతరం పార్థియన్లు (పహ్లవులు) పాలించారు. ఈ మధ్యకాలంలో అత్యంత కీలకమైన ఘట్టం కుషాణుల పాలన. వీరిలో అగ్రగణ్యుడు కనిష్కుడు. క్రీ.శ.78న సింహాసనాన్ని అధిష్టించి 'శఖ' యుగాన్ని ఆరంభించాడు. పురుషపురం రాజధానిగా కనిష్కుడి పాలన సాగింది. అశ్వఘోషుడి ప్రోత్సాహంతో బౌద్ధమతాన్ని స్వీకరించి 'నాలుగో బౌద్ధ సంగీతి'ని నిర్వహించాడు. ఇందులోనే బౌద్ధమతం హీనయాన, మహాయాన అనే రెండు శాఖలుగా చీలిపోయింది. కార్దమాక రాజులు కుషాణుల సమకాలికులు. వీరిలో అగ్రగణ్యుడు చస్తమనుడి మనుమడైన రుద్రదాముడు. గిర్నార్ శాసనంలో రుద్రదాముడి గురించి వర్ణించారు. సౌరాష్ట్రలో మౌర్యులు నిర్మించిన సుదర్శన తటాకాన్ని బాగుచేయించిన రాజు ఇతడు. మూడో రుద్రసింహుడిని క్రీ.శ. 388లో గుప్తరాజైన రెండో చంద్రగుప్తుడు వధించడంతో కార్దమాక వంశం కథ ముగిసింది.

## గుప్త యుగం

గుప్తుల గురించి మనకు తెలియచెబుతున్న చారిత్రక ఆధారాలకు కొదవ లేదు. గ్రంథ, పురావస్తు ఆధారాలు గుప్తుల గురించి చెప్పుకోదగిన సమాచారాన్నే అందిస్తున్నాయి. ధర్మశాస్త్రాలు, స్మృతుల ఆధారంగా గుప్తుల కాలంనాటి న్యాయవ్యవస్థ తీరుతెన్నులను –కాళిదాసు, విశాఖదత్తుడు, విజ్ఞేశ్వరుడు, కమందకుడు వంటివారు రచించిన గ్రంథాల ఆధారంగా అప్పటి సామాజిక వ్యవస్థలోని సంక్లిష్టతలను తెలుసుకోవచ్చు. ఇక గుప్తుల నాణేలు, వారు వేసిన శాసనాలు చరిత్రకారులకు అమితంగా ఉపయోగపడుతున్నాయి. మరీ ముఖ్యంగా రెండో చంద్రగుప్తుడు విక్రమాదిత్యుడు వేయించిన మెహ్రౌళీ స్తంభ శాసనం, హరిసేనుడు రచించిన 'అలహాబాద్ ప్రశస్థి' గుప్తుల గురించి విపులంగా తెలియజేస్తున్నాయి.

గుప్తులు ఏ ప్రాంతానికి చెందినవారన్న అంశంపై ఏకాభిప్రాయం లేకున్నా–బెంగాల్‌లో కుషాణుల సామంతులుగా వీరి రాజకీయ చరిత్ర ప్రారంభమైందని తెలుస్తోంది. గుప్తుల చరిత్రలో శ్రీగుప్తుడిని తొలి పాలకుడిగా పరిగణిస్తారు. ఆయన అనంతరం 'రాజాధిరాజ' బిరుదుతో ఘటోత్కచ గుప్తుడు పాలించాడు. గుప్తుల పాలన ప్రత్యేకతను సంతరించుకొని, స్వతంత్ర రాజవంశంగా అధికారంలోకి రావడం మాత్రం క్రీ.శ. 320లో మొదటి చంద్రగుప్తుడితోనే ప్రారంభమైంది. మగధ రాజ్యంలో అత్యంత బలమైన లిచ్ఛవీల రాజకుమార్తె కుమారదేవిని వివాహం చేసుకోవడంతో పాటలీపుత్రం గుప్తుల ఏలుబడిలోకి వెళ్లింది. జ్యేష్ఠ వారసత్వానికి వ్యతిరేకంగా మొదటి చంద్రగుప్తుడు సముద్రగుప్తుడిని చక్రవర్తిగా నియమించాడు. దండయాత్రల ద్వారా సముద్రగుప్తుడు గుప్త సామ్రాజ్యాన్ని దేశం నలుమూలలా విస్తరింపచేశాడు. ఆర్యావర్త దండయాత్ర ద్వారా మధ్య భారతదేశాన్ని, దక్షిణాన 12 మంది రాజులను జయించడం ద్వారా దక్షిణాదిని సముద్రగుప్తుడు తన అజమాయిషీలోకి తెచ్చుకున్నాడని అందుబాటులోని ఆధారాలు తెలుపుతున్నాయి. ఈయన తదనంతరం పాలన పగ్గాల చేపట్టిన రెండో చంద్రగుప్తుడు శకులపై చిరస్మరణీయ విజయాన్ని సాధించి 'శకారి' అన్న బిరుదును పొందాడు. రెండో చంద్రగుప్తుడి కొలువులో 'నవరత్నాలు'గా పేరుగాంచిన మేధావులు కొలువు దీరినట్లు తెలుస్తోంది. రెండో చంద్రగుప్తుడి అనంతరం కుమారగుప్తుడి హయాంలో గుప్తుల ప్రాభవం కొడిగట్టడం ప్రారంభమై, స్కంధగుప్తుడితో పతాన వస్థకు చేరింది. తెల్లహూణుల దండయాత్రలు గుప్తుల సామ్రాజ్యానికి తూట్లు పొడిచాయి.

## పాలన–సమాజం

రాజ్యానికి రాజు సర్వాధికారి. దైనందిన పాలనలో ఆయనకు తోడ్పడేందుకు మంత్రి పరిషత్తు ఉండేది. పాలన సౌలభ్యం కోసం రాజ్యాన్ని భుక్తులుగా, విషయాలుగా, మండలాలుగా విభజించారు. గ్రామం

చివరి పాలన విభాగం. భూమిశిస్తు రాజ్యానికి ప్రధానాదాయం. పండిన పంటలో సాధారణంగా 1/6 వంతును శిస్తుగా వసూలు చేసేవారు. సైనిక, గూఢచార వ్యవస్థలు అత్యంత పటిష్ఠంగా ఉండేవి.

గుప్తుల కాలంనాటికి సమాజంలో వర్ణవ్యవస్థ బలంగా వేళ్లూను కొంది. మనుధర్మ శాస్త్రం ఆధారంగా న్యాయవ్యవస్థ కొనసాగింది. కింది కులాలలో పలు ఉపకులాలు పుట్టుకొచ్చాయి. విజ్ఞాన, గణిత, ఖగోళ, జోతిష శాస్త్రాలకు గుప్తులు పెద్దపీట వేశారు. దశాంశ పద్ధతి వినియోగంలో ఉండేది. నలంద విశ్వవిద్యాలయం ప్రధానకేంద్రంగా ఉండేది. హుయాన్‌త్సాంగ్, ఇత్సింగ్ వంటి వారు సైతం ఇక్కడ కొంత కాలం పాటు ఉండి విజ్ఞాన సముపార్జన చేసినట్లు తెలుస్తోంది. శ్రేణుల నేతృత్వంలో వాణిజ్యం జోరుగా సాగింది. ఖనిజ పరిశ్రమ ప్రాచుర్యం పొందింది. వస్త్ర పరిశ్రమ కళ్లు చెదిరే స్థాయిలో అభివృద్ధి చెందింది. వీరి కాలాన్ని స్వర్ణయుగంగా కీర్తించటంపై భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఆర్థిక అసమానతలు తీవ్రం కావటం, వర్ణ వివక్ష వేయితల లతో విస్తరించటం వంటివి ప్రతికూలతలు. అయితే వాస్తు, కళా, సారస్వత రంగాల్లో సాధించిన ప్రగతి గుప్తుల కాలాన్ని స్వర్ణయుగం అని కొనియాడదగ్గ స్థాయిలో ఉంది.

## ప్రాక్టీస్ ప్రశ్నలు

**1. దేశంలో తొలిసారిగా వెండి నాణేలను తయారుచేసిందెవరు?**

ఎ) కుషాణులు బి) వాకాటకులు

సి) గుప్తులు డి) శకులు

**2. గుప్తుల అర్థశాస్త్రంగా ప్రఖ్యాతి పొందిన గ్రంథం ఏది?**

ఎ) విశాఖ దత్తుడి దేవీ చంద్రగుప్త

బి) సోమదేవుడి కథాసరిత్సాంగరం

సి) విజ్ఞేశ్వరుడి మితాక్షర

డి) కమందకుడి నీతిసారం

**3. దేశ చరిత్రలో సతీసహగమన ఆచారంపై లభ్య మైన మొట్టమొదటి లిఖితపూర్వక శాసనం?**

ఎ) మెహ్రౌళీ స్తంభ శాసనం బి) అలహాబాద్ ప్రశస్తి

సి) భానుగుప్తుడి ఈరన్ తామ్రశాసనం

డి) జునాఘడ్ శాసనం

**4. గుప్తుల కాలంనాటి అధికార భాష?**

ఎ) పాళి బి) సంస్కృతం

సి) అర్థమాగధి డి) ప్రాకృతం

**5. సింహం బొమ్మ ఉన్న నాణేలను వేయించిన రాజెవరు?**

ఎ) స్కంధగుప్తుడు బి) రెండో చంద్రగుప్తుడు

సి) సముద్రగుప్తుడు డి) రామగుప్తుడు

**6. బృహత్‌కథను రచించింది ఎవరు?**

ఎ) క్షేమేంద్రుడు బి) సుబంధుడు

సి) గుణాఢ్యుడు డి) బిల్హణుడు

**7. నేరస్థుడి నుంచి నిజాలు చెప్పించేందుకు చిత్రహింసలు పెట్టేవారన్న విషయం దేనిద్వారా తెలుస్తోంది?**

ఎ) స్కంధగుప్తుడి సౌగఢ్ శాసనం

బి) హాలుడి గాథాసప్తశతి

సి) జయదేవుడి గీతగోవిందం

డి) మెహ్రౌళీ స్తంభ శాసనం

**8. గుప్తుల కాలంలో సైన్యాధ్యక్షుడిని ఏమని పిలిచేవారు?**

ఎ) మహాపీలుపతి బి) బలాధికర్నిక

సి) కరణిక డి) అవస్థిక

**9. గుప్తుల రాజశాసనాలపై తప్పనిసరిగా ఉండే గుర్తు?**

ఎ) నెమలి బి) సింహం

సి) గరుడ డి) ఏనుగు

**10. వెండి నాణేలను ఏమని వ్యవహరించేవారు?**

ఎ) రూప్యక బి) నిష్క

సి) శత డి) కారీ

**11. రెండో చంద్రగుప్తుడు రచించిన గ్రంథం?**

ఎ) దశగీతిక బి) గంధ మాధవ

సి) సిద్ధాంత శిరోమణి డి) కిరాతార్జునీయం

**12. నివి ధర్మ అంటే?**

ఎ) శాశ్వత భూదానం బి) తాత్కాలిక భూదానం

సి) పాలనపరమైన హక్కులు లేని భూదానం

డి) బీడు భూములను మాత్రమే దానం చేయటం

**13. వ్యాపారులపై విధించే పన్నును ఏమంటారు?**

ఎ) హిరణ్య బి) శుల్క

సి) హాలివకర డి) భోగ

**14. గుప్తుల కాలంలో మంత్రి పరిషత్తులో స్థానం లేనిది ఎవరికి?**

ఎ) మహా దండనాయక బి) మహా సంధి విగ్రహిక

సి) ప్రతిపాల డి) మహాబలాధికృత

**15. గుప్తుల కాలంలో ఏ దేశంతో భారత్‌కు వాణిజ్య సంబంధాలు లేవు?**

ఎ) రోమ్ బి) శ్రీలంక

సి) గ్రీస్ డి) చైనా

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | A | D | C | B | B | C | A | B | C | A | B | A | B | C | C |

# ప్రపంచానికే నడకను నేర్పిన సింధు నాగరికత

'చరిత్ర అడక్కు... చెప్పింది విను' అనేది సినిమాలకు మాత్రమే పనికొచ్చేమాట. 'చరిత్ర తెలుసుకోకుండా చెప్పేదేదీ వినకు' అనేది జీవితానికి ఉపకరించే సూత్రం. సమకాలీన సమాజంతో సంబంధం లేకుండా గతం ఉండదు. చారిత్రక అవగాహన లేకపోతే వర్తమానం అంతుపట్టదు. ముఖ్యంగా గ్రూప్-2 వంటి పరీక్షల్లో చరిత్ర ప్రాధాన్యం ఎనలేనిది. గ్రూప్-2 జనరల్ స్టడీస్‌లో 'భారతదేశ చరిత్ర, జాతీయోద్యమం' ఈసారి ఓ ప్రధానాంశం. దీనిపై కనీసం 25 ప్రశ్నలు వచ్చే అవకాశం ఉన్న నేపథ్యంలో-చరిత్రను విస్తృతంగా చదవాల్సిందే. అయితే సింధు నాగరికత మొదలు స్వాతంత్ర్య సాధన వరకు మహాసాగరంలా కనిపించే చరిత్రలో ఏం చదవాలి, ఎలా చదవాలి, ఎంతని చదవాలి అన్న అయోమయం ఉద్యోగార్థుల్లో కలిగితే అది అసహజమేమీ కాదు. అయిదువేల సంవత్సరాల భారత చరిత్ర విస్తృతి అంతటిది. ఎన్నెన్నో వైరుధ్యాలు, వైవిధ్యమైన భారత చరిత్రను గ్రూప్-2 కోణంలో విశ్లేషించి, అరటిపండు ఒలిచినట్లుగా మీకందించేందుకు మేం చేస్తున్న ప్రయత్నమిది.

## సింధు నాగరికత

దేశ చరిత్రను రెండువేల ఏళ్ల వెనక్కి జరిపిన నాగరికత ఇది. ఆర్యులతోనే భారతదేశ చరిత్ర ప్రారంభమైందని 1920 వరకూ చరిత్రకారులు భావించారు. కానీ ప్రపంచంలోనే అత్యంత పురాతనమైన, విస్తారమైన, నవ నాగరిక సంస్కృతికి మన దేశం పుట్టినిల్లన్న వాస్తవం. 1921లో దయారాం సాహ్ని హరప్పాను, 1922లో ఆర్.డి. బెనర్జీ మొహంజొదారొను కనుగొనడంతో వెల్లడైంది. ఈ నాగరికత స్థూలంగా క్రీ.పూ. 3000-1500ల మధ్య విలసిల్లిందన్నది చరిత్రకారుల అభిప్రాయం. కాంస్య యుగానికి చెందిన ఈ నాగరికత- 12,99,600 చదరపు కిలోమీటర్ల భారీ విస్తీర్ణంలో వ్యాపించి ఉంది. భౌగోళికంగా పశ్చిమాన సుక్తోజెంధార్ నుంచి తూర్పున అలంగీర్‌పూర్ వరకూ, ఉత్తరాన కాశ్మీర్ వద్ద ఉన్న మండ నుంచి దక్షిణాన మహారాష్ట్రలోని దైమాబాద్ పట్టణం వరకూ సింధు నాగరికత విస్తరించింది.

## సమాజంలో ప్రధాన వర్గాలు

సింధు ప్రజలు మాతృస్వామిక వ్యవస్థను అనుసరించారు. ఆనాటికి వర్ణవ్యవస్థ ఆవిర్భవించలేదు. వ్యాపారులు, చేతివృత్తులవారు, వ్యవసాయదారులు, ఆటవికులు సింధు సమాజంలో నాలుగు ప్రధాన వర్గాలు. వ్యవసాయం, వాణిజ్యం సింధు ప్రజల ప్రధాన వ్యాపకాలు. ప్రపంచంలోనే పత్తిని పండించిన తొలి సమాజం వారిది. వాణిజ్యపరంగానూ సింధు ప్రజలు కొత్త ఒరవడికి తెరచాపలెత్తారు. మెసపటోమియా, ఈజిప్ట్, గ్రీస్ వంటి ప్రాంతాలలో నౌకల ద్వారా ఉధృతంగా వాణిజ్య కార్యకలాపాలు నిర్వహించారు. అందుకోసం ప్రత్యేకంగా నౌకాశ్రయాలను నిర్మించుకున్న ఘనత వీరిది. ఆచార విశ్వాసాల పరంగానూ సింధు ప్రజలు విలక్షణమైన పంథానే అనుసరించారు. పశుపతి, అమ్మతల్లికి, జంతు, వృక్షాదులకు వీరు పూజాధికాలు నిర్వహించినట్లు తెలుస్తోంది. ప్రపంచంలో సింధు నాగరికతను విలక్షణ వేదికపై నిలుపుతున్న అంశం- వారి నగర నిర్మాణ కౌశలం. స్కేల్ పెట్టి కొలిచారా అన్నట్లు నిలువూ, అడ్డంగా వీధులను సమాన బ్లాకులుగా విభజించారు. ఇళ్ల నిర్మాణంలో కూడా వారు అదే పరిణతిని కనబర్చారు. ప్రతి ఇంటికీ ప్రవేశ, నిష్క్రమణ ద్వారం; స్నానపు గదులు, మురుగునీటి వ్యవస్థ కచ్చితంగా ఉండేవి. ఇరవై ఒకటో శతాబ్దంలో కూడా భారతదేశంలోని అనేక పట్టణాల్లోనూ ఇప్పటికీ ఆ స్థాయి సౌకర్యాలు లేవంటే అతిశయోక్తి కాదు. అందుకే సింధు నాగరికత 'పట్టణ నాగరికత' అన్న పేరు గణించింది.

## ప్రజల ఆహార అలవాట్లు

గోధుమ, బార్లీ సింధు ప్రజల ప్రధాన ఆహారం. పప్పుదినుసులు, నూనెగింజలు కూడా వీరు ఆహారంలో వినియోగించారనడానికి ఆధారాలున్నాయి. స్టిటైట్ అనే సున్నపు రాయితో వీరు విస్తృతంగా ముద్రికలను తయారుచేశారు. రకరకాల జంతువులు, పశుపక్ష్యాదులను ముద్రించిన ముద్రికలు రెండు వేల వరకు దొరికాయి. కుండలను, బంకమట్టితో బొమ్మలను తయారుచేయడంలో వీరు సిద్ధహస్తులు. వీరిది బొమ్మల లిపి. వీటిని ఇప్పటి వరకూ చరిత్రకారులు ఛేదించలేకపోయారు. 400 రకాల బొమ్మలను ఉపయోగించి వీరు వ్యక్తం చేసిన భావాలను చదవగలిగితే సింధు నాగరికతకు సంబంధించి మరిన్ని వాస్తవాలు వెలుగు చూస్తాయి.

## ఆబ్జెక్టివ్ ప్రశ్నలు ఇలా అడగచ్చు...

**1. సింధు నాగరికత కాలంలో అతిపెద్ద పట్టణ మేది?**

ఎ) హరప్పా బి) లోథాల్

సి) మొహంజొదారొ డి) చన్హుదారొ

**2. వరిని పండించిన ఆధారాలు ఎక్కడ లభించాయి?**

ఎ) బన్వాలీ బి) కాలిబంగన్

సి) రంగపూర్, లోథాల్ డి) దైమాబాద్

**3. సింధు ప్రజల గణాంక కొలమానంలోని ప్రామాణిక సంఖ్య ఎంత?**

ఎ) 4 బి) 8 సి) 16 డి) 32

**4. హరప్పా నాగరికత కాలంలో అత్యంత పవిత్రమైనదిగా పూజలందు**

కొన్ని జంతువేది?

ఎ) మేక బి) పులి

సి) కుక్క డి) వృషభం

5. కోట లేకుండా నిర్మించిన ఒకే ఒక నగరమేది?

ఎ) మొహంజొదారొ బి) అలంఘీర్‌పూర్

సి) చన్హుదారొ డి) బన్వాలి

6. సింధు ప్రజల ప్రధాన రవాణా వాహనం?

ఎ) ఎద్దులబండి బి) పడవ

సి) వృషభ వాహనం డి) చక్రాల బండి

7. భారత ఉపఖండంలో కుమ్మరి చక్రం ఎక్కడ బయటపడింది?

ఎ) మెహ్‌గర్ బి) మండ

సి) రూపర్ డి) హరప్పా

8. సింధు ప్రజల లిపిని తొట్టతొలుత ఎప్పుడు గుర్తించారు?

ఎ) 1843 బి) 1853 సి) 1924 డి) 1944

9. సింధు ప్రజలు అత్యంత పవిత్రంగా భావించి పూజించిన పక్షి?

ఎ) నెమలి బి) చిలుక

సి) కొంగ డి) పావురం

10. 'ఇండియన్ సివిలైజేషన్' రచయిత ఎవరు?

ఎ) మెక్‌మిలన్ బి) మార్షల్

సి) మార్టిమర్ వీలర్ డి) ఆర్.డి. బెనర్జీ

11. ప్రాచీన కాలంలో సింధు ప్రాంతాన్ని ఏమని పిలిచేవారు?

ఎ) కాలీ బి) మెలూహ

సి) కచ్ డి) ద్రవిడ

12. సిరాబుడ్డీ ఎక్కడ దొరికింది?

ఎ) రూపర్ బి) కాలిబంగన్

సి) చన్హుదారొ డి) మెహ్‌గర్

13. లోథాల్ నగరం ఏ నది ఒడ్డున ఉంది?

ఎ) సరస్వతి బి) రావి

సి) బొగవర్ డి) సింధు

14. కాలిబంగన్ ఏ రాష్ట్రంలో ఉంది?

ఎ) అసోం బి) పంజాబ్

సి) రాజస్థాన్ డి) కాశ్మీర్

15. సింధు ప్రజలు ఎక్కడ నుంచి వెండిని దిగుమతి చేసుకునేవారు?

ఎ) మెసపటోమియా బి) గ్రీస్

సి) కాశ్మీర్ డి) అఫ్గాన్, ఇరాన్

16. సింధు ప్రజలు ఉపయోగించిన వస్త్రాల మూట ఎక్కడ దొరికింది?

ఎ) లోథాల్ బి) కాలిబంగన్

సి) ఉమ్మా డి) దైమాబాద్

17. సింధు నాగరికతను 'మూలభారతీయ నాగరికత' అన్నది ఎవరు?

ఎ) వీలర్ బి) సర్ జాన్ మార్షల్

సి) దయారాం సాహ్ని డి) డి.డి. కొశాంబి

18. సింధు లిపికి అతి దగ్గరగా ఉండే లిపి ఏది?

ఎ) మెసపటోమియన్ బి) ఈజిప్ట్

సి) ద్రవిడియన్ డి) అఫ్గానీ

19. సింధు ప్రజల ప్రధాన ఎగుమతులేమిటి?

ఎ) ఆవాలు బి) బార్లీ

సి) వస్త్రాలు, టెర్రకోట వస్తువులు

డి) ఖడ్గాలు

20. సింధు ప్రజలు ఆభరణాల తయారీలో ఉపయోగించని లోహమేది?

ఎ) బంగారం బి) కంచు

సి) తగరం డి) రాగి

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | C | C | C | D | C | A | A | B | D | C | B | C | C | C | D | C | B | C | C | C |

# సామాజిక మార్పులకు ఆర్యులు ఆద్యులు

వెనకేముంది... నీ ముందేముంది అన్న దానికన్నా నీ లోపల ఏముందన్నదే ముఖ్యమంటాడు ఎమర్సన్. చరిత్ర ఓ నిరంతర సామాజిక ప్రక్రియ. గతం గుర్తులు, భవిష్యత్ నిగూఢ సంకేతాల అంతర్వాహినిగా వర్తమానం ముందుకు సాగుతుంటుంది. చరిత్రను సరైన కోణంలో అర్థం చేసుకోగలిగితేనే గతాన్ని, భవిష్యత్తును వేర్వేరు ముక్కలుగా చూడటం సాధ్యమవుతుంది. మూడున్నరవేల ఏళ్ల క్రితం సప్తసింధు, గంగా యమునా ప్రాంతాల్లో తిరిగిన సమూహాలు... జాతి జీవనంపై ప్రగాఢమైన ముద్ర వేశాయి. వేదాలు, వర్ణవ్యవస్థ, పురాణాలు, మంత్రతంత్రాలు, ఆశ్రమ ధర్మాలు, యజ్ఞయాగాదులు... ఇలా ఒకటేమిటి వర్తమాన భారత సమాజాన్ని అడుగడుగునా ప్రభావితం చేస్తున్న, ప్రేరణగా నిలుస్తున్న అనేక అంశాలకు ఆద్యమైందిగా ఆర్యుల నాగరికత నిలుస్తోంది.

ఆర్యులు ఎక్కడివారన్న దానిపై ఏకాభిప్రాయం లేదు. ఆర్యులు మధ్యఆసియా ప్రాంతం నుంచి వచ్చారని మాక్స్‌ముల్లర్, ఆర్కిటిక్ ప్రాంతం నుంచి వలస వచ్చారని బాలగంగాధర తిలక్, టిబెట్‌కు చెందినవారని దయానంద సరస్వతి చెప్పిన అభిప్రాయాలపై పెద్దఎత్తున చర్చ సాగుతోంది. అయితే మాక్స్‌ముల్లర్ చెప్పిన మధ్యఆసియా ప్రాంత అభిప్రాయాన్నే ఎక్కువమంది చరిత్రకారులు అంగీకరిస్తున్నారు.

ఆర్యులంతా ఒకే దఫా కట్టకట్టుకొని రాలేదు. క్రీ.పూ. 1500 నాటికి సింధు నదిని దాటి వచ్చి, దాని ఏడు ఉపనదుల ప్రాంతమైన 'సప్తసింధు'లో స్థిరపడ్డారు. ఆర్యుల నాగరికతను రెండు ప్రధాన భాగాలుగా విభజించవచ్చు.

**మొదటిది** రుగ్వేద నాగరికత. దీనినే తొలివేద కాలం అని అంటారు. ఇది క్రీ.పూ. 1500–1000 మధ్య కాలానికి చెందింది.

**రెండోది** మలివేద నాగరికత క్రీ.పూ. 1000–600 కాలానికి సంబంధించింది.

## రుగ్వేద కాలం

**పాలన ఎలా?** రుగ్వేద నాగరికత ప్రధానంగా పశుసంపద మీద ఆధారపడింది. వ్యవసాయ పరిజ్ఞానం ఉన్నప్పటికీ అది తక్కువ స్థాయిలోనే జరిగినట్లు తెలుస్తోంది. ఈ కాలంలో పెద్దఎత్తున యుద్ధాలు జరగడానికి కారణం పశుసంపద. యుద్ధ దేవుడైన ఇంద్రుడి కీర్తనలకే రుగ్వేదంలో పాతిక శాతాన్ని కేటాయించారు. చిన్నచిన్న గణరాజ్యాలుగా, తెగలుగా రుగ్వేద సమాజం విభజించి ఉండేది. ఒక్కో గణానికి అధిపతిని 'గణపతి' లేదా 'రాజన్' అని పిలిచేవారు. ఇతనికి పాలనలో పురోహితుడు, సేనాని సహకరించేవారు. పాలనా వ్యవస్థలో గ్రామం చివరిది. అనేక గ్రామాలు కలిసి 'విస్'గా, కొన్ని విస్‌లు కలిసి 'గణం'గా ఉండేది. పాలన వ్యవస్థలో సభ –సమితి అత్యంత కీలకంగా ఉండేవి. సమాజంలోని పెద్దలందరూ సభకు ప్రాతినిధ్యం వహించేవారు. సమితి తెగ మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తుంది.

## సమాజం–మతం

రుగ్వేద సమాజం పితృస్వామిక వ్యవస్థను పాటించేది. ఈ కాలంలోనే వర్ణవ్యవస్థ ప్రారంభమైంది. సమాజంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలుండేవి. స్త్రీలకు పరిపూర్ణమైన స్వేచ్ఛను ఇచ్చారు. గోధుమ, బార్లీ వీరి ప్రధాన ఆహారం. వ్యాపార, వాణిజ్యాలు పెద్దఎత్తున జరగలేదు. లావాదేవీలన్నీ చాలావరకు వస్తుమార్పిడి విధానం ద్వారానే కొనసాగాయి. ఆవును మారకంగా కూడా ఉపయోగించారు. బంగారంతో చేసిన 'నిష్క', వెండి పదార్థమైన 'శతక'లను కూడా లావాదేవీల్లో వినియోగించినట్లు రుగ్వేదంలో ఉంది. సింధు నాగరికత తరహాలోనే రుగ్వేదకాలంలోనూ ప్రకృతి శక్తులను పూజించారు. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని వీరి ప్రధాన దేవతలు. వెలుగును ప్రసాదించే దైవంగా 'సావిత్రి'ని పూజించారు. అనార్య దేవుడైన పశుపతిని సైతం కొలిచారు. రుగ్వేదప్రజలు కొలిచిన ఒకే ఒక స్త్రీ దేవత 'సరస్వతి'.

## మలివేద కాలం

ఈ యుగ స్వభావాన్ని గుణాత్మకంగా మార్పుతెచ్చిన అంశం ఇనుమును కనుగొనడం. ఇనుప లోహాన్ని కనుగొనడంతో అడవులను నరకడం, వ్యవసాయం చేయడం సులభ మైంది. ఈ కాలంలోనే ఆర్యులు సప్తసింధు నుంచి గంగా–యమున ప్రాంతానికి విస్తరించారు. వ్యవసాయం వీరి జీవితాన్ని గణనీయంగా ప్రభావితం చేసింది.

చిన్నపాటి గణ రాజ్యాలు అంతరించి.. ప్రాదేశిక రాజ్యాలు ఏర్పడ్డాయి. బలమైన రాజకీయ వ్యవస్థలు ఆవిర్భించాయి. రాజు నిరంకుశుడిగా అవతరించాడు. సభ, సమితి అంతరించాయి. రాజుకు సహకరించే విస్తృత యంత్రాంగం వెలు గులోకొచ్చింది. ప్రజలపై పన్నులు వేయడం మొదలైంది. ఇందుకోసం బగదుగ, బలిసాధక అనే అధికారులను నియమించారు. పెద్దఎత్తున యుద్ధాలు చేయడానికి అనువుగా సిద్ధ సైన్యాలను ఏర్పాటు చేసుకున్నారు.

ఈ కాలంలో సంభవించిన సామాజిక మార్పులు ఎంతో ప్రాధాన్యం సంతరించుకున్నాయి. చాతుర్వర్ణ వ్యవస్థ బలంగా వేళ్లూను

కొంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను 'ద్విజులు'గా పరిగణించేవారు. వంశ మూలపురుషుడి పేరు సూచిస్తూ-గోత్ర విధానం కూడా ఈ కాలంలోనే ఆరంభమైంది. మలివేదకాలం నాటికి స్త్రీలకు స్వాతంత్ర్యం తగ్గింది. అంటరానితనానికి మలివేదకాలంలోనే పునాదులుపడ్డాయి.

వ్యవసాయం విస్తరించడం వల్ల మిగులు ఉత్పత్తి పెరిగింది. వ్యాపార, వాణిజ్యాలకు పెట్టుబడులు సులభంగా అందుబాటులోకి వచ్చాయి. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు వ్యవసాయం నుంచి క్రమంగా తప్పుకొన్నారు. శూద్రులు సేద్యాన్ని చేపట్టడంతో.. వారు ఆర్థికంగా బలపడటం మొదలైంది. పట్టణాలు విపరీతంగా పెరిగాయి.

ఈ కాలాన్ని 'రెండో పట్టణ దశ'గా అభివర్ణించారు. వివిధ 'శ్రేణి'ల ఆధ్వర్యంలో వ్యాపార వాణిజ్యాలు జరిగేవి. కొత్త ఆర్థిక సంస్కృతి సమాజంలో నూతన సంప్రదాయాలు, దేవుళ్లు స్థిరపడటానికి కారణమైంది. ఒక్కో వర్ణానికి ఒక్కో దేవుడు ఆవిర్భవించాడు. బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులు తొలిసారిగా ప్రస్తావనకొచ్చారు. కర్మ, పునర్జన్మ, ఆత్మ, మాత్మ వంటి భావనలు విస్తృతంగా ప్రచారం లోకి వచ్చాయి.

## ప్రాక్టీస్ ప్రశ్నలు

**1. యుద్ధాల్లో ఆర్యుల విజయానికి దోహదపడిన అంశం?**
ఎ) గుర్రపుస్వారీ బి) గదలు
సి) యుద్ధతంత్రం డి) విల్లంబులు

**2. చాతుర్వర్ణ వ్యవస్థ ప్రస్తావన ఎందులో ఉంది?**
ఎ) శతపథ బ్రాహ్మణం బి) అధర్వణవేదం
సి) రుగ్వేదంలోని పురుష సూక్తం
డి) చాందోగ్య ఉపనిషత్తు

**3. 'కృష్ణ ఆయాస్' అంటే?**
ఎ) బంగారు బి) వెండి
సి) కంచు డి) ఇనుము

**4. వ్యాకరణ శాస్త్రాన్ని రాసిందెవరు?**
ఎ) పింగళుడు బి) పాణిని
సి) జైమిని మహర్షి డి) కశ్యపుడు

**5.వడ్డీ వ్యాపారం గురించి ఏ బ్రాహ్మణంలో ప్రస్తావించారు?**
ఎ) కౌశితకి బ్రాహ్మణం బి) ఐతరేయ బ్రాహ్మణం
సి) శతపథ బ్రాహ్మణం డి) తైత్తిరీయ బ్రాహ్మణం

**6. 'నియోగము' అంటే?**
ఎ) సంతానంలేని స్త్రీ భర్త సోదరుని ద్వారా సంతానాన్ని పొందడం
బి) తక్కువ కులానికి చెందిన వారిని సమాజం నుంచి బహిష్కరించడం
సి) వేరొక ప్రాంతానికి వెళ్లి వర్తకం చేయడం
డి) ప్రకృతి దేవతలను పూజించడం

**7.చేతివృత్తులకు చెందినవారు ఎవరి ఆధ్వర్యంలో పనిచేసేవారు?**
ఎ) శ్రేష్టి బి) జేష్టకుడు
సి) రాజన్ డి) పూషన్

**8. ఎందులో 'గోత్రం' గురించిన ప్రస్తావన ఉంది?**
ఎ) సామవేదం బి) రుగ్వేదం
సి) యజుర్వేదం డి) అధర్వణ వేదం

**9.గాయత్రి మంత్రం ఏ దేవతకు సంబంధించింది?**
ఎ) సావిత్రి బి) అమ్మతల్లి
సి) దుర్గ డి) గార్గి

**10.మలివేద కాలంలో అత్యంత బలమైన తెగ ఏది?**
ఎ) పాంచాల బి) అంగ
సి) కురు డి) విదేహ

**11. వడ్లను ఏమని పిలిచేవారు?**
ఎ) తిల బి) శ్యమక
సి) మశ డి) వ్రిహి

**12. కట్నకానుకల ఆధారంగా జరిగే వివాహాన్ని ఏమంటారు?**
ఎ) గాంధర్వ బి) పైశాచ
సి) అసుర డి) దైవ

**13. ఉపనిషత్తులు ఎన్ని?**
ఎ) 101 బి) 104 సి) 106 డి) 108

**14. సంగీతానికి సంబంధించిన ప్రస్తావనలే ఉన్న వేదం?**
ఎ) రుగ్వేదం బి) యజుర్వేదం
సి) అధర్వణ వేదం డి) సామవేదం

**15. కైవర్తులు అంటే ఎవరు?**
ఎ) చర్మకారులు బి) వేటాడేవారు
సి) రథాలు నడిపేవారు డి) కుండలు చేసేవారు

**16. రుగ్వేదంలో ఒకే ఒకసారి ప్రస్తావన కొచ్చిన నది ఏది?**
ఎ) గోదావరి బి) గంగ
సి) బ్రహ్మపుత్ర డి) యమున

**17. దశరాజగణ యుద్ధం ఏ నది ఒడ్డున జరిగింది?**
ఎ) రావి బి) బియాస్
సి) సట్లెజ్ డి) సింధు

**18. శూద్రులు వేదకాలంలో పూజించిన దేవతలు?**
ఎ) బ్రహ్మ బి) విష్ణు
సి) పుషాన్ డి) శివ

**19. న్యాయపరిపాలనకు ప్రాచీనకాలంలో ఆధార భూతమేది?**
ఎ) జ్యోతిషం బి) మనుధర్మశాస్త్రం
సి) నిరుక్తం డి) శిక్ష

**20. యోగ సూత్రాలను ఎవరు రాశారు?**
ఎ) పాణిని బి) గర్గుడు
సి) యాస్కుడు డి) పతంజలి

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | A | C | D | B | C | A | B | D | A | C | D | C | D | D | A | B | A | C | B | D |

# మగధ సామ్రాజ్యం

భారతదేశానికి తొట్టతొలి మహా సామ్రాజ్యమేదన్న ప్రశ్నకు సమా. దానం.... మగధ. క్రీ.పూ. ఆరో శతాబ్దం నాటి పదహారు మహాజన పదాల్లో రాజకీయంగా అత్యున్నత దశకు చేరుకొన్న మగధను హర్యంక, శిశునాగ, నంద, మౌర్య వంశాలు పాలించాయి. గంగా యమునా నదీ మైదానంలోని సారవంతమైన భూములు, అపారమైన ఖనిజసంపద, తిరుగులేని గజబలం, వంశపారంపర్య రాజరికం వంటివి మగధ విజృంభణకు దోహదంచేసిన అంశాలు. చుట్టూ బ్రహ్మాండమైన పర్వతశ్రేణులు, సోనేరి నదీతీరంలో సహజ సిద్ధమైన ప్రకృతి రక్షణ కవచాల మధ్య రాజగృహం, పాటలీపుత్రాలు మగధ రాజధానులుగా భాసిల్లాయి. అపారమైన గజబలం మగధ విజృం భణకు దోహదం చేసిన మరో ముఖ్యాంశం. హర్యంక వంశంలో బిందుసారుడు, అజాతశత్రువు అత్యంత పేరెన్నికగన్న రాజులు. శిశు నాగుడి ఆధ్వర్యంలో ప్రారంభమైందే శిశునాగవంశం. దీని తర్వాత మహాపద్మనందుడి నేతృత్వంలో నంద వంశపాలన మొదలైంది. ఈయన హయాంలో మగధ సామ్రాజ్యం ఉత్తరాన సట్లెజ్ నది నుంచి దక్షిణాన గోదావరి నది వరకు విస్తరించినట్లు తెలుస్తోంది. ఉత్తర భారతాన్ని ఏకచ్ఛత్రాధిపత్యం కిందకు తీసుకువచ్చిన తొలి చక్రవర్తిగా మహాపద్మనందుడిని చరిత్రకారులు పరిగణిస్తారు. చివరి నందరాజైన ధననందుడిని క్రీ.పూ. 322లో చాణుక్యుడి సహాయంతో మౌర్యచంద్ర గుప్తుడు ఓడించి మౌర్య సామ్రాజ్య స్థాపన చేయడంతో చరిత్రలో ఓ మహోద్విగ్న ఘట్టానికి తెరలేచింది.

## మౌర్యులు – పాలన

తొలిసారిగా సువిశాల సామ్రాజ్యాన్ని స్థాపించడమే కాక, దేశానికి మొట్టమొదటి లిఖితపూర్వక ఆధారాలను అందించినవారు మౌర్యు లు. మౌర్యుల గురించి మనకు తెలియజేస్తున్న ఆధారాల్లో కౌటిల్యుడి అర్థశాస్త్రం, గ్రీకుల రాయబారి మెగస్తనీసు రచించిన ఇండికా, విశాఖ దత్తుని ముద్రారాక్షసం, బౌద్ధ – జైన మత గ్రంథాలు, అశోకుడి శాస నాలు ప్రధానమైనవి. ముద్రించిన నాణేలను తొలిసారిగా ప్రవేశ పెట్టింది మౌర్యులే. మౌర్యుల పాలన పూర్తిగా కేంద్రీకృతమైన పద్ధతిలో సాగింది. చక్రవర్తే సర్వోన్నత అధికారి. పాలనలో ఆయనకు మంత్రి పరిషత్ సహకరించేది. చక్రవర్తికి తోడ్పాటునందించేందుకు కేంద్ర స్థాయిలోని ప్రభుత్వ యంత్రాంగంలో 27 శాఖలు ఉండేవి. కేంద్ర స్థాయిలో 'తీర్థులు' అనే అధికారులుండేవారు. భూమిశిస్తు వ్యవహారాలు చూసే 'సమాహర్త' ఖజానా బాధ్యతలు నిర్వర్తించే 'సంగ్రహిత్రి' వీరిలో అత్యంత ముఖ్యులు. మౌర్య సామ్రాజ్యాన్ని నాలుగు ప్రధాన ప్రాంతాలుగా విభజించారు. పశ్చిమ ప్రాంతానికి తక్షశిల, ఉత్తర ప్రాంతానికి ఉజ్జయిని, దక్షిణానికి సువర్ణగిరి, తూర్పునకు తోసలి రాజధానులు. కుమార అమార్త్యులు వీటికి పాలనాధ్యక్షులు. ప్రాంతీయస్థాయిలో భూమిశిస్తు అధికారిగా ప్రాదే శిక, శిస్తు మదింపు చేయడం కోసం రాజుక, వసూలు చేయడం కోసం యుక్త అనే అధికారులు ఉండేవారు. పురుష అనే అధికారి కేంద్ర, ప్రాంతీయ ప్రభుత్వాలకు సమాచారాన్ని అందించేవాడు. పాలనలో చిట్టచివరి భాగం గ్రామం. దీనికి గ్రామణి పాలనాధికారిగా వ్యవహ రించేవాడు. సైనిక, న్యాయపాలన కచ్చితమైన ప్రాతిపదికన జరిగేవి. ఇక భూమిశిస్తు విషయానికొస్తే పంటలో నాలుగో వంతు వసూలు చేసేవారు. అటవీ సంపదపై పన్నును 'హిరణ్య'గా వ్యవహరించేవారు. నేరుగా రాజ్యం అజమాయిషీలో ఉన్న భూములను 'సీతభూముల'ని, వ్యవసాయ కుటుంబాల ఆధీనంలోని భూములను 'కుటుంబ క్షేత్రా ల'ని పిలిచేవారు. ఈ కాలంలో వ్యవసాయ రంగంలో బానిసలను ఉపయోగించినట్లు తెలుస్తోంది. ఇందుకోసం 'వెస్టివందక' అనే ఉద్యో గిని ప్రత్యేకంగా నియమించారు.

## మౌర్యులు – సమాజం

ఈ కాలంలో సామాజిక జీవనానికి వర్ణ వ్యవస్థే ఆధారం. ప్రధానంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులన్న ప్రాతిపదికమీదే సమాజం విభ జితమైనా–దిగువస్థాయిలో మరికొన్ని కొత్త కులాలు వచ్చి చేరినట్లు తెలుస్తోంది. వ్యవసాయం, వ్యాపార వాణిజ్యాలు మౌర్యుల కాలం నాటి ప్రజల ప్రధాన వ్యాపకాలు. వైదిక మతం ప్రాధాన్యాన్ని కోల్పో యి – జైన, అజీవక, బౌద్ధ మతాలు విశేష ప్రజాదరణను పొందాయి. చంద్రగుప్తమౌర్యుడు జైనమతాన్ని, బిందుసారుడు అజీవక మతశా ఖను, అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించి ఆదరించారు. అశోకుడి కాలంలో మౌర్య సామ్రాజ్యం అత్యున్నత దశకు చేరుకొంది.

## అశోకుడు – ధర్మ మతం

వైదిక మత సిద్ధాంతాల వల్ల వివిధ కులాలు, వర్గాల మధ్య వైష మ్యాలు పెరిగి అంతర్గత సమస్యలు పెచ్చరిల్లాయి. భిన్న మతాల విభే దాలు రాజుకున్నాయి. వైషమ్యం ప్రబలింది. ఈ పరిస్థితులు ఇలా ఉంటే – మరోవంక కళింగ యుద్ధం నేపథ్యం అశోకుడిని పూర్తిగా అంతర్ముఖుడిని చేసింది. మతాలకు అతీతమైన సామాజిక ధర్మాన్ని ప్రవేశపెట్టాలన్న ఆలోచనలను ఆయనలో రేకెత్తించింది. దయ, దాతృ త్వం, సహనం, అహింస, సంక్షేమం ప్రాతిపదికలుగా అశోకుడు ధర్మ విధానాన్ని ప్రకటించాడు. ఈ ప్రధాన సూత్రాలకు అనుగుణంగానే

ఆయన పాలన కూడా జనరంజకంగా సాగింది. ధర్మాన్ని ప్రచారం చేసేందుకు అశోకుడు ధర్మమహామాత్రులను నియమించాడు. జంతు బలులను నిషేధించాడు. సామ్రాజ్య విస్తరణకు పూర్తిగా స్వస్తి పలికాడు. అశోకుడి ధర్మవిధానం ఆయన తర్వాత అంతరించి పోవడానికి.. అది ఆనాటి కాలమాన పరిస్థితుల కంటే ఎంతో ముందుండటమే కారణమని చరిత్రకారులు అభిప్రాయపడతారు. అశోకుడి తర్వాత మౌర్య సామ్రాజ్యం క్రమంగా పతనావస్థకు చేరింది. మౌర్య వంశంలో చివరివాడైన బృహద్రదుడిని బ్రాహ్మణ సేనాని పుష్యమిత్రుడు సంహరించడంతో మహాసామ్రాజ్యం పతనమైందని చరిత్రకారుల అభిప్రాయం.

## ప్రాక్టీస్ ప్రశ్నలు

**1. కౌటిల్యుడి అర్థశాస్త్రాన్ని 1906లో గుర్తించి ఆంగ్లంలోకి తర్జుమా చేసింది ఎవరు?**
ఎ) మాక్స్ ముల్లర్ బి) శ్యామశాస్త్రి
సి) వి.డి. మహాజన్ డి) కొశాంబి

**2. మౌర్యుల పాలన కాలంలో భూమిశిస్తు విధానాన్ని తెలుసుకోవడానికి ఉపకరించే శాసనం?**
ఎ) రుమ్మిందై స్తంభ శాసనం బి) ఎర్రగుడి శాసనం
సి) హాథిగుంఫా శాసనం డి) జునాగఢ్ శాసనం

**3. ఏ శాసనంలో అశోకుడు తనను తాను ధర్మాశోకుడిగా ప్రకటించుకున్నాడు?**
ఎ) 13వ రాతి శాసనం బి) 4వ చిన్నరాతి శాసనం
సి) సారనాథ్ స్తంభ శాసనం డి) ఎర్రగుడి శాసనం

**4. మౌర్యుల పరిపాలనలో కేంద్రస్థాయి పాలన యంత్రాంగంలో అధ్యక్షుడు లేని శాఖ ఏది?**
ఎ) భూమిశిస్తు బి) సైన్యం
సి) ఖజానా డి) మత్స్య

**5. మౌర్యుల న్యాయపాలనకు ప్రధాన ఆధారం?**
ఎ) అర్థశాస్త్రం బి) శుక్రనీతి
సి) ఉపనిషత్తులు డి) వైదిక మతం

**6. నాగలిపై వేసిన పన్నును ఏమని పిలుస్తారు?**
ఎ) హిరణ్య బి) ప్రజ
సి) హలివకార డి) భాగ

**7. ఖనిజ పరిశ్రమలను పర్యవేక్షించే అధికారిని ఏమని పిలుస్తారు?**
ఎ) అకరాధ్యక్ష బి) పొతువాధ్యక్ష
సి) రూపదర్శక డి) స్థలాధ్యక్ష

**8. తోల, రూప అనేవి?**
ఎ) బంగారు, వెండి నాణేలు బి) కంచు, రాగి నాణేలు
సి) భూమి శిస్తులు
డి) మౌర్యుల కాలంనాటి శిక్షలు

**9. వర్తక వాణిజ్యాలు ఎవరి అధీనంలో ఉంటాయి?**
ఎ) ఫణాధ్యక్ష బి) స్థలాధ్యక్ష
సి) వార్తాధ్యక్ష డి) అమాత్య

**10. అశోకుడికి బౌద్ధమతం ఇప్పించిన గురువు?**
ఎ) మొగలిపుత్తతిస్స బి) ఉపగుప్తుడు
సి) సహదేవుడు డి) సంఘమిత్ర

**11. అశోకుడి శాసనాల్లో ఉపయోగించిన భాష, లిపి ఏవి?**
ఎ) ప్రాకృతం, బ్రహ్మి బి) పాళి, అర్ధమాగధి
సి) సంస్కృతం, పాళి డి) బ్రహ్మి, సంస్కృతం

**12. స్తంభ శాసనాల సంస్కృతిని మౌర్యులు ఎవరి వద్ద నుంచి గ్రహించారు?**
ఎ) రోమనులు బి) గ్రీకులు
సి) పర్షియన్లు డి) చైనీయులు

**13. మౌర్యుల రాజచిహ్నం?**
ఎ) పులి బి) సింహం
సి) ఏనుగు డి) నెమలి

**14. భారతీయ సమాజంలో ఏడు కులాలు ఉన్నాయని చెప్పింది?**
ఎ) కౌటిల్యుడు బి) మెగస్తనీసు
సి) విశాఖదత్తుడు డి) జాతక కథలు

**15. ధర్మస్థేయ, కంతక శోధన అనేవి?**
ఎ) న్యాయస్థానాలు బి) సైన్య విభాగాలు
సి) మత ప్రచార సంస్థలు డి) రెవెన్యూ సంస్థలు

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | B | A | C | D | B | C | A | A | A | B | A | B | D | B | A |

# మొఘలుల ³Ç´ ëలన Ñ§é¯I...

రాజులు పోయారు... రాజ్యాలు పోయాయి కానీ కొందరి జాడలు మాత్రం ఇంకా తాజాగానే ఉన్నాయి. ఆ వరుసలో మొఘలుల గురించి ముందుగా చెప్పుకోవచ్చు. భారతదేశ చరిత్రను మొఘలుల స్థాయిలో మరెవరూ ప్రభావితం చేయలేదంటే అతి శయోక్తి కాదు. ఆద్యంతం మహోద్విగ్నభరితంగా సాగిన మొఘలుల జమానాను రెండు భాగాలుగా చూడవచ్చు.

**ఒకటి: రాజకీయ చరిత్ర**

**రెండు: ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక విశేషాలు**

తొలి భాగంలో మొఘలుల రాజకీయ చరిత్రను కులంకషంగా చర్చిద్దాం.

బాబర్ దండయాత్రనాటికి భారతదేశంలో రాజకీయ అనైక్యత, సైనిక పరమైన బలహీనతలు దేశాన్ని ఆవరించి ఉన్నాయి. నిరంకుశ ధోరణులు పెచ్చుమీరడంతో ఢిల్లీ పీఠంపై ఇబ్రహీం లోడీ పాలన అంతిమ దశకు చేరింది. జైనులబ్దీన్ మరణానంతరం కాశ్మీర్ అతలాకుతలమయింది. గుజరాత్ పాలకులకు, మేవార్ రాజపుత్రులకు మధ్య నిప్పు- ఉప్పు పరిస్థితి. దక్కన్ ప్రాంతం రాజకీయంగా చిన్న చిన్న ముక్కలుగా మారింది. దేశాన్ని అలముకున్న అనైక్యత, అస్థిరతలు సుప్రసిద్ధ తైమూర్‌ఖాన్, చంఘీజ్‌ఖాన్ వంశాల వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న బాబర్‌ను భారత్‌పై దండయాత్రకు ప్రేరేపించాయి. సియాల్‌కోట్‌లో దౌలతాఖాన్ లోడీ సైన్యాలను చిత్తుగా ఓడించిన బాబర్ సర్‌హింద్ మీదుగా ఢిల్లీ వైపు మరలాడు. చరిత్రాత్మకమైన పానిపట్ మైదానంలో క్రీ.శ. 1526లో లోడీలను చావుదెబ్బ తీస్తూ బాబర్ విజయభేరి మోగించాడు. ఆ తర్వాత క్రీ.శ.1527లో జరిగిన కాణ్వ యుద్ధంలో అతిశక్తిమంతుడైన మేవార్ రాజు రాణా సంగాను బాబర్ ఓడించాడు. రాజపుత్రులంతా చందేరికి చెందిన మేధినీ రాయ్ నాయకత్వంలో ఒకటి కావడంతో – బాబర్ హఠాత్తుగా ఛందేరి దుర్గంపై దాడిచేసి వారిని ఓడించాడు. ఫలితంగా మధ్య భారతదేశం మొత్తం బాబర్ ఆధీనంలోకి వెళ్లింది. మరోవంక బీహార్ పాలకుడైన మహమ్మద్ లోడీ మొఘలులకు వ్యతిరేకంగా పావులు కదపడంతో–బాబర్ క్రీ.శ. 1529లో గోగ్రా వద్ద జరిగిన యుద్ధంలో లోడీని ఓడించాడు. దీంతో ఉత్తర భారతమంతా మొఘలుల ఆధీనంలోకి వెళ్లింది. నలభై ఏళ్ల వయసులో బాబర్ క్రీ.శ. 1530లో ఆగ్రాలో కన్నుమూశాడు. ఆయన మృతదేహానికి కాబూల్‌లో అంతిమ సంస్కారాలు నిర్వహించారు.

బాబర్ తదనంతరం ఆయన పెద్ద కుమారుడు హుమయున్ రాజ్యాధికారాన్ని చేపట్టాడు. సోదరులైన కమ్రాన్, అస్కారీ, హిందాల్‌లకు కొన్ని ప్రాంతాలను పంచాడు. ఈయన హయాంలో షేర్‌ఖాన్ సుర్ నేతృత్వంలో అఫ్గాన్‌లు తిరిగి విజృంభించారు. హుమయున్, గుజరాత్‌పై దండెత్తిన సమయంలో షేర్షా బెంగాల్‌ను ముట్టడించాడు. ఫలితంగా 1539లో హుమయున్, షేర్షాల మధ్య చౌసా వద్ద యుద్ధం జరిగింది. ఆ పోరులో షేర్షా తిరుగులేని విజయం సాధించాడు. సోదరుల నుంచి సహకారం అందకపోవడంతో క్రీ.శ. 1540లో బిల్‌గ్రామ్ సమరంలో హుమయున్ షేర్షా చేతిలో చిత్తుగా ఓడిపోయి పదిహేనేళ్ల పాటు ప్రవాసం వెళ్లడంతో షేర్షా సుర్ పాలన మొదలైంది. షేర్షా అసలు పేరు ఫరీద్. యుద్ధ పరాక్రమాలకన్నా పాలనపరమైన సంస్కరణలకే షేర్షా హయాం ప్రసిద్ధమైంది. మాల్వా నుంచి మార్వార్ వరకు ఉన్న రాజపుత్రుల దుర్గాలన్నింటినీ దండయాత్రల్లో షేర్షా గెలుచుకోగలిగాడు. కానీ కలింజర్ కోటను ముట్టడించే సమయంలో జరిగిన అగ్ని ప్రమాదంలో షేర్షా మరణించాడు. షేర్షా అనంతరం ఆయన కుమారుడు జలాల్ ఖాన్ ఇస్లామ్ షా పేరిట పాలించాడు. క్రీ.శ. 1552లో ఈయన మరణం తర్వాత మరో ముగ్గురు పాలించారు. కానీ ఈ కాలంలో హేము అనే బ్రాహ్మణ మంత్రి చేతిలోనే కీలక అధికారాలు ఉండేవి. బలహీనపడిన సుర్ వంశీకులను క్రీ.శ. 1555లో హుమయున్ ఓడించి మొఘల్ రాజ్యాధికారానికి పునఃప్రతిష్ఠ చేశాడు. క్రీ.శ. 1556లో గ్రంథాలయం మెట్లమీద నుంచి దిగుతూ హుమయున్ మరణించడంతో ఆయన కుమారుడు మొఘల్ చరిత్రలోనే మహోన్నత చక్రవర్తిగా గుర్తింపు తెచ్చుకున్న అక్బర్ సింహాసనాన్ని అధిష్ఠించాడు.

పద్దెనిమిదేళ్లు వచ్చేవరకూ అంటే క్రీ.శ. 1560 వరకు బైరాంఖాన్ వెన్నుదన్నులతోనే అక్బర్ పాలన సాగింది. క్రీ.శ.1561లో బాజ్ బహదూర్‌ను ఓడించి మాల్వాను, క్రీ.శ. 1564లో రాణిదుర్గావతి, మైనారిటీ తీరని ఆమె కుమారుడు బీర్ నారాయణలను పరాజితులను చేసి గర్కతంగ గోండ్వానాలను, క్రీ.శ. 1574–76ల్లో బీహార్, బెంగాల్‌లను; క్రీ.శ. 1581లో కాబూల్‌ను, క్రీ.శ. 1586లో బలూచిస్థాన్‌ను, క్రీ.శ. 1591లో సింధ్‌ను, క్రీ.శ. 1592లో ఒరిస్సాను, క్రీ.శ. 1593లో ఖాందేష్‌ను, క్రీ.శ. 1595లో కాందహార్‌ను, చాంద్‌బీబీని ఓడించి అహ్మద్‌నగర్‌లో కొంత ప్రాంతాన్నీ అక్బర్ కైవసం చేసుకొని మొఘల్ సామ్రాజ్యాన్ని విస్తరించాడు. క్రీ.శ. 1556లో జరిగిన పానిపట్ యుద్ధం, క్రీ.శ. 1576లో రాణా ప్రతాపసింహుడిని ఓడించిన హల్దీఘాట్ యుద్ధం అక్బర్ సాధించిన విజయాల్లో పేరెన్నికగన్నవి. తీవ్ర అనారోగ్యంతో 1605లో అక్బర్ మరణించిన తర్వాత అతని కుమారుడు సలీమ్–జహీంగర్ (ప్రపంచ విజేత) పేరిట అధికారాన్ని చేపట్టాడు. జహంగీర్ పాలనపై భార్య నూర్జహాన్, ఆమె తండ్రి, సోదరుల ప్రభావం అధికంగా ఉండేది. సైనిక శక్తిని, దౌత్యనీతిని సమానంగా ఉపయోగించి జహంగీర్ పాలన సాగించాడు. మేవార్

రాజు అమర్‌సింగ్‌తో క్రీ.శ. 1615 సంధి కుదుర్చుకున్నాడు. కానీ అహ్మద్‌నగర్‌కు చెందిన మాలిక్ అంబర్ తిరుగుబాట్లు మాత్రం జహంగీర్‌కు కంటిమీద కునుకు లేకుండా చేశాయి.

క్రీ.శ. 1606లో జహంగీర్ కుమారుడు ఖుస్రూ తండ్రి మీద తిరుగుబాటు చేసి ఓడిపోవడంతో కటకటాల వెనక్కి వెళ్లాడు. నూర్జ హాన్ నేతృత్వంలోని ఝుంటా చేసిన రాజకీయాల మధ్య జీవిత పర్యంతం నలిగిపోయిన జహంగీర్ క్రీ.శ. 1627లో కాశ్మీర్‌లోని బింబర్ వద్ద మరణించాడు. అనంతరం సింహాసనం కోసం జరిగిన పోరులో జహంగీర్ మూడో కుమారుడు ఖుర్రం విజేతగా నిలిచి, షాజహాన్ పేరిట రాజ్యాధికారం చేపట్టాడు. ఈయన భార్య పేరు అర్జ్‌మంద్‌బాను బేగం (ముంతాజ్ మహల్). అధికారం చేపట్టిన వెంటనే జుజార్ సింగ్ నేతృత్వంలో జరిగిన బుందేలుల తిరుగు బాటును షాజహాన్ ఎదుర్కోవాల్సి వచ్చింది. 1632లో షాజహాన్ పోర్చుగీసువారిని ఓడించాడు. క్రీ.శ. 1636లో అహ్మద్‌నగర్‌ను స్వాధీ నం చేసుకున్నాడు. క్రీ.శ. 1652లో కుమారుడైన ఔరంగజేబును దక్కన్ వైస్రాయ్‌గా నియమించాడు. క్రీ.శ. 1657లో షాజహాన్ అనారో గ్యం పాలవడంతో ఆయన నలుగురు కుమారుల మధ్య వారసత్వ పోరు మొదలైంది. దారాషికో, షుజా, ఔరంగజేబు, మురాద్‌బక్ష్‌ల మధ్య సాగిన పోరులో ఔరంగజేబు విజయం సాధించి క్రీ.శ. 1658లో రాజ్యాధికారం చేపట్టాడు. మొదటి పదేళ్ల పాలన కాలంలో ఔరంగ జేబు సైనికపరంగా, రాజకీయంగా గొప్ప విజయాలనే చవిచూశాడు. తర్వాత కాలంలో జాట్‌లు, సత్నామీలు, సిక్కులు ఔరంగజేబుకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు చేశారు. అహోంలను అణచడానికి క్రీ.శ.1662లో ఔరంగజేబు సేనాని మిర్ జుమ్లా బయలుదేరి వెళ్లాడు. ప్రయత్నంలో కొంతవరకు సఫలమైనా క్రీ.శ. 1663లో మిర్ జుమ్లా మరణంతో అహోంలు తిరిగి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. దక్కన్‌పై ఆధిపత్యాన్ని సాధించడానికి సంబంధించి ఔరంగజేబు నాలుగు దశల్లో ప్రయత్నాలు సాగించాడు. దక్కన్‌పై ఆధిపత్యం కోసం క్రీ.శ. 1681లో దండయాత్ర చేసిన ఔరంగజేబు వ్యూహాత్మక తప్పి దాలు చేస్తూ.. సంక్లిష్ట పరిస్థితుల్లో చిక్కుకుపోయాడు. క్రీ.శ.1707లో ఔరంగజేబు మరణం, ఆ తర్వాత వచ్చిన బలహీనమైన వారసుల పాలనల వల్ల మొఘల్ సామ్రాజ్యం పతనమైంది.

## ప్రాక్టీస్ ప్రశ్నలు...

**1.బాబర్ అనే టర్కీ పదానికి అర్థం?**

ఎ) సింహం బి) పులి
సి) మదపుటేనుగు డి) గద్ద

**2.భారత్‌పై దండయాత్రకు రమ్మని బాబర్‌ను ఎవరు ఆహ్వానించారు?**

ఎ) రాణా సంగా బి) రాణా ప్రతాప్
సి) దౌలత్‌ఖాన్ లోడీ డి) మేదినీరాయ్

**3.హుమయున్‌కు ఆశ్రయం అందించిన పర్షియన్ చక్రవర్తి ఎవరు?**

ఎ) సుల్తాన్ షా బి) షహర్‌యార్ షా
సి) షా తమస్ప్ డి) ఇక్బాల్ మండ్

**4.'దిన్‌పన'అనే నగరాన్ని నిర్మించిన రాజు ఎవరు?**

ఎ) బాబర్ బి) హుమయున్
సి) షేర్షా డి) అక్బర్

**5.అక్బర్ ముందు స్వచ్ఛందంగా లొంగిపోయిన తొలి రాజపుత్రులు?**

ఎ) హాదాస్ బి) సిసోదియాలు
సి) రాథోడ్‌లు డి) కచ్చవాహులు

**6.గుజరాత్ దిగ్విజయ యాత్రలకు చిహ్నంగా అక్బర్ నిర్మించిన ముఖ ద్వారం?**

ఎ) ఫతేపూర్ సిక్రీ బి) అలయ్ దర్వాజా
సి) కాబూలీ బాగ్ డి) బులందర్ దర్వాజా

**7.ఎవరి ప్రోద్బలంతో బైరాంఖాన్ అక్బర్‌పై తిరుగుబాటు చేశాడు?**

ఎ) మాన్‌సింగ్ బి) హేమూ
సి) రాణా ప్రతాప్ డి) పీర్ మహ్మద్

**8.అక్బర్ సార్వభౌమాధికారాన్ని అంగీకరించని ఒకేఒక రాజపుత్ర రాజ్యం?**

ఎ) మేవార్ బి) బికనీర్
సి) మార్వార్ డి) శాకంబరి

**9. ఏ మొఘలు పాలకుడి హయాంలో దేశంలోకి తొలిసారిగా పొగాకు ప్రవేశించింది?**

ఎ) ఔరంగజేబు బి) జహంగీర్
సి) అక్బర్ డి) షాజహాన్

**10. గురు అర్జున్‌దేవ్‌కు మరణశిక్ష విధించిన మొఘలు పాలకుడు?**

ఎ) అక్బర్ బి) జహంగీర్
సి) షాజహాన్ డి) ఔరంగజేబు

**11. చిత్రకళానైపుణ్యం పుష్కలంగా ఉన్న మొఘలు చక్రవర్తి?**

ఎ) బాబర్ బి) హుమయున్
సి) జహంగీర్ డి) షాజహాన్

**12.పాలన వ్యవహారాల్లో నూర్జహాన్ జోక్యానికి వ్యతిరేకంగా తిరుగు బాటు చేసిన మొఘలు మున్సబ్‌దారు?**

ఎ) మాన్‌సింగ్ బి) ఇతిమద్దౌలా
సి) అసఫ్‌ఖాన్ డి) మహబత్‌ఖాన్

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | B | C | C | B | D | D | D | A | B | C | C | D |

# మొఘలుల పాలనా సంస్కరణలు

ఎవరి గురించయినా తెలుసుకోవాలంటే అధికారం అప్పగించి చూడు వారి అసలు రంగు బయటపడుతుంది అంటారు. మధ్య ఆసియా లోని ఫర్గానా, సమర్‌ఖండ్ వంటి సాదాసీదా ప్రాంతాలకు నాయకత్వం వహించిన బాబర్ అతని వారసులు – అమేయ సిరిసంపదలు, ప్రకృతి వనరులతో నిండిన విశాల భారతదేశానికి చక్రవర్తులై ఉదాత్తంగా పాలించారు. ఒక్క ఔరంగజేబు కాలాన్ని మినహాయిస్తే మొఘలుల హయాంలో పాలన సర్వజనామోదంగానే సాగిందని చెప్పవచ్చు. మొఘలుల్లో మొదటివాడైన బాబర్ పాలనలో కొన్ని మౌలికమైన మార్పులను ప్రవేశపెట్టాడు. పాద్‌షా (చక్రవర్తి) పేరిట పాలన సాగింది. నామమాత్రంగా కూడా మొఘలులు ఖలీఫా ఆధిపత్యాన్ని ఆమోదించలేదు. ఇస్లామిక్ చట్టాలకు సంబంధించి తలెత్తే వివాదాలను సైతం పాద్‌షాయే పరిష్కరించేవాడు. చక్రవర్తి భగవంతుడి ప్రతినిధి అన్న భావన అక్బర్ కాలం నుంచి ప్రారంభమైంది. ఈ కారణంతోనే జరోఖాదర్శన్, తులాదన్ వంటి సంప్రదాయాలకు అక్బర్ తెరలేపాడు. అక్బర్ హయాంలో వకీల్, దివాన్ లేదా వజీర్, మిర్ బక్షి, సదర్ ఉస్ సదర్ అనే నలుగురు మంత్రులుండేవారు. తర్వాత కాలంలో ఖాన్–ఇ–సమన్, ముఖ్య ఖాజీ, ముహ్తసిబ్‌లకు కూడా మంత్రుల హోదా ఇచ్చారు. కొన్నాళ్లకు వకీల్–దివాన్ లేదా వజీర్ పదవులన్నింటినీ కలిపి వకీల్ ఇ ముత్‌లక్ అన్న ఒకేఒక హోదాగా మార్చారు. చక్రవర్తి తర్వాత స్థానమితనిది. రాజ్య ఆదాయ, వ్యయాలు, ఇతర శాఖలపై అజమాయిషీ ఈయన విధులు. మిర్‌బక్షి చేతిలో సైన్యం, సదర్ ఉస్ సదర్ నేతృత్వంలో మత, విద్య, ధర్మ సాంస్కృతిక అంశాలుండేవి. రాజ్యంలో న్యాయవిభాగం ముఖ్య ఖాజీ చేతిలో ఉండేది. ప్రజల నైతిక ప్రవర్తన, ఇస్లామిక్ నియమాల సక్రమ అమలు వంటివి ముహ్తసిబ్ విధులు. రాజ ప్రాసాదం, రాజు అతని కుటుంబీకుల అవసరాలను నెరవేర్చేందుకు ఖాన్ ఇ సమన్; గూఢచార విభాగానికి దరోగ ఇ దాక్ చౌకి నేతృత్వం వహించేవాడు.

రాజ్యాన్ని సుబాలుగా విభజించారు. అక్బర్ హయాంలో 15, షాజహాన్ హయాంలో 19, ఔరంగజేబు పాలనలో 21 సుబాలు ఉన్నాయి. సుబాకు అధిపతిగా సుబేదార్ లేదా సిపాసలార్ ఉండేవాడు. సుబాలను తిరిగి సర్కార్లుగా, పరగణాలుగా విభజించారు. పాలనలో చివరి యూనిట్ గ్రామం. సర్కార్‌కు అధిపతిగా ఫౌజ్‌దార్ ఉండేవాడు. సర్కార్‌లో సర్వం సహా సైనికాధిపతి ఈయన. ఆర్థిక కార్యకలాపాలను పర్యవేక్షించే అమల్ గుజార్ సర్కార్‌లో మరో ముఖ్య అధికారి. అదే విధంగా పరగణాలు షిక్దార్, అమిల్ అనే అధికారుల నేతృత్వంలో ఉండేవి. పట్వారీ, చౌకిదార్‌ల నేతృత్వంలో గ్రామపాలన సాగేది. చక్రవర్తి తరఫున వివిధ ప్రాంతాల్లో విధులు నిర్వహిస్తూ, సైనిక నిర్వహణ కోసం మున్సబ్‌దార్లు ఉండేవారు. జీతాలకు బదులుగా వీరికి జాగీర్‌లను కేటాయించేవారు. ఆ భూముల నుంచి వచ్చే రెవెన్యూలో కొంతభాగాన్ని మున్సబ్‌దార్లు జీతాలకు బదులుగా తీసుకునేవారు. అయితే కొందరు మున్సబ్‌దారులకు మాత్రం రాజాస్థానం నేరుగా జీతాలను చెల్లించేది. జాగీర్దార్లందరూ మున్సబ్‌దారులే గానీ మున్సబ్‌దారులంతా జాగీర్దారులు కారు. రాజప్రాసాద నిర్వహణ ఖర్చులు, చక్రవర్తి వ్యక్తిగత వ్యయాల కోసం ఖలీసా భూములను ప్రత్యేకించారు. మున్సబ్‌దారీ వ్యవస్థను తీర్చిదిద్దడానికి కొన్ని పద్ధతులను అనుసరించారు. అశ్వదళం మారిపోకుండా, విధులకు క్రమంతప్పకుండా సైనికులు హాజరయ్యేలా చూసేందుకు– దాగ్ (గుర్రాలపై ముద్ర), చెహ్రా (సైనికులకు క్రమసంఖ్య) విధానాలను ప్రవేశపెట్టారు. మున్సబ్‌దారుల జీతం, హోదాలను ప్రతిఫలించే 'జాత్'; అశ్విక దళాల సంఖ్య నిర్వహణ వ్యయాన్ని సూచించే 'సవార్' హోదాలను అక్బర్ ప్రవేశపెట్టారు. రెవెన్యూ పాలన మరింత కచ్చితంగా జరిగింది. భూ శిస్తు వసూలుకు భిన్న రకాలైన పద్ధతులను అనుసరించారు. బతాయ్ లేదా గల్లా బక్ష్, కాన్‌కూట్, నసఖ్ అనే మూడు పద్ధతుల్లో శిస్తు నిర్ణయం జరిగేది. ప్రభుత్వానికి రైతుల నుంచి దఖలు పడుతున్న శిస్తు లెక్కలను పూర్తిగా సమీక్షించి, సంస్కరణలు తీసుకురావడం కోసం రాజా తోడర్ మల్ జబ్త్ లేదా బందోబస్త్ విధానాన్ని ప్రవేశపెట్టాడు. ఈ పద్ధతి కింద భూమిని నాలుగు రకాలుగా వర్గీకరించారు. ఏటా సాగవుతున్న భూమిని 'పోలజ్'గా, ఒకటి రెండేళ్లుగా సాగులో లేని భూమిని 'పరౌటీ'గా, మూడు నాలుగేళ్లుగా సాగుకాని భూమిని 'చచర్'గా, అయిదేళ్లు అంతకంటే ఎక్కువ కాలం నుంచీ బీడుగా పడిఉన్న భూములను 'బంజర్'గా వర్గీకరించారు. భూమిని కొలిచేందుకు రాజా తోడర్ మల్ 'ఇలాహి గజ్' అనే శాస్త్రీయ పద్ధతిని ప్రవేశపెట్టాడు. రైతులను కూడా మూడు రకాలుగా వర్గీకరించారు. సొంత ఊర్లో పొలాలు, పరికరాలు ఉన్న రైతులను కుద్‌కస్తాలని, బయటి నుంచి వచ్చి కౌలుకు తీసుకొని భూములను సాగుచేసేవారిని పాహీలని, సొంత ఊళ్లోనే ఉంటూ ఎలాంటి భూములూ, పరికరాలూ లేని వారిని ముజరియమ్‌లనీ వర్గీకరించారు.

మొఘలుల సాంస్కృతిక వైభవం గణనీయమైంది. అక్బర్ కాలంలో ఫతేపూర్ సిక్రీ అనే నూతన రాజధాని నగరాన్ని నిర్మించారు. అక్బర్ నేతృత్వంలోనే జోధ్‌భాయ్ మహల్, మిరియం మహల్, సుల్తానా మహల్, బీర్‌బల్ మహల్ వంటి సుప్రసిద్ధమైన నిర్మాణాలు జరిగాయి. జహంగీర్ కాలంలో చలువరాళ్లతో అత్యద్భుత నిర్మాణ కౌశలంతో ఇతిమదుద్దౌలా సమాధిని నిర్మించారు. షాజహాన్ కాలంలో రాజధాని నగరం ఆగ్రా నుంచి ఢిల్లీకి మారింది. ఢిల్లీలోని దివాన్–ఇ–ఆమ్, జామా మసీదు, మోతీ మసీదు షాజహాన్ నిర్మించినవే.

ప్రపంచ అద్భుత నిర్మాణాల్లో ఒకటిగా పేర్కొనదగిన తాజ్‌మహల్ సైతం షాజహాన్ కాలంలోనిదే. తాజ్‌మహల్ నిర్మాణాన్ని ఉస్తాద్ ఈసా అనే నిపుణుడు పర్యవేక్షించాడు. తాజ్‌మహల్‌కు స్ఫూర్తినిచ్చిన రెండు నిర్మాణాలు ఢిల్లీలో ఉన్నాయి. అవి ఢిల్లీలోని హుమయున్ సమాధి, ఇతిమదుద్దౌలా సమాధి.

## ప్రాక్టీస్ ప్రశ్నలు

**1. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నెమలి సింహాసనం ఏ మొఘలు భవనంలో ఉండేది?**

ఎ) ఫతేపూర్ సిక్రీలోని దివాన్ ఇ ఖాస్

బి) ఆగ్రాకోట

సి) ఢిల్లీ ఎర్రకోటలోని రంగ్‌మహల్

డి) ఢిల్లీ ఎర్రకోటలోని దివాన్ ఇ ఆమ్

**2. ఏ రకమైన శిస్తు వసూలు చేయని భూములను ఏమంటారు?**

ఎ) ఖలీసా  బి) జాగిర్

సి) సయూర్‌గల్  డి) రైయతి

**3. అక్బర్‌కు ఏ సంగీత పరికరంపై నైపుణ్యం ఉంది?**

ఎ) వీణ  బి) సితార్

సి) పఖ్వాజ్  డి) నక్కారా

**4. జీతంగా జాగీర్లను కాకుండా ధనాన్ని పొందే మున్సబ్‌దార్లను ఏమంటారు?**

ఎ) నఖ్దీస్  బి) జాగీర్దార్లు

సి) అమిర్లు  డి) మిర్జాలు

**5. బదలాయించడానికి అవకాశం లేని జాగీర్ ఏది?**

ఎ) కిద్మతి జాగీర్  బి) మిల్కియత్ జాగీర్

సి) తన్ జాగీర్  డి) వతన్ జాగీర్

**6. సాగుచేయని భూములను సాగులోకి తేవడాన్ని ప్రోత్సహించడానికి రైతులకు ఇచ్చే రుణం?**

ఎ) కీన్‌కుట్  బి) దు అస్పా

సి) జలలి  డి) తక్కావి

**7. ఔరంగజేబు నిర్మించిన బాద్‌షా మసీదు ఎక్కడ ఉంది?**

ఎ) పానిపట్  బి) ఢిల్లీ

సి) జైపూర్  డి) లాహోర్

**8. హుమయున్ నామా రాసిందెవరు?**

ఎ) మహమ్మద్ అలీ  బి) దారాషుకో

సి) గుల్ బదన్ బేగ్  డి) సూరదాస్

**9. మొఘలుల కాలంలో ప్రామాణికమైన బంగారు నాణెం?**

ఎ) టంకా  బి) ముహర్

సి) జిటాల్  డి) డం

**10. అక్బర్ నామా రాసిందెవరు?**

ఎ) నిమర్ ఖాన్ అలి  బి) ఈశ్వర్‌దాస్

సి) దారా షుకో  డి) అబుల్ ఫజల్

**11. ఔరంగజేబు రచనలను ఏమంటారు?**

ఎ) అలంగీర్ నామా  బి) ముంతకబ్ ఉల్ లుబాబ్

సి) రఖత్ ఇ అలంగిరీ  డి) నుక్లాకిల్ కుషా

**12. జహంగీర్ పాలన చరిత్రను గుదిగుచ్చుతూ ఇక్బాల్ నామాను రాసిందెవరు?**

ఎ) ముహమ్మద్ వారిస్  బి) మహమ్మద్ ఖాన్

సి) బీమ్ సేన్  డి) బదౌని

**జవాబులు**

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| D | C | D | A | D | D | D | C | B | D | C | B |

# స్వాతంత్ర్యం వైపు తొలి అడుగులు

అనుభవం మీద తత్వం బోధపడుతుందంటారు. బ్రిటిష్ వారి దమన నీతిని, దోపిడీ రీతిని అవగతం చేసుకొని వలస పాలకులపై సమైక్య సమరానికి సిద్ధమయ్యేందుకు భారతీయులకు వందేళ్లకు పైగా పట్టింది. 1885 డిసెంబరు 22న బొంబాయిలో ఉమేష్ చంద్ర బెనర్జీ నేతృత్వంలో 72 మంది ప్రతినిధులు సమావేశమై భారత జాతీయ కాంగ్రెస్(ఐ. ఎన్.సి.)కు అంకురార్పణ చేశారు. బ్రిటిష్ వలసవాదంపై భారతీయుల్లో చైతన్యాన్ని రేకెత్తించేందుకు ఐ.ఎన్.సి. నిర్విరామంగా కృషి చేసింది. వీరి పోరాటం ప్రధానంగా విజ్ఞప్తులు, ప్రార్థన, నిరసన ప్రాతిపదికల మీద సాగింది. వలస పాలకులు భారత్‌ను దోచుకుం టున్న తీరును, దేశ సంపద ఇంగ్లాండుకు తరలిపోతున్న వైనాన్ని దాదాబాయి నౌరోజీ 'డ్రెయిన్ థియరీ'ని ఆధారంగా చేసుకొని రాసిన 'ది పావర్టీ అండ్ అన్ బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా' గ్రంథంలో ససాక్ష్యంగా నిరూపించారు. 1886లో నౌరోజీ నేతృత్వంలో కలకత్తాలో జరిగిన ఐ.ఎన్.సి. ద్వితీయ వార్షిక సమావేశంలో సురేంద్రనాథ్ బెనర్జీ నేతృత్వంలోని నేషనల్ కాన్ఫరెన్స్ కాంగ్రెస్‌లో విలీనమైంది. 1887లో కాంగ్రెస్ తృతీయ వార్షిక సమావేశానికి బద్రుద్దీన్‌త్యాబ్జీ అధ్యక్షత వహించారు. మితవాదుల పోరాటం కారణంగా సివిల్ సర్వీసు పరీక్షకు హాజరయ్యే భారతీయ అభ్యర్థుల వయోపరిమితిని 22 ఏళ్లకు పెంచారు. 1892 నాటి ఇండియన్ కౌన్సిల్స్ చట్టం చట్టసభల్లో సభ్యుల సంఖ్యను పెంచారు. బ్రిటిష్ వ్యతిరేక వ్యాసాలను ప్రచురించినందుకు 1897లో తిలక్‌తో పాటు మరికొంతమంది పత్రికా సంపాదకులను జైళ్లలో వేశారు. 1898లో బ్రిటిష్ సర్కారుకు వ్యతిరేక భావనలను వ్యాప్తి చేయడాన్ని నేరంగా పరిగణిస్తూ చట్టం చేశారు. 1904లో పత్రికా స్వేచ్ఛను నియంత్రిస్తూ అధికార రహస్యాల చట్టాన్ని తీసుకు వచ్చారు. 1904 కలకత్తా విశ్వవిద్యాలయ చట్టం, 1904 కలకత్తా మున్సిపల్ కార్పొరేషన్ చట్టాన్ని రద్దు చేశారు. 1905లో ప్రారంభమైన స్వదేశీ ఉద్యమం జాతీయోద్యమ చరిత్రలో అత్యంత విస్తృతంగా జరిగిన తొలిపోరుగా ప్రఖ్యాతి పొందింది. ప్రజాశక్తి మీద అపార నమ్మకమున్న అతివాదుల యుగం ఈ ఉద్యమంతోనే ప్రారంభ మైంది. బెంగాల్‌ను విభజిస్తూ కర్జన్ చేసిన తీర్మానం ఈ ఉద్యమానికి ముఖ్య కారణం. బెంగాల్ విభజన అమల్లోకి వచ్చిన 1905 అక్టోబరు 16ను సంతాపదినంగా పాటించారు. వందేమాతర గీతాన్ని పాడు తూ.. గంగా స్నానాలాచరించారు. ప్రధానంగా లాల్, బాల్, పాల్‌ల నేతృత్వంలో స్వదేశీ ఉద్యమం దేశ వ్యాప్తంగా విస్తరించింది. ఉద్యమం అఖిల భారత స్థాయికి చేరుకోవడంతో 1912 మార్చి 22న బెంగాల్ విభజనను రద్దు చేస్తూ.. ఢిల్లీని రాజధానిగా ప్రకటిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

తిలక్ నేతృత్వంలో ఈ దశలో ఉద్యమం ఉద్ధృతంగా సాగింది. గణపతి ఉత్సవాలు (1893), శివాజీ ఉత్సవాలు (1895), మహారాష్ట్రలోని దుర్భిక్ష పీడిత ప్రాంతాల రైతులు బ్రిటిష్ వారికి పన్నులు చెల్లించాల్సిన అవసరం లేదంటూ 1896-97లలో తిలక్ చేసిన ఉద్యమాలు జాతీయ భావాలను గొప్పగా ప్రేరేపించాయి. దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించడంతో పాటు తిలక్ న్యూ ఇంగ్లీష్ స్కూల్ ఏర్పాటుకు కూడా సహకరించారు. ఆ స్కూలే తర్వాత ఫెర్గుసన్ కాలేజీగా పరిణామం చెందింది. మరాఠా అనే ఇంగ్లీషు వార్తాపత్రికకు, కేసరీ అనే మరాఠీ పత్రికకు తిలక్ సంపాదకుడిగా వ్యవహరించారు. 1916లో ఆయన హోంరూల్ లీగ్‌ను స్థాపించి 'స్వరాజ్యం నా జన్మ హక్కు' అని గర్జించారు. 1908లో తిలక్‌ను అరెస్టు చేసి ఆరేళ్లపాటు బర్మాలోని మాండలె జైలుకు తరలించారు. పంజాబ్ కేసరిగా ప్రసిద్ధ మైన లాలా లజపతిరాయ్ 'ఆర్యసమాజ్'లో 'కాలేజీ' పేరిట ఏర్పా టైన వేర్పాటు విభాగానికి నాయకుడు. పంజాబీ అనే వార్తాపత్రికకు ఆయన సంపాదక బాధ్యతలు నిర్వహించడంతోపాటు 'అన్‌హ్యా పీ ఇండియా' అనే గ్రంథాన్నీ రాశారు. 1907లో లాలాలజపతిరాయ్‌ని అరెస్టు చేసి బర్మాకు తరలించారు. విడుదలైన తర్వాత అమెరికాకు వెళ్లిన ఆయన, ఇండియన్ హోంరూల్ లీగ్‌ను 1914లో స్థాపించారు. అరబిందో ఘోష్ మరో కీలక నాయకుడు.'న్యూ ల్యాంప్స్ ఫర్ ది ఓల్డ్' పేరిట వరుసగా బ్రిటీష్ వ్యతిరేక వ్యాసాలను ఈయన వెలువరిం చారు. 'బందేమాతరం' అనే పత్రికకు ఆయన సంపాదకుడిగా ఉన్నా రు. బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్న ఈయన 1906లో కలకత్తాలో ప్రారంభమైన బెంగాల్ నేషనల్ కాలేజీ ప్రిన్సిపల్‌గా నియమితుడయ్యారు. కెన్నెడీ హత్యతో సంబంధముం దన్న ఆరోపణలపై అరబిందోను 1908లో అరెస్టు చేశారు. ఆ తర్వాత 1910లో ఆయన ఖైదు నుంచి తప్పించుకొని పాండిచ్చేరికి పారిపో యారు. సావిత్రి, ద లైఫ్ డివైన్ వంటి పుస్తకాలను రచించిన ఈయన స్వాతంత్రోద్యమంపై చెరగని ముద్ర వేశారు. 1907లో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో మితవాదులు, అతివాదుల మధ్య స్పష్టమైన విభజన పొడచూపింది. అతివాదులకు ప్రజల మద్దతు ఉన్నప్పటికీ, కాంగ్రెస్‌లో తగిన సంఖ్యాబలం లేదు. కాబట్టి మితవా దులు వారిని 1916లో జరిగిన లక్నో సమావేశం వరకూ వేరుగానే పెట్టారు. 1916లో ఐ.ఎన్.సి., ముస్లిం లీగ్‌ల మధ్య చరిత్రాత్మక లక్నో ఒప్పందం కుదిరింది. అదే క్రమంగా మత ప్రాతిపదికన నియోజక వర్గాల ఏర్పాటు జరిగిన మాంటెగ్ చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలకు కారణమైంది. 1916లో అనిబిసెంట్ నేతృత్వంలోనూ హోంరూల్ లీగ్ ప్రారంభమైంది. స్వయంపాలనను కోరుతూ ఏర్పాటైన ఈ లీగ్ తిలక్

స్థాపించిన 'హోంరూల్ లీగ్'తో సమన్వయంతో పనిచేసింది. 1917లో బాధ్యతయుతా ప్రభుత్వం ఏర్పాటు చేస్తామని మాంటెగ్ హామీ ఇవ్వడంతో అనిబిసెంట్ ఒక్కసారిగా బ్రిటిష్‌వారికి అనుకూలంగా మారిపోయారు. ఫలితంగా క్రమంగా హోంరూల్ ఉద్యమం మసకబారిపోయింది. స్వాతంత్రోద్యమంలో విప్లవవాద దశ కూడా ఉద్ధృతంగానే సాగింది.బరీంద్రకుమార్ ఘోష్, జతీంద్రనాథ్ బెనర్జీ, ప్రమోత మిట్టర్‌లు కలిసి 1902లో కలకత్తా అనుశీలన్ సమితిని ఏర్పాటు చేసి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా రహస్య ఉద్యమం సాగించారు. పులిన్ దాస్ నేతృత్వంలో 1902లో ఢాకా అనుశీలన్ సమితి ఏర్పాటైంది. 1899లో సావర్కర్ సోదరుల ఆధ్వర్యంలో మిత్రమేళ సంస్థ ప్రారంభమైంది. 1907లో గణేష్ సావర్కర్ అభినవ భారత్ అనే సంస్థను ప్రారంభించారు. 1924లో సచిన్ సన్యాల్, జోగేశ్ చంద్ర ఛటర్జీల నేతృత్వంలో హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్ ఏర్పాటైంది. 1913లో అమెరికాలో హర్‌దయాల్, సొహైన్ సింగ్‌ల ఆధ్వర్యంలో గదర్ పార్టీ ప్రారంభమైంది. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ 1942లో రాస్‌బిహారీ బోస్ అధ్యక్షతన ప్రారంభమైంది. 1897లో బ్రిటిష్ అధికారులైన రాండ్, అయెరెస్ట్ సోదరులను దామోదర్, బాలకృష్ణ సోదరులు హతమార్చారు. 1908లో కుదిరామ్ బోస్, ప్రఫుల్ల చాకి కలిసి కెన్నెడీ హత్యలో పాలుపంచుకున్నారు. 1912లో లార్డ్ హార్డింగ్‌పై.. రాస్‌బిహారీ బోస్, సచిన్ సన్యాల్‌లు హత్యాయత్నం చేశారు. కర్జన్ విల్లీ అనే బ్రిటిష్ అధికారిని 1909లో మదన్‌లాల్ ధింగ్రా అనే స్వాతంత్ర్యయోధుడు లండన్‌లో హతమార్చాడు. 1928 డిసెంబరులో శాండర్స్‌ను భగత్‌సింగ్, ఆజాద్, రాజ్‌గురులు లాహోర్‌లో హతమార్చారు. లజపతిరాయ్ హత్యకు ప్రతీకారంగా శాండర్స్‌ను చంపారు. 1929లో భగత్‌సింగ్, భటుకేశ్వర్ దత్తాలు కలిసి కేంద్ర శాసనసభ భవనంపై బాంబులు విసిరారు.

## ప్రాక్టీస్ ప్రశ్నలు...

**1. అమృత బజార్ పత్రికను స్థాపించింది ఎవరు?**

ఎ) సురేంద్రనాథ్ బెనర్జీ బి) హరిశ్చంద్ర ముఖర్జీ

సి) గిరీశ్చంద్ర ఘోష్ డి) శిశిర్ కుమార్ ఘోష్

**2. భారత జాతీయ కాంగ్రెస్ ప్రారంభ సమయంలో భారత 'సెక్రటరీ ఆఫ్ స్టేట్'గా ఎవరున్నారు?**

ఎ) లార్డ్ ఎల్గిన్ బి) లార్డ్ హామిల్టన్

సి) లార్డ్ క్రాస్ సి) లార్డ్ మోరిలె

**3. భారత జాతీయ కాంగ్రెస్ తొలి మహిళా అధ్యక్షురాలెవరు?**

ఎ) రాజ్ కుమారీ అమృత్‌కౌర్

బి) అనిబిసెంట్ సి) సరోజినీ నాయుడు

డి) సుచేత కృపలానీ

**4. భారత జాతీయ కాంగ్రెస్ తొలి ముస్లిం అధ్యక్షుడెవరు?**

ఎ) బద్రుద్దీన్ త్యాబ్జీ బి) సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్

సి) మహమ్మద్ అలీ జిన్నా డి) అబ్దుల్ కలామ్ ఆజాద్

**5. అత్యంత కీలకమైన ఐ.సి.ఎస్. పరీక్షలను ఇంగ్లాండులో, భారత్‌లో ఒకేసారి జరపడం ఎప్పటి నుంచి ప్రారంభమైంది?**

ఎ) 1914 బి) 1926 సి) 1923 డి) 1938

**6. వ్యవసాయాభివృద్ధిని లక్షించి లార్డ్ కర్జన్ వ్యవసాయ పరిశోధన సంస్థను ఎక్కడ ఏర్పాటు చేశారు?**

ఎ) మద్రాసు బి) పూసా

సి) ఢాకా డి) లక్నో

**7. బ్రిటిష్ పాలన కాలంలో గవర్నర్ పదవిని అధిష్ఠించిన మొట్టమొదటి భారతీయుడు ఎవరు?**

ఎ) సురేంద్ర బెనర్జీ బి) మైఖెల్ బెనర్జీ

సి) ఎస్.పి.సిన్హా డి) మోతీలాల్ నెహ్రూ

**8. న్యూ ఇండియా అనే వారపత్రికను ఎవరు ఏర్పాటు చేశారు?**

ఎ) తిలక్ బి) బిపిన్ చంద్రపాల్

సి) అరబిందో ఘోష్ డి) అనిబిసెంట్

**9. ఏ రాజప్రతినిధి హయాంలో 1881లో మొదటి ఫ్యాక్టరీ చట్టాన్ని ఆమోదించారు?**

ఎ) రిప్పన్ బి) లిట్టన్

సి) డఫ్రిన్ డి) కర్జన్

**10. ఇండియన్ సోషియాలజిస్ట్ పత్రికను ఎవరు ప్రారంభించారు?**

ఎ) బ్రహ్మోబందబ్ ఉపాధ్యాయ్

బి) వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ్

సి) శ్యామ్జీ కృష్ణ వర్మ డి) ధరణి గోస్వామి

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | D | C | B | A | C | B | C | B | A | C |

GRK

గాంధీ ప్రవేశం స్వాతంత్ర్య సమరంలో గుణాత్మక మార్పులను తీసుకు వచ్చింది. వలస పాలకులకు వ్యతిరేకంగా కొత్త వర్గాలను తెర మీదకు తీసుకువచ్చింది. జాతిని ఏకం చేసింది. గాంధీ 1915లో దక్షిణాఫ్రికా నుంచి భారత్‌కు తిరిగివచ్చింది మొదలు జనంలో మమేకమయ్యారు. మానవహక్కులను హరించేవిధంగా రౌలత్ కమిటీ చేసిన సూచనలను వ్యతిరేకిస్తూ ఏప్రిల్ 6, 1919ను జాతీయ నిరసన దినంగా ప్రకటించారు. ఆ నేపథ్యంలో సత్యపాల్, లజపతిరాయ్, సైఫుద్దీన్ కిచ్లూలు అదృశ్యమయ్యారు. అందుకు బ్రిటిషర్లే కారణమని పంజాబీలు భావించారు. దీంతో అల్లర్లు మొదలయ్యాయి. శాంతి భద్రతల పరిరక్షణ కోసం నియమితుడైన జనరల్ డయ్యర్ క్రూరంగా వ్యవహరించారు. అతడి ప్రవర్తనపై నిరసన తెలియజేసే సమయంలో ఏప్రిల్ 13, 1919న జలియన్ వాలాబాగ్‌లో భీతావహ హత్యాకాండ జరిగింది. ఈ పరిణామాలన్నీ గాంధీజీ సంకల్పాన్ని దృఢతరం చేశాయి. ప్రపంచ ముస్లింలకు ప్రతినిధి అయిన ఖలీఫా వ్యవస్థను రద్దు చేస్తూ బ్రిటిష్ ప్రభుత్వం జారీచేసిన తీర్మానంపై భారత్‌లో నిరసన జ్వాల ఎగిసింది. అలీ సోదరుల నేతృత్వంలో ఖిలాఫత్ కమిటీ ఏర్పాటైంది. భారత్‌లో ఖిలాఫత్ ఉద్యమానికి గాంధీజీ తన సంపూర్ణ మద్దతు ప్రకటించి ముస్లింలకు అభిమానపాత్రుడయ్యారు. 1920లో కలకత్తా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశంలో సహాయ నిరాకరణ ఉద్యమ నాయకుడిగా గాంధీజీని ఎన్నుకున్నారు. దేశవ్యాప్తంగా విదేశీ వస్తువుల సంపూర్ణ బహిష్కరణ, పన్నుల నిరాకరణ అమలైంది. కాంగ్రెస్ సామాజిక పరిధి గణనీయంగా విస్తరించింది. 1922 ఫిబ్రవరిలో గోరఖ్ పూర్ సమీపంలోని చౌరీచౌరాలో హింస చెలరేగడంతో -గాంధీజీ హఠాత్తుగా ఉద్యమాన్ని నిలిపివేశారు. ఉద్యమానికి మద్దతు పలికిన అలీ సోదరులు – తమను మాట మాత్రం కూడా సంప్రదించకుండా దాన్ని రద్దు చేయడంతో గాంధీపై అసంతృప్తి వ్యక్తం చేశారు. మరోవైపు ఉద్యమ బహిష్కరణ అనంతరం పరిస్థితులు- కాంగ్రెస్ పార్టీలోనే గాంధీజీకి వ్యతిరేకంగా మోతిలాల్ నెహ్రూ నేతృత్వంలో స్వరాజ్ పార్టీ ఏర్పాటుకు దారితీశాయి. ఏది ఏమైనా కార్మిక, కర్షక, మేధావి వర్గాలను సహాయ నిరాకరణ ఉద్యమం ఏకం చేసిందనే చెప్పాలి. స్వాతంత్ర్య సాధన క్రమంలో గాంధీ చేసిన మరో సమరం శాసనోల్లంఘన ఉద్యమం. 1930 మార్చి 12న 78 మంది అనుచరులతో సబర్మతీ ఆశ్రమం నుంచి దండికి కాలినడకన గాంధీజీ బయల్దేరడంతో ఉప్పు సత్యాగ్రహం మొదలైంది. ఏప్రిల్ 6 నాటికి సుమారు 250 మైళ్ల దూరం నడిచి మహాత్ముడు దండిని చేరుకున్నారు. పోలీసుల దమనకాండను సత్యాగ్రహంతో ఎదుర్కొని ఉప్పును తయారు చేశారు. అది మొదలు శాసనోల్లంఘనోద్యమం దేశవ్యాప్తంగా విస్తరించింది. ఆంధ్రలో ఈ ఉద్యమ రథసారథిగా కొండా వెంకటప్పయ్యను నియమించారు. భారత వాయవ్య ప్రాంతానికీ ఉద్యమం విస్తరించింది. 'సరిహద్దు గాంధీ'గా ప్రసిద్ధుడైన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ నేతృత్వంలో 'కుదాయ్ ఖిద్మత్‌గార్' (ఎర్ర చొక్కాలు) అనే సంస్థ ఏర్పాటైంది. ఇదే కాలంలో బెంగాల్‌కు చెందిన విప్లవనేత సూర్యసేన్ 1930 ఏప్రిల్ 18న అనుచరులతో కలిసి చిట్టగాంగ్‌లోని సైనిక స్థావరంపై దాడి జరిపి దాన్ని స్వాధీనం చేసుకున్నాడు. 'భారత రిపబ్లిక్ సైన్యాన్ని' స్థాపించి స్వాతంత్ర్య ప్రకటన చేశారు. రాణి గైడిన్లు నేతృత్వంలో నాగాలాండ్‌లో బ్రిటిష్ వ్యతిరేక పోరాటం జరిగింది. శాసనోల్లంఘన ఉద్యమం జరుగుతున్న నేపథ్యంలోనే సైమన్ కమిషన్ నివేదికపై చర్చలు జరిపేందుకు 1930లో లండన్‌లో మొదటి రౌండ్ టేబుల్ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. జాతీయ కాంగ్రెస్ సమావేశాలను బహిష్కరించింది. 1931 సెప్టెంబర్‌లో రెండో రౌండ్ టేబుల్ సమావేశంలో గాంధీ పాల్గొన్నారు. దేశానికి డొమినియన్ ప్రతిపత్తి కోసం గట్టిగా పట్టుపట్టారు. దానికి బ్రిటిష్‌వారు తిరస్కరించడంతో శాసనోల్లం ఘనోద్యమం మళ్లీ ప్రారంభమైంది. భారతీయ నాయకుల్లో విభేదాలు, బ్రిటిష్ అణచివేత విధానాల ఫలితంగా ఉద్యమం క్రమంగా బలహీనపడింది. 1933, మేలో ఉద్యమాన్ని నిలిపివేస్తున్నట్లు జాతీయ కాంగ్రెస్ అధికారికంగా ప్రకటించింది. భారత స్వాతంత్ర్య ప్రస్థానంలో అత్యంత కీలక ఘట్టం 'క్విట్ ఇండియా' ఉద్యమం. భారతీయుల మనోభావాలను పట్టించుకోకుండా దేశాన్ని రెండో ప్రపంచ యుద్ధంలోకి దించడం, పాకిస్థాన్ ఏర్పాటుకు మద్దతుగా ఆగస్టు ప్రతిపాదనలను అంగీకరించడం, యుద్ధకాలంలో పెద్ద ఎత్తున జరిగిన మానవహక్కుల ఉల్లంఘనలు, మిత్రపక్ష సేనలు భారతీయులను హీనంగా చూడటం వంటివి 'క్విట్ ఇండియా ఉద్యమానికి' కారణమయ్యాయి. ఆగస్టు 6, 1942న బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 'క్విట్ ఇండియా' తీర్మానం చేసింది. ఆ మరుసటి రోజే గాంధీ సహా ఇతర నాయకులందరిని బ్రిటిషర్లు ఖైదు చేయడంతో ఉద్యమానికి సారథులు కొరవడ్డారు. అయినప్పటికీ ఉద్యమం దేశవ్యాప్తంగా దావానలంలా పాకింది. ప్రభుత్వ వ్యవస్థలను నిర్వీర్యం చేసే కార్యక్రమం పెద్ద ఎత్తున జరిగింది. రైతులు వివిధ ప్రాంతాల్లో సమాంతర ప్రభుత్వాలను ఏర్పాటు చేసుకున్నారు. ఉద్యమ నేపథ్యంలోనే సుభాష్ చంద్రబోస్ నేతృత్వంలో ఆజాద్ హింద్ ఫౌజ్ ఏర్పాటు జరిగింది. జపాన్ ప్రధాని 'కైజో' ఆహ్వానం మేరకు బోస్ భారత జాతీయ సైన్యం నాయకత్వాన్ని చేపట్టారు.

జపాన్ సహాయంతో బోస్ సింగపూర్‌లో ప్రజా ప్రభుత్వాన్ని Ü

స్థాపించారు. భారత ప్రజల కోసం అక్కడ రేడియోను ఏర్పాటు చేశారు. మరోవైపు భారత్‌లో అరుణా అసఫ్ అలీ, జయప్రకాష్ నారాయణ్‌లు క్విట్ ఇండియా ఉద్యమానికి పరోక్ష సహకారమందించారు. బ్రిటిష్ వారి దమనకాండ ఫలితంగా ఉద్యమం క్రమంగా బలహీన పడింది. ఉద్యమం విఫలమైనప్పటికీ – బ్రిటిష్‌వారు ఇక ఎంతోకాలం దేశంలో మనలేరన్న స్పష్టమైన సంకేతాలను మాత్రం అది ఇవ్వగలిగింది. బ్రిటిష్ వారి వెన్ను విరిచిన ఉద్యమాలకు అడుగడుగునా గాంధీ ప్రేరణగా నిలిచారు. భారతీయుల్లో ఆయన ఆత్మవిశ్వాసాన్ని నింపారు. అందుకే ఆయన జాతిపితగా మిగిలారు.

## ప్రాక్టీస్ ప్రశ్నలు...

1. **భారత జాతీయవాదులు సైమన్ కమిషన్‌ను ఎందుకు వ్యతిరేకించారు?**
   ఎ) సైమన్ బ్రిటిష్‌వాడు
   బి) కమిషన్‌లో భారతీయులెవరూ లేనందున
   సి) జాతీయవాదులతో సైమన్‌కు వైరం ఉంది
   డి) ఇవేవీ కాదు
2. **వ్యక్తిగత సత్యాగ్రహం చేసి 1940లో అరెస్ట యిన తొలి వ్యక్తి ఎవరు?**
   ఎ) చౌదరి రహమతుల్లా  బి) కొండా వెంకటప్పయ్య
   సి) ఆచార్య వినోబాభావే  డి) అరుణా అసఫ్ అలీ
3. **కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించిన మొదటి ఆంధ్రుడు?**
   ఎ) సరోజిని నాయుడు  బి) మాధవ కేలాస్కర్
   సి) రామస్వామి  డి) ఆనందాచార్యులు
4. **క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వం గాంధీజీని ఎక్కడ నిర్బంధించింది?**
   ఎ) పూనాలోని ఆగాఖాన్ భవనం
   బి) ఎరవాడ జైలు  సి) బొంబాయి
   డి) కలకత్తా
5. **ఏ ఉద్యమ సమయంలో బ్రిటిష్ వైఖరికి నిరసనగా గాంధీజీ 'కైజర్ ఎ హింద్' బిరుదును త్యజించారు?**
   ఎ) క్విట్ ఇండియా  బి) శాసనోల్లంఘన
   సి) సహాయ నిరాకరణ  డి) ఖిలాఫత్
6. **గాంధీజీ దక్షిణాఫ్రికాలో స్థాపించిన సంఘం ఏమిటి?**
   ఎ) ట్రాన్‌వెల్ ఫామ్  బి) ఫోనిక్స్ ఫామ్
   సి) డర్బన్ ఫామ్  డి) సబర్మతి ఫామ్
7. **ముస్లింలీగ్ ప్రారంభించిన పత్రిక పేరు?**
   ఎ) ఇంక్విలాబ్  బి) కామ్
   సి) స్టార్ ఆఫ్ ఇండియా  డి) బాంబే క్రానికల్
8. **దక్షిణాఫ్రికాలో గాంధీజీ తన భావాల ప్రచారానికి ఏర్పాటు చేసిన పత్రిక ఏది?**
   ఎ) కామన్‌వీల్  బి) ఇండియన్ ఒపీనియన్
   సి) హరిజన్  డి) దక్షిణాఫ్రికా టైమ్స్
9. **'భారత అశాంతి పిత'గా తిలక్‌ను అభివర్ణించిందెవరు?**
   ఎ) వాలెంటైన్ చిరోల్  బి) రెండో మింటో
   సి) డిజ్రాలీ  డి) చెమ్స్‌ఫర్డ్
10. **ఆజాద్ హింద్ ఫౌజ్ మహిళా విభాగానికి ఎవరు అధ్యక్షత వహించారు?**
   ఎ) అరుణా అసఫ్ అలీ  బి) రాణి గైడిన్లు
   సి) సరోజినీ నాయుడు  డి) కెప్టెన్ లక్ష్మి
11. **'నాకు రక్తమివ్వండి. నేను మీకు స్వాతంత్ర్యమిస్తాను' అన్నదెవరు?**
   ఎ) స్వామి వివేకానంద  బి) సుభాష్ చంద్రబోస్
   సి) భగత్‌సింగ్  డి) సూర్యసేన్
12. **1924లో బెల్గాం కాంగ్రెస్ సమావేశాలకు అధ్య క్షత వహించిందెవరు?**
   ఎ) మోతీలాల్ నెహ్రూ  బి) భూపేంద్రనాథ్ బోస్
   సి) లజపతిరాయ్  డి) మహాత్మాగాంధీ

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | B | C | D | A | C | B | C | B | A | D | B | D |

# భారత్‌లో సామాజిక, సాంస్కృతిక సంస్కరణోద్యమం

ఒక్క అక్షరం వేయి మెదళ్ల కదలిక అన్న మాటలో అతిశయోక్తి ఇసుమంత కూడా లేదు. ఆర్థికంగా, సామాజికంగా వలసపాలన దేశాన్ని భ్రష్టుపట్టించిందన్నది నిజమే. కానీ అదే సందర్భంలో బ్రిటిష్ హయాంలో భారత్‌లోకి ప్రవేశించిన విద్య, రవాణాల వల్ల ఎంతో కొంత మేలు కూడా జరిగింది. మరీ ముఖ్యంగా బ్రిటిష్ రాకకు ముందు వరకు వైదిక, మదర్సా విద్యావిధానమే దేశానికి దిక్కు. కానీ వారు వెంట తీసుకువచ్చిన ఇంగ్లిష్ విప్లవాత్మక మార్పులను తీసుకొచ్చింది. ఫలితంగా భారతీయుల ఆలోచనలకు నూతన ఒరవడి, పరిణితి, తిరుగుబాటుతత్వం జతగూడాయి. స్వాతంత్ర్య సమరానికి అదీ ఒక కారణంగా నిలిచింది. భారతీయ విద్యారంగంలో బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన మార్పులు, దేశంలో సామాజిక-సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలను పరిశీలిద్దాం.

ఇంగ్లిష్‌తో పాటు బ్రిటిషర్లు భారత్‌లో సంస్కృత, అరబిక్, పారశీక విద్యల ప్రోత్సాహానికీ కృషి చేశారు. 1792లో జొనాథన్ డంకన్ సిఫార్సుల మేరకు బెంగాల్‌లో సంస్కృత కళాశాలను స్థాపించారు. వారన్ హేస్టింగ్స్ 1781లో పారశీక, అరబిక్ భాషల అధ్యయనం కోసం కలకత్తాలో మదర్సాను ఏర్పాటు చేశారు. 1813లో బ్రిటిష్ తూర్పు ఇండియా సంఘం దేశంలో విద్యావ్యాప్తి కోసం లక్ష రూపాయలను కేటాయించింది. దేశంలో ఇంగ్లిష్‌ను రాజభాషగా చేయాలని విలియం బెంటింగ్, మెకాలే తీవ్రంగా ప్రయత్నించారు. 1818లో శెరాంపూర్ క్రైస్తవ సంఘాలు బాప్టిస్ట్ మిషనరీ కళాశాలను స్థాపించాయి. 1827లో ఎల్ఫిన్‌స్టన్ కళాశాలను, 1837లో అండర్‌సన్ మద్రాసులో క్రిస్టియన్ కాలేజీని, 1841లో రాబర్ట్ నోబెల్ మచిలీపట్నంలో నోబెల్ కళాశాలను, 1844లో స్టిఫెన్ హిస్లాప్ నాగపూర్‌లో కళాశాలను, 1853లో ఆగ్రాలో సెయింట్ జాన్స్ కాలేజీని స్థాపించారు. 1854లో ఈస్టిండియా కంపెనీ బోర్డ్ ఆఫ్ కంట్రోల్ అధ్యక్షుడిగా చార్లెస్ వుడ్ ప్రతిపాదించిన నివేదిక ఆంగ్ల విద్యావ్యాప్తికి విశేషంగా ఉపయోగపడింది. దాన్ని ఇంగ్లిష్ అభివృద్ధికి 'మాగ్నా కార్టా'గా పరిగణించారు. ఉన్నత విద్యాభివృద్ధి లక్ష్యంగా 1857లో కలకత్తా, బొంబాయి, మద్రాస్‌లలో యూనివర్సిటీలను ఏర్పాటు చేశారు. వుడ్స్ ప్రతిపాదనలను, విద్యా బోధన అభివృద్ధికి సర్కారు చేపట్టాల్సిన చర్యలను అధ్యయనం చేయడం కోసం 1880లో విలియం హంటర్ నేతృత్వంలో ఓ విద్యాసంఘాన్ని నాటి గవర్నర్ జనరల్ లార్డ్ రిప్పన్ ఏర్పాటు చేశారు. విద్యారంగంలో ప్రభుత్వ ప్రత్యక్ష నియంత్రణకు స్వస్తిపలికి, ప్రైవేటు భాగస్వామ్యాన్ని పెంపొందించాలని హంటర్ కమిటీ సూచించింది. 1902లో గవర్నర్ జనరల్ లార్డ్ కర్జన్ యూనివర్సిటీలపై సమీక్ష కోసం థామస్ ర్యాలీ కమిటీని నియమించారు. కమిటీ సూచనల మేరకు 1904లో విశ్వవిద్యాలయాల చట్టాన్ని చట్టసభలో ఆమోదించారు. 1921లో ద్వంద్వ పాలనను ప్రవేశపెట్టడం ద్వారా విద్యను రాష్ట్రాల అంశంగా గుర్తించారు. 1929లో సర్ ఫిలిప్ హర్‌టోగ్ కమిటీ నిర్బంధ విద్యావిధానాన్ని సమీక్షించి దానికి మద్దతు పలికింది. విద్యాభివృద్ధికి మరిన్ని సూచనల కోసం 1944లో జాన్ సార్జంట్ కమిటీని నియమించారు. 1947 నాటికి మన దేశంలో 25 విశ్వవిద్యాలయాలు, 643 అనుబంధ కళాశాలలు క్రియాశీలంగా ఉన్నాయి.

## సామాజిక, సాంస్కృతిక సంస్కరణోద్యమం

దేశంలో పాతుకుపోయిన మూఢాచారాలను, అంధ విశ్వాసాలను, దురాచారాలను తుదముట్టించే సదాశయంతో సంస్కరణోద్యమాలు జరిగాయి. రాజారామ్మోహన్‌రాయ్ స్థాపించిన బ్రహ్మసమాజం, 1866లో బ్రహ్మసమాజ్ నుంచి విడిపోయి కేశవ్ చంద్రసేన్ తదితరులు స్థాపించిన అఖిల భారత బ్రహ్మసమాజ్‌లు స్త్రీ ఉద్ధరణకు చేసిన కృషి అంతా ఇంతా కాదు. కేశవ్ చంద్రసేన్ బాల్య వివాహాలకు పూనుకోవడంతో 1878లో ఆనంద మోహన్‌బోస్, చిప్లూంకర్‌లు సద్ధర్మ బ్రహ్మ సమాజాన్ని ఏర్పాటు చేశారు. 1875లో స్వామి దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజం సాంస్కృతిక పునరుజ్జీవనానికి విభిన్నమైన కృషిచేసింది. శుద్ధి ఉద్యమం, గో సంరక్షణ ఉద్యమాలు ఆర్యసమాజ్ కార్యక్రమాల్లో అత్యంత వివాదాస్పదమైన అంశాలు. స్వామి శ్రద్ధానంద ఆధ్వర్యంలోని గురుకుల వర్గంగా పిలిచే విభాగం సంస్కృత విద్యను మాధ్యమంగా ఉండాలని ప్రచారం చేయగా, లాలాలజపతి రాయ్, హన్స్‌రాజ్‌ల నేతృత్వంలోని వర్గం ఇంగ్లిష్ భాష కోసం పట్టుపట్టింది. 1875లో రష్యన్‌కు చెందిన మేడమ్ బ్లావట్స్కీ, కల్నల్ ఆల్కాట్‌ల నేతృత్వంలో దివ్యజ్ఞాన సమాజం ప్రారంభమైంది. తొలుత అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్న ఈ సంస్థ ప్రధాన కార్యాలయం అనంతర కాలంలో చెన్నైలోని అడయార్‌కు మారింది. 1916లో భారతీయులకు స్వయం పాలనాధికారాన్ని సాధించేందుకు అనిబిసెంట్ నేతృత్వంలో హోంరూల్ ఉద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమ ప్రచారం కోసం ఆమె కామన్ వీల్, న్యూ ఇండియా అనే పత్రికలను స్థాపించారు. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంలో రామకృష్ణ మఠం నిర్వహించిన పాత్ర అద్వితీయమైంది. 1887లో బేలూరులో వివేకానంద మఠాన్ని స్థాపించారు. దీనికి అనుబంధంగా 1897లో రామకృష్ణ మిషన్‌ను కూడా ఏర్పాటు చేశారు. ఆత్మారాం పాండురంగ స్థాపించిన ప్రార్థన సమాజం, దాదాజి పాండురంగ స్థాపించిన పరమహంస మండలి, హరిదయాల్ శాస్త్రి స్థాపించిన రాధాస్వామీ సత్సంగ్, శివనారాయణ్ అగ్నిహోత్రి స్థాపించిన దేవసమాజ్ వంటివి దేశంలో సామాజిక, సాంస్కృతిక వికాసానికి తిరుగులేని సేవ చేశాయి. ఇస్లామ్‌లో సంస్కరణలను లక్షిస్తూ తొలిసారిగా 1865లో తొలిసారిగా మౌలానా హుస్సేన్ అహ్మద్ నేతృత్వంలో దియోబంద్ ఉద్యమం

ప్రారంభమైంది. మీరజ్ గులామ్ అహ్మద్ ప్రారంభించిన అహ్మదీయ ఉద్యమం కూడా ముస్లి ముల్లో సామాజిక ప్రగతిని లక్షించింది. మౌలానా సిబిల్ నిమామీ స్థాపించిన నుద్వాఉల్, ఉలామా, నాజిర్ హుస్సేన్ ప్రారంభించిన అహల్ ఎ ఖొరాన్, అబ్దులా చక్రలావీ మొదలుపెట్టిన అహల్ ఎ హదీస్ వంటి ఉద్యమాలు ముస్లిం సమాజంలో సంస్కరణల కోసం కృషి చేశాయి. నిమ్న జాతుల్లోనూ చైతన్యం కోసం పెద్ద ఎత్తున ఉద్యమాలు జరిగాయి. బ్రాహ్మణ వ్యతిరేక ధోరణిని ప్రచారం చేస్తూ ఏర్పాటయిన జస్టిస్ పార్టీ 1923లో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో మద్రాస్ ప్రెసిడెన్సీలో గెలుపొందింది. ఇ.వి. రామస్వామి నాయకర్ ఆత్మగౌరవ పోరాటం అత్యంత ప్రసిద్ధమైంది. కుడి-అరసు పత్రిక ద్వారా ద్రవిడ మున్నేట్ర భావాలను ఆయన ప్రచారం చేశారు. మున్నాత్త పద్మనాభ పిళ్లై నాయక్ వెల్ఫేర్ సొసైటీ, రామన్ పిళ్లై మళయాల మనోరమలు కేరళ ప్రాంతంలో ప్రభావశీలంగా ఉన్నాయి. అంటరాని కులాలుగా భావించిన ఇజ్జవాలకు ఆలయ ప్రవేశాన్ని కల్పించడం కోసం నారాయణ గురు తిరుగులేని పోరాటం చేశారు. కర్ణాటకలో సిఆర్‌రెడ్డి నేతృత్వంలో బ్రాహ్మణ వ్యతిరేక భావజాలంతో ప్రజా మంత్రిమండలి ఏర్పాటయింది. బాంబే ప్రెసిడెన్సీలో జ్యోతిభాపూలే నేతృత్వంలో ఏర్పాటయిన సత్యశోధక్ సమాజ్ దిగువ కులాల్లో చైతన్యానికి నాంది పలికింది. అంటరాని మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ 'మహర్ సత్యాగ్రహం' ద్వారా నిమ్న కులాల్లో ఉద్యమ చైతన్యం రగిల్చారు. 1924లో ఆయన ఆల్ ఇండియా డిప్రెస్డ్ క్లాస్ అసోసియేషన్ ఏర్పాటు చేశారు.

## ప్రాక్టీస్ ప్రశ్నలు...

**1. కింది వాటిలో స్వామి దయానంద సరస్వతి రాసిన గ్రంథమేది?**

ఎ) సత్యార్థ ప్రకాశ్ బి) వేద ప్రకాశ్
సి) సత్యార్థ భూమిక డి) వేద భాష్య భూమిక

**2. లోకహిత వాదిగా పేరొందిన మహారాష్ట్రకు చెందిన సంఘసంస్కర్త ఎవరు?**

ఎ) ఎం.జి. రణడే బి) జి.జి. అగార్కర్
సి) కేశవ్ చంద్రసేన్ డి) గోపాల్ హరి దేశ్‌ముఖ్

**3. ముస్లింల సామాజిక, ఆర్థిక అభ్యున్నతి కోసం అలీఘడ్ ఉద్యమాన్ని ప్రారంభించింది ఎవరు?**

ఎ) సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్
బి) మౌలానా హుస్సేన్ అహ్మద్
సి) జఫర్ అలీ ఖాన్ డి) అజ్మల్ ఖాన్

**4. విలియం బెంటింగ్‌పై ఒత్తిడి తెచ్చి సతీస హగమన దురాచారాన్ని రద్దు చేయించింది?**

ఎ) దాదా కొండదేవ్ బి) దాదోబా పాండురంగ్
సి) రాజారామ్మోహన్‌రాయ్
డి) దేబేంద్రనాథ్ ఠాగూర్

**5. సిక్కుల్లో సంస్కరణలను కాంక్షిస్తూ ఆరంభమైన కుకా ఉద్యమ స్థాపకుడు?**

ఎ) తులసీరామ్ బి) రాధాకృష్ణ దేవ్
సి) హెచ్.ఎస్. కుంబ్రు డి) భగత్ జవహర్‌మల్

**6. యువబెంగాల్ ఉద్యమాన్ని ప్రారంభించింది ఎవరు?**

ఎ) శ్రీరామ్ బాజ్‌పాల్ బి) హెన్రీ వివియన్ డిరోజియో
సి) ఎస్.ఎస్. బెంగాలీ డి) జి.కె. దేవధర్

**7. జొరాస్ట్రియన్ మత ప్రచారం కోసం నౌరోజీ పుర్దోంజీ ప్రారంభించిన పత్రిక ఏది?**

ఎ) న్యూ ఇండియా బి) రఫ్త్ గుఫ్తార్
సి) ఫమ్ ఇ ఫమ్‌హిద్ డి) జగత్ మిత్ర

**8. గుజరాత్‌లోని టంకారా ప్రాంతంలో 1824లో జన్మించిన దయానంద సరస్వతి అసలు పేరు?**

ఎ) మూల శంకర బి) శ్రద్ధానంద
సి) ఛటోపాధ్యాయ డి) స్వామి నారాయణ్

**9. వితంతు వివేకం అనే గ్రంథాన్ని రాసిందెవరు?**

ఎ) రణడె బి) వీరేశలింగం పంతులు
సి) ఈశ్వరచంద్ర విద్యాసాగర్
డి) గోపాల్ హరిదేశ్‌ముఖ్

**10. దేవేంద్రనాథ్ ఠాగూర్ నేతృత్వంలో కొనసాగిన 'తత్వబోధిపత్రిక' భాషలో వెలువడింది?**

ఎ) ఇంగ్లిష్ బి) బెంగాలీ
సి) హిందీ డి) మరాఠీ

**11. కేరళలో తొలి ఆధునిక నవలైన ఇందులేఖను 1889లో రచించిందెవరు?**

ఎ) సి.వి. రామన్ పిళ్లై బి) పద్మనాభ పిళ్లై
సి) చందర్ మీనన్ డి) రామకృష్ణ పిళ్లై

**జవాబులు**

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| B | A | A | C | D | B | C | A | C | B | C |

# పునరుజ్జీవనోద్యమం, సంస్కరణోద్యమాలు...

భారత్‌లో సాంఘిక, మత సంస్కరణోద్యమాలు పందొమ్మిదో శతాబ్దిలో ప్రారంభమయ్యాయి. బెంగాల్‌లో ప్రారంభమైన ఈ ఉద్యమం క్రమంగా దేశవ్యాప్తమైంది. ప్రాచీన భారతీయ సాహిత్య అధ్యయనం, ఆంగ్లవిద్య, సాహిత్య ప్రభావం, జాతీయతా భావం, విదేశీయులు భారతీయ సంస్కృతిని అణచివేయడానికి పాటించిన విధానాలకు వ్యతిరేకత, పాశ్చాత్య ప్రలోభాల్లో భారతీయులు పడకుండా చేయడం వంటి పలు కారణాలు కూడా పునరుజ్జీవనోద్యమానికి దోహదం చేశాయి.

పునరుజ్జీవనోద్యమానికి పాటుపడిన ఆయా సంస్థలు, వ్యక్తుల గురించి క్లుప్తంగా..

## రాజారామ్ మోహన్ రాయ్ (1774-1833)

ఆధునిక యుగకర్తగా, బెంగాల్‌లో ప్రారంభమైన సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమానికి ప్రథమ నాయకునిగా చరిత్రలో ప్రత్యేక స్థానం సంపాదించాడు. ఈస్ట్ ఇండియా కంపెనీలో సామాన్య ఉద్యోగిగా పనిచేసే కాలంలో జాన్ డిగ్బీకి సన్నిహితుడై ఆంగ్లభాష నేర్చుకున్నాడు. ఇస్లాం మతస్థులకు మూలగ్రంథమైన ఖురాన్‌ను పఠించి తుహ్ఫాత్ ఉల్ మువాహిద్దీన్ అనే గ్రంథాన్ని రచించి, 1803లో ముద్రించాడు. ఏకేశ్వరోపాసన ప్రతిమత సిద్ధాంతమని తెలిపాడు. వేదాంతాన్ని బెంగాలీ భాషలోకి అనువదించాడు. 1815లో ఆత్మీయసభను స్థాపించాడు. ప్రజలను చైతన్యపరచడానికి బెంగాలీ వారపత్రిక సంవాద కౌముది, పర్షియన్ వారపత్రిక మిరాట్-ఉల్-అక్బర్ పత్రికలను నడిపాడు. వీటిలో ప్రధానంగా రాజకీయ, మత, నైతిక విషయాలను చర్చించేవారు. రాయ్ రచించిన పుస్తకాలు బెంగాలీ భాషలో 30 వరకు, ఆంగ్లభాషలో 40 వరకు ఉన్నాయి. 1820లో వెలువడిన 'ది ప్రిన్సెస్ ఆఫ్ జీసస్', 'ది గైడ్ టు పీస్ అండ్ హ్యాపీ నెస్' సంకలనాలు ముఖ్యమైనవి. ఇతడు హరిహరానంద వద్ద తంత్ర శాస్త్రాన్ని నేర్చుకున్నాడు.

రాయ్ నాయకత్వంలో 1828లో బ్రహ్మసమాజం ఆవిర్భవించింది. సమాజ సభ్యుల ఆరాధనలకు, ఉపాసనలకు 1830లో బ్రహ్మ మందిరాన్ని నిర్మించాడు. మానవులంతా ఒకే కుటుంబానికి చెందినవారని సమాజ సభ్యులు విశ్వసించారు. సతీసహగమన దురాచారాన్ని రూపుమాపడానికి, భారత్‌లో ఆంగ్ల విద్యావ్యాప్తికి కృషిచేసిన సంఘసంస్కర్త ఇతడు. ఈ విషయంలో గవర్నర్ జనరల్ విలియం బెంటిక్‌కు సహకారాన్నిచ్చాడు. మొఘల్ వంశ చక్రవర్తి II అక్బర్ క్రీ.శ. 1832లో రాజారామ్ మోహన్ రాయ్‌కు 'రాజా' అనే బిరుదునిచ్చాడు. రాయ్ 1833 సెప్టెంబర్ 27న ఇంగ్లండ్‌లోని బ్రిస్టల్ నగరంలో మరణించాడు.

## దేవేంద్రనాథ్ ఠాగూర్ (1817-1905)

రాయ్ మరణానంతరం బ్రహ్మ సమాజానికి నాయకత్వం వహించిన ప్రముఖుడు. ఈయన 1842లో బ్రహ్మసమాజ సభ్యత్వాన్ని స్వీకరించాడు. ఉపనిషత్తుల ప్రేరణతో తాను 1839లో స్థాపించిన 'తత్వబోధిని సభ'ను బ్రహ్మసమాజంలో విలీనం చేశాడు. వేదాలను, ఉపనిషత్తులను బోధించేందుకు 1840లో 'తత్వబోధిని పాఠశాల'ను స్థాపించాడు. 1843లో తత్వబోధిని పత్రికను అక్షయ్‌దత్తా సంపాదకత్వంలో ప్రారంభించాడు. 1843లో బ్రహ్మసమాజ సభ్యులకు నియమ నిబంధనలను పేర్కొంటూ... ఉపనిషత్తుల ఆధారంగా 'బ్రహ్మధర్మం'ను ప్రచురించాడు. ఈయన నాయకత్వంలో బ్రహ్మసమాజం వృద్ధి చెందింది. 1865 నాటికి బ్రహ్మసమాజంలో దేవేంద్రనాథ్, కేశవ చంద్రసేన్‌ల మధ్య అభిప్రాయ బేధాలు తలెత్తాయి. కేశవ చంద్రసేన్ బ్రహ్మసమాజం నుంచి వైదొలిగి, 1866లో 'బ్రహ్మసమాజ్ ఆఫ్ ఇండియా'ను స్థాపించాడు. దేవేంద్రనాథ్ నాయకత్వంలోని సమాజం 'ఆది బ్రహ్మసమాజం'గా కొనసాగింది.

## కేశవ చంద్రసేన్ (1838-1884)

ఈయన 1857లో బ్రహ్మసమాజంలో చేరాడు. స్త్రీ విద్య, వితంతు వివాహాలను, వర్ణాంతర భోజనాలను, కులాంతర వివాహాలను సమర్థించాడు. చంద్రసేన్ 1861లో 'హిందూదేశ దర్పణం' అనే పక్షపత్రికను ప్రారంభించాడు. ఇది 1871లో ప్రథమ ఆంగ్ల దినపత్రికగా మారింది. ధర్మతత్వ అనే బెంగాలీ పత్రికను కూడా సేన్ ప్రారంభించాడు. స్త్రీలకు ప్రత్యేకంగా ప్రార్థనా మందిరాన్ని స్థాపించారు. ఈయన స్థాపించిన బ్రహ్మసమాజ్ ఆఫ్ ఇండియా (భారతీయ బ్రహ్మసమాజం)ను నవ బ్రహ్మసమాజం, భరతవర్షీయ సమాజంగా కూడా వ్యవహరిస్తారు. సేన్ నాయకత్వంలో 1870లో స్థాపించిన 'భారత సంస్కరణ సంఘం' భారతీయుల సాంఘిక, నైతిక అభ్యున్నతికి కృషి చేసింది. సేన్ కృషి ఫలితంగా వివాహ వయోపరిమితులను నిర్ణయిస్తూ 1872లో 'నేటివ్ మ్యారేజ్ యాక్ట్' రూపొందింది. ఈ చట్టం ప్రకారం 14 సంవత్సరాలు నిండిన బాలికలు, 18 సంవత్సరాలు నిండిన బాలురు మాత్రమే వివాహానికి అర్హులు. కానీ 1878లో ఈ చట్టానికి విరుద్ధంగా సేన్ తన కుమార్తె వివాహాన్ని యుక్తవయసు లేని కూచ్ బీహార్ యువరాజుతో జరిపించి విమర్శలను ఎదుర్కొన్నాడు.

## శశిపాద బెనర్జీ

కేశవ చంద్రసేన్ ప్రభావంతో 40 సంవత్సరాల పాటు ప్రజాసేవలో గడిపాడు. 1873లో 'సాధారణ ధర్మసభ' అనే మత సంఘాన్ని స్థాపిం

చాడు. ఈయన స్థాపించిన 'శ్రమజీవి' పత్రిక మొదటి కార్మిక పత్రికగా పేరుగాంచింది. 1887లో కలకత్తాలో వితంతు శరణాలయాన్ని స్థాపించాడు.

## ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820–1891)

బ్రహ్మసమాజ వ్యాప్తికి కృషిచేసిన బెంగాలీ నాయకుడు, సంస్కర్త, నాస్తికుడు, హేతువాది. స్త్రీల అభ్యున్నతికి విద్యాసాగర్ గణనీయమైన కృషి చేశాడు. వితంతు వివాహాలు శాస్త్ర సమ్మతమని 1856లో సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించాడు. ఇతని కృషి ఫలితంగానే బ్రిటిషర్ల తో 1856లో 'హిందూ వితంతు పునర్వివాహ చట్టం' రూపొందింది. విద్యాసాగర్ తన గృహంలో అనేక స్త్రీ పునర్వివాహాలను జరిపించాడు. 'వితంతు వివేకం' అన్న గ్రంథాన్ని రాశాడు.

## ప్రాక్టీస్ ప్రశ్నలు

1. ఆధునిక యుగకర్తగా ఇతడు ప్రతీతి?
   ఎ) వీరేశలింగం బి) ఈశ్వర చంద్ర విద్యాసాగర్
   సి) రాజారామ్మోహన్‌రాయ్ డి) స్వామిదయానంద
2. రాజారామ్మోహన్‌రాయ్‌కు 'రాజా' అన్న బిరుదును ప్రసాదించిన మొఘల్?
   ఎ) అక్బర్ బి) రెండో అక్బర్
   సి) జహంగీర్ డి) బహదూర్‌షా–2
3. కింది వాటిలో 'హిందూదేశీ దర్పణం' అనే పక్ష పత్రికను స్థాపించింది?
   ఎ) దేవేంద్రనాథ ఠాగూర్ బి) కేశవచంద్రసేన్
   సి) శశిపాద బెనర్జీ డి) ఈశ్వరచంద్రవిద్యాసాగర్
4. 'బ్రహ్మసమాజ్ ఆఫ్ ఇండియా' స్థాపకుడు?
   ఎ) రాజారామ్మోహన్‌రాయ్ బి) దేవేంద్రనాథ్ ఠాగూర్
   సి) కేశవచంద్రసేన్ డి) వీరేశలింగం
5. 'సత్యశోధక్ సమాజ్' అనే సంస్థను స్థాపించింది? (గత పరీక్షల్లో అడిగిన ప్రశ్న)
   ఎ) దయానంద సరస్వతి బి) శ్రీ నారాయణగురు
   సి) జ్యోతిరావు పూలె డి) పండిత రమాబాయి
6. ఆంగ్లంలో గోల్డ్‌స్మిత్ రాసిన వికార్ ఆఫ్ ది వేక్‌ఫీల్డ్ ఆధారంగా రూపుదిద్దుకుంది ఏది?
   ఎ) సత్యవతి చరిత్ర బి) చంద్రమతి చరిత్ర
   సి) రాజశేఖర చరిత్ర డి) సత్యరాజా పూర్వదేశయాత్ర
7. దేవేంద్రనాథ్ ఠాగూర్ 'తత్వబోధిని' సభను స్థాపించిన సంవత్సరం?
   ఎ) క్రీ.శ. 1839 బి) క్రీ.శ. 1840
   సి) క్రీ.శ. 1842 డి) క్రీ.శ. 1843
8. వివేకానందుని చికాగో సర్వమత సమ్మేళన ప్రసంగాన్ని కొనియాడిన పత్రిక?
   ఎ) ప్రబుద్ధ భారత బి) న్యూయార్క్ టైమ్స్
   సి) న్యూయార్క్ హెరాల్డ్ డి) ఇందు ప్రకాష్
9. దివ్యజ్ఞాన సమాజాన్ని 1875లో ఇక్కడ స్థాపించరు?
   ఎ) అడయారు బి) ముంబయి
   సి) న్యూయార్క్ డి) మాస్కో

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|---|
| | C | B | B | C | C | A | A | C |

భారత్‌లో సాంఘిక, మత సంస్కరణోద్యమాలు పందొమ్మిదో శతాబ్దంలో ప్రారంభమయ్యాయి. బెంగాల్‌లో ప్రారంభమైన ఈ ఉద్యమం క్రమంగా దేశవ్యాప్తమైంది. దేశంలో సంస్కరణోద్యమాలకు పాటుపడిన వారిలో కొందరి గురించి..

## పండిత రమాబాయి (1858-1922)

బొంబాయిలోని సంఘసంస్కర్తల్లో ఒకరు. ఈమెకు పండిత, సరస్వతి అనే బిరుదులున్నాయి. మహిళాభ్యుదయానికి పుణే పట్టణంలో 'ఆర్య మహిళా సమాజం'ను ప్రారంభించారు. హిందూ సమాజంలోని కులతత్వాన్ని విమర్శిస్తూ 'High Caste Hindu Woman' అనే గ్రంథాన్ని రచించారు. వితంతువుల కోసం 1889లో 'శారదా సదన్' అనే వసతిగృహాన్ని బొంబాయిలో స్థాపించారు.

## రామకృష్ణ పరమహంస (1836-1886)

ప్రాచీన హైందవ మత ఔన్నత్యాన్ని ఆధునిక కాలంలో పునరుజ్జీవింపజేయడానికి కృషిచేసిన వ్యక్తి. ఈయన అసలు పేరు గదాధర చటోపాధ్యాయ. 1856లో బెంగాల్‌లోని దక్షిణేశ్వరంలో రాణి రాసమణి దేవి నిర్మించిన కాళికాలయంలో అర్చకత్వం స్వీకరించారు. 'దక్షిణేశ్వర యోగి'గా ప్రసిద్ధుడిగా పేరొందిన రామకృష్ణ పరమహంస శిష్యుడే వివేకానందుడు.

## వివేకానంద-రామకృష్ణ మిషన్ (1863-1902)

వివేకానందుడి అసలు పేరు నరేంద్రనాథ్ దత్తా. ఈయన 1897లో 'రామకృష్ణ మిషన్'ను స్థాపించాడు. 1893లో చికాగోలో జరిగిన సర్వమత సమ్మేళనంలో ప్రసంగించడం ద్వారా ప్రపంచ దృష్టిని ఆకర్షించాడు. ఈ ఉపన్యాసం 'న్యూయార్క్ హెరాల్డ్' పత్రిక ప్రశంసలందుకొంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మానవులందరికీ కల్పించాలన్నది వివేకానందుని ఆశయం. ప్రతి వ్యక్తిలోనూ మహోన్నత స్థానం పొందే శక్తి సామర్థ్యాలు నిబిడీకృతమై ఉన్నాయని వివేకానందుడు ఉద్బోధించాడు. ఈయన ప్రబుద్ధ భారత అనే పత్రిక ద్వారా ఆధ్యాత్మిక ప్రచారం చేశాడు. 'భారతదేశ ఆధ్యాత్మిక సూర్యుడు'గా ప్రసిద్ధికెక్కారు.

## సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ (1817-1898)

ముస్లింలలో పాశ్చాత్య సంస్కృతి పట్ల అవగాహన కలిగించడానికి, విద్యావ్యాప్తికి, ముస్లిం సమాజాన్ని సంస్కరించడానికి విశేషంగా కృషి చేశాడు. బ్రిటిషర్లకు ముస్లిముల పట్ల ఉన్న వ్యతిరేకతను దూరం చేయడానికి 1860-61లో విధేయులైన భారతీయ ముస్లిములు అనే వ్యాసాన్ని ప్రచురించాడు. 1875లో అలీఘడ్ కేంద్రంగా ఇతడు స్థాపించిన మహమ్మదీయ ఆంగ్ల ప్రాచ్య కళాశాలే నేటి అలీఘడ్ యూనివర్సిటీ. ముస్లిం సంస్కరణకు ఈయన ప్రారంభించిన ఉద్యమం 'అలీఘడ్ ఉద్యమం'గా ప్రతీతి. ఈయన స్థాపించిన పత్రిక Tahdibul Akhalq. 'ఖురాన్ వైపు మరలండి' అనే నినాదం ఇతనిదే.

## జ్యోతిరావ్ పూలె 1827-1890

మహారాష్ట్రకు చెందిన సంఘసంస్కర్త. థామస్ పెయిన్ రాసిన 'రైట్స్ ఆఫ్ మాన్' ఆయనను ఎంతగానో ప్రభావితం చేసింది. స్త్రీలకు విద్య నిషేధమని ప్రవచించిన మనుస్మృతిని తిరస్కరించాడు. మానసిక బానిసత్వం నుంచి శూద్రులను కాపాడాలనే ఉద్దేశంతో 'Tritiya Ratna' అనే నాటకాన్ని ముద్రించి, పంచిపెట్టాడు. 'Priestcraft Expo sed' అనే గ్రంథంలో సమాజంలో పాతుకుపోయిన ఆచారాలను, మూఢనమ్మకాలను ఖండించాడు. 1872లో 'గులాంగిరి' అనే గ్రంథాన్ని ప్రచురించాడు. ఈయన స్థాపించిన సంస్థయే 'సత్యషోదక్ సమాజ్'.

## స్వామి దయానంద సరస్వతి - ఆర్యసమాజం (1824-1883)

దయానంద సరస్వతి అసలుపేరు మూలశంకర్. శృంగేరి మఠానికి చెందిన పరమానంద సరస్వతి వద్ద దీక్షను స్వీకరించాడు. తరువాత దయానంద సరస్వతిగా పేరు మార్చుకున్నాడు. మధురలో స్వామి విరజానంద వద్ద వేదసత్యాలను తెలుసుకున్నాడు. 1875లో బొంబాయి కేంద్రంగా 'ఆర్య సమాజం' అనే సంస్థను స్థాపించాడు. ఇతని రచనల్లో అతి ముఖ్యగ్రంథం 'సత్యార్థ ప్రకాశిక'. ఇది ఆర్యసమాజ సభ్యులకు ప్రామాణిక గ్రంథం. 1882 'గోరక్షణ సభ'ను స్థాపించి గోవధకు వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. దయానందుని మరణానంతరం.. 1892లో ఆర్యసమాజ సభ్యుల్లో విద్య, ఆహారపు అలవాట్ల విషయంలో విభేదాలు తలెత్తడంతో ఆర్యసమాజం చీలిపోయింది.

## అనీబిసెంట్-దివ్యజ్ఞాన సమాజం

సంస్కరణోద్యమంలో ప్రముఖపాత్ర వహించిన సంస్థలలో దివ్యజ్ఞాన సమాజం(థియోసాఫికల్ సొసైటీ) ఒకటి. దీనిని మొదట న్యూయార్క్ కేంద్రంగా రష్యాకు చెందిన బ్లావట్స్కీ, కల్నల్ హెన్రీస్టీల్ ఆల్కాట్‌లు స్థాపించారు. వీరు 1879లో భారతదేశం వచ్చి, మద్రాసు సమీపంలో

అడయారు వద్ద దివ్యజ్ఞాన సమాజ కేంద్రాన్ని స్థాపించారు. ఈ సంస్థ కార్యకలాపాలు ఐర్లాండ్ మహిళ అనిబిసెంట్ 1893లో భారతదేశానికి రావడంతో ఊపందుకున్నాయి. హిందూ సమాజ ఉద్ధరణ లక్ష్యంగా ఈ సంస్థ కార్యకలాపాలు కొనసాగాయి. విద్య, రాజకీయాలపై అనిబిసెంట్ ఇచ్చిన ఉపన్యాసాలు 'భారతదేశమా మేలుకో (Wack up India)' అనే గ్రంథ రూపంలో ప్రచురితమయ్యాయి. ప్రజలలో జాతీయవాద స్ఫూర్తిని పెంపొందించడానికి అనీబిసెంట్ 'కామన్ వీల్', 'న్యూ ఇండియా' అనే పత్రికలను సాధనాలుగా ఉపయోగించుకుంది. 1921లో బెనారస్ యూనివర్సిటీ నుంచి గౌరవ డాక్టరేట్ సాధించింది. 1916లో తన నాయకత్వంలో హోమ్‌రూల్ (స్వపరిపాలన) ఉద్యమాన్ని ప్రారంభించింది. కాశీలో హిందూ కళాశాల స్థాపనకు కారకురాలు. ఈ కళాశాలే మదన్‌మోహన్ మాలవ్య ఆధ్వర్యంలో బెనారస్ విశ్వవిద్యాలయంగా ప్రసిద్ధికెక్కింది.

## కందుకూరి వీరేశలింగం (1848-1919)

ఆధునిక ఆంధ్రదేశ సాంస్కృతిక పునరుజ్జీవ నోద్యమంలో ఆద్యుడు. ఈయన్ని 'ఆధునిక ఆంధ్ర పితామహుడు', 'దక్షిణ దేశ విద్యాసాగర్' అని పిలుస్తారు. 'గద్యతిక్కన'గా కూడా ప్రసిద్ధిగాంచారు. 1874లో 'వివేకవర్ధిని' అనే తెలుగు పక్షపత్రికను, తర్వాతి కాలంలో హాస్య సంజీవిని, సతీహిత బోధిని, సత్య సంవర్ధిని, తెలుగు జనానా, సత్యవాదిని పత్రికలను ప్రచురించాడు. ఆంధ్రదేశంలో స్త్రీ విద్యావ్యాప్తికి, వితంతు వివాహాలను జరిపించడానికి ప్రాముఖ్యతనిచ్చాడు. సత్యవతి చరిత్ర, చంద్రమతి చరిత్ర, సత్యసంవలిని వంటి గ్రంథాలు ఈయన రచనలే. తెలుగులో మొదటి నవలగా పేరుగాంచిన 'రాజశేఖర చరిత్ర' ఇతని రచనే. ఆంగ్లంలో గోల్డ్‌స్మిత్ రాసిన 'వికార్ ఆఫ్ ది వేక్‌ఫీల్డ్' ఆధారంగా రాజశేఖర చరిత్ర నవల రూపుదిద్దుకుంది. ఇందులో వితంతువుల దుస్థితిని వర్ణించాడు. 1879లో వితంతు వివాహం శాస్త్ర సమ్మతమే అంటూ రాజమండ్రిలో మొదటి బహిరంగ ఉపన్యాసం చేశాడు. 1881 డిసెంబరులో మొదటి వితంతు వివాహాన్ని జరిపించాడు. బ్రహ్మ వివాహం, సత్యరాజా పూర్వదేశ యాత్ర వంటి హాస్యనాటికలు రాశాడు. జీసస్ చరిత్ర, విక్టోరియా మహారాణి చరిత్రలను రాశాడు. బ్రహ్మసమాజ సభ్యుడు. తాను ప్రారంభించిన సంస్కరణోద్యమాన్ని కొనసాగించడానికి 1908లో 'హితకారిణి సమాజం'ను స్థాపించాడు.

## రఘుపతి వెంకటరత్నం నాయుడు (1861-1939)

మచిలీపట్నంలో జన్మించాడు. సాంఘిక స్వచ్ఛత ఉద్యమ నిర్మాత. జీవితంలో స్వచ్ఛత, దేవదాసి వ్యవస్థను రద్దుచేయడం ఈ ఉద్యమ లక్ష్యాలు. బ్రహ్మ ప్రకాశిక, ది పీపుల్స్ ఫ్రెండ్, ది ఫెలో వర్కర్ పత్రికల ద్వారా తన ఉద్యమాలను ప్రజల్లోకి తీసుకెళ్ళిన వ్యక్తి. 'బ్రహ్మర్షి'గా ప్రతీతి.

## ప్రాక్టీస్ బిట్స్...

**1. న్యూ ఇండియా, కామన్ వీల్ పత్రికలెవరివి?**

ఎ) తిలక్ బి) అనీబిసెంట్
సి) శశిపాద బెనర్జీ డి) రాజారామ్మోహన్‌రాయ్

**2.ప్రార్థనా సమాజ వ్యవస్థాపకులలో ప్రముఖుడు?**

ఎ) మహదేవ గోవింద రెనడే బి) నౌరోజీ ఫరోదొంజీ
సి) డి.కె. కార్వే డి) స్వామిదయానంద

**3.అలీఘర్ ఉద్యమ నిర్మాత?**

(ఏపీపీఎస్సీ గత ప్రశ్నపత్రాలలో అడిగిన ప్రశ్న)

ఎ) మదన్‌మోహన్ మాలవ్య
బి) సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్
సి) సర్ సయ్యద్ ఇబ్రహీం డి) థియోడర్ బెక్

**4.''గులాంగిరి'' గ్రంథ రచయిత?**

ఎ) శశిపాద బెనర్జీ బి) జ్యోతిరావ్ పూలే
సి) శ్రీ నారాయణ గురు డి) రామస్వామి నాయకర్

**5.ఆత్మగౌరవ ఉద్యమ నాయకులు?**

ఎ) శ్రీ నారాయణ గురు బి) శ్రీ రామస్వామి నాయకర్
సి) డి.కె. కార్వే డి) జ్యోతిరావ్ పూలే

**6. ఆర్యసమాజం నా తల్లి, వైదిక ధర్మం నా తండ్రి' అన్న వ్యక్తి?**

ఎ) స్వామిదయానంద బి)లాలాలజపతిరాయ్
సి) వివేకానంద డి) తిలక్

**7. రెహ్నుమాయ మజో దయాన్‌నన్ సభను స్థాపించింది ఎవరు?**

ఎ) సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ బి) నౌరోజీఫరోదొంజీ
సి) డి.కె. కార్వే డి) శ్రీ నారాయణ గురు

**8.కింది వానిలో దక్షిణ దేశ విద్యాసాగరునిగా పేరుగాంచింది?**

ఎ) రఘుపతి వెంకటరత్నం నాయుడు
బి) వీరేశలింగం సి) ఈశ్వరచంద్రవిద్యాసాగర్
డి) దేశిరాజు పెదబాపయ్య

**9. సత్యార్థ ప్రకాశిక ఈ సంఘ సభ్యులకు ప్రామాణిక గ్రంథం?**

ఎ) బ్రహ్మసమాజం బి) ప్రార్థనాసమాజం
సి) ఆర్యసమాజం డి) థియోసాఫికల్ సొసైటీ

**10. దక్షిణేశ్వర యోగి ఎవరంటే?**

ఎ) వివేకానంద బి) రామకృష్ణపరమహంస
సి) స్వామిదయానంద డి) వీరేశలింగం

| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | B | A | B | B | B | B | B | B | C | B |

# ఢిల్లీ సుల్తానుల పరిపాలన

ఉత్తర భారతదేశం రాజకీయంగా క్రీ.శ. 750 నుంచి 1200 వరకు ముక్కలు చెక్కలుగా ఉంది. ఈ రాజకీయ అనిశ్చితిని మంచి అవకాశంగా తీసుకుని మొదట అరబ్బుల దండయాత్రలు చేశారు. ఆ తర్వాత ఘజనీ మహమ్మద్, ఘోరీ ఈ దేశంపై దాడి చేశారు. మూడు వందల ఏళ్లుగా జరిగిన దండయాత్రలు ఒక తీరైన రాజకీయ రూపాన్ని సంతరించుకొని క్రీ.శ. 1206 నాటికి దేశంలో ఢిల్లీ సుల్తానుల పాలన ప్రారంభమైంది. క్రీ.శ. 1526 వరకు ఢిల్లీ సుల్తానుల పాలన అవిచ్ఛిన్నంగా సాగింది. ఢిల్లీ సుల్తానుల్లో మొదట పాలించినవారు బానిస వంశస్థులు.

## కుతుబుద్దీన్ ఐబక్ (1206–10)

భారతదేశంలో తొలి స్వతంత్ర ముస్లిం పాలకుడు. బానిస వంశ స్థాపకుడైన ఈయన పాలన పగ్గాలు చేపట్టిన నాలుగేళ్లకే 'పోలో' ఆటలాడుతూ మరణించాడు. ఐబక్ తర్వాత ఆయన కుమారుడు ఆరాబ్ బక్ష్ (1210–11) ఏడాది కాలం పాలించాడు.

## ఇల్టుట్‌మిష్ (1211–36)

కుతుబుద్దీన్ ఐబక్ అల్లుడైన ఇల్టుట్‌మిష్ ఆరామ్ బక్ష్‌ను పడదోసి రాజ్యపాలన చేపట్టాడు. ముల్తాన్, సింధ్, బీహార్, బెంగాల్ ప్రాంతాలను ఢిల్లీ సుల్తానత్ పాలన ఛత్రచ్ఛాయ కిందకు తీసుకువచ్చిన గొప్ప యోధుడు. అబ్బాసిద్ ఖలీఫా నుంచి 'మన్సూర్' పత్రాలను పొంది, రాజరికానికి చట్టబద్ధతను కల్పించుకున్న మొదటి వ్యక్తి.

పెద్దగా రాజకీయ సామర్థ్యం లేని రుక్నుద్దీన్ (ఏప్రిల్–నవంబర్, 1236) ఇల్టుట్‌మిష్ అనంతరం పాలన పగ్గాలు చేపట్టాడు. ఇల్టుట్‌మిష్ మరో కుమారుడు అవధ్‌లో చేసిన తిరుగుబాటును అణచివేయడానికి రుక్నుద్దీన్ వెళ్లినప్పుడు, అతని సోదరి రజియా దండెత్తి ఢిల్లీ పీఠాన్ని హస్తగతం చేసుకుంది. 'చిహల్‌గని' రాజకీయాలను సమర్థంగా ఎదుర్కొని కొంతకాలంపాటు పాలించింది. 1240లో దుండగుల దాడిలో రజియా, ఆమె భర్త అల్తునియా హతమయ్యారు. ఆమె తర్వాత బహ్రామ్ షా, మసూద్ షా, నాసిరుద్దీన్ మహమ్మద్‌లు ఢిల్లీ పీఠాన్ని అధిరోహించి 1266 వరకు పాలించారు.

## బాల్బన్ (1266–87)

నసీరుద్దీన్‌కు సంతానం లేకపోవడంతో ఢిల్లీ సుల్తాన్‌గా బాల్బన్ సింహాసనాన్ని అధిష్టించాడు. బానిస వంశ పాలకుల్లో అత్యంత సమర్థుడు ఘియాజుద్దీన్ బాల్బన్. శక్తిమంతమైన సైన్యాన్ని ఏర్పాటు చేయడంతో పాటు, గంగా యమున మైదానం–ఢిల్లీ ప్రాంతాలను అదుపులో ఉంచి, నలభైమంది సర్దారుల కూటమి అయిన చిహాల్ గనీని నిర్మూలించాడు. బెంగాల్‌లో తిరుగుబాటును అణచివేయడమే కాక, మంగోలులను తిప్పికొట్టి బాల్బన్ తిరుగులేని నాయకుడిగా ఆవిర్భవించాడు. రాజరికానికి దైవదత్తమన్న హోదాను కట్టబెట్టాడు. తన నాణేలపై ఖలీఫా పేరు ముద్రించాడు. బాల్బన్ అనంతరం ఆయన పెద్ద కుమారుడు కైకుబాద్ మూడేళ్లపాటు ఢిల్లీని పాలించినప్పటికీ.. వ్యక్తిగత బలహీనతలను అధిగమించలేకపోయాడు. చివరికి ఖిల్జీల చేతిలో 1290లో హతమయ్యాడు.

జలాలుద్దీన్ ఖిల్జీ(1290–1296)తో ఖిల్జీ వంశపాలన ఆరంభమైంది. ఆ సమయంలో అల్లాఉద్దీన్ ఖిల్జీ కారా గవర్నర్‌గా పాలన బాధ్యతలు నిర్వహించాడు. 1296లో జలాలుద్దీన్‌ను కారాకు రప్పించి, హతమార్చడంతో అల్లాఉద్దీన్ ఖిల్జీ పాలన మొదలైంది.

## అల్లాఉద్దీన్ ఖిల్జీ (1296–1316)

ఢిల్లీ సుల్తానులందరిలోనూ అత్యంత సమర్థుడిగా పేరొంది, సమర్థ సైన్యంతో సుల్తానత్ కీర్తి ప్రతిష్ఠలను నలుదిశలా వ్యాపింపచేసిన చక్రవర్తిగా అల్లాఉద్దీన్ ఖిల్జీ సుప్రసిద్ధుడు. ఖిల్జీ పేరును చరిత్రలో శాశ్వతంగా నిలిపే అంశం... ఈయన తీసుకువచ్చిన మార్కెట్ సంస్కరణలు. తక్కువ జీతాలతో ఎక్కువ సైన్యాన్ని పోషించడం సాధ్యంకాదని గ్రహించిన ఖిల్జీ– మార్కెట్లో వివిధ వస్తువుల ధరలను తగ్గించి సైనికుల జీవన ప్రమాణాలు పెరగడానికి కారణమయ్యాడు. నిత్యావసరాల ధరలను ముందే నిర్ణయించి కచ్చితమైన ధరల పట్టికలను తయారు చేయించాడు. నిబంధనలు కచ్చితంగా అమలు జరిగేలా చర్యలు తీసుకున్నాడు. రెవెన్యూ పాలనలోనూ మార్పులను ప్రవేశపెట్టాడు. భూమిని రైతుల ఎదుటే సర్వే చేయించి శిస్తు అంచనాలు వేసే పద్ధతిని మొదలుపెట్టాడు. ప్రభుత్వ భూమిశిస్తు వాటా యాభై శాతంగా ఉండేది. రైతులపై అంతకుముందు ఉన్న వృథా పన్నులను, శిస్తులను రద్దు చేశాడు. ఉలేమాలకు, మతపరమైన సంస్థలకు ఇచ్చిన భూములను వెనక్కి తీసుకున్నాడు. శక్తిమంతమైన గూఢచారి వ్యవస్థను, తిరుగులేని సైనిక శక్తిని అల్లాఉద్దీన్ ఏర్పాటు చేసుకున్నాడు. ఫలితంగా తన పాలనలోని ఏ దశలోనూ రాజ్యంపై అల్లాఉద్దీన్ పట్టు కోల్పోలేదు.

అల్లాఉద్దీన్ అనంతరం ముబారక్(1316–20), ఆ తర్వాత ఖుస్రూలతో ఖిల్జీల పాలన ముగిసింది. ఖుస్రూను చంపి, గాజీ మాలిక్

గియాసుద్దీన్ తుగ్లక్ పేరిట ఢిల్లీ పీఠాన్ని అధిరోహించాడు.

## తుగ్లక్‌లు

ఘియాసుద్దీన్ తుగ్లక్ (1320–25) మరణానంతరం ఉలుఘ్‌ఖాన్ పాలన చేపట్టాడు. మహమ్మద్ బిన్ తుగ్లక్ (1325–51) పేరిట ఆయన సాగించిన పాలన భారతదేశ చరిత్రలోనే అత్యంత వివాదాస్పద మైంది. సమకాలీన మధ్యయుగ పాలకుల్లోని దుర్గుణాలు ఈయనలో కనిపించవు. ఖలీఫా ఉనికిని, ఆధిపత్యాన్ని ఈయన గుర్తించలేదు. కానీ పాలన చివరి రోజుల్లో తుగ్లక్ తన అభిప్రాయాలను మార్చుకుని ఖలీఫా పేరును నాణేలపై ముద్రించడమే గాక, అతని పేరు మీద ఖుత్బాను కూడా చదివేవాడు. అద్భుతమైన పాండిత్యం ఇతని సొంతం. కానీ సమయస్ఫూర్తి లేకపోవడం ఈయనలోని మరో విరుద్ధ లక్షణం. దుర్భిక్షంతో కొట్టుమిట్టాడుతున్న గంగ అంతర్వేది ప్రాంతం లో రైతులపై పన్నులు పెంచడం, ఢిల్లీ నుంచి దౌలతాబాదుకు రాజధా నిని మార్చడం, రాగి నాణేలను ప్రవేశపెట్టడం వంటి చర్యలు మహ మ్మద్ బిన్ తుగ్లక్‌కు ప్రతికూలంగా పరిణమించాయి. ఏ మాత్రం దూరదృష్టి లేకుండా ఖొరసాన్‌పై తలపెట్టిన దండయాత్ర తుగ్లక్ సైన్యాన్ని తీవ్రంగా దెబ్బతీసింది. ఉదాత్తమైన ఆశయాలు ఉన్నప్పటికీ సాధ్యాసాధ్య విచక్షణ లేకపోవడం వల్ల మహమ్మద్ బిన్ తుగ్లక్ పలు విమర్శలకు గురయ్యాడు.

## ఫిరోజ్ షా తుగ్లక్ (1351–1388)

ఢిల్లీ సుల్తానత్‌ను పాలించిన చిట్టచివరి గొప్ప చక్రవర్తిగా ప్రశంసలు పొందినవాడు ఫిరోజ్ షా తుగ్లక్. అంతకుముందు పాలకులు విధిం చిన అనేక చిల్లర పన్నులను తొలగించాడు. ఖురాన్‌ను అనుసరించి ఖరాజ్, జఖత్, జిజియా, ఖామ్స్ అనే పన్నులను విధించాడు. పంట లో పదోవంతును పన్నుగా నిర్ధారించాడు. బంజరు భూములను వ్యవసాయ యోగ్యంగా మలిచే క్రమంలో నీటిపారుదల సౌకర్యాలను అభివృద్ధి చేశాడు. జౌన్‌పూర్, ఫతేబాద్, హిస్సార్, ఫిరోజ్‌పూర్, ఫిరోజాబాద్ వంటి నగరాలను, 1200 ఉద్యానవనాలను నిర్మించాడు. రాగి, వెండి మిశ్రమాలతో నాణేలను తయారు చేయించిన ఘనత ఈయనది. నాగర్‌కోట్‌లోని జ్వాలాముఖి ఆలయంలో భద్రపరిచిన 300 సంస్కృత గ్రంథాలను పారశీక భాషలోకి అనువదించే కార్యక్ర మాన్ని తన ఆస్థాన పండితులకు అప్పగించాడు. అయితే ఈయన పాలనలో సుల్తానుల ప్రాభవం తగ్గడం మొదలైంది. జాగీర్దారీ విధానాన్ని పునరుద్ధరించడం వల్ల అధికార వికేంద్రీకరణ జరిగి సుల్తా నుల పట్టు తగ్గింది. మరోవంక బెంగాల్ వంటి ప్రాంతాల్లో సుల్తానుల ఆధిపత్యాన్ని ప్రశ్నించే కొత్త శక్తులు పుట్టుకొచ్చాయి. అన్నింటికీ మించి ఫిరోజ్ తర్వాత వచ్చిన రాజులు అత్యంత బలహీనులు. ఢిల్లీ సామ్రా జ్య విచ్ఛిన్నాన్ని ఏ మాత్రం ఆపలేకపోయారు.

తుగ్లక్‌ల తర్వాత సయ్యదుల పాలన 1414 నుంచి 1451 వరకు సాగింది. ఖిజిర్‌ఖాన్, ముబారక్ షా, మహమ్మద్ షా, ఆలమ్ షాలు సయ్యద్ పాలకుల్లో ముఖ్యులు. వీరి అనంతరం 1451 నుంచి 1526 వరకు లోడీల పాలన సాగింది. బహ్లోల్ లోడీ, సికిందర్ లోడీల తర్వాత ఇబ్రహీం లోడీ పాలించాడు. ఈయనతోనే ఢిల్లీ సుల్తానుల పాలన అంతమై మొఘలుల పాలన మొదలైంది.

## ప్రాక్టీస్ ప్రశ్నలు...

**1. 'చరాయ్' అనే పన్ను దేనికి సంబంధించింది?**
ఎ) బానిసలు బి) వృత్తి పనివారు
సి) మతపరమైంది డి) పాలిచ్చే పశువులకు

**2. ఢిల్లీ సుల్తానుల కాలంలో భూమిని కొలవడానికి ఉపయోగించిన పదం?**
ఎ) ఇక్తా బి) జాగీర్
సి) మసాహత్ డి) బతాయ్

**3. జమిందారీ, జాగీర్దారీ విధానాన్ని ఎవరు రద్దు చేశారు?**
ఎ) బాల్బన్ బి) అల్లాఉద్దీన్ ఖిల్జీ
సి) ఫిరోజ్ షా తుగ్లక్ డి) ఖిజిర్‌ఖాన్

**4. 'షెహనా–ఇ–మండి' అంటే ఎవరు?**
ఎ) పన్నులను వసూలు చేసే అధికారి
బి) సైనికాధికారి సి) బానిసల నిర్వాహకుడు
డి) ధరలను అదుపు చేసే అధికారి

**5. 'ఇక్తా' విధానాన్ని ప్రవేశపెట్టింది ఎవరు?**
ఎ) రజియా బి) ఇల్టుట్‌మిష్
సి) బాల్బన్ డి) ఘియాజుద్దీన్ తుగ్లక్

**6. అల్లా ఉద్దీన్ ఖిల్జీ ప్రవేశపెట్టిన మార్కెట్ సంస్కరణలను పర్యవేక్షించే ప్రభుత్వ శాఖ?**
ఎ) దివాన్ ఇ రిసాలత్ బి) దివాన్ ఇ ఇన్షా
సి) దివాన్ ఇ బరీద్ డి) దివాన్ ఇ రియాసత్

**7.అల్లా ఉద్దీన్ ఖిల్జీ రాజధాని ఏది?**
ఎ) బెంగాల్ బి) ఆగ్రా
సి) ఢిల్లీ డి) సిరి

**8. తుగ్లక్ ప్రారంభించిన వ్యవసాయ శాఖ పేరు?**
ఎ) దివాన్ ఇ ముస్తఖ్రజ్ బి) దివాన్ ఇ అర్జ్
సి) దివాన్ ఇ కోహి డి) దివాన్ ఇ బరీద్

**9. తారిక్ ఇ హింద్ రాసింది ఎవరు?**
ఎ) అలీ అహ్మద్ బి) అల్ బెరూని
సి) హసన్ నిజామి డి) సికిందర్ లోడీ

**10. మహ్మద్ తుగ్లక్‌ను సృష్టి వైపరీత్యంగా అభివర్ణించింది ఎవరు?**
ఎ) బరానీ బి) అబ్దుల్ ఫజల్
సి) ఖుస్రూ డి) ఫిరోజ్ షా

**11. సంపన్నులైన ముస్లింలపై వేసే పన్ను ఏది?**
ఎ) ఖరజ్ బి) ఖామ్స్
సి) జకత్ డి) షరబ్

**12. ఆగ్రాను నిర్మించిందెవరు?**
ఎ) ఖిజిర్ ఖాన్ బి) ఫిరోజ్ షా తుగ్లక్

సి) జలాలుద్దీన్ ఖిల్జీ డి) సికిందర్ లోడీ

**13. ఢిల్లీ సుల్తానుల అధికార భాష ఏది?**

ఎ) హిందీ బి) ఉర్దూ

సి) పర్షియన్ డి) అరబ్బీ

**14. 'ప్రిన్స్ ఆఫ్ మనీయర్స్' ఎవరు?**

ఎ) మహ్మద్‌బిన్ తుగ్లక్ బి) ఇల్టుట్‌మిష్

సి) బాల్బన్ డి) అల్లాఉద్దీన్ ఖిల్జీ

**15. వ్యవసాయ పరికరాలను కొనుగోలు చేయడా నికి ఢిల్లీ సుల్తానులు మంజూరు చేసిన రుణాలను ఏమంటారు?**

ఎ) తక్కావి బి) షిర్బ్

సి) మౌలా డి) రియాసత్

**16. 'కపూర్ హజార్ దినారీ' అనే బిరుదు ఎవరిది?**

ఎ) ముబారక్ షా బి) మహ్మద్ షా

సి) అల్లాఉద్దీన్ ఆలం షా డి) మాలిక్ కపూర్

**17. ఢిల్లీ సుల్తానుల కాలంలో అత్యంత స్వల్ప విలువలు కలిగిన నాణెం?**

ఎ) అదాలి బి) బిక్కా

సి) జితాల్ డి) టంకా

**18. ఢిల్లీ సుల్తానుల ఆధీనంలోని సేద్య భూమిని ఏమనేవారు?**

ఎ) ఖలీసా బి) నాయబ్

సి) అర్జ్ డి) సదర్

**19. జైనమునితో చర్చలు జరిపిన ఢిల్లీ సుల్తాను ఎవరు?**

ఎ) బాల్బన్ బి) ఫిరోజ్ షా తుగ్లక్

సి) మహ్మద్ బిన్ తుగ్లక్ డి) సికిందర్ షా

**20. ఢిల్లీ సుల్తానులు జారీచేసే పాలన పరమైన శాసనాలను ఏమంటారు?**

ఎ) షార్ట్‌లు బి) జవాబిత్‌లు

సి) ముల్క్‌లు డి) జరీబ్‌లు



| జవాబులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | D | C | B | D | B | D | D | C | B | A | C | D | C | A | A | D | C | A | C | B |

# భారతదేశ చరిత్ర

## 1. చారిత్రక ఆధారములు

సాహిత్య ఆధారములు
- దేశీయ రచనలు
  - మత గ్రంథాలు
    - హిందూమత గ్రంథాలు
      - ఎ) నాలుగు వేదాలు (ఋగ్వేదము,యజుర్వేదము,సామవేదము, అధర్వణ వేదములు)
      - బి) ఇతిహాసాలు, రామాయణము, భారతములు
      - సి) పురాణాలు (విష్ణు, మత్స్య, వాయు మొ॥వి)
      - డి) ఉపనిషత్తులు (చాందోగ్య, బృహదారణ్య,ముండక, ఈశ మొ॥వి)
    - బౌద్ధమత గ్రంథాలు
      - ఎ) త్రిపీఠకములు (వినయ, సుత్త,అభిదమ్మ)
      - బి) బుద్ధుని జాతక కథలు
    - జైనమత గ్రంథాలు
      - ఎ) అంగములు
      - బి) భద్రబాహుని కల్పసూత్రములు
  - మతేతర గ్రంథాలు
    - ఎ) కౌటిల్యుని - అర్థశాస్త్రము
    - బి) కల్హణుని - రాజతరంగిణి
- విదేశీ రచనలు
  - ఎ) సింహళ,బౌద్ధమత గ్రంథాలు
  - బి) మెగస్తనీసు (ఇండికా)
  - సి) ఫాహియాన్,హుయాన్‌త్సాంగ్, ఇత్సింగ్ రచనలు

పురావస్తు ఆధారములు
- శాసనాలు
- నాణెములు
- పురావస్తు శిధిలాలు (లేక) కట్టడాలు

1. భారతదేశ చరిత్రకు ముఖ్య ఆధారములు ఏవి ? **(1 . లిఖిత లేక వాఙ్మయ ఆధారములు 2. అలిఖిత లేక పురావస్తు ఆధారములు)**
2. ఆర్యుల తొలి చరిత్రను తెలుసుకొనుటకు ముఖ్య ఆధారము ఏది ? **(ఋగ్వేదము)**
3. చారిత్రక ప్రాధాన్యము గల గ్రంథములలో ముఖ్యమైనది ఏది? **( కౌటిల్యుని అర్థశాస్త్రము)**
4. భారతీయ చరిత్ర - సంస్కృతిని గూర్చి తెలుసుకొనుటకు సహాయపడిన ఆధారములలో రెండవ స్థానమును ఆక్రమించినది ఏమిటి ? **(పురావస్తు ఆధారములు)**
5. పురావస్తు ఆధారములను ఎన్ని రకాలుగా విభజించవచ్చు? అవి ఏవి? **( 3 రకములు, అవి 1 శాసనములు 2 నాణెములు 3 చిహ్నములు లేక శిధిలములు)**
6. భారతదేశ చరిత్రకు ఆధారములయిన పురావస్తు ఆధారములలో ముఖ్యమైన శాసనములు ఏ భాషలయందు గలవు ? **(బ్రాహ్మిలిపి, ఖరోష్ఠిలిపి, పాళీభాష, సంస్కృతము, తమిళము, తెలుగు)**
7. చారిత్రక ఆధారములయిన శాసనములు ఎన్నిరకములు ? అవి ఏవి? **(రెండు అవి 1 స్వదేశీ శాసనములు 2 విదేశీ శాసనములు)**
8. స్వదేశీ శాసనములలో ప్రాచీనమయినవి ఏవి ? **(అశోకుని శిలా శాసనములు)**

9. శాసనముల వలె చరిత్రకు అమూల్యమయిన మరొక ఆధారములనదగినవి ఏవి ? **(నాణెములు)**

10. భారతదేశములో ఎవరితో నాణెముల యుగము ఆరంభమయినది ? **( ఇండో బాక్ట్రియన్ గ్రీకు రాజులతో)**

11. వేద కాలమున ఉపయోగించిన నాణెము లేవి ? **( నిష్క, శతమాన, సువర్ణ, కార్షపన)**

12. భారతదేశ చరిత్రకు ఆధారములయిన సుప్రసిద్ధ ఇతిహాసము లేవి ? **(మహాభారతము, రామాయణము)**

13. ఆర్యులు మన దేశమునకు ఎట్లు వలస వచ్చినారో తెలియజేయు శాసనము ఏది ? **( బోగజ్ కోయీ శాసనము)**

14. పురావస్తు సముదాయకములు ఏవి**(భవన శిధిలములు, వాడిన పాత్ర సామగ్రులు, ఆయుధములు, శిల్పములు, చిత్రలేఖనము)**

15. దక్షిణ భారతదేశమున ఆర్యుల సంస్కృతి వ్యాపించిన విధమును తెలియజేసినది ఏది ? **(రామాయణము)**

16. శాసనములను ముఖ్యముగా వేటిపైన చెక్కుదురు ? **(రాళ్ళు, స్థంభములు, రాగి, ఇత్తడి లోహములు, గుహలపైన)**

17. శాసనములు సాధారణముగా ఏ విషయములపై యుండెను ? **(విజయ యాత్రలు, సంస్కరణలు మొ॥వి)**

18. పూర్వం రాజులచే ముద్రింపబడిన నాణెములకు ఏఏ లోహములను ఉపయోగించినారు ? **(బంగారము, వెండి, రాగి)**

19. మొట్టమొదటగా నాణెముల ముద్రణ భారతదేశములో ఎప్పటి నుంచి వచ్చెను ? **( అశోకుని తరువాత నుండి)**

20. నాణెములను బట్టి ఏ కాలమునకు ఆ నాణెములు చెందినవో ఎలా చెప్పుదురు ? **(నాణెముపై ఉన్న భాష, లిపి, స్వరూపములను బట్టి)**

21. నాణెము యొక్క స్వరూపము, లోహము, కళను బట్టి ఏమి తెలుసుకోవచ్చును ? **(ఆనాటి ఆర్థిక పరిస్థితులు)**

22. చరిత్ర యొక్క పూర్వ యుగమును ఏ విధముగా కనుగొనుట జరిగినది? **(పురావస్తు సంపదను బట్టి)**

23. ఏఏ పిటకములను త్రిపిటకములు అందురు ? **(వినయ, సుత్త, అభిదమ్మ)**

24. ముద్రారాక్షసము అనే నాటకము ఎవరిచే రచించబడెను ? **(విశాఖదత్తుడు)**

25. భారతదేశము వివిధ జాతుల చోద్యమైన ప్రదర్శనశాల అని ఏ చరిత్రకారుడు అన్నాడు **( వి.ఎ. స్మిత్ )**

26. రెండవ చంద్రగుప్తుని కాలంలో భారతదేశాన్ని సందర్శించి చైనా యాత్రికుడు ఎవరు ? **(పాహియాన్)**

27. విష్ణు పురాణము ఏ రాజుల చరిత్రను తెలియజేయును **(మౌర్య)**

28. కళింగ చక్రవర్తి అయిన ఖారవేలుని విజయములను సూచించు శాసనము **( హతిగుంఫా శాసనము)**

29. వేద సాహిత్యంలో ప్రఖ్యాతి గాంచిన నాలుగు వేదములు **(ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, ఆధర్వణవేదము)**

30. భారతదేశాన్ని ఏ పర్వత శ్రేణులు ఉత్తర, దక్షిణ భారతములుగా విభజించినవి ? **(వింధ్య)**

## 2. చరిత్ర పూర్వ యుగము (క్రీ.పూ.3000 వరకు)

1. చారిత్రక యుగము అనగా ఏమి? **(మానవుడు లిపి కనిపెట్టిన తరువాతి కాలం)**

2. చరిత్ర పూర్వ యుగం అంటే ఏమిటి ? **(మానవుడు లిపి కనిపెట్టటానికి ముందున్న కాలం)**

3. చారిత్రక యుగం అని ఏ కాలాన్ని అంటారు? **(5000 క్రీ.పూ. నుండి నేటి వరకు)**

4. పూర్వ చారిత్రక యుగం అని ఏ కాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 5000 సంవత్సరముల ముందున్న కాలం)**

5. భారతదేశ చరిత్రలో సింధు నాగరికతకు ముందున్న కాలాన్ని ఏమందురు. ? **(చరిత్ర పూర్వయుగం)**

6. భారతదేశ చరిత్రలో సింధు నాగరికతకు తరవాత కాలాన్ని ఏమందురు? **( చారిత్రక యుగం)**

7. చరిత్ర పూర్వయుగమును ఎన్ని రకములుగా విభజించుట జరిగినది ? **(శిలాయుగము, లోహయుగము)**

8. శిలా యుగమును మరల ఏ విధముగా అభివర్ణించిరి ? **(పాతరాతియుగము, సూక్ష్మరాతియుగం, నవీన శిలాయుగం)**

9. శిలా యుగము అంటే ఎమిటి ? **( మానవుడు రాతి పనిముట్లు వాడిన కాలం)**

10. పాతరాతి యుగమునకు సంబంధించిన నిదర్శనం ఎక్కడ కనపడినది? **(కర్నూలు, రాయఘడ్ నందలి సింగ్యపూర్ గుహలలో)**

11. పాతరాతియుగమునకు సంబంధించినవారు ఏ జాతికి చెందినవారు **(నీగ్రో జాతివారు)**

12. పాత రాతి యుగంలో మానవుడు వాడిన పనిముట్లు ఏవి ? **(గులకరాళ్ళు, రాతి గొడ్డళ్ళు, గీకుడు రాళ్ళు)**

13. పాతరాతి యుగంలో మానవుని ఆహారమేమిటి ? **(పండ్లు, కాయలు, కందమూలాలు, పక్షులమాంసము)**

14. ప్రాచీన శిలాయుగం అని ఏ కాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 50,000 - క్రీ.పూ. 25,000)**
15. నవీన శిలాయుగం అని ఏ కాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 8000 - 500)**
16. లోహయుగం అని ఏకాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 5000 - 500)**
17. రాగి, కంచుయుగం అని ఏకాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 5000-1000)**
18. మధ్యశిలాయుగం అని ఏకాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 10,000 - 8000)**
19. సూక్ష్మరాతియుగమునకు గల మరొక పేరు ఏమిటి ? **(మధ్యశిలాయుగం)**
20. మధ్యరాతి యుగములో మానవుడు ఉపయోగించిన పరికరములు ఏవి?
**(మొనతేలిన రాతి ముక్కలను, ఎముకలకు, కర్రలకు అమర్చి గొడ్డళ్ళుగా, ఈటెలుగా ఉపయోగించుట)**
21. మధ్యరాతియుగ ప్రజల ఆభరణములేవి ? **(దంతములు, గవ్వలతో చేసిన పూసలు)**
22. మత విశ్వాసములు మొట్టమొదటి సారిగా ఎప్పుడు ఏర్పడినవి అని చెప్పుదురు ? **(మధ్యశిలాయుగ కాలమున)**
23. నవీన శిలాయుగమునకు గల మరొక పేరు ఏమి ? **(కొత్త రాతియుగము)**
24. పితృదేవతారాధన ఏ కాలమునందు ప్రారంభమైనది ? **(కొత్తరాతి యుగ కాలము)**
25. లోహ యుగమునకు గల మరియొక పేరు ఏమిటి ? **(తామ్రశిలాయుగము)**
26. తామ్రశిలాయుగ స్థావరములు ఎక్కడ లభించినవి ?
**(తీహర్(రాజస్తాన్), నగ్ద(చెంబల్ నదీ ప్రాంతము), నవదలోలి(నర్మదా నదివద్ద), నాసిక్, గోదావరిప్రాంతము)**
27. మానవుడు జంతువులను మచ్చిక చేయడం ఎప్పుడు ప్రారంభించాడు? **(మధ్యరాతియుగంలో)**
28. మానవుడు ప్రప్రథమంగా మచ్చిక చేసిన జంతువు ఏది ? **(కుక్క)**
29. నవీన శాలా యుగంలో మానవుడు ఉపయోగించిన పనిముట్లు ఏవి?**(నునుపుగా, పదునుగా నాగరికంగా ఉన్న రాతి పనిముట్లు)**
30. నేటి మానవుని నాగరికతా లక్షణాలన్నీ ఎప్పుడు ప్రారంభమైనవి ? **(నవీన శిలాయుగంలో)**
31. మానవుడు వ్యవసాయం చేయటం, వస్త్రాలను నేయటం, కుమ్మరిసారెపై కుండలు చేయటం ఎప్పుడు ప్రారంభించాడు? **(నవీన శిలాయుగంలో)**
32. మానవుడు రాతి పనిముట్లకు బదులు లోహంతో చేసిన పనిముట్లను ఎక్కువగా వాడిన కాలం ఏది?**(లోహయుగం)**
33. మానవుడు మొట్టమొదట ఉపయోగించిన లోహమేది ? **(రాగి)**
34. ఏ లోహం వాడుకతో మానవ నాగరికత ఉచ్ఛదశకు చేరింది ? **(ఇనుము)**
35. దక్షిణ భారతదేశంలోని నవీన శిలాయుగం మానవులు మరణించిన వారికి పెద్ద పెద్ద బండలతో నిర్మించిన సమాధులను ఏ మందురు? **( రాక్షస గుళ్ళు)**
36. భారత దేశంలో మానవుని ఉనికిని సూచించే అతి పురాతన ప్రాంతమేది? **(శివాలిక్ పర్వత ప్రాంతము)**
37. మానవుడు లోహ పరికరాలను మొట్టమొదటగా ఏపని చేసేందుకు ఉపయోగించాడు ? **(అడవులు నరకటానికి)**
38. నవీన శిలాయుగం నిర్మాతలైన మానవులు ఏ జాతికి చెందినవారు ? **(ఆస్ట్రలాయిడ్)**
39. మానవుడు మచ్చిక చేసిన జంతువుల వరుస క్రమం ఏది? **(కుక్క, మేక, ఆవు,ఎద్దు,గాడిద, గుర్రం)**
40. ప్రాచీన శిలాయుగంలో మానవుడు పనిముట్లను తయారు చేసేందుకు ఉపయోగించిన రాయి ఏది? **(క్వార్ట్‌జైట్)**
41. ప్రాచీన శిలాయుగపు పనిముట్లు లభ్యమైన ప్రాంతం ఏది ? **(పాకిస్తాన్‌లోని సోన్ నదీలోయ ప్రాంతం)**
42. అతి ప్రాచీన శిలాయుగం సాధారణంగా ఏ యుగానికి చెందినదిగా భూగోళ శాస్త్రవేత్తలు భావిస్తారు? **(మంచు యుగం)**
43. ప్రాచీన, మధ్య, నవీనశిలాయుగపు నాటి అవశేషాలు ఒకే చోట సేకరించబడినది ఎక్కడ ? **(వింధ్య పర్వత శ్రేణులలోని భేలన్ లోయ)**
44. యజమాని మరణానంతరం అతడితోపాటు పెంపుడు కుక్కను కూడ పాతిపెట్టినట్లుగా దొరికిన సమాధులు ఏ కాలం నాటివి ? **(నవీన శిలా యుగం)**
45. నవీన శిలాయుగంలో ధాన్యం పండించారనడానికి చిహ్నాలు ఎక్కడ లభ్యమైనాయి ? **(అలహాబాద్ ప్రాంతం)**

46. ఆంధ్రప్రదేశ్‌లో నవీన శిలాయుగపు నాగరికతకు సంబంధించిన పనిముట్లు దొరికిన సుప్రసిద్ధ స్థలాల ఏవి? **(పిక్లీహిల్, ఉట్నూర్)**

47. ప్రాచీన శిలాయుగపు మానవుడు ఏ జాతివాడు ? **(నీగ్రిటోజాతి)**

48. మధ్యయుగపు మానవుడు ఏ జాతికి చెందినవాడు ? **(హెవెంట్ జాతి)**

49. మానవుడు స్థిర జీవనం ప్రారంభించిన కాలం ఏది? **( నవీన శిలాయుగం)**

50. నవీన శిలాయుగపు మానవుడు ఏ జాతివాడు ? **(ద్రావిడ జాతి)**

51. ఆదిమ మానవుడు విపరీతంగా దేనికి భయపడేవాడు? **(ఉరుములు, మెరుపులకు)**

52. మానవుని జీవన గమనంలో విప్లవాత్మకమైన తొలి మలుపు ఏది ? **(నిప్పును కనుగొనడం)**

53. భారతదేశంలో మొదట నివసించిన ఆదిమ మానవులు ఎవరు ? **(నీగ్రిటోలు)**

54. ఉత్తర భారతదేశములో నవీన శిలాయుగము అనంతరము వాడుకలోనికి వచ్చిన లోహముల ఏవి? **(రాగి, తరవాత ఇనుము.)**

55. నవీన శిలాయుగపు గొడ్డళ్ళు లభ్యమైన బూర్జహమ్ ఎక్కడ కలదు ? **(కాశ్మీర్ లోయలో శ్రీనగర్ కు 40 కి.మీ. దూరంలో)**

56. మెడిటరేనియన్‌జాతికి చెందినవారు ఎవరు ? **(ద్రావిడులు)**

57. భారతదేశములో దేవాలయ నిర్మాణానికి పునాదులు వేసిన వారెవరు ? **(ద్రావిడులు)**

58. పురావస్తు శాఖను రూపొందించిన వ్యక్తి ఎవరు ? **(లార్డ్ కర్జన్)**

59. ద్రావిడ నాగరికత ప్రధానంగా ఏ నాగరికత ? **(పట్టణ నాగరికత )**

60 ద్రావిడ కుటుంబంలో పెద్ద ఎవరు ? **(తల్లి)**

61. ద్రావిడుల ప్రధాన వృత్తి ఏది ? **(వ్యవసాయము)**

62. భారతదేశానికి నిజమైన నాగరికత, సంస్కృతి ఎవరిద్వారా లభించాయని భావిస్తున్నారు? **(ద్రావిడులు)**

63. ద్రావిడ భాషలు అనగా ఏవి ? **(తెలుగు,కన్నడ, తమిళ, మళయాళ భాషలు)**

64. మన దేశమునకు వలస వచ్చిన జాతులలో నాగరీకులు ఎవరు ? **(ద్రావిడులు)**

65. ద్రావిడులు ప్రథమ నివాస స్థలము ఏదని ప్రధానంగా భావించబడుచున్నది? **(మధ్యధరా సముద్ర ప్రాంతము)**

66. ద్రావిడులు దేనియందు కడు నేర్పరులుగా భావించబడుచున్నారు ? **(నౌకా నిర్మాణము)**

67. ద్రావిడుల ముఖ్య ఎగుమతులు లేవి ? **(నూలుబట్టలు, కలప, చందనము)**

68. ద్రావిడులు ఏఏదేశములతో వర్తక వాణిజ్యములు నడిపేవారు ? **(ఈజిప్టు, రోమ్, పర్షియా, బాబిలోనియా)**

69. ద్రావిడుల ముఖ్య పరిశ్రమలు ఏవి ? **( చేనేత పరిశ్రమ, కుండలు చేయుట)**

70. ద్రావిడులు ఎలా నివసించేవారు ? **( తెగలుగా)**

71. ద్రావిడుల ముఖ్య దుస్తులేవి ? **(ధోవతి, తలపాగ,లేక ఉత్తరీయము, శాలువా)**

72. ద్రావిడుల ముఖ్య ఆయుధము లేవి ? **(కత్తి, ఈటె, బాణము)**

73. ద్రావిడుల శిల్ప కళకు నిదర్శనము లేవి? **(ఆ కాలపు మట్టిపాత్రలపై గల కళ )**

74. ద్రావిడుల ప్రధాన దైవములు ఎవరు ? **( ఆదిశక్తి, శివుడు, భూతములు)**

75. దేవతల తృప్తి కొరకు నరబలులిచ్చెడి ఆచారమే సంస్కృతి యందు గలదు ? **(ద్రావిడ సంస్కృతి)**

76. ద్రావిడ భాష యొక్క లిపి ఏదేశం నందు ఉద్భవించినదని చరిత్రకారుల అభిప్రాయం ? **(సుమేరు)**

77. ద్రావిడ భాషలకు ఏ భాషలకు సంబంధము కలదు ? **(సింధియా)**

78. నేడు మన మతమునందు గల పెక్కు లక్షణములు ఎవరివని చెప్పవచ్చు ? **(ద్రావిడులు)**

79. హిందూమతం ఏఏ సంస్కృతుల సమ్మేళనం ? **(ఆర్య, ద్రావిడ)**

80. ద్రావిడ చిహ్నములు ఎక్కడ కన్పించినవని పండితుల అభిప్రాయము? **(వేదకాలపు సంస్కృతములో)**

## 3. సింధు నాగరికత యుగము (క్రీపూ.3000 - 1500)

1. మన దేశంలో అతిపురాతన నాగరికత ఏది ? ( సింధు నాగరికత)
2. సింధూ నాగరికత ఏ కాలమునకు చెందినది ? (తామ్ర శిలాయుగము)
3. సింధూ నాగరికత బయల్పడిన ముఖ్య ప్రాంతములు ఏవి ? ( హరప్పా, మొహంజోదారో)
4. తొలిసారిగా సింధునదీ ప్రాంతంలో త్రవ్వకాలకు నిర్వహణ భాధ్యత వహించిన పురావస్తు శాఖ డైరెక్టరుఎవరు? (సర్ జాన్ మార్షల్)
5. సింధు నాగరికత విలసిల్లిన కాలము ఏది ? (క్రీ.పూ. 2800 - 2200)
6. సింధులోయ నాగరికత శిధిలాలను ఎప్పుడు కనుగొన్నారు ? ( 1921 లో)
7. ప్రధానంగా సింధు ప్రజల నాగరికత ఏది ? (పట్టణ నాగరికత)
8. సింధు నాగరికత నిర్మాతలుగా భావించబడిన జాతి ఏది ? (మధ్యధరా జాతి)
9. సింధు నాగరికతకు మరొక పేరేమిటి ? ( హరప్పా నాగరికత)
10. సింధు నాగరికత అవశేషాలను ఎన్ని ప్రదేశాలలో గుర్తించారు ? (250 పైగా ప్రదేశాలలో)
11. సింధు నాగరికతకు సమకాలీనమైన నాగరికతలు ఏవి ? (అస్సీరియో, బాబిలోనియా, ఈజిప్టు నాగరికతలు)
12. హరప్పా సంస్కృతి యొక్క ప్రత్యేకత ఏమిటి ? (పటిష్టమైన పట్టణ ప్రణాళిక)
13. సింధూ నాగరికత ప్రదేశాలలో పట్టణాలు ఎన్ని ? అవి ఏవి? (ఆరు. అవి 1, హరప్పా 2. మొహంజొదారో, 3.చాన్హు దారో, 4. లోథల్ 5.కలిబంగన్ 6. బన్వారీ)
14. హరప్పా నగరాలలో నిర్మించబడిన ఇళ్ళ ప్రత్యేకత ఏమిటి ? (రోడ్డుకు ఒకవైపే వరుసగా పేర్చబడినట్లు నిర్మించడం)
15. పాకిస్థానులోని పశ్చిమ పంజాబు రాష్ట్రంలోని మాంటిగోమరీ జిల్లాలో ఉన్న నగరం ఏది ? ( హరప్పా)
16. భారత ఉపఖండంలో అతిపురాతన నగరాలేవి ? (హరప్పా, మొహంజదారో)
17. మొహంజదారో ఎక్కడ ఉంది ? (పాకిస్థాన్‌లోని సింధు రాష్ట్రంలోని లార్ఖానా జిల్లాలో)
18. హరప్పా, మొహంజదారోలు ఏ నది ఒడ్డున ఉన్నాయి ? (సింధు నది)
19. హరప్పా, మొహంజదారోలు ఎప్పుడు శిధిలమైనవి ? (క్రీ.పూ. 1750 నాటికి)
20. సింధు నాగరికత వ్యాపించిన ప్రదేశం వైశాల్యం ఎంత ? ( 12 లక్షల 99 వేల 600 చ.కి.మి.)
21. సింధు ప్రజలు వ్యవసాయమునకు ఉపయోగించు జంతువు ఏది ? (ఎద్దు)
22. సింధు నాగరికత వ్యాపించిన ప్రదేశానికి ఉత్తర, దక్షిణ సరిహద్దులు ఏవి? (జమ్మూ, నర్మదానది)
23. సింధునాగరికత వ్యాపించిన ప్రదేశానికి తూర్పు, పశ్చిమ సరిహద్దులు ఏవి ? (మీరట్, బెలూచిస్థాన్ లోని మక్రాన్.)
24. శుభ్రతకు, ఆరోగ్యానికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చిన ప్రాచీన నాగరికత ఏది ? (సింధు నాగరికత)
25. సింధు ప్రజలకు తెలిసిన లోహాలేవి ? (రాగి, వెండి, బంగారము)
26. సింధు ప్రజలకు ఏ లోహం తెలియదు ? (ఇనుము)
27. సింధు ప్రజల ప్రధాన ఆహారపంటలేవి ? (గోధుమ, బార్లీ,వరి)
28. అతి తూర్పున ఉన్న హరప్పానాగరికత గల ప్రదేశము ఏది? (అలంఘీర్ పూర్ )
29. అతి పశ్చిమాన ఉన్న హరప్పా నాగరికత గల ప్రదేశము ఏది ? (సుట్ కోజెండర్)
30. అతి ఉత్తరాన ఉన్న హరప్పా నాగరికత గల ప్రాంతమేది ? (మాండా)
31. అతి దక్షిణాన ఉన్న హరప్పా నాగరికత గల ప్రాంతమేది ? (దైమాబార్)
32. మొహంజదారో అంటే ఏమిటి? (మృత్యు దిబ్బ)
33. ఏ సింధూలోయ పట్టణం చాలాసార్లు సింధునది వరదల్లో మునిగినట్లు దాని శిధిలాలను బట్టి తెలుస్తుంది? (మొహంజదారో)
34. సింధూ నాగరికత గల పట్టణాలలో అతి విశాలమైన పట్టణం ఏది ? (హరప్పా)
35. సింధూ ప్రజలు వరి పండించినట్లు ఏఏ సింధూలోయ పట్టణ శిధిలాల వల్ల తెలుస్తుంది ? (లోథలు, రంగపూర్)

36. ఏ సింధూనాగరికత పట్టణంలో త్రాసు లభించింది ? (లోథల్)

37. ఉత్తర ప్రదేశ్‌లోని మీరట్‌కు సమీపంలో గల సింధూ నాగరికత ప్రదేశం ఏది ? (అలంఘీర్ పూర్)

38. సింధూ నాగరికత కాలంలో ప్రధాన రేవు పట్టణం ఏది ? (లోథల్)

39. మెసపొటేమియా, హరప్పాల మధ్యగల వర్తక కేంద్రమేది ? దాని ప్రస్తుత నామం ఏమిటి ? (డిల్‌మూన్) (ప్రస్తుతం - బహ్రైన్)

40. సింధూ ప్రజల ముఖ్యవృత్తి ఏమిటి ? (వ్యవసాయము)

41. సింధూనాగరికత గల పట్టణాలలో అత్యాశ్చర్యకరమైన విషయం ఏమిటి ? (భూగర్భ మురుగునీటి పారుదల వ్యవస్థ)

42. హరప్పా కాలంనాటి ముద్రలు ఎన్ని లభించాయి ? (రెండు వేలకు పైగా)

43. సింధూ లోయలో లభించిన ముద్రలు మీద ఏ జంతువుల బొమ్మలున్నాయి? (ఎద్దు, గేదె, పులి, మేక, ఏనుగు, ఖడ్గమృగం)

44. సింధూ ప్రజలు పూజించే దేవతలు ఎవరు ? (మాతృదేవత, పశుపతి మహాదేవుడు)

45. సింధూ ప్రజలు మరణించిన వారిని ఏమి చేసేవారు ? (దహనం లేదా పాతి పెట్టడం)

46. సింధూ ప్రజలు పూజించిన పక్షి ఏది? (పావురం)

47. స్వస్తిక్ గుర్తు ఏ నాగరికతకు చెందినది ? (సింధూనాగరికత)

48. సింధు ప్రజల నిర్మాణాలలో సాటిలేనిది ఏది? (స్నానవాటిక)

49. సింధు ప్రజల లిపి ఏది? (బొమ్మల లిపి)

50. సింధూ ప్రజల లిపి ఏ వైపు నుండి ఏ వైపుకు వ్రాసేవారు ? (కుడి నుండి ఎడమకు తిరిగి ఎడమ నుండి కుడికి)

51. సింధూ నాగరికతలో తూర్పు దక్షిణ వీధులను కలిపే కూడలిని ఏమందురు? (ఆక్స్‌ఫర్డ్ సర్కస్)

52. హరప్పా నిర్మాణాలలో ఉపయోగించిన పదార్థం ఏది ? (మట్టి మోర్టర్)

53. సింధూలోయ నాగరికత శిథిలాలు స్పష్టముగా వ్యక్తము చేయునది ఏమి? (వెట్టి చాకిరీ గురించి)

54. సింధు ప్రజల కుండలు ఏ రంగులో వేయబడినవి ? (పసుపు, నలుపు, ఎరుపు రంగులలో)

55. సింధూ ప్రజలకు తెలియని జంతువు ఏది ? (గుర్రం)

56. సింధూ నాగరికత కాలపు ప్రభుత్వము ఏది? (ఏకస్వామ్య మతాధిపత్యం)

57. కాలిబంగన్ అంటే ఏమిటి ? ( నల్ల గాజులు)

58. హరప్పా, మొహంజోదారోలు ఎప్పుడు శిథిలమైనవి ? (క్రీ.పూ. 1750 నాటికి)

59.' నేసిన గుడ్డముక్క ' సింధూలోయ ఏ ప్రదేశంలో లభించినది ? (మొహంజొదారోలో)

60. సింధూ ప్రజలు వ్యవసాయానికి నాగలి వాడినట్లు ఏ సింధూలోయ పట్టణ శిథిలాలను బట్టి తెలుస్తుంది ? (కాలిబంగన్)

61. మొహంజొదారో యందలి పౌరులు ఎన్ని జాతుల వారు ? (నాలుగు)

62. మొహంజొదారో నగరమందు గల స్నానాగార వైశాల్యమెంత ? (11,440 చ.అ)

66. సింధూ నాగరికతా కాలంలో భారతదేశం నుండి ఎగుమతి చేయబడిన వస్త్రాలమూట లభించిన పశ్చిమ ఆసియాలోని ప్రదేశంఏది? (ఉమ్మా)

67. సింధూ కాలం నాటి ఏ ప్రాంతంలో మట్టతాయెత్తు, ఓడ బొమ్మ, పాత్ర చిత్రించిన ముద్ర లభించినాయి? (మొహంజోదారో)

68. సింధూలోయ నుండి మెసపొటేమియాకు నూలు వస్త్రాలు ఎగుమతి అయిన వనేందుకు ఆధారమేది? (సమీర్ లో లభించిన హరప్పా ముద్రగల నూలు గుడ్డ.)

69. హరప్పాలిపి లో ఎన్ని గుర్తులున్నాయి ? (400)

70. మొహంజోదారోలో వీధుల వెడల్పు ఎంత ? (135 అడుగుల నుండి 83 అడుగుల వరకు)

71. లోథాల్ రేవు పట్టణం ఏ ఆకారంలో ఉంటుంది ? (విస్తీర్ణమైన చతురస్రాకారంలో)

72. హరప్పా ప్రజల ఆరాధనా స్వభావము గురించి ఇప్పటికీ నిర్ధారణ కాని విషయం ఏది ?(**ప్రకృతి శక్తుల ఆరాధన గురించి**)
73. హరప్పా పై పొరల్లో ఎక్కువగా కనుగొనబడిన కళాసాధనాలు ఏవి ? (**బీటుతో చేయబడిన సాధనాలు**)
74. సింధూ సంస్కృతికి, ఇతర సుమేరియన్ సంస్కృతులకు మౌలికంగా గోచరించే వైవిధ్యం దేనిలో ? (**మత, మృత సంస్కారాలు గురించి**)
75. పూర్వ హరప్పా సంస్కృతికి సంబంధించిన ఆధారాలు లభ్యమయినది ఎక్కడ ? (**గుజరాత్‌లోని ఘల్వర్ జిల్లాలోని రంగాపూర్ వద్ద**)
76. మొహంజోదారో త్రవ్వకములు ఎవరి నేతృత్వములో నిర్వహింపబడెను? (**డా॥ D.R బెనర్జీ**)
77. సింధూలోయ ప్రజలను ఎవరు పరిపాలించెడి వారు? (**ఎక్కువగా వర్తకులు** )
78. సింధూ ప్రజలుపయోగించిన ఆయుధములేవి ? (**గొడ్డలి , ఈటె, బాకు, బడిసె, విల్లంబులు**)
79. సింధూ ప్రజల వినోదము లేవి ? (**సంగీతము, నాట్యము, వేట, పాచికలాట,చదరంగము, ఎద్దులపోట్లాట**)
80. సింధూ ప్రజల పిల్లల ఆట వస్తువు లేవి ? (**ఈలలు, గిలకలు, బండ్లు, జంతువుల బొమ్మలు, మనుషుల బొమ్మలు**)

## 4. వేదయుగం ( క్రీ.పూ. 1500 - 600)

1. వేదములెన్ని అవి ఏవి? (**4. అవి 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము**)
2. వేదాలు ఎవరి పవిత్ర గ్రంథాలు ? (**హిందువుల**)
3. వేదయుగాన్ని ఎన్ని భాగాలుగా విభజించారు ? అవి ఏవి? (**2 అవి 1, ఋగ్వేదయుగం 2 ఋగ్వేదానంతర యుగం లేదా ఇతిహాసయుగం**)
4. వేదాలలో అతి పురాతన గ్రంథమేది ? (**ఋగ్వేదము**)
5. ఋగ్వేద కాలం ఏది ? (**క్రీ. పూ. 1600 నుండి 1000 వరకు**)
6. ఇతిహాసయుగ కాలం ఏది ? (**క్రీ.పూ. 1000 నుండి 600 వరకు**)
7. భారత యుద్ధం ఎప్పుడు జరిగింది ? (**క్రీ.పూ. 950 లో**)
8. ఋగ్వేదమునందు ఎన్ని మంత్రములు కలవు? (**1071**)
9. శ్రావ్యమయిన స్వర సంకలనమునకు రూపొందించబడిన వేదము ఏది ? (**సామవేదము**)
10. మంత్ర తంత్రములకు, మానవాతీత శక్తులకు సంబంధించిన వేదము ఏది ? (**అధర్వణ వేదము**)
11. ఋగ్వేద ఆర్యనాగరికత ముఖ్య లక్షణము ఏది ? (**గ్రామీణ నాగరికత**)
12. ఋగ్వేద కాలమునాటి ఆర్యుల ప్రధాన దైవము ఏది ? (**ఇంద్రుడు**)
13. ఋగ్వేదకాలమునాటి ప్రసిద్ధి చెందిన కవయిత్రులు ఎవరు ? (**గార్గి లోపాముద్ర**)
14. ఋగ్వేద ఆర్య నాగరికత కాలమునాటి సమాజవ్యవస్థ ఏది? (**పితృస్వామిక వ్యవస్థ** )
15. వేదకాలములో వ్యాపారము ఏ పద్ధతిలో నడచుచుండెడిది ? (**వస్తు మార్పిడి పద్ధతి**)
16. వస్తుమార్పిడి పద్ధతిలో ఆర్యులు ఉపయోగించు సాధనములు ఏవి ? (**బంగారము మరియు ఆవు**)
17. ఋగ్వేద ఆర్యులు రాజులకు చెల్లించే పన్నును ఏమందురు ? (**బలి**)
18. "రాజే దైవాంశ సంభూతుడు" అనే సిద్ధాంతము ఎప్పుడు ప్రచారములోనికి వచ్చెను ? (**ఇతిహాస లేక మలి వేదకాల ఆర్య నాగరికత కాలంలో**)
19. ఆర్యులు అంటే అర్థం ఏమిటి ? (**పూజ్యులు**)
20. ఆర్యులు ఎవరితో యుద్ధం చేయవలసి వచ్చింది ? (**దస్యులతో**)
21. ఆర్యులు మొట్టమొదట ఎక్కడ స్థిర పడ్డారు ? (**సప్త, సింధూ ప్రాంతంలో లేదా పంజాబులో** )
22. ఆర్యుల సాంఘిక వ్యవస్థకు ప్రాథమిక ప్రమాణమేది ? (**కుటుంబం**)
23. ఋగ్వేదకాలంనాటి ఆర్యుల ప్రధాన వినోద కాలక్షేపం ఏది ? (**రథాల పందెములు**)
24. 'పురుష సూక్తం' ఏ వేదంలో ఉన్నది ? (**ఋగ్వేదంలో**)

25. 'చాతుర్వర్ణ వ్యవస్థ' ప్రప్రథమంగా ఏ వేదంలో పేర్కొనబడింది ? **(ఋగ్వేదంలో)**
26. ఋగ్వేద కాలంలో రాజుకు సలహాలనిచ్చే ప్రజా సభలను ఏమనేవారు ? **(సమితి, సభ)**
27. ఋగ్వేద కాలంలో గణ నాయకుని ఏమనేవారు ? **(రాజన్)**
28. ఋగ్వేద కాలంలో ప్రసిద్ధి చెందిన యుద్ధం ఏది ? **(దశరాజ యుద్ధం)**
29. ఋగ్వేద కాలంలో రాజు యొక్క ప్రధాన సలహాదారులు ఎవరు ? **(పురోహితుడు, సేనాని, గ్రామణి)**
30. వేద కాలంలో పవిత్రమైన పానీయం ఏది ? **(సోమరసం)**
31. ఋగ్వేద కాలంలో ఆర్యుల ప్రధాన వృత్తి ఏమి ? **(పశుపోషణ)**
32. వేదకాలంలో గ్రామాధికారిని ఏమని పిలిచేవారు ? **(గ్రామణి)**
33. వేదకాలంలో కులపెద్దను ఏమనేవారు ? **(కులపా)**
34. ఋగ్వేదకాలంలో వాణిజ్యం ఎవరు చేసేవారు ? **(ఫణి లనే అనార్యజాతి)**
35. ఆర్యులు వాడుకలో పెట్టిన నాణెములేవి ? **(నిష్క,శతమాన, సువర్ణ,కార్ష, పణి)**
36. వేదకాలంలో గ్రామ సముదాయాన్ని ఏమనేవారు ? **(విష్)**
37. ఆర్యనాగరికతకు ప్రధాన ఆధారం ఏది ? **(వేద వాఙ్మయం)**
38. మలివేద కాలంలో ఆర్యుల రాష్ట్రాధిపతిని ఏమని పిలిచేవారు ? **(స్థపతి లేక శతపతి)**
39. మలివేద కాలంలో ఆర్యుల ప్రధాన వృత్తి ఏమి ? **(వ్యవసాయము)**
40. మలివేద యుగంలో ఆర్యుల ప్రధాన దేవతలు ఎవరు ? **(బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు)**
41. ఉపనిషత్తులు ఏ కాలంలో రచింపబడినవి ? **(క్రీ.పూ.600)**
42. సంస్కృత మహా భారతమును ఎవరు వ్రాశారు ? **(వ్యాస మహర్షి)**
43. సంస్కృత రామాయణమును రచించింది ఎవరు ? **(వాల్మీకి మహర్షి)**
44. ఋగ్వేదానంతర కాలంలో జరిగిన ప్రధాన యుద్ధమేది ? **(మహాభారతయుద్ధం లేక కురుక్షేత్రం)**
45. కురుక్షేత్ర సంగ్రామము ఎవరెవరికి జరిగినది ? **(కౌరవులకు, పాండవులకు)**
46. భగవద్గీత ఏ గ్రంథంలో భాగం ? **(మహాభారతం)**
47. ప్రాచీన భారత దేశంలోని ప్రముఖ స్మృతి ఏది ? **(మనుస్మృతి)**
48. ఆయుర్వేద వైద్యవిధానానికి మూలమైన వేదం ఏది ? **(అథర్వణ వేదం)**
49. సంగీత విద్యకు మూలమైన వేదం ఏది ? **(సామవేదం)**
50 'శ్రుతులు' అంటే ఏవి ? **(వేదములు)**
51. ఋగ్వేదానంతర నాగరికత ముఖ్య లక్షణమేమి ? **(వర్గ వ్యవస్థ బలపడుట)**
52. ఆర్య భాషయైన సంస్కృతమునందు ఎన్ని ద్రావిడ పదములు ఉన్నవి ? **(సుమారు 450)**
53. హిందూ మత గ్రంథము లేవి ? **(వేదములు, పురాణములు, ఇతిహాసములు, ఉపనిషత్తులు)**
54. ఉపనిషత్తులు వేటికి సంబంధించినవి **(వేదాంతము)**
55. ఉత్తరదేశ సార్వభౌమాధికారమును, ఆర్య రాజులకు మధ్య సంఘర్షణను వివరించినది ఏది? **(మహా భారతము)**
56. దక్షిణ భారతదేశమున ఆర్యుల సంస్కృతి వ్యాపించిన విధమును తెలియజేయునది ఏది ? **(రామాయణము)**
57. చరిత్ర రచనకు ఉపకరించిన పురాణాలు ఏవి ? **(అష్టాదశ పురాణములు)**
58. ఆర్యుల కాలంలో శిక్షావిధానం ఎలా ఉండెడిది ? **(దేశ బహిష్కరణ, అంగ విచ్ఛేదము)**
59. ఆర్యుల కాలంలో రాజులపై కూడా అధికారాన్ని కలిగి ఉండినది ఎవరు ? **(బ్రహ్మణులు)**
60. ఆర్యుల కాలంలో రాజ్య భాగాలను ఏలెడి వారిని ఏమనెడివారు ? **(శతపతి)**
61. ఆర్యుల కాలంలో రాజుకు న్యాయ పాలనలో సహకరించే ఉద్యోగి ఎవరు? **(రాజన్యుడు)**
62. ఆర్యుల కాలంలో గ్రామాధికారితో పాటుగా ఉండే మరో ఉద్యోగి ఎవరు? **(అధీకృత)**
63. ఆర్యుల కాలంలో ప్రయాణ సాధనాలు ఏవి ? **(పశువుల బండ్లు,రథాలు)**

64. ఆర్యుల కాలంలో విదేశీ వ్యాపారం చేసేవారిని ఏమనేవారు ? **(ఫణిజులు.)**
65. ఆర్యులు ఏఏ దేశాలతో వాణిజ్య సంబంధాలు జరిపేవారు ? **(పశ్చిమాసియా, బాబిలోనియా)**
66. ఆర్య రాజులు ఏఏ బిరుదులను సాంప్రదాయకంగా ధరించేవారు ? **(సామ్రాట్, ఏకరాట్, సార్వభౌమ, రాజాధిరాజ)**
67. ఆర్యులు ఏ వంశమునకు చెందిన వారు ? **(నార్డిక్ జాతి)**
68. రామాయణమును తమిళములోనికి ప్రథమముగా అనువదించిన వారు ఎవరు ? **(కంబన్)**
69. ప్రపంచ సాహిత్యంలో ఆది గ్రంథం ఏది ? **(ఋగ్వేదము)**
70. సంహిత అనగానేమి ? **(కూర్పు)**
71. సంహితలోని ప్రార్ధనా శ్లోకములు ఏవి? **(ఋక్కులు)**
72. ఋగ్వేదము ఎన్ని మండలాలుగా విభజించబడినవి . **(10 భాగాలు)**
73. యజ్ఞము కన్నా తపస్సు ఉత్తమమని ప్రభోదించు మోక్షమార్గ చర్చల సారాంశమును ఏమంటారు ? **(అరణ్యకము)**
74. అరణ్యకములలో ముఖ్యమైనవి ఏవి ? **(ఐతరేయ, తైత్తరీయ అరణ్యకము)**
75. గురువు శిష్యుల మధ్య ప్రకృతి ధర్మం గురించి జరిగిన చర్చలసారాంశం ఏమిటి ? **(ఉపనిషత్తు)**
76 ఉపనిషత్ అన్న పదానికి  సాహితీపర వివరణ ఏది ? **(ఒకరి వద్ద కూర్చోనుట)**
77. సామవేదములోని మొత్తం శ్లోకములు ఎన్ని ? **(1603)**
78. కృష్ణ యజుర్వేదం యొక్క ప్రత్యేకత ఏమిటి ? **(పద్య గద్య భాగాలుండటం)**
79. యజుర్వేదములోని ప్రధాన భాగాలు ఏవి ? **(కృష్ణ,శుక్ల, విభాగాలు)**
80. యజుర్వేదములోని శ్లోకాలు ఎన్ని ? **(1836)**
81. అధర్వణ వేదంలోని మొత్తం శ్లోకములు ఎన్ని ? **(731)**
82. అధర్వణ వేదము ఎన్ని భాగాలుగా విభజించబడినది ? **(20 భాగాలు)**
83. జ్యోతిష శాస్త్ర బీజాలు దేనిలో ఉన్నాయి ? **(అధర్వణ వేదము)**
84. చాంద్యోగ బ్రాహ్మణం దేనిలోనిది ? **(సామవేదం)**
85. శతపథ బ్రాహ్మణం దేనిలోనిది? **(యజుర్వేదము)**
86. సామవేదమందు గల ఉపాంగము ఏది ? **(తాంట్య, మహమనీయ బ్రాహ్మణులు)**
87. చారిత్రక వివరణగల ఉపనిషత్తులు మొత్తం ఎన్ని ? **(13)**
88. సాంప్రదాయవాదుల నమ్మకం ప్రకారం మొత్తం ఉపనిషత్తులు ఎన్ని ? **(108)**
89. అపౌరుషేయములని వేనినందురు ? **(వేదములు)**
90. జీవాత్మ, పరమాత్మలో లీనమగుటను ఏమందురు ? **(మోక్షము)**
91. వేదములను అధ్యయనం చేయడానికి, అర్ధం చేసుకోవడానికి నిర్దేశించబడిన శాస్త్ర విషయాలనేమంటారు ?
**(వేదాంగములు)**
92. వేదాంగములు ఏవి ? **(శిక్ష,కల్ప, నిరుక్త, వ్యాకరణ ఛందస్సు, జ్యోతిషం)**
93. వేదాంగములలో వేద పఠనమునకు అవసరమైన ఉచ్చారణ గూర్చి తెలుపునదేది ? **(శిక్ష (ఫొనెటెక్స్)**
94. వేదాంగములలో  కల్పదేని గూర్చి తెలుపును ? **(వేదములలోని కర్మకాండ (రిట్యువల్)**
95. వేదాలలోని అంతర్గత రహస్యాలను అర్ధం చేసుకోవడానికి అనుగుణమైన శబ్దవ్యుత్పత్తి శాస్త్రం ఏది ? **నిరుక్త (ఎధిమాలజి)**
96. వ్యాకరణము దేని గురించి తెలుపును ? **(వేదముల అధ్యయనం అర్థవంతంగా అధ్యయనం చేయుట తెలుపును)**
97. వేద పఠనమునకు అత్యావశ్యకమైనదేది ? **(ఛందస్సు)**
98. ఆర్యుల వేద సాహత్యంలో "జ్యోతిష" ప్రాధాన్యత ఏమిటి ? **(ఆర్యుల జీవన వ్యవస్థను ప్రధానంగా ప్రభావితం చేసినది)**
99. సూత్ర వాఙ్మయం ఎన్ని భాగాలుగా వర్గీకరించబడెను ? **(నాలుగు వర్గాలు)**
100. కర్మకాండకు సంబంధించి వేద సూత్ర వాఙ్మయం ఏది ? **(శ్రౌత సూత్రములు)**
101. దైనందన గృహవ్యవహారాలకు సంబంధించి నిర్దేశిత సూత్ర నిబంధనావళి గల వాఙ్మయం ఏది? **(గృహ సూత్రములు)**

102. సాంఘీక బాద్యతల గూర్చి ధర్మబద్ధమైన జీవనం గురించి తెలిపే వాజ్మయం ఏది ? **(ధర్మసూత్రములు)**

103. గృహ నిర్మాణమునకు సంబంధించిన శాస్త్ర వివరణ గల సూత్ర వాజ్మయం ఏది ? **(సుల్య సూత్రములు)**

104. ఋగ్వేదమందు చివరి భాగమేది ? **(పురుషసూక్తము)**

105. పురుషసూక్తమందు పేర్కొనబడిన నాలుగు వర్ణములేవి ? **(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు)**

106. వేద కాలంలో గ్రామ సముదాయాన్ని ఏమనేవారు ? **(విష్)**

107. 'సత్యమేవజయతే' అను వాక్యం ఏ గ్రంథంలోనిది ? **(ముండకోపనిషత్తు)**

108. చతురాశ్రమములేవి ? **(బ్రహ్మచర్యము, గార్హస్థము, వానప్రస్థము, సన్యాసము)**

109. బ్రాహ్మణములు ఏవి ? **(ఐతరేయబ్రహ్మణం, శతపథ బ్రాహ్మణం, జైమినీయ బ్రాహ్మణం, గోపదబ్రాహ్మణం)**

110. అరణ్యకములు ఏవి ? **(ఐతరేయారణ్యకం, తైత్తరేయారణ్యకం, బృహదారణ్యకం, తలవరకారణ్యకము)**

111. ఉపనిషత్తులయందు చర్చించబడిన దేమి ? **(కర్మ, పునర్జన్మ, ముక్తి,ఆత్మ, పరమాత్మ, లేనక విశ్వాత్మ)**

112. మనదేశమున పెక్కు సారస్వత గ్రంథములకు ఆధారములేవి ? **(ఇతిహాసములు)**

113. ఋగ్వేదంలో చాలా విషయాలతో సామ్యంగల మరో ప్రాచీన గ్రంథం ఏది ? **(జెండా అవెస్తా)**

114. జెండా అవెస్తాలో పెర్కోనబడ్డ ప్రధాన దేవత ఎవరు ? **(అహర్ మిజ్దా)**

115. జెండా అవెస్తా ఏ దేశపు ఆది గ్రంథం ? **(ఒకప్పటి పర్షియా నేటి ఇరాన్)**

116. వేదాలలో వర్ణించబడిన నదులలో ప్రస్తుతం భౌతికంగా అంతరించిన నదులు ఏవి ? **(సరస్వతి, ద్రిషద్వతి)**

117. ఋగ్వేద కాలంలో అతి పవిత్రంగా భావించబడిన దేవత ఎవరు ? **(సరస్వతి)**

118. ఋగ్వేద కాలంలో భూమిపై ఆధిపత్యం ఎవరిది ? **(వ్యక్తులు వారి కుటుంబాలు)**

119. అనార్యులపై ఆర్యుల విజయానికి ప్రధాన కారణంఏమిటి? **(శక్తివంతమైన సైనిక వ్యూహం, ఆయుధాలు)**

120. ఋగ్వేద ఆర్యులు ఎన్ని తెగలుగా వర్ణించబడ్డారు ? **(పంచజన)**

121. పరుష్ణ నదిగా ఇప్పుడు గుర్తించబడినది ఏది ? **(రావి నది)**

121. సభ, సమితితోబాటు ఋగ్వేద కాలపు ఇతర సలహావేదికలు ఏవి ? **(విధాత, గణ)**

122. ప్రజలు చెల్లించే 'బలి' ఏ రూపంలో ఉండేది ? **(ధాన్య రూపంలో గాని, ఆవుల రూపంలో గాని)**

123. ఋగ్వేద కాలంలో 'బలి' ఎందుకు చెల్లించేవారు ? **(శత్రువు నుండి తమను తమ పశుగణాన్ని కాపాడినందుకు)**

125. 'పుచ్ఛరిష్ణు ' దేనికి సంబంధించినది ? **(కదిలే కోటలు)**

126. వ్యాకరణ శాస్త్రాన్ని రచించింది ఎవరు ? **(పాణిని మహర్షి)**

127. చందశ్శాస్త్రాన్ని రచించింది ఎవరు ? ఆ గ్రంథం పేరేమి? **(పింగళుడు - ఛందోవిచితి)**

128. ప్రాచీన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఎవరు ? **(లగదుడు - గర్గుడు)**

129. రామాయణంలో భాగాలను ఏమంటారు ? అవి ఎన్ని అవిఏవి ?

**(కాండలు ఆరు అవి 1.బాలకాండ 2.అయోధ్యకాండ 3.అరణ్యాకాండ 4.కిష్కింధకాండ 5.సుందరకాండ 6.యుద్ధకాండ)**

130. భారతంలో భాగాలను ఏమంటారు ? అవి ఎన్ని? అవి ఏవి ?

**(పర్వములు. 18 అవి 1 ఆది పర్వము 2 సభాపర్వము 3 అరణ్యపర్వము 4 విరాట పర్వము 5 ఉద్యోగపర్వము 6 భీష్మ పర్వము 7 ద్రోణ పర్వము 8 కర్ణపర్వము 9. శల్యపర్వము 10 సౌప్తిక పర్వము 11 స్త్రీ పర్వము 12 శాంతి పర్వము 13 అనుశాసనిక పర్వము 14 అశ్వమేధ పర్వము 15 ఆశ్రమవాస పర్వము 16 మౌసల పర్వము 17 మహా ప్రస్థానిక పర్వము 18. స్వర్గారోహణ పర్వము)**

131. దశరాజ యుద్ధములో విజేత ఎవరు ? **(సుధాముడు)**

132. ఆర్యుల ఆసియా వలసకు నిదర్శనము ? **(భోగజ్‌కోయి శాసనము)**

# 5. జైన, బౌద్ధ మతాలు (క్రీ.పూ. 600-300)

1. క్రీ.పూ. 6వ శతాబ్దంలో భారతదేశంలో ఉద్భవించిన మతములు ఏవి ? **(జైన బౌద్ధ మతములు)**
2. జైనమత స్థాపకుడు ఎవరు ? **(పార్శ్వ నాధుడు)**
3. జైన మతగురువులను ఏమని పిలుస్తారు ? **(తీర్ధంకరులు)**
4. తీర్ధంకరులనగానేమి ? **(జీవన స్రవంతిని దాటించువారు)**
5. జైనులలో 23వ తీర్థంకరుడు ఎవరు ? **(పార్శ్వనాధుడు)**
6. జైనులలో 24వ తీర్ధంకరుడు ఎవరు ? **(వర్ధమాన మహావీరుడు)**
7. జైన తీర్ధంకరులు ఎంతమంది ఉన్నారు ? **(24 మంది)**
8. జైనుల మొదటి తీర్ధంకరుడు ఎవరు ? **(ఋషభనాథుడు)**
9. వర్ధమాన మహావీరుడు ఎప్పుడు ఎక్కడ జన్మించాడు ? **(క్రీ.పూ. 540లో వైశాలికి సమీపంలోని కుందగ్రామంలో)**
10. వర్ధమాన మహావీరుని తల్లిదండ్రులు ఎవరు ? **(సిద్ధార్ధుడు, త్రిశాలదేవి)**
11. మహావీరుని భార్య పేరేమి? **(యశోద)**
12. మహవీరుని కుమార్తె పేరేమిటి ? **(ప్రియదర్శని)**
13. వర్ధమానుని బిరుదులు ఏవి ? **(జనుడు, కేవలి, నిగ్ర గ్రంధుడు, మహావీరుడు)**
14. వర్ధమాన మహావీరుని అనుయాయుల నేమంటారు ? **(జైనులు)**
15. వర్ధమాన మహావీరుడు ఎప్పుడు? ఎక్కడ, మరణించాడు ? **(క్రీ.పూ. 468లో రాజగృహం సమీపంలోని పావపురిలో)**
16. వర్ధమానునికి ఎప్పుడు ఎక్కడ జ్ఞానోదయమైంది? **(తన 42వ సంవత్సరములో జృంబిక గ్రామసమీపంలో సాలవృక్షం కింద)**
17. పార్శ్వనాధుడు ప్రతిపాదించిన నాలుగు సూత్రములేవి ? **(1. అసత్యమాడరాదు, 2.ఆస్తిపాస్తులుండరాదు 3.జీవహింస చేయరాదు 4. దొంగతనంచేయరాదు)**
18. పార్శ్వనాధుని నాలుగు సూత్రాలకు వర్ధమానుడు చేర్చిన ఐదవ సూత్రము ఏది? **(బ్రహ్మచర్యము అవలంభించుట)**
19. మహావీరుడు భోధించిన పంచ సూత్రములను ఏమంటారు ? **(పంచ వ్రతములు)**
20. జైన మత గ్రంథములేవి ? అవి ఎన్ని ? **(అంగములు అవి పన్నెండు)**
21. జైన మత త్రిరత్నము లేవి ? **(సద్భక్తి, సత్ జ్ఞానము, సదాచారము)**
22. జైన మతమును ప్రోత్సహించిన మౌర్య చక్రవర్తి ఎవరు? **(మౌర్య చంద్ర గుప్తుడు)**
23. ఏ మౌర్య చక్రవర్తి కాలంలో పాటలీపుత్రంలో జైన పరిషత్తు జరిగింది ? **(మౌర్య చంద్ర గుప్తుడు)**
24. జైనమతం ఎన్ని శాఖలుగా విడిపోయినది? అవి ఏవి? **(రెండు 1 శ్వేతాంబరులు 2. దిగంబరులు)**
25. జైన మతమును దక్షణ భారతదేశంలో వ్యాపింపజేసింది ఎవరు ? **(భద్ర భాహువు)**
26. జైన పరిభాషలో 'కుద్ధశాల' లేక ' కేవలావస్థ' అంటే ఏమిటి ? **(మోక్షం)**
27. పార్శ్వనాధుడు జ్ఞాని అగుటకు తపస్సు చేసిన కాలము ఎంత? **(84 రోజులు)**
28. జైనమతము అనుపేరు ఎవరి వల్ల వచ్చినది ? **(వర్ధమాన మహావీరుడు)**
29. ఏసత్యాన్వేషణలో వర్ధమానుడు తపస్సుచేసిన కాలమెంత ? **(12 సం॥లు)**
30. చేతనా, అచేతనములందు జీవము కలదని ఏమతస్థుల విశ్వాసము **(జైన)**
31. జైనులలో తెల్లని వస్త్రములను ధరించువారు ఎవరు ? **(శ్వేతాంబరులు)**
32. జైనుల కొరకు ఉదయగిరి వద్ద గుహలు తవ్వించిన కళింగ చక్రవర్తి ఎవరు? **(మహరాజా ఖారవేలుడు)**
33. జ్ఞానోదయమైన పిదప వర్ధమానుడు ఏ పేరుతో పిలువబడెను ? **(కేవలి)**
34. మోక్ష సాధనకు జైనమతము సూచించిన విధానము ఏమిటి ? **(సల్లేఖన వ్రతము)**
35. జైన మతములోని అత్యంత కఠినమయిన సిద్ధాంతాలు ఏమిటి ? **(బ్రహ్మచర్యము, అహింస)**
36. బౌద్ధ,జైన మతములలో ఏది ప్రాచీనమైనది ? **(జైన మతము)**

37. జైనమతము సాహిత్యము నేమంటారు ? (ద్వాదశాంగములు)
38. శరీరాన్ని క్రమంగా శుష్కింప జేసికొనుటను ఏమందురు ? (సల్లేఖనం)
39. జైన భిక్షువుల నివాసము నేమందురు ? (భిక్షుగృహ)
40. శ్రావణ బెళగోళలోని జైన భిక్షువు విగ్రహము ఎవరిది ? (బాహుబలి)
41. శ్రావణబెళగొళ ఏ రాష్ట్రము నందుగలదు ? (కర్ణాటక)
42. సల్లేఖన దీక్ష ద్వారా శరీరమును త్యజించిన మౌర్య చక్రవర్తి ఎవరు ? (చంద్రగుప్తమౌర్యుడు)
43. ఆత్మ నిగ్రహము దేనిని ఆపుదల చేయునని పార్శ్వనాధుడు బోధించెను? (కర్మను)
44. కర్మను నిర్మూలించుటకు పార్శ్వనాధుడు బోధించిన మార్గం ఏది ? (తపస్సు)
45. మహావీరుని కాలమున మగధను పరిపాలించే రాజు ఎవరు ? (బింబసారుడు)
46. మహవీరుడు ప్రామాణిక గ్రంథములు అని వేనినెను ? (వేదములు)
47. బౌద్ధమత స్థాపకుడు ఎవరు ? (బుద్ధుడు)
48. బుద్ధుని అసలు పేరేమి ? (సిద్ధార్థుడు)
49. బుద్ధుడు ఏ ప్రదేశమున జన్మించినాడు ? (లుంబిని)
50. బుద్ధుని తల్లిదండ్రులు ఎవరు ? (శుద్ధోధనుడు, మాయాదేవి)
51. బుద్ధుని భార్య పేరేమిటి ? (యశోధర)
52. బుద్ధుని కుమారుని పేరేమిటి ? (రాహులుడు)
53. గౌతమ బుద్ధుడు పుట్టిన సంవత్సరము ఏది ? (క్రీ.పూ. 567)
54. బుద్ధుడు క్షత్రియ కులములో ఏశాఖకుచెందిన రాజు ? (శాక్య)
55. బుద్ధుడు ఏ రాజ్యమునకు యువరాజు ? (కపిలవస్తు)
56. బౌద్ధ మతములో బుద్ధుడు ఇల్లువదలి వెళ్లు సంఘటనకు ఏమనిపేరు ? (మహాభినిష్క్రమణము)
57. బుద్ధుని జీవితములో గొప్ప మార్పు తెచ్చిన నాలుగు ముఖ్య దృశ్యములేవి?
(రోగ గ్రస్తుడు, వృద్దుడు సన్యాపి, మృతదేహము)
58. ఇల్లు వదలి వెళ్ళునప్పటికి బుద్ధుని వయసు ఎంత ? (29వ సం॥ము)
59. బుద్ధునికి ఎచ్చట జ్ఞానోదయమైనది ? (గయలోని భోధివృక్షము క్రింద)
60. బుద్ధుడు జ్ఞానోదయము పొందిన సంఘటనకు బౌద్ధమతములో ఏమని పేరు ? (సంబోధి)
61. జ్ఞానోదయమయిన పిమ్మట బుద్ధుడు తాను కనుగొన్న సత్యములను ప్రప్రథమముగా ప్రకటించిన స్థలము పేరేమిటి ?
(సారనాథ్)
62. బుద్ధుని సాహిత్యమునకు ఏమని పేరు ? (త్రిపీఠకములు)
63. గౌతమ బుద్ధుని " ఆసియాజ్యోతి" గా వర్ణించిన దెవరు ? (ఎడ్విన్ ఆర్నాల్డ్)
64. గౌతమ బుద్ధుని " ప్రపంచ జ్యోతి" గా వర్ణించిన దెవరు ? (శ్రీమతి రైస్ డేవిడ్స్)
65. బుద్ధుడు కుశి నగరమున నిర్యాణము చెందునప్పటికి ఆయన వయసు ఎంత ? (80వ సం॥ము)
66. బుద్ధుడు ఎన్ని సంవత్సరములు ధర్మబోధ చేసెను ? (సుమారు 45సం॥లు)
67. బుద్ధుని రథసారధి పేరు ఏమిటి ? (చెన్న)
68. బౌద్ధ మహాసభలను ఏమంటారు ? (సంగీతి)
69. ధర్మచక్ర పరివర్తనము ఏ మతమునకు చెందినది? (బౌద్ధమతమునకు)
70. బుద్ధుడు కనుగొనిన చతురాస్య సూత్రములు ఏవి ?

**(ఏ) లోకము ధు:ఖమయము బి)దు:ఖమును పోగొట్టుటకు కోరికలను త్యజింపుము సి) దు:ఖమునకు కోరికలే కారణము డి) కోరికలను జయించుటకు అష్టాంగ మార్గమును అనుసరించవలేను)**

71. అష్టాంగ మార్గములు ఏవి? (సత్ వాక్కు, సత్ క్రియ, సత్‌జీవనము, సత్ శ్రమ, సత్ ఆలోచన, సత్ ధ్యానము, సత్ నిశ్చయము, సత్ దృష్టి)
72. బుద్ధుని అనుచరులు ఎవరు? (ఆనందుడు, ఉపాలి)
73. వినయస్తుతి పీఠికలు వేనిఆధారముగా రూపొందించబడినవి ? (బుద్ధుని ఉపదేశములు)
74. మొదట బౌద్ధ సంగీతి ఎవరి పాలనకాలంలో జరిగినది (అజాత శత్రువు)
75. మొదటి బౌద్ధ సంగీతికి అధ్యక్షత వహించిన వారెవరు ? (మహకాశ్యపుడు)
76. మొదటి బౌద్ధ సంగీతి ఎచ్చట జరిగినది ? (రాజగృహము)
77. మొదటి బౌద్ధ సంగీతి నందు రూపొందింపబడినవి ఏమిటి? (వినయ, సుత్త పీఠికలు)
78. రెండవ బౌద్ధ సంగీతి ఎక్కడ జరిగినది ? (వైశాలి నందు)
79. బౌద్ధులు మహాసాంఘీకులుగానూ, స్థవిరవాదులుగానూ చీలిపోయిన సంగీతి ఎన్నవది ? (రెండవది)
80. పీఠికములు ఏ భాషలో వ్రాయబడినవి ? (పాళి భాష)
81. మూడవ బౌద్ధ సంగీతి ఎక్కడ ఏర్పాటు చేయబడెను ? (పాటలిపుత్రము నందు)
82. మూడవ బౌద్ధ సంగీతి ఏర్పాటు చేసినవారు ఎవరు ? (అశోకుడు)
83. మూడవ బౌద్ధ సంగీతికి అధ్యక్షత వహించిన వారెవరు ? (మొగ్గలి పుత్తతిస్స)
84. మూడవ బౌద్ధ సంగీతిలో రూపొందించబడినవి ఏవి ? (అభిదమ్మ పీఠిక)
85. నాల్గవ బౌద్ధ సంగీతి ఎక్కడ జరిగింది ? (కుందలవనము జలంధర్)
86. నాల్గవ బౌద్ధ సంగీతి ఎవరికాలంలో జరిగింది ? (కనిష్కుడు)
87. నాల్గవ బౌద్ధ సంగీతికి అధ్యక్షత వహించినది ఎవరు ? (వసుమిత్రుడు)
88. నాల్గవ బౌద్ధ సంగీతిలో బౌద్ధ మతము ఎలా విడిపోయెను ? (హీనయానము, మహాయానము)
89. బుద్ధుని దేవునిగా ఆరాధించెడివారిని ఏమందురు ? (మహాయానులు)
90. బుద్ధుని లేక సుప్రసిద్ధబౌద్ధ బిక్షువుల అస్థికలపై నిర్మించిన కట్టడములు ఏవి ? (స్థూపములు)
91. బౌద్ధుల విశ్రాంతి గృహములను ఏమని పిలుస్తారు ? (ఆరామములు)
92. బుద్ధుడు ఏ సం॥ము నిర్యాణము చెందినాడు ? (క్రీ.పూ. 487)
93. బుద్ధుని మరణమును ఏమంటారు ? (మహాపరి నిర్యాణము)
94. బుద్ధుడు బోధించిన నీతి నియమావళి ఏది ? (అహింస, దయ, భోగవిసర్జన, ప్రేమ, సత్యము)
95. బుద్ధుని రథసారధి పేరేమిటి ? (చెన్నుడు)
96 బుద్ధుని ప్రథమ జ్ఞాన బోధను ఏమంటారు ? (ధర్మచక్ర ప్రవర్తనము)
97. బౌద్ధుల ప్రార్దనా మందిరాలను ఏమంటారు ? (చైత్యములు)
98. బౌద్ధ భిక్షువుల విశ్రాంతి మందిరాలను ఏమంటారు ? (ఆరామములు)
99. భారతదేశ చరిత్రలో ప్రప్రథమ సామ్రాజ్యమేది ? (మగధ సామ్రాజ్యము)
100. ఏఏ సిద్ధాంతములను జైన, బౌద్ధ మతములు అంగీకరించెను ? (కర్మ, పునర్జన్మ)

## 6. మగధ రాజ్య ప్రాబల్యము ( క్రీ.పూ. 6వ శతాబ్దము)

1. షోడశ మహా జనపదములు ఏ శతాబ్దమునకు చెందినవి ? **(క్రీ.పూ. 6వ శతాబ్దం)**
2. క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో ఉత్తర భారతదేశం ఎన్ని జనపదాలుగా విభజింపబడినది ? వాటి పేరేమిటి ?
**(16, అవి షోడశ మహాజనపదములు))**
3. షోడశ మహాజనపదము లేవి ?
**(అంగ, కాశీ, కోసల, మగధ, చేది, వత్స, కురు, పాంచాల, మత్స్య, శూరసేన, అశ్మక, అవంతి, గాంధార, కాంభోజ, వజ్జి, దుల్ల)**
4. ఇతిహాస కాలంలో మగధను పాలించిన రాజవంశం ఏది? **(బృహద్రధ వంశం)**
5. జరాసంధుడు ఏ వంశానికి చెందినవాడు ? **(బృహద్రధ వంశం)**
6. బృహద్రధ వంశం తరువాత మగధను పాలించిన వంశం ఏది? **(హార్యంక వంశం)**
7. హార్యంక వంశ స్థాపకులు ఎవరు ? **(బింబిసారుడు)**
8. బింబిసారుని కాలంలో మగధ రాజధాని ఏది ? **(గిరి వ్రజము)**
9. బింబిసారుని పాలనా కాలం ఏది ? **(క్రీ.పూ 547 నుండి 495 వరకు)**
10. బింబిసారుని కుమారుడు ఎవరు ? **(అజాత శత్రువు)**
11. అజాత శత్రువు పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 495 నుండి 464)**
12. అజాత శత్రువు కుమారుడు ఎవరు ? **(ఉదయనుడు)**
13. మగధ రాజధానిని రాజగృహం నుండి పాటలీపుత్రమునకు మార్చిన హర్యంక వంశ పరిపాలకుడెవరు ?
**(ఉదయనుడు)**
14. హార్యంక వంశము తరువాత మగధనేలిన రాజవంశం ఏది? **(శైశునాగవంశం)**
15. శైశునాగవంశం నిర్మాత ఎవరు ? **(శిశునాగుడు)**
16. శిశునాగుని కుమారుడెవరు ? **(కాలాశోకుడు)**
17. శైశు నాగవంశం తరువాత మగధను పాలించిన రాజవంశం ఏది ? **( నందవంశం)**
18. నందవంశ స్థాపకుడు ఎవరు ? **(మహాపద్మనందుడు)**
19. మహాపద్మనందుని బిరుదు ఏది ? **(ఏక్‌రాట్)**
20. నంద వంశమును నిర్మూలించినది ఎవరు ? **(చాణుక్యుడు - మౌర్య చంద్ర గుప్తుడు)**
21. నందవంశం తరువాత మగధను పాలించిన రాజవంశంఏది? **(మౌర్యవంశం)**
22. భారతదేశంపై జరిగిన మొదటి విదేశీ దండయాత్ర ఏది ? **(పారశీక దండయాత్ర)**
23. సింధూ, పంజాబు రాష్ట్రాలను జయించటానికి పారశీక రాజైన డరయస్ పంపిన గ్రీకు సేనాని ఏవరు ? **(స్కైలాక్స్)**
24. పారశీకులు భారతదేశంలో ప్రవేశ పెట్టిన లిపి పేరేమి ? **(ఖరోష్ఠి లిపి)**
25. పారశీక రాష్ట్రాన్ని ఏమంటారు ? **(సత్రప్)**
26. అలెగ్జాండరు దగ్గం చేసిన పారశీక రాజధాని ఏది ? **(పెర్సి పోవస్)**
27. భారతదేశ చరిత్రలో మొట్టమొదట దేశద్రోహి ఎవరు ? **(తక్షశిల రాజు అంభి)**
28. అలెగ్జాండరు తండ్రి పేరేమిటి ? **(ఫిలిప్స్)**
29. ఫిలిప్స్ ఏదేశపు రాజు ? **(మాసిడోనియా)**
30. అలెగ్జాండరును ఎదిరించిన భారతీయ రాజు ఎవరు ? **(పురుషోత్తముడు)**
31. అలెగ్జాండరు పురుషోత్తముని ఏ సంవత్సరంలో, ఏ యుద్దంలో ఓడించెను? **(క్రీ.పూ.326లో జరిగిన జీలం యుద్ధం)**
32. అలెగ్జాండరు ఎక్కడ మరణించాడు ? **(బాబిలోనియాలో)**
33. మహాభారత యుద్ధ కాలము ఎప్పుడు జరిగినట్టుగా నిర్ధారించబడుతున్నది.? **(క్రీ.పూ. 3138)**
34. శ్రీ కృష్ణ నిర్యాణము ఎప్పుడు జరిగినదని నిర్ధారించబడినది ? **(క్రీ.పూ 3102)**

35. కలియుగ ప్రారంభము ఎప్పుడని చెప్పబడినది ? **(క్రీ.పూ. 3102)**
36. ఆరవ శతాబ్ద ముఖ్యలక్షణములు ఏవి ? **(రాజకీయ అనైక్యత, ఆధ్యాత్మిక అశాంతి, సాంఘీక విభేదములు)**
37. 6వ శతాబ్ద కాలములో ఉన్న 16 జనపదములలో గణ రాజ్యములెన్ని ? **(రెండు)**
38. 6వ శతాబ్ద కాలములో ఉన్న 16 జనపదములలో రాజరిక వ్యవస్థ గల జనపదములు ఎన్ని ? **(14)**
39. వారణాశి ఏఏ నదుల సంగమ స్థానమున నిర్మింపబడినది ? **(వరుణ,అశి)**
40. వారణాశి రాజధాని ఏది ? **(కాశీ)**
41. ఆరవ శతాబ్దమున గొప్ప విద్యా కేంద్రముగా ప్రసిద్దికెక్కిన నగరము ఏది? **(వారణాశి)**
42. ఆరవ శతాబ్దము నాటి జనపదాలలో బలీయమైనది ఏది ? **(మగధ)**
43. ఆరవ శతాబ్దమునాటి మగధ ఎచ్చట కలదు ? **(బీహారులోని పాట్న, గయ జిల్లాల ప్రాంతము)**
44. ఆరవ శతాబ్దము నాటి ఛేది జనపదం ప్రస్తుతం ఏది? **(బందేల్‌ఖండ్ ప్రాంతం)**
45. ఛేది జనపద రాజధాని ఏది ? **(సుత్తిమతి)**
46. వత్స ఏ నదికి దక్షణముగా ఉన్న జనపదం ? **(యమునా)**
47. వత్స జనపదమునకు, రాజధాని ఏది ? **(కౌశాంబి)**
48. ఉదయనుని జీవితమును నాటకముగా రచించిన కవి ఎవరు ? **(భాసుడు)**
49. మహభారత యుద్ధ రంగస్థలమైన జనపదమేది ? **(కురు)**
50. నేడు కురు జనపద ప్రాంత మేది ? **(ఢిల్లీ, మీరట్ జిల్లాల ప్రాంతం)**
51. గంగానది ఉత్తర దక్షణ భాగాలుగా విభజించు జనపదమేది ? **(పాంచాల)**
52. పాంచాల జనపదం నేడెచ్చట గలదు ? **(ఉత్తర ప్రదేశ్‌లోని బడౌన్, ఫరూఖాబాద్ జిల్లాప్రాంతము)**
53. మత్స్య జనపదము నేడెచ్చట కలదు ? **(రాజస్తాన్ లోని జయపూర్ ప్రాంతం)**
54. మత్స్య జనపదము రాజధాని ఏది ? **(విరాట నగరము)**
55. శూరసేన జనపద రాజధాని ఏది ? **(మధుర)**
56. శూరసేన జనపదం నేడెచ్చట గలదు ? **(ఢిల్లీ, ఆగ్రాల మధ్య ప్రాంతం)**
57. గోదావరి పై నున్న ఆంధ్ర జనపదమేది ? **(ఆస్మక)**
58. బుద్దుని కాలంలో అస్మక జనపద రాజుఎవరు ? **(సుజాతుడు)**
59. అస్మక రాజధాని ఏది ? **(పుతిన్)**
60. అవంతి జనపదము నేడెచ్చట కలదు ? **(మధ్యప్రదేశ్ లోని మాళ్వా ప్రాంతం)**
61. గాంధార జనపదము రాజధాని ఏది? **(తక్షశిల)**
62. గాంధార జనపదము నేడెచ్చట కలదు ? **(రావల్పిండి పెషావరుల ప్రాంతం)**
63. కాంభోజ జనపదము రాజధాని ఏది ? **(రాజపురము)**
64. గణ రాజ్య సమాఖ్య లేవి ? **(వజ్జి గణ రాజ్య సమాఖ్య, మల్ల గణ రాజ్య సమాఖ్య)**
65. పోషక మహా జనపదములందు పాలనా వ్యవస్థ ఏన్ని రకములు ? **(రెండు)**
66. బింబిసారుని ఆస్థాన వైద్యుడు ఎవరు ? **(జీవకుడు)**
67. ప్రపంచ విశ్వ విద్యాలయముగా పేరుపొందిన విద్యాలయము ఎచట కలదు? **(తక్షశిల)**
68. భూమండలమందలి క్షత్రియులందరిని నిర్మూలించినాడని పురాణములలో పేర్కొనిన రాజు ఎవరు ?
**(మహాపద్మనందుడు)**
69. చాణక్యుని నామముతో ధననందుని వధించిన వారెవరు ? **(చంద్ర గుప్త మౌర్యుడు)**
70. నందులు ఏ మతాన్ని అవలంభించినారు ? **(జైన మతము)**
71. అలెగ్జాండర్ ఎవరి శిష్యుడు ? **(అరిస్టాటిల్ )**
72. అలెగ్జాండర్ భారతదేశ దండయాత్రలకు ఆధారములు ఏవి ? **(స్ట్రాబ్ ఎరియన్ ప్లూటర్స్ మొ॥ గ్రీకు రచయితల రచనలు)**

73. అలెగ్జాండర్‌ను మన దేశమునకు దండెత్తి రమ్మని కోరిన వారెవరు ? **(అంభి)**
74. అంభి ఏ దేశపు జనపదమునకు రాజు ? **(తక్షశిల)**
75. పుష్కలావతి ఆక్రమించిన గ్రీకు సేనాధిపతులెవ్వరు ? **(హెఫెష్టియన్ పెర్డికాస్)**
76. జీలం లేక హైడస్పస్ యుద్ధము ఎప్పుడు జరిగింది ? **(క్రీ.పూ. 326 లో)**
77. జీలం యుద్ధ విజేత ఎవరు ? **(అలెంగ్జాండరు)**
78. పారశీక చక్రవర్తి డరయస్‌ను అర్బేలా యుద్ధంలో ఓడించిన రాజు ఎవరు? **(అలెగ్జాండరు)**

## 7.మౌర్యుల యుగం ( క్రీ.పూ. 300 - 200 )

1. మౌర్య వంశ స్థాపకుడు ఎవరు ? **(మౌర్య చంద్రగుప్తుడు)**
2. చరిత్రలో ఒక గొప్ప చారిత్రాత్మక సంఘటన ఏది ? **(మౌర్య సామ్రాజ్య స్థాపన)**
3. మౌర్యుల చరిత్రకు మూలాధారము లేవి ?
**(కౌటిల్యుని అర్థశాస్త్రము, మెగస్తనీస్ ఇండికా, అశోకుని శిలాశాసనాలు,ముద్రారాక్షసము)**
4. చంద్రగుప్త మౌర్యుని పరిపాలనా విధానమునకు, నాటి రాజనీతి తెలుసుకోనుటకు ముఖ్యాధారము ఏది ? **(కౌటిల్యుని అర్థశాస్త్రము)**
5. చంద్రగుప్త మౌర్యుని ప్రధాన మంత్రి ఎవరు ? **(చాణక్యుడు లేక కౌటిల్యుడు లేక విష్ణు గుప్తుడు)**
6. అర్థ శాస్త్రము ఏ భాషలో వ్రాయబడెను ? **(సంస్కృతము)**
7. అర్థ శాస్త్రములో ఎన్ని అధ్యాయాలున్నాయి ? **(150)**
8. అర్థ శాస్త్రములో ఎన్ని శ్లోకములు ఉన్నాయి? **(6,000)**
9. అర్థశాస్త్రమునందు కౌటిల్యుడుపదేశించినదేమిటి ? **(సామ్రాజ్యమును సంపాదించి దానిని పాలించు విధానము)**
10. యధా రాజ తథా ప్రజ అని చెప్పిన దెవరు ? **(కౌటిల్యుడు)**
11. 'ఇండికా' గ్రంధకర్త ఎవరు ? **(మెగస్తనీసు)**
12. మెగస్తనీసు ఎవరు ? **(గ్రీకు రాజు సెల్యూకస్ నికేటర్ యొక్క రాయబారి)**
13.' ఇండికా' గ్రంథం ప్రకారం పాటలీపుత్ర వైశాల్యమెంత ? **(13 కి. మీ. పొడవు. రెండున్నర కి.మీ. వెడల్పు)**
14. 'ఇండికా' ప్రకారము పాటలీపుత్రనగర పాలనకు ఉన్న 'పురపాలక సంఘ సభ్యులు ఎంతమంది ? **(30 మంది)**
15. మౌర్యులను గూర్చి తెలియజేసే సింహళ ఇతిహాసిక గ్రంథాలు ఏవి ? **(ద్వీపవంశము,మహావంశము)**
16. చంద్రగుప్తమౌర్యుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 322 నుండి 298 వరకు)**
17. చంద్రగుప్త మౌర్యుడు ఓడించిన గ్రీకు సేనాని ఎవరు ? **(సెల్యుకస్ నికేటర్)**
18. మౌర్య చంద్రగుప్తునికి జైనమత దీక్షను ఇచ్చిన జైనమత గురువు ఎవరు ? **(భద్రభాహువు)**
19. మౌర్య చంద్రగుప్తుడు ఏ సంవత్సరంలో ధననందుని చంపి మగధను ఆక్రమించాడు ? **(క్రీ.పూ. 322)**
20. నంద వంశనిర్మూలనకు చంద్రగుప్త మౌర్యునికి తోడ్పడింది ఎవరు ? **(చాణక్యుడు)**
21. చంద్రగుప్త మౌర్యుడు ఎక్కడ మరణించాడు ? **(కర్ణాటకలోని శ్రావణ బెళగోళలో)**
22. మౌర్య చక్రవర్తులలో గొప్పవాడు ఎవరు ? **(అశోకుడు)**
23. అశోకుని తండ్రి పేరేమిటి ? **(బిందుసారుడు)**
24. అశోకుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 274 నుండి 237)**
25. బిందుసారుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 298 నుండి 274 వరకు)**
26. అశోకుని జీవిత గతిని మార్చిన యుద్ధమేది ? **(కళింగ యుద్ధము)**
27. కళింగ యుద్ధం ఎప్పుడు జరిగింది ? **(క్రీ.పూ. 261లో)**
28. కళింగ యుద్ధ వర్ణనము గల అశోకుని శిలాశాసనము ఏది ? **(13వ శిలా శాసనము)**
29. అశోకుని శిలాశాసనములను బట్టి అతని రాజ్యవిస్తీర్ణమెంత ? **(తమిళనాడు,అస్సాము తప్ప మిగిలి భారతదేశమంతా.)**

30. అశోకుడు ఎవరి వలన బౌద్ధమతము స్వీకరించెను ? (ఉప గుప్తుడు)
31. బుద్ధము, ధర్మము, సంఘమునందు అశోకుడు విశ్వాసము ప్రకటించినట్లు దేనియందుండెను ? (బైరాట్ శాసనము లేక బధు శాసనం)
32. అశోకుడు దర్శించిన బౌద్ధ మత క్షేత్రంలేవి ? (లుంబినీ, గయ, కుశి, సారనాథ్)
33. అశోకుడు కట్టించిన బౌద్ధ స్థూపములేవి ? (సాంచి సారనాథ్, చార్యుత్)
34. అశోకుడు వ్యాప్తిచేసిన మతమేది ? (బౌద్ధమతము)
35. అశోకుని కాలంలో జరిగిన బౌద్ధ సంగీతి ఏది ? (మూడవ బౌద్ధ సంగీతి)
36. ఇతర మతములను గౌరవించుట వలనే తన మత ఆధిక్యత పెరుగును అని భావించిన చక్రవర్తి ఎవరు ? (అశోకుడు)
37. అశోకుని బిరుదులు ఏవి ? (దేవానాంప్రియ, ప్రియదర్శి)
38. ఎవరి శిలా శాసనములో మనదేశమునకు తొలి లిఖిత ఆధారములు లభించినవి ? (అశోకుని)
39. రెండువేల సంవత్సరాల క్రితమే యుద్ధములను త్యజించమనిన విశ్వశాంతి దూత ఎవరు ? (అశోకుడు)
40. జంతు బలులను, మాంసాహారమును సేవించుటలో జంతువధను అశోకుడు నిషేధించెననుటకు ఆధారమేది? (మొదటి రాతి శాసనము)
41. దేశ సమైక్యతను, సమగ్రతను, ప్రగతిని సాధించుటకు అశోకుడు ప్రవేశపెట్టిన క్రొత్త విధానము ఏమిటి ? (ధర్మము)
42. ధర్మప్రచారమునకు అశోకుడు నియమించిన ప్రత్యేకాధికారులెవరు ? (ధర్మమహామాత్రులు)
43. కాశ్మీర్, గాంధార ప్రాంతాలలో ధర్మ ప్రచారానికి అశోకుడు ఏవరిని పంపాడు ? (మజహంతకుడు)
44. ధర్మ ప్రచారానికి మైసూరు ప్రాంతానికి అశోకుడు ఎవరిని పంపాడు ? (మహాదేవుడు)
45. అశోకుడు బౌద్ధమత ప్రచారము కొరకు సింహళమునకు ఎవరిని పంపెను? (మహేంద్ర, సంఘమిత్ర)
46. మహారాష్ట్రలో బౌద్ధమత ప్రచారానికి అశోకునిచే పంపబడింది ఎవరు ? (మహాధర్మ రక్షితుడు)
47. అశోకుడు బౌద్ధమత ప్రచారము కొరకు బర్మాకు ఎవరిని పంపెను ? (శోన, ఉత్తర)
48. అశోకుడు సింహాసనము అధిష్టించక పూర్వము ఏ రాష్ట్రమునకు గవర్నరుగా నుండెను ? (ఉజ్జయిని)
49. అశోకుని కుమారుడు ఎవరు ? (కుణాలుడు)
50. అశోకుని మత విధానమునకు మూలసూత్రమేది ? (పరమత సహనము)
51. చిట్టచివరి మౌర్య చక్రవర్తి ఎవరు ? (భృహద్రధుడు)
52. అశోకుడు మరణించిన ఎంతకాలములో మౌర్య సామ్రాజ్యము పూర్తిగా అంతరించెను ? (అర్ధ శతాబ్ధి)
53. అశోకుని ఏ విధానము మౌర్య సామ్రాజ్య పతనమునకు కారణము అని కొందరి భావన ? (మతవిధానము)
54. మౌర్య సామ్రాజ్యం అంతమొందిన దెపుడు ? (క్రీ.పూ. 186 సం॥)
55. అశోకుని పరిపాలనలో ముఖ్య సూత్రములు ఏవి ? (అహింస, మైత్రి)
56. చివరి మౌర్య చక్రవర్తిని వధించింది ఎవరు ? (పుష్యమిత్రశుంగుడు)
57. బ్రాహ్మణుడైన మౌర్యసేనాని ఎవరు ? (పుష్యమిత్రశుంగుడు)
58. మౌర్యుల పాలన ఎటువంటిదని స్మిత్ అభిప్రాయము ? (ఉదాత్తమైన, రాజరిక వ్యవస్థ)
59. మౌర్యుల కాలంలో రాజ్యమునకు సర్వాధికారి ఎవరు ? (చక్రవర్తి)
60. మౌర్యుల కాలములో ఉన్నత న్యాయాధీశుడు ఎవరు ? (చక్రవర్తి)
61. మౌర్యుల గూఢచారుల నేమనేవారు ? (సత్రములు)
62. మౌర్యులు తమ ధ్యేయముగా దేనినెంచి పాలించిరి ? (ప్రజాక్షేమము)
63. రాజ్యపాలనలో చక్రవర్తికి సలహా ఇచ్చుటకు తోడ్పడునది ఏది ? (మంత్రి పరిషత్తు)
64. మంత్రి పరిషత్తు నందు ముఖ్యులెవరు? (ముఖ్యమంత్రి, పురోహితుడు, యువరాజు, సేనాని)
65. మంత్రిపరిషత్తు నందు ఉపమంత్రులు ఎందరు ? (14 గురు)
66. మౌర్యుల కాలంలో కోశాధికారి ఎవరు ? (సన్నిధాత)

67. మౌర్యుల కాలంలో ప్రభుత్వము ఎన్ని శాఖలుగా విభజింపబడింది ? **(32)**

68. మౌర్యుల కాలంలో రక్షక భటాధికారి ఎవరు? **(ప్రశస్తి)**

69. సమర్ధవంతమైన గూఢచారి వ్యవస్థ ఉన్న రాజునేమనేవారు ? **(చారచక్షువు)**

70. మౌర్యుల కాలంలో రాజధానికి సమీపముగా ఉన్న రాష్ట్రములను ఎవరు నిర్వహించెడి వారు ? **(మహామంత్రులు)**

71. మౌర్యుల పాలనలో జిల్లాస్థాయి పాలనాంశం పేరేమిటి ? దాని అధికారి ఎవరు ? **(ప్రాదేశములు లేక ఆహారములు, ప్రాదేశికుడు)**

72. ప్రాదేశికునకు ఏఏ ఉద్యోగులు సాయపడేవారు ? **(రజ్జుకుడు,యుక్త)**

73. రజ్జుకుడు ఏఏ అధికారములు నిర్వహించేవారు ? **(రెవిన్యూ, న్యాయాధికారాలు)**

74. మౌర్యుల గ్రామాధికారి పేరేమి ? **(గ్రామికుడు)**

75. మౌర్యుల కాలంలో ఐదు, పది గ్రామాలపై అధికారి నేమంటారు ? **(గోపుడు)**

76. గోపునపై ఉన్నతాధికారి ఎవరు ? **(స్థానికుడు)**

77. ప్రాదేశములో  నాల్గవ వంతు ప్రాంతమును పర్యవేక్షించేది ఎవరు ? **(స్థానికుడు)**

78. మౌర్యుల నాటి ప్రజాసంఘాలేవి ? **(రాజధాని ప్రతినిధులు)**

80. జనపదము నందు ఎవరుంటారు ? **(గ్రామ  ప్రతినిధులు)**

81. మౌర్యుల కాలంలో గ్రామాలనుండి వచ్చు ముఖ్యాదాయము ఏమిటి ? **(భూమిశిస్తులు)**

82. మౌర్యుల కాలంలో పన్నులు ఏవి. **(భాగ, బలి)**

83. స్వంత భూమియున్న రైతులు రాజుకు చెల్లించే పన్ను ఏది ? **(భాగ)**

84. భాగ పన్ను ఎంత ? **(పంటలు 1/6 వంతు నుండి 1/4 వంతు వరకు ఉంటుంది)**

85. బలి అనగా ఏమి ? **(రాజు భూములను రైతులు సాగు చేసుకున్నందుకు కౌలు)**

86. గుజరాతులోని సుదర్శన తటాకమును త్రవ్వించింది ఎవరు ? **(చంద్రగుప్తమౌర్యుని సామంతుడైన 'పుష్యగుప్తుడు')**

87. మౌర్యులు వేయించిన రాచబాటలలో ముఖ్యమైనదేది ? **(పాటలీపుత్రము నుండి తక్షశిలకు వేయబడిన రాచబాట)**

88. ఆదాయశాఖకు ముఖ్యాధికారిఎవరు ? **(సమాహర్త)**

89. మౌర్యుల కాలంలో క్రిమినల్ కోర్టులను ఏమనేవారు ? **(కంటక శోధన)**

90. మౌర్యుల కాలంలో సివిల్ కోర్టులను ఏమనేవారు. ? **(ధర్మస్థియ)**

91. మౌర్యుల కాలంలో అత్యున్నత న్యాయమూర్తి ఎవరు ? **(రాజు)**

92. మౌర్యుల కాలంలో గ్రామాలలో న్యాయపాలనను ఎవరు చూసేవారు ? **(గ్రామపెద్దలు)**

93. మౌర్యుల కాలంలో 10 గ్రామాలకు గల న్యాయస్థానం పేరేమి ? **(సంగ్రహము)**

94. మౌర్యుల కాలంలో 400 గ్రామాలకు గల న్యాయస్థానం పేరేమి ? **(ద్రోణముఖ)**

95. మౌర్యుల కాలంలో 800 గ్రామాలకు గల న్యాయస్థానంపేరేమి ? **(స్థానీయము)**

96. మౌర్యుల నగర పాలకుని పేరేమి **(నాగరికుడు)**

97. మౌర్యుల కాలం నాటి శిక్షలలో ఒకటి తెలుపుము ? **(అంగ విచ్ఛేదనము)**

98. మౌర్యుల రాజులలో ఎవరి కాలంలో శిక్షాస్మృతి తగ్గించబడింది ? **(అశోకుడు)**

99. మౌర్యుల కాలంలో  వర్తక సంఘాలను ఏమనేవారు ? **(శ్రేణులు)**

100. మౌర్యుల కాలంలో రాజభాష ఏది? **(ప్రాకృతము)**

101. మౌర్యుల కాలంలో సుప్రసిద్ధ విశ్వవిద్యాలయం ఏది ? **(తక్షశిల)**

102. అశోకుని శాసనముల భాష ఏది ? **(ప్రాకృతము)**

103. అశోకుని శాసనములు ఎక్కువగా ఏ లిపిలో ఉన్నాయి ? **(బ్రాహ్మీలిపి)**

104. భారత ప్రభుత్వ రాజముద్ర (మూడు సింహాల గుర్తు అశోకుని ఏ స్థూపము నుండి గ్రహింపబడినది ? **(సారనాథ్)**

105. అశోకుడు ఎప్పుడు జన్మించాడు ? **(క్రీ.పూ. 269)**

106. మధ్యప్రదేశ్‌లోని సాంచీ స్థూపాన్ని ఎవరు నిర్మించారు ? **(అశోకుడు)**
107. మౌర్య చక్రవర్తుల పాలనాక్రమం ఏది ? **(చంద్ర గుప్తుడు -బిందుసారుడు - అశోకుడు)**
108. నేడు బీహరు రాష్ట్ర రాజధానియైన పాట్న, ప్రాచీన నామమేది ? **(పాటలీపుత్రము )**
109. మౌర్యులకాలంలో ప్రమాణ నాణెము ఏది ? **(పణము)**
110. మౌర్యుల కాలంలో రాగి నాణెము పేరేమి ? **(దుష్కర)**
111. మౌర్యులచే విధింపబడిన కఠిన సుంకాలేవి . **(కార-విష్టి)**
112. మౌర్యుల విదేశాంగ మంత్రి పేరేమి ? **(సంధి విగ్రహుడు)**
113. మౌర్యుల ప్రధాన న్యాయాధికారి పేరేమి ? **(ప్రాడ్వివాకుడు)**
114. అశోకుని కాలంలో దక్షిణ భారతదేశంలో ప్రవేశపెట్టబడిన లిపి ఏది ? **(బ్రాహ్మి లిపి)**
115. అశోకుని లిపిని ఎవరు ? ఎప్పుడు చదివారు ? **(జేమ్స్ ప్రిన్సిప్ 1837లో)**
116. ప్రత్యేక శిలాశాసనాలు అని అశోకుని ఏ శిలాశాసనాలను అంటారు ? **(రెండు కళింగ శిలా శాసనాలను)**
117. ప్రప్రథమ అఖిల భారత సామ్రాజ్యం నిర్మించిన వంశమేది ? **(మౌర్యవంశం)**
118. మౌర్యుల పరిపాలనా కాలమెంత ? ( 137 సం॥ లు **(క్రీ.పూ. 322-185)**
119. అశోకుని స్థంభ శాసనాలకు ఉపయోగించిన రాయి ఎక్కడ నుండి తీసుకుని రాబడినది ? **(చునార్ గని నుండి)**
120. బిందుసారుని బిరుదు ఏది ? **(అమిత్ర ఘాతుడు)**
121. 'ధర్మబాంధవుడ'ని పేరుపొందిన మౌర్య చక్రవర్తి ఎవరు ? **(అశోకుడు)**
122. అశోకుడు చెక్కించిన స్థంభ శాసనములు ఎన్ని ? **(ఏడు)**
123. అశోకుడు చేయించిన గుహశాసనములు ఎన్ని ? **(మూడు)**
124. అశోకుడు ఎప్పుడు మరణించినాడు ? **(క్రి.పూ. 232)**
125. మౌర్య పాలకులలో చివరి రాజు ఎవరు ? **(బృహద్రధుడు)**

## 8. మౌర్యానంతర యుగం ( క్రీ.పూ. 200 క్రీ.శ.300) ఎ. శుంగులు

1. శుంగ వంశ స్థాపకుడు ఎవరు ? **(పుష్యమిత్రశుంగుడు)**
2. శుంగ వంశ పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 187 -75 ( 112 సం॥లు)**
3. పుష్యమిత్రుని అనంతరం ఎంతమంది శుంగ రాజులు రాజ్యపాలన చేసినారు? **(తొమ్మిదిమంది)**
4. శుంగుల చరిత్రకు ఆధారములనదగినవి ఏవి ?
**(పతంజలి-మహాభాష్యము, బాణుని-హర్షచరిత్ర, కాళిదాసు-మాళవికాగ్నిమిత్రము,యోగపురాణము, దివ్యవదాన)**
5. శుంగవంశ రాజుల మతమేది ? **(వైదికమతము)**
6. పుష్యమిత్రుడు మౌర్యుల సామ్రాజ్యంలో ఏభాగాన్ని, హస్తగతం చేసుకొన్నాడు? **(తూర్పుభాగమును)**
7. పుష్యమిత్రుని కుమారుడు ఎవరు ? **(అగ్ని మిత్రుడు)**
8. పుష్యమిత్రుడు, అగ్నిమిత్రుని ఏ ప్రాంతమునకు అధిపతిగా నియమించెను? **(దిశ)**
9. విదర్భను జయించిన శుంగవంశ రాజు ఎవరు ? **(అగ్నిమిత్రుడు)**
10. కాళిదాసు రచించిన 'మాళవికాగ్నిమిత్రం' లో నాయకుడు ఎవరు ? **(అగ్నిమిత్రుడు)**
11. మాళవికాగ్నిమిత్రం కథానాయకి ఎవరు ? **(విదర్భరాజైన యజ్ఞసేనుని కుమార్తె)**
12. పుష్యమిత్ర శుంగుని మనుమడు ఎవరు ? **(వసుమిత్రుడు)**
13. పుష్యమిత్రుని ఓడించిన మనుమడు ఎవరు ? **(వసుమిత్రుడు)**
14. వైదిక మతాభిమాని అయిన శుంగ వంశ రాజు ఎవరు ? **(పుష్యమిత్రుడు)**
15. పుష్యమిత్ర శుంగుని కాలములోని ప్రసిద్ధ వైయాకరణుడు ఎవరు ? **(పతంజలి)**
16. శుంగ వంశంలో చివరి రాజు ఎవరు ? **(దేవభూతి)**

17. దేవభూతి మంత్రి ఎవరు ? (వాసుదేవ కణ్వుడు)
18. శుంగ వంశ కాలమునందే తయారైనది అని భావింపబడుచున్న హిందూ ధర్మ శాస్త్రమేది ? (మను సంహిత)
19. పుష్యమిత్రుడు ఎన్ని అశ్వమేధ యాగములు చేసినాడు ? (రెండు)
20. శుంగ వంశాన్ని అంత మొందించినది ఎవరు ? (వాసుదేవ కణ్వుడు)

## కణ్వులు

21. కణ్వ వంశ స్థాపకుడు ఎవరు ? ( వాసుదేవ కణ్వుడు)
22. వాసుదేవ కణ్వుని కుమారుడెవరు? ( భూమి మిత్రుడు)
23. కణ్వ వంశం చివరి రాజు ఎవరు ? ( సుశర్మ )
24. కణ్వ వంశాన్ని అంతం చేసిన వారెవరు ? ( శాతవాహనులు)
25. కణ్వ వంశం పరిపాలనా కాలమేది ? ( క్రీ.పూ. 75-29 (46. సం॥)

## బాక్ట్రియన్ గ్రీకులు

26. సిరియా రాజధాని ఏది ? ( బాక్ట్రియా)
27. మౌర్య సామ్రాజ్య విచ్ఛిన్నతకు కారకులైన బాక్ట్రియానందు స్థిరపడిన గ్రీకులనేమంటారు ? (బాక్ట్రియన్ గ్రీకులు)
28. బాక్ట్రియన్ గ్రీకులకు గల ఇతర పేర్లేమి ? (ఇండోగ్రీకులు, యవనులు)
29. పుష్యమిత్రుని కాలంలో భారతదేశంపై దండెత్తిన బాక్ట్రియన్ గ్రీకు రాజు ఎవరు ? (డెమెట్రియస్)
30. సుప్రసిద్ధ బాక్ట్రియన్ గ్రీకు రాజు ఎవరు ? (డెమెట్రియస్)
31. బాక్ట్రియ ఎక్కడ ఉన్నది ? (నేటి ఆఫ్ఘనిస్థాన్ ఉత్తర ప్రాంతం)
32. పంజాబు నందు స్థిరపడిన డెమెట్రియస్ వంశస్థులు ఎంతకాలం పాలించిరి? (100 సం॥లు)
33. బౌద్ధ గ్రంధాలలో 'మిళిందుడు' అని ప్రసిద్ధిచెందిన ఇండోగ్రీకు రాజు ఎవరు ? (మీనాండర్)
34. మీనాండర్ పాలనా కాలమేది ? (క్రీ.పూ. 165- 1450)
35. మీనాండర్ రాజధాని ఏది ? (సాకాల ( నేటి సియోల్ కోట)
36. మీనాండర్ ఏ మతమును ఆదరించినాడు ? (బౌద్ధ మతము)
37. మీనాండర్ ఆస్థానములోని బౌద్ధ పండితుడు ఎవరు ? (నాగసేనుడు)
38. మీనాండర్ నాగసేనుల బౌద్ధమత సంవాదమును తెలిపే గ్రంథం ఏది ? (మిళిందపన్హ)
39. హిందూ - గ్రీకు శిల్పకళల మిశ్రమములో ఏర్పడిన శిల్ప కళ ఏది ? (గాంధార శిల్పకళ)
40. భారత దేశంలో మొట్టమొదట బంగారునాణెములను ముద్రించిన రాజులు ఎవరు ? (బాక్ట్రియన్ గ్రీకులు)

## శకులు

41. శకులు ఎవరు ? (సిధియన్లు మధ్య ఆసియావాసులు)
42. శకులు ప్రధమ నివాస స్థలమేది ? (సర్ డెరియానది ఉత్తర ప్రాంతము)
43. శకుల మొదటి రాజు ఎవరు ? (మవుస్)
44. మవుస్ బిరుదమేది ? (రాజాధిరాజు)
45. సంస్కృతములో ప్రప్రథమంగా పెద్ద శిలా శాసనమును వేయించిన శకరాజు ఎవరు ? (రుద్రదమనుడు)
46. శక రాజులలో గొప్పవాడు ఎవరు ? (రుద్రదమనుడు)
47. శక రాజులలో సుదర్శన సరస్సు బాగుచేయించిన వారెవరు ? (రుద్ర దమనుడు)
48. శకుల రాష్ట్రములను, రాష్ట్ర పాలకులను ఏమంటారు? (సత్రపీ- క్షాత్రపులు, మహాక్షాత్రపులు)
49. శకుల మొదటి రాజుల పరిపాలనా ప్రాంతం ఏది ? (వాయువ్య పంజాబ్)

50. క్షాత్రపుడనగా ఎవరు ? (యువరాజు)
51. మహాక్షాత్రపుడనగా ఎవరు ? (రాష్ట్ర మండలాధిపతి)
52. క్షాత్రపులలో సుప్రసిద్ధులు ఎవరు ? (పశ్చిమ క్షాత్రపులు)
53. క్షాత్రపులలో ఎన్ని తెగలున్నాయి ? **(రెండు 1. ఉత్తర క్షాత్రపులు 2. పశ్చిమ క్షాత్రపులు)**
54. పశ్చిమ క్షాత్రపులలో ఎన్ని తెగలున్నాయి ?**(రెండు 1. మహారాష్ట్ర లేక క్షహరాట క్షాత్రపులు 2. మాళవ లేక కార్ధమక క్షాత్రపులు)**
55. క్షాత్రపులలో ప్రసిద్ధులెవరు ? (పశ్చిమ క్షాత్రపులు)
56. మహారాష్ట్ర క్షాత్రప రాజ్యమును స్థాపించిన వారే వంశస్థులు ? (క్షహరాట)
57. క్షహరాట క్షాత్రప రాజ్యమును స్థాపించినది ఎవరు ? (భూమకుడు)
58. క్షహరాట క్షాత్రపుల రాజధాని ఏది ? (బరుకచ్ఛము లేదా నాసిక్)
59. భూమకుని అనంతరం రాజు ఎవరు ? (సహపణుడు)
60. సహపణుని పాలనా కాలమేది ? (క్రీ.శ. 119 - 124)
61. మహారాష్ట్ర క్షహరాట క్షాత్రపులలో సుప్రసిద్ధుడు ఎవరు ? (సహపణుడు)
62. సహపణుడు శాతవాహనుల నుండి జయించిన వేవి ? (మాళ్వా, మాహారాష్ట్రములు)
63. క్షహరాట వంశర్మూలనము గావించినవాడు ఎవరు ? (గౌతమీపుత్ర శాతకర్ణి)
64. మాళవ క్షాత్రవ రాజ్యమును స్థాపించిన వారెవరు? (కార్ధమక వంశంకారు)
65. కార్ధమక క్షాత్రవులు పాలించిన ప్రాంతమేది ? కార్ధమక వంశమూలపురుషుడు ఎవరు ? **(మాళవ ప్రాంతము - యశమితిక)**
66. కార్ధమక వంశస్థులలో అగ్రగణ్యుడు ఎవరు ? (రుద్ర దమనుడు)
67. రుద్రదమనుని బిరుదు ఏమిటి ? (మహా క్షత్రిప)
68. రుద్రదమనుని పాలనా కాలమేది ? (క్రీ.శ 130 నుండి 150 వరకు)
69. రుద్రదమనునిచే ఓడింపబడి, అతనికి అల్లుడైన శాతవాహన రాజు ఎవరు? (శివశ్రీ శాతకర్ణి)
70. రుద్రదమనుని శాసనములు ఎక్కడ ఉన్నాయి ? (అంధౌ, గిర్నార్)
71. కార్ధమక వంశస్థులలో చివరివాడు ఎవరు ? (మూడవ రుద్రసింహుడు)
72. కార్ధమక వంశస్థులలో చివరివాడు ఎప్పుడు, ఎవరిచే ఓడించబడ్డాడు ? (క్రీ.శ.388లో చంద్రగుప్త విక్రమాదిత్యునిచే)

## పార్థియనులు

73. పార్థియన్లు ఎవరు ? (ఐరోపాలోని కాస్పియన్ సముద్ర తీర ప్రాంతములోని పార్థియా దేశంవారు)
74. పార్థియన్లకు గల మరొక పేరు ఏది ? (పహ్లావులు)
75. పార్థియన్లు చక్రవర్తులలో సుప్రసిద్ధుడు ఎవరు ? (గండోఫర్నిస్)
76. సంస్కృత గ్రంథాలలో విందవర్ధుడని పేరు పొందిన పార్థియన్ చక్రవర్తి ఎవరు ? (గండోఫర్నిస్)
77. గండోఫర్నిస్ పాలనాకాలం ఏది ? (క్రీ.శ. 19 నుండి 45 వరకు)
78. గండోఫర్నిస్ ఏ ప్రాంతాన్ని పాలించాడు ? **(తూర్పు పర్షియానుండి భారతదేశ వాయవ్య సరిహద్దు ప్రాంతాన్ని పాలించాడు)**

## కుషాణులు

79. కుషాణులు ఎవరు ? (మంగోలియాలోని యూచీ తెగకు చెందిన వారు)
80. కుషాణులలో మొదట వాడెవరు? (కుజుల కాడ్‌ఫేసెస్)
81. కాడ్ ఫేసెస్ పాలనా కాలమేది ? (క్రీ.శ. 15 నుండి 65)
82. కుజుల కాడ్ ఫేసెస్ కుమారుడెవరు ? (వానుకాడ్ ఫేసెస్)
83. కుషాణుల అధికారమును మాళ్వా వరకు వ్యాప్తి చేసిన రాజెవరు ? (వానుకాడ్ ఫేసెస్)
84. వాన్ కాడ్ ఫేసెస్ బిరుదములేవి ? (రాజాధిరాజు, మహేశ్వరుడు, రక్షకుడు)

85. కుషాణు చక్రవర్తులలో అగ్రగణ్యుడు ఎవరు ? **(కనిష్కుడు)**
86. కనిష్కునిపాలనా కాలమేది ? **(క్రీ.శ. 78 - 101)**
87. శక సంవత్సరమును ప్రారంభించిన కుషాణురాజు ఎవరు ? **(కనిష్కుడు)**
88. కనిష్కుని కాలమున జరిగిన బౌద్ధ సంగీతి ఏది? **(నాల్గవ బౌద్ధ సంగీతి)**
89. బౌద్ధమతము హీనయానము - మహాయానముగా ఎప్పుడు చీలింది ? **(కనిష్కునికాలంలో)**
90. కనిష్కుడు ఏ బౌద్ధమత శాఖను ఆదరించినాడు ? **(మహయానము)**
91. కనిష్కుడు మగధను జయించి తీసుకువచ్చిన బౌద్ధ పండితుడెవరు ? **(అశ్వఘోషుడు)**
92. కనిష్కుడు బౌద్ధమతమును ఎవరి ప్రభోధము వలన స్వీకరించెను ? **(అశ్వఘోషుడు)**
93. కనిష్కుని బిరుదు లేవి ? **(దేవపుత్ర, సీజరు)**
94. కనిష్కుని ఆస్థానంలోని సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడు ఎవరు ? **(చరకుడు)**
95. చరకుడు వ్రాసిన ఆయుర్వేద వైద్య గ్రంథమేది **(చరక సంహిత)**
96. నాల్గవ బౌద్ధ సంగీతి నందు క్రోడీకరించబడిన గ్రంథమేది? **(మహవిభాష శాస్త్రము)**
97. చైనా, టిబెట్టులలో బౌద్ధమత వ్యాప్తికి కనిష్కుడు పంపిన బౌద్ధ బిక్షువు ఎవరు ? **(కశ్యప మాతంగుడు)**
98. కనిష్కుడు నిర్మించిన పట్టణమేది ? **(కనిష్కపురము)**
99. కనిష్కుడు కాశ్మీరును జయించి కనిష్క పట్టణమును నిర్మించెను అనుటకు ఆధారమేది ? **(కల్హణుని రాజతరంగిణి)**
100. కనిష్కుని రాజధాని ఏది ? **(పురుషపురము లేక పెషావర్)**
101. కనిష్కుని ఆస్థాన కవి ఎవరు ? **(అశ్వఘోషుడు)**
102. 'బుద్ధ చరిత్రము' 'సౌందర నందము'. అను గ్రంథాలను రచించింది ఎవరు ? **(అశ్వఘోషుడు)**
103. కనిష్కుడు పోషించి ఆదరించిన చిత్రకళ ఏది ? **(గాంధార)**
104. ప్రథమంగా బుద్ధుడు ఏ శిల్పకళలో విగ్రహ రూపం పొందినాడు ? **(గాంధార శిల్పకళ)**
105. నాల్గవ బౌద్ధ సంగీతికి ఎంతమంది బౌద్ధ భిక్షువులు హాజరైనారు ? **(500)**
106. నాల్గవ బౌద్ధ సంగీతి నందు పాల్గొనిన సుప్రసిద్ధ బౌద్ధ భిక్షువులు ఎవరు? **(నాగార్జునుడు, పార్శ్యుడు)**
107. ఆచార్య నాగార్జునుడు ఎవరి ఆస్థానంలోనివాడు? **(కనిష్కుడు)**
108. ఆచార్యనాగార్జునుడు రచించిన గ్రంథములేవి ? **(మాధ్యమిక సిద్ధాంతం , సుహృల్లేఖ)**
109. ఇండియన్ ఐన్‌స్టీన్ గానూ, మార్టిన్ లూథర్ గానూ ప్రసిద్దిపొందినది ఎవరు ? **(ఆచార్య నాగార్జునుడు)**
110. ఆచార్య నాగార్జునుని జన్మ స్థలం ఏది ? **(ఆంధ్రదేశంలోని వేదలి)**
111. ప్రపంచములో వెలుగొందు నలుగురు విజ్ఞాన సంపన్నులలో నాగార్జునుడు ఒకడు అని కీర్తించిన దెవరు?**(హ్యుయాన్‌త్సాంగ్)**
112. వసుమిత్రుడు ఎవరి ఆస్థానంలోనివాడు ? **(కనిష్కుని)**
113. వసుమిత్రుడు రచించిన గ్రంథం ఏది ? **(మహవిభాష శాస్త్రము)**
114. కనిష్కుని నాణెములు ఎచ్చటెచ్చట దొరికినవి ? **(గోరక్‌పూర్, గజపూర్)**
115. కనిష్కుని తరువాత రాజ్యమునకు వచ్చిన రాజెవరు? **(వశిష్టుడు)**
116. రెండవ అశోకుడు అని ఎవరిని పిలిచేవారు ? **(కనిష్కుడు)**
117. కనిష్కుడు ఎక్కడ కొయ్యతో పదమూడు అంతస్థులు కలిగిన గోపురమును నిర్మించెను ? **(పురుషపురం)**

## ఛేది వంశము

118. కళింగను పాలించిన సుప్రసిద్ధ రాజవంశం ఏది ? **(ఛేదివంశము (లేక)మహా మేఘవాహన వంశము)**
119. ఛేది వంశములో సుప్రసిద్ధుడు ఎవరు? **(ఖారవేలుడు)**
120. ఖారవేలుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 170 నుండి 157 వరకు)**
121. 'కళింగాధిపతి', కళింగ చక్రవర్తి' ఎవరు ? **(ఖారవేలుడు)**

122. ఖారవేలుని దిగ్విజయ యాత్రలను కీర్తించే శాసనం ఏది ? (హాతి గుంఫా శాసనము)
123. హాతిగుంఫా శాసనము ఎక్కడ ఉంది ? (భువనేశ్వర్‌కు సమీపంలోని ఉదయగిరి కొండలలో)
124. ఖారవేలుడు ఆదరించిన మతమేది ? (జైనమతము)
125. ఖారవేలుని కాలంలో జైన పరిషత్తు ఎక్కడ సమావేశమైంది ? (కుమారగిరిపై)
126. ఖారవేలుడు నిర్మించిన రాజభవనము పేరేమి ? (మహావిజయ ప్రాసాదము)
127. ఖారవేలునిచే ఓడింపబడిన మగధరాజు ఎవరు ? (పుష్యమిత్రశుంగుడు)
128. ఖారవేలునిచే ఓడింపబడిన శాతవాహన రాజు ఎవరు ? (మొదటి శాతకర్ణి)

## శాతవాహనులు

129. ఆంధ్ర దేశాన్నిపాలించిన తొలి రాజవంశం ఏది ? (ఆంధ్ర శాతవాహనులు)
130. శాతవాహన వంశ మూల పురుషుడు ఎవరు ? (శ్రీముఖుడు)
131. శాతవాహనుల ప్రసక్తి గల పురాణమేది? (మత్స్య పురాణము)
132. ఆంధ్రుల ప్రసక్తి గల మొదటి గ్రంథమేది ? (ఐతరేయ బ్రాహ్మణము)
133. శాతవాహనుల జన్మస్థలమేది ? (కృష్ణా, గోదావరుల మధ్యప్రాంతము)
134. శాతవాహనుల తొలి రాజధాని ఏది ? (పైఠాన్ లేదా ప్రతిష్ఠానం)
135. శాతవాహనుల మలి రాజధాని ఏది ? (ధరణికోట లేదా ధాన్యకటకం)
136. శాతవాహనులు వాడిన తొలి భాష ఏది ? (ప్రాకృతము)
137. 'లీలావతి' అనే ప్రాకృత కావ్యం రచించినది ? (శర్వవర్మ)
139. 'బృహత్కథ' రచించినది ? (గుణాఢ్యుడు)
140. శ్రీముఖుని సోదరుడు ఎవరు ? (కృష్ణుడు)
141. మాళ్వను జయించిన  మొదటి ఆంధ్రరాజు ఎవరు ? (మొదటి శాతకర్ణి)
143. 'దక్షిణాపథపతి' , అప్రతిహతఃచక్ర అనే బిరుదులు గల శాతవాహన రాజు ? (మొదటి శాతకర్ణి)
144. 'నానాఘాట్' శాసనం వల్ల ఏ శాతవాహన రాజు దిగ్విజయ యాత్రలు తెలుస్తున్నాయి ? (మొదటి శాతకర్ణి)
145. నానాఘాట్ శాసనం చేయించినదెవరు ? (మొదటి శాతకర్ణి భార్య నాగానిక)
146. రెండు అశ్వమేధములు, ఒక రాజసూయము చేసిన శాతవాహన రాజు ? (మొదటిశాతకర్ణి)
147. మొదటి శాతకర్ణికి సమకాలీనుడైన కళింగ రాజు ? (ఖారవేలుడు)
148. మొదటి శాతకర్ణి  ఏ మతాభిమాని ? (వైదిక)
149. మగధ రాజధానియైన పాటలీపుత్రాన్ని ఆక్రమించిన శాతవాహనరాజు ? (రెండవ శాతకర్ణి)
150. ఎవరి పాలన అనంతరం శాతవాహన సామ్రాజ్యం తొలిసారిగా ఛిన్నాభిన్నం అయినది? (రెండవ శాతకర్ణి)
151. విక్రమాదిత్యుని సమకాలీనుడైన శాతవాహన రాజు ఎవరు? (మూడవ శాతకర్ణి)
152. మగధ రాజైన 'సుశర్మ'ను వధించిన శాతవాహన రాజు ? (మొదటి పులోమావి)
153. ప్రాకృతిభాష స్థానే సంస్కృతము రాజభాషగా ఎవరి కాలంలో  వచ్చినది? (కుంతల శాతకర్ణి)
154. కుంతల శాతకర్ణి ఆస్థాన మంత్రులు ఎవరు ? (గుణాఢ్యుడు, శర్వ వర్మ)
155. సహపణుని ఓడించి, అతని నాణెములను తిరిగి తనపేర ముద్రించుకున్న శాతవాహన రాజు ఎవరు?(గౌతమీపుత్ర శాతకర్ణి)
156. పూర్వ శాతవాహనులలో ఆఖరి రాజు ఎవరు ? (హాల చక్రవర్తి)
157. 'కవి వత్సలుడు అను బిరుదు పొందిన శాతవాహన రాజు ఎవరు ? (హాలుడు)
158. హాలుని సమకాలీనుడైన పశ్చిమ క్షాత్రపులు ఎవరు ? (బౌమికుడు, సహపాణుడు)
159. 'గాథా సప్తశతి'ని రచించింది ఎవరు ? (హాలుడు)
160. 'గాథా సప్తశతి' ఏ భాషలో రచించబడింది ? (ప్రాకృతం)

161. 'గాథా సప్తశతి'ని పోలిన గ్రంథం ? (వజ్జలగ్గ)
162. 'వజ్జలగ్గ' ఎవరి రచన ? (జయవల్లభుని)
163. ఏరాజు దగ్గర నుంచి తల్లిపేరు పెట్టుకొనుట కనిపిస్తున్నది ? (చకోర శాతకర్ణి)
164. గౌతమీపుత్ర శాతకర్ణికి సంబంధించిన శాసనాలు ఏవి ? (నాసిక్, కార్లీశాసనాలు)
165. గౌతమీపుత్ర శాతకర్ణి తల్లి ? (గౌతమీ బాలశ్రీ)
166. సాంచీస్థూప దక్షిణతోరణం నిర్మించిన దెవరు ? (గౌతమీపుత్ర శాతకర్ణి)
167. గౌతమీపుత్ర శాతకర్ణి బిరుదులు ఏవి ? (త్రిసముద్రాధీశా, ద్విజకుల వర్ధన, ఏక బ్రాహ్మణ)
168. శాతవాహనుల రాజధాని ధరణి కోటగా ఎవరి కాలం నుంచి వర్థిల్లినది ? (గౌతమీపుత్ర శాతకర్ణి)
169. రాజర్షి వధుగా వర్ణించబడిన శాతవాహన స్త్రీ ఎవరు ? (గౌతమీ బాలశ్రీ)
170. కడపటి శాతవాహనులలో గొప్పవాడు ఎవరు ? (యజ్ఞశ్రీ శాతకర్ణి)
171. ఆచార్య నాగార్జునుని పోషించిన శాతవాహన చక్రవర్తి ? (యజ్ఞశ్రీ శాతకర్ణి)
172. నాగార్జున కొండ స్థూపాన్ని, విహారాన్ని నిర్మించిన వారు ? (యజ్ఞశ్రీ శాతకర్ణి)
173. యజ్ఞశ్రీ శాతకర్ణిని త్రిసముద్రాధీశ్వరుడని కీర్తించినది ? (బాణ మహాకవి)
174. శాతవాహనుల పాలనా కాలమేది ? (క్రీ.పూ. 230 నుండి క్రీ.శ. 225 ( 455. సం॥లు)
175. శాతవాహనుల కాలంలో ప్రసిద్ధికెక్కిన సంస్కృత గ్రంథం ? (నాగార్జునుని సుహృల్లేఖ)
176. నాగార్జున కొండకు గల మరొక పేరు. (శ్రీ పర్వతం)
177. శాతవాహనుల పశ్చిమతీర రేవు పట్టణములేవి ? (బరుకచ్ఛం సోపారు , కళ్యాణ్)
178. శాతవాహనుల తూర్పుతీర రేవు పట్టణములేవి ? (ఘంటసాల, మైసోలియా, కొట్టూరు)
179. శాతవాహనుల మంత్రుల పేరేమి ? (విశ్వాసామాత్యులు)
180. శాతవాహనుల రాజ్య విభాగాలేవి ? (జనపదము ( రాష్ట్రం ), ఆహారము ( జిల్లా, గ్రామము)
181. శాతవాహనుల పాలనలో జనపధమునకు అధిపతి ఎవరు ? (రాజన్, మహభాజ, మహారథి)
182. శాతవాహనుల పాలనలో ఆహారమునకు అధిపతి ఎవరు ? (అమాత్యుడు)
183. శాతవాహనుల పాలనలో గ్రామాధిపతి ఎవరు ? (గ్రామణి)
184. శాతవాహనుల నగర పాలన సంస్థల పేరేమి ? (నిగమ సభలు)
185. అమరావతి, జగ్గయ్యపేట, నాగుర్జున కొండ వంటి బౌద్ధ స్థూపములు, కార్లే, కన్హేరీ, నాసిక్ వంటి గుహ విహార చైత్యములు ఎవరి కాలంలో నిర్మింపబడినవి ? (శాతవాహనుల కాలంలో)
186. శాతవాహనుల కాలంలో ఆంధ్ర దేశంలో ప్రసిద్ధిపొందిన విశ్వవిద్యాలయం? (నాగార్జున విశ్వవిద్యాలయం)
187. యోగశాస్త్రమును రచించినది ఎవరు ? (పతంజలి)
188. శాతవాహనుల అధికార భాష ఏది ? అది ఏ లిపిలో వ్రాయబడినది ? ('ప్రాకృతం- బ్రాహ్మీలిపి')
189. శాతవాహనులలో చివరివాడు ? (మూడో పులోమావి)
190. శాతవాహన వంశాన్ని అంతమొందించిన వారెవరు ? (ఇక్ష్వాకులు)

## సంగం యుగం ( లేదా ) ప్రాచీన తమిళ రాజ్యాలు

191. ప్రాచీన తమిళ రాజ్యము చరిత్రకు ముఖ్యాధారము ఏది ? (సంగం వాజ్మయము)
192. తమిళ వాజ్మయ చరిత్రలో స్వర్ణ యుగమేది ? (సంగం యుగము)
193. సంగం అంటే ఏమటి ? (మధురలోని ప్రాచీన తమిళ కవి పండిత పరిషత్తు)
194. సంగం యుగ కాలమేది ? (క్రీ.శ. 100 నుండి 200 వరకు)
195. సంగం యుగమందు గల సుప్రసిద్ధ రచయితలు ఎవరు ? (సిత్తాలై పత్తనార్ ఇలంగో అడిగళి)
196. 'మణిమేఖల' ను ఎవరు రచించారు. (సిత్తాలై సత్తనార్)

197. ' శిలప్పధికారం' ఎవరు రచించారు ? (ఇలంగో అడిగళి)
198. కృష్ణానదికి దక్షిణముగా కన్యాకుమారి అగ్రము వరకు ఉన్న దేశము నేమందురు ? (దక్షిణాత్యము)
199. దక్షిణాత్యమందలి మూడు పెద్ద రాజ్యములేవి ? (చోళ, చేర, పాండ్య)
200. ప్రాచీన చోళరాజ్యం ఎక్కడ ఉంది? దాని రాజధాని ఏది? (కావేరి డెల్టా దాని పరిసర ప్రాంతం రాజధాని -ఉరయూరు)
201. ప్రాచీన చేరరాజ్యం ఎక్కడ ఉంది? దాని రాజధాని ఏది? (పశ్చిమ తీరంలోని దక్షిణ కొంకణప్రాంతం రాజధాని -వంజి)
202. ప్రాచీన పాండ్య రాజ్యం ఎక్కడ ఉంది?దాని రాజధాని ?
(పుదుక్కోట జిల్లాలోని వల్లూరు నదికి కన్యాకుమారికి మధ్యనున్న తూర్పుతీర ప్రాంతం రాజధాని -మధురై)
203. ప్రాచీన చోళ, చేర, పాండ్య రాజ్యాల ఉత్తర సరిహద్దు ఏది ? ( వెంగడం ( నేటి తిరుపతి)
204. ప్రాచీన చోళులలో సుప్రసిద్దుడు ఎవరు ? (కరికాలచోళుడు)
205. దక్షిణాత్య సార్వభౌమత్వమునకై ఎవరెవరి మధ్య ఎడతెరపి లేకుండా యుద్దములు సాగినవి ? (చేర, చోళ, పాండ్యరాజ్యముల మధ్య)
206. కరికాలచోళుడు ఏ యుద్ధమున పాండ్య, చేర, రాజ్యములను ఓడించాడు? (వెణ్ణి యుద్ధము)
207. చోళుల రేవు పట్టణం ఏది ? (కావేరీ పట్టణం)
208. పాండ్య రాజ్యమందు గల ముఖ్య రేవు పట్టణాలేవి ? (కోర్కుచ కమాల్)
209. చేరరాజుల ముఖ్య రేవువ పట్టణములు ఏవి ? (ముజరన్, వైక్కరై)
210. కరికాలుని దిగ్విజయములలో సుప్రసిద్ధమైనదేది ? (సింహళ దండయాత్ర)
211. సింహళ రాజును ఓడించి, బందీలైన సింహళీయుల చేత పుహర్ రేవుకు దక్షిణ శ్రేణులను, కావేరీనదికి వరద కట్టలను కట్టించిన చోళ రాజు ఎవరు ? (కరికాలుడు)
212. కరికాలచోళుని పాలనా కాలమేది ? (క్రీ.శ. 190)
213. కరికాలుడే మతాభిమాని ? (శైవ మతం)
214. కరికాలుడు కట్టించిన శివాలయములేని ? (70)
215. కావేరి నదికి శ్రీరంగం వద్ద ఆనకట్ట నిర్మించిన దెవరు ? (కరికాలుడు)
216. చోళుల యందేగాక దక్షిణాత్య రాజ్య వంశీయులలోనే సుప్రసిద్ధ చక్రవర్తి ఎవరు ? (కరికాలచోళుడు)
217. కరికాలచోళుని అనంతరము దక్షిణాత్య సార్వభౌమత్వమును కైవసం చేసుకొన్నవారెవరు ? (చేర వంశస్థులు)
218. చేర రాజులలో సుప్రసిద్దుడు ఎవరు ? అతని పాలనా కాలమేది ? (సెంగుట్టవాన్ క్రీ.శ. 180)
219. శిలప్పాదికారం రచించిన ఇలంగోఅళిగళ్ ఎవరి సోదరుడు ? (సెంగుట్టవాన్)
220.సెంగట్టవాన్ అనంతరం పాండ్యులు ఎవరి నాయకత్వమున విజృంభించినారు? (ముడిగుడిమి వెరువలడి)
221. పాండ్యరాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? అతని పాలనా కాలమేది ? (నెటుంజెలియన్ క్రీ.శ. 210)
222. చేర, చోళ కూటమిని ఓడించిన పాండ్య రాజెవరు ? (నెటుంజెలియన్)
223. నెటుంజెలియన్ ఏమతాభిమాని ? (వైదిక)
224. సాంస్కృతికముగా భారతదేశ సమైక్యతకు గట్టి పునాదులు ఏ యుగమున ఏర్పడినవి? (సంగం యుగమున)
225. సంగం యుగమందు గల నాలుగు ముఖ్య వర్గములేవి ? (వణం, తుడియం,వరియలీ, కడంబన్)

## 9. గుప్త యుగం ( క్రీ.శ. 300 - 500 )

1. గుప్తుల చరిత్రకు గల ముఖ్య ఆధారాలేవి ? (వాజ్మయ ఆధారములు, పురావస్తు ఆధారాలు, విదేశీరచనలు)
2. గుప్తుల నాటి రాజకీయ పరిస్థితులను వివరించినదేది ? (విష్ణు పురాణము)
3. అష్టాదశ పురాణములలో చాలా వరకు ఏ కాలమున వ్రాయబడినవి ? (గుప్తుల కాలమున)

4. అష్టాదశ పురాణములందు గుప్తుల చరిత్ర గూర్చి తెలుపునవేవి? **(వాయు, విష్ణు, బ్రహ్మాండ పురాణములు)**
5. గుప్తుల కాలమునాటి సామాజిక ఆర్థిక పరిస్థితులను విశదీకరించునవేవి?**(వ్యాస, హరీతి, సితామహ మున్నగువారి స్మృతులు)**
6. గుప్తుల నాటి ప్రముఖ గణ రాజ్యముల ప్రస్తావన దేనియందు కలదు? **( ముద్రా రాక్షసము )**
7. గుప్తుల చరిత్రకు అమూల్య ఆధారములు ఏవి ? **( గుప్తులు వేయించిన శాసనములు )**
8. గుప్త చక్రవర్తుల ప్రజల మతవిశ్వాసముల గూర్చి దేని యందు వర్ణింపబడినది ? **(ముద్రా రాక్షసము)**
9. గుప్తులకాలం నాటి విదేశీ రచనలలో ముఖ్యమైనవి ఏవి ? **(పాహియాన్, యువాన్‌ఛాంగ్, ఇత్సింగ్,ఆల్‌బెరూతీల రచనలు)**
10. గుప్తవంశ మూలపురుషుడు ఎవరు ? **(శ్రీ గుప్తుడు)**
11. గుప్త సామ్రాజ్య స్థాపకుడు ఎవరు ? **(మొదటి చంద్రగుప్తుడు)**
12. గుప్త శకమును ప్రారంభించింది ఎవరు ? **(మొదటి చంద్ర గుప్తుడు)**
13. మొదటి చంద్రగుప్తుని పాలనా కాలం ఏది ? **(క్రీ.శ. 320 నుండి 335 ( 15 సం॥లు)**
14. శ్రీ గుప్తుని మనుమడు ఎవరు ? **(మొదటి చంద్రగుప్తుడు)**
15. గుప్త చక్రవర్తులలోనే గాక భారతీయ చక్రవర్తులలో అగ్రగణ్యుడెవరు ? **(సముద్ర గుప్తుడు)**
16. 'ఇండియన్ నెపోలియన్ ' గా పేరుగాంచిన గుప్త చక్రవర్తి ఎవరు ? **(సముద్ర గుప్తుడు)**
17. సముద్ర గుప్తుని ముఖ్య లక్ష్యమేమి ? **(సమైక్య భారతదేశ నిర్మాణము)**
18. సముద్ర గుప్తుని పాలనా కాలమేది ? **(క్రీ.శ. 335 నుండి 380 (45 సం॥లు)**
19. సముద్రగుప్తుని ఆస్థాన కవి ఎవరు ? **(హరిసేనుడు)**
20. సముద్రగుప్తుడు కవితాపటిమకు నిదర్శనముగా ఏ బిరుదు పొందెను ? **(కవిరాజు)**
21. దక్షిణాపథమున ఎంతమంది చక్రవర్తులను సముద్రగుప్తుడు ఓడించెను? **(12 మంది)**
22. ఆర్యావర్తనమున ఎంతమంది చక్రవర్తులను సముద్రగుప్తుడు ఓడించెను? **(9 మంది)**
23. సముద్రగుప్తుని దిగ్విజయ యాత్రను తెల్పే శాసనం ఏది ? **(అలహాబాద్ ప్రశస్తి)**
24. సాధించిన విజయములకు చిహ్నముగా సముద్రగుప్తుడు ఏయాగము చేసెను? **(అశ్వమేధ యాగము)**
25. సముద్రగుప్తుని ఆస్థాన మందలి బౌద్ధమత వేదాంతి ఎవరు ? **(వసుబంధుడు)**
26. సముద్రగుప్తుడే మతాభిమాని ? **(బ్రాహ్మణ మతము)**
27. సముద్రగుప్తుని బిరుదు లేవి ? **(కవిరాజు , అశ్వమేధయోగి, ఇండియన్ నెపోలియన్)**
28. వీణమీటుతున్న బొమ్మగల నాణెములను ముద్రించిన గుప్త చక్రవర్తి ఎవరు? **(సముద్రగుప్తుడు)**
29. చంద్రగుప్త విక్రమాదిత్యుని పాలనాకాలం ఏది ? **(క్రీ.శ.380 - 414)**
30. సముద్రగుప్తుని పెద్ద కుమారుడు ఎవరు ? **(రామగుప్తుడు)**
31. రామగుప్తుని సోదరుడు ఎవరు ? **(రెండవ చంద్రగుప్తుడు)**
32. రెండవ చంద్రగుప్తుని బిరుదులేవి ? **(విక్రమాదిత్యుడు, శకారి , సాహసాంక)**
33. చంద్రగుప్తుని భార్య పేరేమి ? **(కుబేరనాగ)**
34. చంద్రగుప్తుని కుమార్తె పేరేమి ? **(ప్రభావతి గుప్త)**
35. గుప్తుల మొదటి రాజధాని ఏది ? **(పాటలీపుత్రము)**
36. గుప్తుల రాజధానిని ఉజ్జయినికి మార్చిన గుప్త చక్రవర్తి ఎవరు ? **(చంద్రగుప్త విక్రమాదిత్యుడు)**
37. చంద్రగుప్తుని మంత్రి ఎవరు ? **(శబరవీరసేనుడు)**
38. చంద్రగుప్తుని సేనాని ఎవరు ? **(అమరకరదేవుడు)**
39. చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలమున భారతదేశమును దర్శించిన చైనా యాత్రికుడు ఎవరు ? **(పాహియాన్)**
40. చంద్రగుప్తుని ఆస్థానమందలి సంస్కృత పండితులకేమని పేరు ? **(నవ రత్నములు)**
41. చంద్రగుప్తుని ఆస్థానమందు నవరత్నములెవరు ?
**(కాళిదాసు, వరాహమిహిరుడు, ధన్వంతరి, అమరసింహుడు, క్షిపణుకుడు, శంకు, భేతాళభట్టు, ఘటకర్పరుడు, వరరుచి)**

42. చంద్రగుప్తుని ఆస్థానమందలి నవరత్నములలో అగ్రగణ్యుడెవరు ? **(కాళిదాసు)**

43. మహాకవి కాళిదాసు రచనలలో గొప్పవేవి ? **(కుమార సంభవము, అభిజ్ఞాన శాకుంతలం, మేఘ సందేశము)**

44. చంద్రగుప్తుడే మతాభిమాని ? **(వైష్ణవ మతాభిమాని)**

45. అన్యమతస్థులకు సైతము ఉన్నత పదవులిచ్చిన గుప్త రాజెవరు ? **(చంద్రగుప్త విక్రమాదిత్యుడు)**

46. సముద్రగుప్తుడు ప్రారంభించిన దిగ్విజయ యాత్రలను ఎవరు పూర్తి చేసెను? **(చంద్రగుప్త విక్రమాదిత్యుడు)**

47. భారతదేశమున స్వర్ణ యుగమేది ? **(గుప్త యుగం)**

48. చంద్రగుప్తుని కాలము సుఖశాంతులకు, సిరి సంపదలకు నిలయమై గణనీయమైన సాంస్కృతాభ్యుదయమును. సాధించుటచే చరిత్రకారులు ఏమన్నారు ? **(స్వర్ణ యుగము)**

49. గుప్తయుగంలో ప్రసిద్ధి చెందిన ఖగోళ గణిత శాస్త్రజ్ఞులు ఎవరు ? **(ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మ గుప్తుడు)**

50. గుప్తుల స్వర్ణ యుగమునకు మాయని మచ్చలైన వేవి ? **(వర్ణ వ్యవస్థ, అస్పృశ్యత)**

51. గుప్తులకాలము నాటి ప్రజల విశ్వాసమేది ? **(రాజు దైవాంశ సంభూతుడని)**

52. నేటి హిందూమతమందలి పండుగలు చేసికొనుట, వ్రతములు సలుపుట, దేవతలను, పూజించు లక్షణములు ఏ కాలము నాటివి ? **(గుప్తుల కాలము)**

53. దేవతలకు ఆలయములను నిర్మించుట ఏకాలమున ప్రారంభమయ్యెను? **(గుప్తుల కాలం)**

54. చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలంలో గొప్ప విద్యాకేంద్రం ఏది ? **(ఉజ్జయిని)**

55. భారతీయ తర్కశాస్త్ర పితామహుడెవరు ? **(దిఙ్నాగుడు)**

56. గుప్తయుగము ఏఏ శాస్త్రములందు అభివృద్ధి సాధించబడినది ? **(గణిత, ఖగోళ భౌతిక, వైద్య శాస్త్రాలందు)**

57. 'దశాంశ పద్ధతి ' ' సున్న' విలువ ఉపయోగము ఏ కాలమున ఆవిర్భవించినవి? **(గుప్తులకాలమున)**

58. గుప్తుల కాలంనాటి వైద్య శాస్త్ర గ్రంథములలో సుప్రసిద్ధమైన దేది ? **(వాగ్భటుడు రచించిన అష్టాంగ సంగ్రహము)**

59. వైద్య శాస్త్ర గ్రంథములలో ముఖ్యమైనది ఏది ? **(పాలకాప్య రచించిన హస్త ఆయుర్వేదము)**

60. ప్రపంచ సారస్వతమందు సుప్రసిద్ధ మొదటి నూరు గ్రంథములలో ఒకటిగా విమర్శకులచే పరిగణింపబడినదేది ? **(కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలము)**

61. 'మృచ్ఛ కటికమును' రచించింది ఎవరు ? **(శూద్రకుడు)**

62. 'ముద్రా రాక్షసము' ను రచించినది ఎవరు ? **(విశాఖ దత్తుడు)**

63. 'రావణవధ' లేక బట్టి కావ్యమును రచించింది ఎవరు ? **(భట్టి)**

64. వరాహమిహిరుడు రచించిన గ్రంథమేది ? **(భృహత్ సంహిత)**

65. నీతి కథల సముచ్ఛయమైన ' పంచతంత్రము' వ్రాసిన వారు ? **(విష్ణుశర్మ)**

66. 'అమరకోశం' అనే సంస్కృత నిఘంటుకర్త ఎవరు ? **(అమర సింహుడు)**

67. 'ఆర్యభట్టీయం' అనే గణిత గ్రంథాన్ని రచించినది ఎవరు? **(ఆర్యభట్టు)**

68. 'స్వప్న వాసవదత్తమ్‌ను రచించినది ఎవరు ? **(సుబంధుడు)**

69. 'ఆర్యసిద్ధాంతం' అనే ఖగోళ శాస్త్ర గ్రంథాన్ని రచించింది ఎవరు ? **(ఆర్యభట్టు)**

70. 'భృహత్సంహిత' అనే విజ్ఞాన సర్వస్వం రచించినది ఎవరు ? **(వరాహమిహిరుడు)**

71. శుశ్రుతుడు రచించిన గ్రంథమేది ? **(శుశ్రుతము)**

72. రెండవ చంద్రగుప్తుని అనంతరం గుప్త సింహాసనాన్ని అధిష్టించినదెవరు? **(కుమార గుప్తుడు)**

73. మొదటి కుమారగుప్తుని తరువాత గుప్త సింహాసనానికి వచ్చింది ఎవరు ? **(స్కంద గుప్తుడు)**

74. ఎవరి తరవాత గుప్తవంశ చరిత్ర అస్తవ్యస్థమైనది ? **(స్కంధ గుప్తుని)**

75. గుప్త సామ్రాజ్య పతనమునకు ముఖ్య కాణమనదగినది ఏది ? **(వారసత్వ యుద్ధములు)**

76. గుప్త సామ్రాజ్య పతనము ప్రధానంగా ఎవరి దండయాత్రల వల్ల జరిగింది? **(హూణుల దండయాత్ర వల్ల)**

77. భారతదేశంపై దండయాత్ర చేసిన హుణులు ఎవరు ? **(శ్వేత హూణులు)**

78. గుప్తుల పాలనను ఇంగ్లండు పాలించిన ఏ రాజు పాలనతో పోలుస్తారు ? **(ఎలిజబెత్ రాణి)**

79. గుప్తుల కాలమును గ్రీసు దేశంలోని ఎవరి పాలనతో పోలుస్తారు ? **(పెరిక్లిస్)**

80. గుప్తరాజైన నరసింహగుప్త బాలాదిత్యని ఓడించి తక్షశిల విశ్వ విద్యాలయాన్ని ధ్వంసం చేసిన హూణరాజుఎవరు? **(తోరమానుడు)**

81. గుప్తుల కాలంలో నగర పాలనను నిర్వహించింది ఎవరు ? **(ఐదుగురు సభ్యులతో కూడిన నగరసభ)**

82. నగర సభలలోని సభ్యులు ఎవరు ? **(నగర శ్రేష్టి, ప్రధమ కులికుడు, సార్ధవాహుడు, ప్రథమకాయస్థుడు , పుస్తపాలకుడు)**

83. గుప్తుల కాలమున రాజుకు సలహా ఇచ్చుటలో సాయపడుటకు ఏమి ఉన్నది. **(మంత్రి పరిషత్తు)**

84. మంత్రి పరిషత్తులోని మంత్రులెవ్వరు ? **(మహాదండనాయకుడు, సంధివిగ్రహికుమారామాత్యుడు)**

85. గుప్తులు తమ సామ్రాజ్యమును ఎలా విభజించినారు ? **(రాష్ట్రాలుగా)**

86. గుప్తుల కాలమునాటి రాష్ట్రమునేమందురు ? **(భుక్తి)**

87. భుక్తికి అధిపతి ఎవరు ? **(ఉపరిక లేక గోప్త్రీ)**

88. గుప్తుల కాలమున నగరములనేమనేవారు ? **(విషయములు)**

89. విషయము అధిపతి ఎవరు ? **(విషయపతి)**

90. గుప్తుల కాలంలోని విషయమెలా విభజించబడినది ? **(గ్రామములు)**

91. గుప్తుల పాలనావ్యవస్థలో చివరి భాగమేది ? దాని అధిపతి ఎవరు ? **(గ్రామము - గ్రామికుడు)**

92. గ్రామికుని ముఖ్యవిధులేవి ? **(శాంతి భద్రతలు, గ్రామాభ్యుదయము)**

93. గుప్తుల ముఖ్యరేవు పట్టణము లేవి ? **(తామ్రలిపి , బరుకచ్ఛము)**

94. గల్డులు అంటే ఏమిటి ? **(వ్యాపార సంఘాలు వీటినే శ్రేణులు , నిగమములు అనికూడ అంటారు)**

95. గుప్తులు ఏ మతాభిమానులు ? **(బ్రాహ్మణ మతం)**

96. హిందూ మతమునకు ఏవి ఆధారములైనవి ? **(ఆగమ శాస్త్రములు , పురాణములు)**

97. గుప్తుల కాలంలో ఉజ్జయనీలోని నక్షత్ర పరిశోధనశాలను ఏమని పిలిచేవారు. **(జంతర్ మంతర్)**

98. నలంద విశ్వవిద్యాలయ స్థాపకుడు ఎవరు ? **(కుమార గుప్తుడు)**

99. గుప్తుల 'కుడ్య చిత్రలేఖనమునకు ప్రధాన నిదర్శనమైన అజంతాలోని గుహలు ఏవి? **(16, 17, 19 గుహలు)**

100. సముద్రగుప్తుని విజయములు తెలుసుకొనుటకు ఆధారము **(అలహాబాదు స్తంభ శాసనము)**

## హూణులు

101. హూణులు ఎవరు ? **(చైనా సరిహద్దులలో సంచరించు మంగోలియా ప్రాంత వాసులు)**

102. హుణులెటువంటివారు . **(రణశూరులు, అతి క్రూరులు)**

103. క్రీ.శ. 4వ శతాబ్దంలో రోమ్‌పై దండెత్తి రోమ్ సామ్రాజ్య పతనమునకు కారణమైనవారు ఎవరు ? **(అట్టిలా నాయకత్వంలోని నల్లహూణులు)**

104. హూణులలో ఎన్ని తెగలున్నవి ? **(రెండు 1. శ్వేత హూణులు 2. నల్ల హూణులు)**

105. గుప్తులపై హూణుల దండయాత్రల కాలమేది ? **(క్రీ.శ. 455 -458)**

106. హూణులను మొదట ఎదుర్కొన్న గుప్తులెవరు ? **(కుమారగుప్తుడు ,స్కందగుప్తుడు)**

107. హూణులను ఓడించిన గుప్త రాజు ఎవరు . **(కుమార గుప్తుడు)**

108. హూణుల నాయకుడెవరు ? **(తోరమాణుడు)**

109. తోరమాణుని కుమారుడెవరు ? (మిహిరకులుడు)
110. తోరమాణుడు అవలంభించిన మతమేది? (జైనమతము)
111. మిహిరకులుని రాజధాని ఏది ? ( సాకాల సియోల్ కోట)
112. మిహిరకులుడు ఎటువంటివాడు ? (క్రూర స్వభావుడు, మోసగాడైన నిరంకుశ ప్రభువు)

## బి. ఇక్ష్వాకులు

113. ఇక్ష్వాకుల వంశ స్థాపకుడు ? (శ్రీ శాంతమూలుడు)
114. ఇక్ష్వాకుల చరిత్రకు మూలాధారాలు ? (నాగార్జున కొండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి శాసనాలు)
115. ఇక్ష్వాకులకు గల మరొక పేరేమి ? (శ్రీ పర్వతీయులు)
116. ఇక్ష్వాకులు పాలించిన ప్రాంతమేది? (నేటి గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, కడప,కర్నూలు, నల్గొండ జిల్లాలు)
117. ఇక్ష్వాకుల రాజధాని ఏది? (విజయపురి)
118. ఇక్ష్వాకులు ఆదరించినమతమేది ? (బౌద్ధమతము)
119. హిందూమతాన్ని పోషించిన మొదటి ఆంధ్రరాజు (శ్రీ శాంతమూలుడు)
120. తొలి హిందూ దేవాలయాన్ని కట్టించిన ఆంధ్ర వంశం ? (ఇక్ష్వాకులు)
121. ఇక్ష్వాకుల రాజ్యచిహ్నం ఏది ? (సింహం)
122. ఇక్ష్వాకుల కాలంలోని రాజభాష ఏది ? (ప్రాకృతము)
123. 'దక్షిణ గాను' ప్రసిద్ధి చెందినది? (నాగార్జున కొండ)
124. ఇక్ష్వాక రాజులకు గల బిరుదు ఏది ? (మహాదేవి)
125. శ్రీ పర్వత బౌద్ధ కట్టడాలకు కారకురాలైన రాజకుమార్తె ఎవరు ?(మహతలవరి, మహాసేనాపత్ని, మహాదానపత్ని శాంతిశ్రీ)

## చుటు నాగులు

126. చుటునాగుల మూలపురుషుడెవరు ? (విష్ణుస్కంద చుటు శాతకర్ణి)
127. చుటునాగులు పాలించిన ప్రాంతమేది ? (మైసూరులోని బనవాసీ ప్రాంతం)
128. చుటునాగుల రాజధాని ఏది ? (బనవాసీ)
129. ఇక్ష్వాక రాజైన వీరపురుషదత్తుని కుమార్తె కొడబలిశ్రీని వివాహమాడిన చుటునాగరాజు ఎవరు ? (శివస్కంద శాతకర్ణి)

## బృహత్పలాయనులు

130. బృహత్పలాయనుల గురించి తెలియజేసే ఏకైక శాసనం ఏది ? (కొండముది తామ్రశాసనం)
131. ఇక్ష్వాకుల పతనం తరువాత మచిలీపట్టణం ప్రాంతాన్ని పాలించినవారు ఎవరు ? (బృహత్పలాయనులు)
132. బృహత్పలాయనుల వంశంలో ఇప్పటి వరకు తెలిసిన ఏకైక రాజు ? (జయవర్మ)
133. బృహత్పలాయనుల రాజధాని ఏది ? (కృష్ణా జిల్లాలోని కోటూరు)
134. జయవర్మ ఏమతాభిమాని ? (బ్రాహ్మణ మతాభిమాని)

## ఆనంద రాజులు లేదా ఆనంద గోత్రజులు

135. ఆనందరాజుల గోత్రము తెలియజేసే శాసనం ఏది ? (దామోదరవర్మ మట్టెపాడు శాసనం)
136. ఆనంద గోత్రజులు పాలించిన ప్రాంతమేది? (గుంటూరు మండలం)
137. ఆనంద గోత్రజుల రాజధాని ఏది? (కందపురం)
138. కందపురమును బౌద్ధులు ఏమని పేర్కొనిరి ? (కపోతికందపురం)
139. ఆనందరాజుల లాంఛనము ఏది ? (వృషభం)

140. ఆనందరాజులలో మొదటివాడు ? **(దామోదరవర్మ)**

141. ఆనందరాజులలో చివరివాడు ? **(కందార రాజు)**

142. త్రికూట పర్వత ప్రస్తుత నామం ఏది ? **(కోటప్పకొండ)**

## శాలంకాయనులు

143. శాలంకాయనులు పాలించిన ప్రాంతమేది . **(వేంగిప్రాంతము)**

144. శాలంకాయనుల రాజధాని ఏది ? **(వేంగీపురం)**

145. శాలంకాయన వంశ స్థాపకుడు ఎవరు ? **(నందివర్మ)**

146. శాలంకాయనుల ఇష్టదైవము ఎవరు ? **(చిత్ర రథస్వామి)**

147. శాలంకాయన పదానికి అర్ధం ఏమిటి ? **(నంది)**

148. శాలంకాయనులు ఏ మతస్తులు ? **(వైదిక బ్రాహ్మణ మతస్తులు)**

149. సముద్రగుప్తుని సమకాలికుడైన శాలంకాయన రాజు ఎవరు ? **(హస్తివర్మ)**

150. అశ్వమేధం చేసిన శాలంకాయన రాజు ? **(విజయ దేవవర్మ)**

## విష్ణు కుండినులు

151. ఆంధ్ర దేశంలో శాలంకాయనుల అధికారం తుది ముట్టించినవారు ? **(విష్ణు కుండినులు)**

152. విష్ణు కుండినుల స్వస్థలము **(వినుకొండ ( విష్ణు కుండినపురం)**

153. విష్ణు కుండినుల తొలి రాజధాని **(దెందులూరు)**

154 విష్ణు కుండినుల మలి రాజధాని **(వేంగి)**

155. విష్ణు కుండినుల వంశ స్థాపకుడు **(మొదటి మాధవ వర్మ)**

156. విష్ణుకుండినుల ప్రసిద్ధ గుహాలయము . **(ఉండవల్లి)**

157. విష్ణుకుండినుల చిహ్నము. **(సింహము)**

158. శ్రీ శైల మల్లికార్జునుని భక్తులు **(విష్ణుకుండినులు)**

159. విష్ణుకుండినుల కాలంలోని గుహాలయములు **(మొగల్రాజపురం గుహాలయములు)**

160. విష్ణుకుండినుల కాలంలో బహుళ ప్రచారం పొందిన మతం **(వైదిక మతం)**

161. ఏకాదశ అశ్వమేథములు,వేయి అగ్నిష్టోమములుచేసి జనాశ్రయుడని బిరుదు వహించిన రాజు **(మూడవ మాధవ వర్మ)**

162. విష్ణుకుండినుల శాసనాలలో వాడిన భాష ? **(సంస్కృతము)**

163. రాగిమలాముతో చేసిన ఇనుప నాణాలు వాడినది ? **(విష్ణుకుండినులు)**

164. విష్ణుకుండినులు పతనమైన యుద్ధం ? **(కొల్లేరు)**

## వాకాటకులు

165. వాకాటకులు ఏ కాలం వారు ? **(క్రీ.శ. 4,5 శతాబ్దాల వారు)**

166. వాకాటక రాజ్యస్థాపకుడు ఎవరు ? **(వింధ్యశక్తి)**

167. ఏ వాకాటక రాజు పాలన తరువాత నాకాటక రాజ్యం 'పురీరక','వత్సగుల్మ' శాఖలు గా చీలిపోయింది ? **(మొదటి ప్రవరసేనుడు)**

168. వాకాటక వత్సగుల్మ శాఖలలో ప్రసిద్ధ పాలకుడు ఎవరు . **(హరిసేనుడు)**

169. వాకాటక పురీరక శాఖలో చంద్రగుప్త విక్రమాదిత్యుని కుమార్తె, ప్రభావతీ గుప్తను వివాహమాడిన రాజు ఎవరు ? **(రెండవ రుద్రసేనుడు)**

## కదంబులు

170. కదంబులు ఏ కాలము వారు ? **(క్రీ.శ. 345 - 580)**
171. కదంబులు పాలించిన ప్రాంతమేది ? **(కర్ణాటకలోని వనవాసీ ప్రాంతం)**
172. కదంబుల రాజధాని ఏది ? **(వనవాసి)**
173. కదంబుల మూలపురుషుడు ఎవరు ? **(మయూరశర్మ)**
174. కదంబ చక్రవర్తులలో పేరెన్నికగన్నవాడు ఎవరు ? అతని కాలమేది ? **(కాకుత్సవర్మ ( క్రీ.శ. 425. - 450)**
175. కదంబ రాజ్యమును అంతం చేసింది ఎవరు ? **(రెండవ పులకేసి)**

## మాతరులు

176. మాతరులు ఏ ప్రాంతాన్ని  పాలించారు. ? **( కళింగదేశం )**
177. మాతరుల తొలి రాజధాని ? **( పిఠాపురము )**
178. మాతరుల మలి రాజధాని ? **(దేవపురం)**
179. మాతరుల వంశ మూలపురుషుడు ? **( శక్తివర్మ )**
180. మాతరుల వంశ రాజులు **( శక్తివర్మ, రెండవ శక్తి వర్మ, చండవర్మ, ఉమావర్మ, విశాఖవర్మ)**
10. గుప్తానంతర యుగం **( క్రీ.శ. 500 - 700 )**

## 10. గుప్తానంతరయుగం (క్రీ.శ. 500 - 700) హర్షవర్ధనుడు

1. హర్షవర్ధనుడు ఏ వంశానికి చెందినవాడు ? (పుష్యభూతి )
2. గుప్తుల సాంస్కృతిక వారసత్వమును నశింపనీయకుండా కాపాడి, దానికి మెరుగులుదిద్ది తన వారసులకు అందించిన మహాపురుషుడెవరు ? (హర్షవర్ధనుడు)
3. హర్షుని జీవితము, సాధించిన విజయములకు ముఖ్యాధారము లేవి ? (బాణుని హర్ష చరిత్ర, సి.యు.కి. గ్రంథం, హర్షుని  శాసనములు)
4. హర్షుని తండ్రిపేరేమి ? ( ప్రభాకర వర్ధనుడు )
5. హర్షవర్ధని సోదరుడెవరు ? ( రాజవర్ధనుడు )
6. హర్షవర్ధని సోదరి ఎవరు ? ( రాజశ్రీ )
7. ప్రభాకరవర్ధనుని రాజధాని ఏది ? ( స్థానేశ్వరం)
8. హర్షుని తల్లి పేరేమి ? ( యశోమతీ దేవి )
9. పుష్యభూతి వంశంలో ప్రసిద్ధ పాలకుడు ఎవరు ? ( హర్షవర్ధనుడు )
10. హర్షుని పాలనాకాలం ఏది? (క్రీ.శ. 606 - 646)
11. హర్షుని సోదరుడైన రాజ్యవర్ధనుడు సింహాసన మధిష్టించిన దెపుడు ? ( క్రీ.శ. 605)
12. రాజ్యవర్ధనుని మాయోపాయముతో హతమార్చిన దెవరు ? ( శశాంకుడు )
13. హర్షుని సోదరి అయిన రాజశ్రీ భర్త ఎవరు ? ( గృహవర్మ (కనోజ్ పాలకుడు )
14. గృహవర్మను వధించి , రాజశ్రీని చెరబట్టిన మాళ్వ రాజు ఎవరు ? (దేవగుప్తుడు )
15. సింహసనమధిష్టించు నాటికి హర్షుని  వయస్సెంత ? ( 16 సంత్సరాలు)
16. సింహాసనం ఎక్కునాటికి హర్షుని బిరుదమేది ? ( రాజపుత్ర )
17. హర్షుడు స్థానేశ్వర, కన్యాకుబ్జ రాజ్యాలను ఏకంచేసి ఏ బిరుదు సంపాదించెను ? (శశిలాదిత్య )
18. హర్షుని రాజధాని ఏది ? ( కనోజ్ లేక కన్యాకుబ్జము )
19. హర్షుని ఓడించిన దక్షిణాపథ రాజెవరు ? ( రెండవ పులకేశి)

20. హర్షుని రెండవ పులకేశి ఏ నది వద్ద ఓడించెను ? ( నర్మదానది )

21. హర్షుడు వ్రాసిన గ్రంథాలేవి ? ( నాగానందం, రత్నావళి, ప్రియదర్శిక )

22. హర్షుని ఆస్థానకవి ఎవరు ? ( బాణుడు )

23. హర్షుని మతమేది ? ( శైవ మతము )

24. హర్షుని కాలంలో భారతదేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు ఎవరు? ( హ్యూయన్‌త్సాంగ్ )

25. హూయన్‌త్సాంగ్ రచించిన గ్రంథమేది ? ( సి - యూ - కీ )

26. హూయన్‌త్సాంగ్ బిరుదులేవి ? ( శాక్యముని, యాత్రికులలో రాజు )

27. 'కాదంబరి' రచించినదెవరు ? ( బాణుడు )

28 'సుభాషిత శతక' కారకుడెవరు ? ( భర్తృహరి )

29. ' సూర్య శతకము' గ్రంథకర్త ఎవరు ? ( మయూరుడు )

30. హర్షుడు ఎవరి వలన మహాయాన బౌద్ధ మతమునకు ఆకర్షించబడెను ? ( రాజశ్రీ , హ్యూయాన్‌త్సాంగ్ )

31. హర్షుని కాలంలో ప్రసిద్ధి చెందిన విశ్వవిద్యాలయాలు ఏవి ? ( నలందా, వల్లభి )

32. హర్షుడు పోషించిన విశ్వవిద్యాలయం ఏది ? ( నలందా )

33. నలందా విశ్వవిద్యాలయమున ఉపాధ్యాయులెంతమంది ? విద్యార్థులెంతమంది ?
( ఉపాధ్యాయులు 1,500, విద్యార్థులు - 10,000

34. నలందా విశ్వవిద్యాలయ మందున్న ప్రఖ్యాతి నార్జించిన ఆచార్యులెవరు? ( ధర్మపాల, ఆర్యదేవి, శాలభద్ర )

35. ఐదు సంవత్సరాలకు ఒకసారి హర్షుడు చేసిన దానము పేరేమి ? ( మహామోక్షపరిషత్ లేక సర్వస్వదానవ్రతము)

36. పరిపాలనా సౌలభ్యం కొరకు రాజ్యము ఎలా విభజించబడింది . (భుక్తులు, విషయములు, గ్రామములు )

38. హర్షుని పాలనా కాలంలో పన్ను ఎంత వసూలు చేసేవారు ? ( పంటలో 1/6 వంతు)

39. హర్షుని కాలమున భారతదేశమును విదేశములలో ఏమని పిలిచేవారు ? ( బ్రాహ్మణ దేశము )

40. హర్షుని కాలమున ప్రజల ముఖ్య వృత్తి ? ( వ్యవసాయము)

## వేంగి (లేక ) తూర్పు చాళుక్యులు

41. నాలుగున్నర శతాబ్దాల కాలం ఆంధ్రదేశంలో పరిపాలన సాగించిన చాళుక్యుల శాఖ ? ( తూర్పు చాళుక్యులు (ఆంధ్ర చాళుక్యులు)

42. తూర్పు చాళుక్యుల చరిత్రకు ఆధారభూతాలైన శాసనాలు ?
(ఐహోలు శాసనం, కట్టపర్రు శాసనం, మాట్టూరు శాసనం మొ॥నవి )

43. చాళుక్యుల రాజ లాంఛనం ( వరాహము )

44. బాదామి చాళుక్యరాజులు " పశ్చిమ చాళుక్య సామ్రాజ్యానికి పునాదులు వేసిన రాజన్యులు ? ( 1. జయసింహుడు 2.రణరాగుడు 3. మొదటి పులకేసి 4. కీర్తివర్మ 5. మంగళేశులు)

45. పైవారు వేసిన పునాదులపై పశ్చిమ చాళుక్య సామ్రాజ్య సౌధాన్ని నిర్మించినది? (కీర్తి వర్మపుత్రుడు (రెండవ పులకేశి)

46. తూర్పు చాళుక్య వంశమూల పురుషుడెవరు ? ( కుబ్జ విష్ణువర్ధనుడు)

47. బాదామి చాళక్యుల వంశ కర్త ? ( జయసింహవల్లభుడు)

48. కుబ్జ విష్ణువర్ధనుని బిరుదు ? ('విషమ సిద్ది')

49. దక్షిణాదిన రెండవ పులకేసి తన తమ్ముని తన ప్రతినిధిగా నియమించి అతనికి స్వతంత్ర ప్రతిపత్తి అంగీకరించాడు ? ఆవ్యక్తి ఎవరు ? ( కుబ్జవిష్ణు వర్ధనుడు )

50. రెండవ పులకేశికి వేంగిని, పిఠాపురములను జయించుటలో ఖడ్గ సహాయుడై తోడ్పడినది ? ( కుబ్జ విష్ణువర్ధనుడు)

51. కుబ్జవిష్ణువర్ధనుని కాలంలో ఆంధ్ర దేశాన్ని పర్యటించి, ఇచ్చటి స్థితిగతుల గూర్చి వ్రాసిన చైనా యాత్రికుడు ? ( యువాన్ చ్వాంగ్)

52. 'సర్వసిద్ధి' యను బిరుదు గల కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడు ? ( జయసింహ వల్లభుడు )

53. కుబ్జ విష్ణువర్ధనుడు ఎవరి కుమారుడిగా భావిస్తున్నారు ?

( త్రిలోచన పల్లవునితో పోరాడి మరణించిన విజయాదిత్య చాళుక్యుని కుమారుడు )

54. నాగార్జునకొండ శాసనం, నందంపూడి శాసనంలోని గాధను బట్టి చాళుక్యుల జన్మస్థలం ఏదని తెలియుచున్నది ? ( హిరణ్యా రాష్ట్రం )

55. జయసింహ వల్లభుని మనవడు ఎవరు ? ( మొదటి పులకేశి )

56. మొదటి పులకేశి కుమారులు ఎవరు ? ( కీర్తివర్మ, మంగళేశుడు )

57. కీర్తివర్మ కుమారుడు ? ( రెండవ పులకేశి)

58. బాదామి చాళుక్యులలో గొప్పవాడెవరు ? ( రెండవ పులకేశి )

59. రెండవ పులకేశి విజయాలను తెలియజేసే శాసనం ఏది ? ( ఐహోలు శాసనం)

60. రెండవ పులకేశి బిరుదులేవి ? ( పరమ మహేశ్వర, సత్యాశ్రీ, పృధ్వీవల్లభ )

61. మొదటి జయసింహ వల్లభుని బిరుదులేవి ? ( సకల లోకాశ్రయ, సర్వసిద్ధి)

62. ప్రాచీన తొలి తెలుగు శాసనం ఏది ? ( మొదటి జయసింహవల్లభుని విప్పర్ల శాసనం)

63. జయసింహ వల్లభుని అనంతరం రాజ్యాధికారం చేపట్టినది ? ( ఇంద్రభట్టారకుడు )

64. ఇంద్రభట్టారకుని అనంతరం రాజ్యభారాన్ని వహించినది ? ( రెండో విష్ణువర్ధనుడు )

65. రెండో విష్ణువర్ధనుని కుమారుడు ? ( మంగి యువరాజు )

66. మంగి యువరాజు అనంతరం రాజ్యానికి వచ్చినదెవరు ? ( రెండో జయసింహుడు )

67. 'త్రిభువనాంకుశ' అనే బిరుదు ఎవరిది ? ( మూడో విష్ణు వర్ధనుడు )

68. మూడో విష్ణువర్ధనుని తరువాత సింహాసనం అధిరోహించిన వ్యక్తి ? ( మొదటి విజయాదిత్య)

69. మొదటి విజయాదిత్యుని బిరుదులేవి ? (సమస్త భువనాశ్రయ, త్రిభువనాంకుశ) మహారాజాధి రాజ పరమేశ్వర భట్టారక)

70. మొదటి విజయాదిత్యుని అనంతరం రాజ్యనికి వచ్చిన దెవరు ? ( నాలుగో విష్ణువర్ధనుడు )

71. నాలుగో విష్ణువర్ధనుడు ఎవరికి సామంతుడుగా వ్యవహరించాడు ? ( రాష్ట్రకూటులకు )

72. రాష్ట్రకూట దంతిదుర్గుడు తరువాత రాజ్యాధికారానికొచ్చిన దెవరు ? ( మొదటి కృష్ణుడు )

73. సింహాసనానికై కలహించుకున్న మొదటి కృష్ణుని కుమారులలో ఎవరికి నాలుగో విష్ణువర్ధనుడు సాయపడ్డాడు ? ( గోవిందుడుకి)

74. రాష్ట్రకూట కృష్ణుడు అనంతరం రాజ్యానికి వచ్చినదెవరు ? ( ధ్రువుడు )

75. రాజ్యం కోసం కలహించుకున్న నాలుగో విష్ణువర్ధనుని కుమారులు ? ( రెండోవిజయాదిత్యుడు భీమసలుకి)

76. రెండో విజయాదిత్యుని బిరుదులేవి ? ( నరేంద్ర మృగరాజ, చాళుక్యరాయ, విక్రమధావళి)

77. నరేంద్రేశ్వరాలయం కట్టించిన దెవరు ? ( రెండో విజయాదిత్యుడు )

78. భీమశలునితో యుద్ధకాలంలో రెండో విజయాదిత్యుని రాజధాని ఏది ? ( బెజవాడ)

79. విజయవాడకు ఆపేరు ఏ రాజు వలన వచ్చిందని కొందరు అభిప్రాయ పడుతున్నారు ? ( విజయాదిత్యుడు )

80. రెండో విజయాదిత్యుని ఘన విజయాలను తెలిపే శాసనం ? ( గుణగ విజయాదిత్యుని సాకటూరి శాసనం )

81. రెండో విజయాదిత్యుని తరువాత రాజ్యానికి వచ్చిన దెవరు ? ( ఐదోవిష్ణు వర్ధనుడు )

82. ఐదో విష్ణువర్ధనుని తువాత రాజ్యానికి వచ్చినది ? ( గణక విజయాదిత్య లేదా మూడో విజయాదిత్యుడు )

83. గణక విజయాదిత్యుని ఓడించిన రాష్ట్రకూట రాజెవరు ? ( అమోఘవర్షుడు )

84. గణక విజయాదిత్యుని చేతిలో ఓడిపోయిన రాష్ట్రకూట రాజు ? ( రెండవ కృష్ణుడు )

85. గణక విజయాదిత్యుని సైన్యాధిపతులలో ముఖ్యులు? ( కడేమరాజు, పాండురంగ వినమడి శర్మ రాజాదిత్య ముఖ్యులు

86. రాష్ట్రకూటులను సామంతులుగా చేసికొనిన తూర్పు చాళుక్య రాజు ? ( గణక విజయాదిత్యుడు )

87. గణక విజయాదిత్యుని తరువాత రాజ్యానికి వచ్చింది ? ( చాళుక్య భీముడు లేదా ఆరో విష్ణువర్ధనుడు )

88. చాళుక్య భీముని ఆస్థాన కవి ? ( కవివృషభ భట్టవామనుడు )
89. కావ్యాలంకార సూత్రాలు అనే అలంకార గ్రంథాన్ని రచించిన దేవరు? ( భటవామనుడు )
90. చాళుక్యభీముని ఆస్థానంలో గాంధర్వ, విద్యాప్రవీణులు, తుంబురుడను ఖ్యాతిపొందిన దెవరు ?
( చల్లవ్వ, చల్లవ్వ తండ్రి మల్లవ్వ)
91. చాళుక్య భీముని కాలంలో గణిత శాస్త్ర పాండిత్యాన్ని సూచించేది ? ( గణక సంజ్ఞ )
92. చాళుక్య భీముని కాలంలో నిర్మించిన దేవాలయాలు ఏవి ?
( చాళుక్య భీమవరంలోని చాళుక్య భీమేశర్వఆలయం, ద్రాక్షారామ భీమేశ్వరాలయం )
93. చాళుక్య భీముని తరువాత రాజ్యానికి వచ్చిన దెవరు ? ( నాలుగో విజయాదిత్యుడు )
94. రాజరాజే తనపేరు మీద కొత్త నగరం కట్టించినాడని తెలయజేసే గ్రంథం ఏది ? ( కావ్యాలవారి చూడామణి )
95. రెండో చాళుక్య భీముని కుముదులు ? ( దానార్ణవుడు, అమ్మరాజు )
96. అమ్మరాజును వధించిన దెవరు ? ( దానార్ణవుడు )
97. రెండో చాళుక్యు భీముని అనంతరం రాజ్యానికి వచ్చినది ? ( రెండో అమ్మరాజు లేదా ఆరో విజయాదిత్య)
98. దానార్ధవునికి సాయం చేసిన రాష్ట్రకూట రాజు ( మూడో కృష్ణుడు )
99. దానార్ధవని వధించిన దెవరు ? ( జటాచోడ, భీముడు )
100. జటాచోడ భీముడు ఎవరు ? ( కర్నూలు మండలంలో పెద్దకల్లుని ఏలే తెలుగు చోడుడు)
101. జటాచోడ భీముని చేతిలో మరణించిన గాంగవంశం రాజు ? ( మధుకామార్ణవుడు )
102. జటాచోడ భీముణ్ణి ఓడించిన దెవరు? (శక్తివర్మ)
103. చాళుక్య చంద్రుడు అనే బిరుదు ఎవరిది ? ( శక్తివర్మ)
104. శక్తివర్మ ఎవరి కుమారుడు ? ( దానార్ధవుడు )
105. మొదటి శక్తివర్మ తరువాత సింహాసనాన్ని అధిరోహించినది ఎవరు ? ( విమాలాదిత్యుడు )
106. విమలాదిత్యుని గురువు ? ( జైన సన్యాసి త్రికాలయోగి సిద్ధాంత దేవుడు )
107. విమలాదిత్యుని తరువాత సింహాసన మాక్రమించినది ? ( కుందవై కుమారుడు రాజరాజు )
108. రాజ రాజు మేనమామ ఎవరు ? ( రాజేంద్ర చోళుడు )
109. రాజరాజ నరేంద్రుని భార్య అమంగాదేవి ఎవరి కుమార్తె ? (రాజేంద్ర చోళుడు )
110. రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి ఎవరు ? ( నన్నయ భట్టు )
111. మహాభారతాన్ని రచించడంలో నన్నయకు సాయం చేసినది ఎవరు ? ( నారాయణ భట్టు )
112. రాజరాజ నరేంద్రుని కుమారుడు ? (రాజేంద్రుడు)
113. ఎవరి మరణంతో తూర్పు చాళుక్యుల పాలన అంతమయినట్లయింది ? ( విజయాదిత్యుడు )
114. తూర్పు చాళుక్యుల కాలంలో ప్రభుత్వంలోని సప్తాంగాలు ఏవి ?
( రాజు, మంత్రి, రాజ్యము, దుర్గము, కసము, సైన్యం, మిత్రం )
115. పరిపాలన ఎవరి ఆధీనంలో ఉండేది ? ( తీర్దులు )
116. తూర్పు చాళుక్య కాలంలో తీర్దులు అనగా ? ( ఉద్యోగులు )
117. తూర్పు చాళుక్యుల ప్రాంతీయ పరిపాలన విభాగాల పేరేమి ? (విషయము, నాటు, కోట్టము, గ్రామము)
118. తూర్పు చాళుక్యుల కాలంలో వర్తక శ్రేణికి ఏమని పేరు? ( నకరమని )
119. హిందూమతం అభివృద్ధి చెంది బౌద్ధమతం పూర్తిగా ఎవరి కాలంలో క్షీణించింది ?; ( తూర్పు చాళుక్యుల)
120. 'కవిగాయక' కల్పతరు ఎవరి బిరుదు ? ( అమ్మరాజు )
121. 'కవి పండిత కామధేనువు' అని ఎవర్ని పిలచేవారు ? ( మూడే విష్ణువర్ధనుని )
122. తూర్పు చాళుక్య కాలంలో ప్రసిద్ధ జైన గురువులు ? ( అర్వనందన్ , దిన నందన్ )
123. ఏ తూర్పు చాళక్యరాజు కాలపు శాసనాలలో తొలిసారిగా పద్యాలు కనిపించాయి ? ( గుణగ విజాయదిత్యుని )

124. గణిత శాస్త్రంలో పద్యాలు రచించిన పావులూరి మల్లన ఎవరి సమకాలీనుడు ? ( నన్నయ్య)
125. గుప్తవర్మ తర్కంపై 70 వ్యాఖ్యానాలు వల్లివేసెనని తెలిపే శాసనం ? ( పెదమద్దాలి శాసనం )

## పల్లవులు

126. శాతవాహనుల తర్వాత దక్షిణాపథంలో గొప్ప సామ్రాజ్యం నిర్మించిన వారు ( పల్లవులు)
127. పల్లవ చరిత్రకు ఆధారములైన శాసనములు ? ( మంచికల్లు శాసనం, మైదవోలు శాసనం, హిరగడపల్లి శాసనం మొ॥నవి)
128. పల్లవుల వంశంలో వున్న శాఖలు
1. ప్రాకృత పల్లవులు ( లేక ) ప్రాచీన పల్లవులు 2. సంస్కృత పల్లవులు 3. బృహత్ పల్లవులు. 4.చివరి పల్లవులు
129. ప్రాచీన పల్లవుల మూల పురుషుడు ( వీర కూర్చవర్మ )
130. సంస్కృత శాసనములందుపేర్కొనిన పల్లవులలో మొదటి పాలకుడు ? ( విష్ణుగోపుడు )
131. మహాపల్లవ వంశమునకు మూల పురుషుడు ? ( సింహ విష్ణువు )
132. దక్షిణాపథంలో వైదిక మతంలో వైష్ణవమును పోషించిన వారు ? ( పల్లవులు )
133. సప్త పవిత్ర నగరాలలో, పల్లవ కాలం నాటి రాజధాని ? ( కాంచీపురం)
134. బౌద్ధ వాజ్మయములో, పల్లవులు నివసించిన మండలానికి ఏమని పేరు? ( వల్ల బోగ్గము )
135. పల్లవుల రాజచిహ్నము ? ( వృషభము )
136. పల్లవ చక్రవర్తులలో సుప్రసిద్ధుడు ? ( మొదటి నరసింహ వర్మ)
137. నవీన పల్లవుల అధికారం నాశనం చేసినది ? ( చోళులు )
138. వీర కూర్చవర్మ బిరుదమేమి ? ( సింహవర్మ)
139. 'మత్త విలాస ప్రహసన ' కర్త ? ( మొదటి మహేంద్ర వర్మ)
140. ' కిరాతార్జునీయం' కర్త భారవి ఎవరి ఆస్థాన కవి ? ( మొదటి నరసింహవర్మ)
141. రెండవ మహేంద్ర వర్మ ఆస్థాన కవి ? (దండి)
142. పల్లవుల రాజధాని ? కంచి ( కాంచీపురం)
143. మొదటి మహేంద్రవర్మ దక్షిణాత్య చిత్ర లేఖనంపై రచించిన గ్రంథం ? ( దక్షిణ చిత్ర )
144. మహాబలిపుర ఏక శిలా రధాల నిర్మాణకర్త ? ( మొదటి నరసింహవర్మ)
145. కంచిలోని కైలాసనాధ ఆలయనిర్మాణకర్త ? ( రెండవ నరసింహవర్మ)
146. పల్లవులు అనుసరించిన శిల్ప సాంప్రదాయము ? ( అమరావతీ శిల్పం)
147. ఎవరి కాలంలో చైనా నుండి హుయాన్ సాంగ్ యాత్రికుడు వచ్చాడు ? ( మొదటి నర సింహవర్మ)
148. పల్లవులు అష్టాదశ పరిహారమన్న శాసనం ద్వారా వారు ఎన్ని రకాల పన్నులు వసూలు చేసినట్లు తెలుస్తుంది? (180 రకాలు
149. భారతీయ తర్క శాస్త్ర పితామహుడు ? ( దిజ్ఞాగుడు )
150. బ్రాహ్మణ మతోద్ధరణకై కృషి సల్పిన పల్లవ రాజు ? ( నర సింహవర్మ)
151. దక్షిణాపథంలో తొలిసారిగా గ్రానైట్ రాళ్ళతో నిర్మించిన దేవాలయము? ( తీర దేవాలయము )
152. ఆగ్నేయాసియాలో శిల్పానికి మాతృక ? ( పల్లవ శిల్పకళ)
153. ప్రపంచ దృష్టి నాకర్షించిన " గంగావతరణ " శిల్ప దృశ్యం ఎచ్చటిది ? ( మహాబలిపురం)
154. నలందా విశ్వవిద్యాలయ ఆచార్యునిగా పేర్గాంచిన కంచి నివాసి ? ( ధర్మపాలుడు )
155. వేద శాస్త్రములను, సంస్కృతమును పోషించిన ఆంధ్ర రాజులు ? ( పల్లవులు )
156. పల్లవుల ఇతర ముఖ్య నగరములు ? (1. పలక్కడ 2. దశనపుర 3. తాంబ్రాప)
157. అవనిసింహుడని బిరుదున్న పల్లవ రాజు ? ( సింహవిష్ణువు )
158. పల్లవ రాజ్య పునరుద్ధారకుడు ? ( సింహ విష్ణువు)
159. పల్లవుల కాలంనాటి చిత్ర కళాఖండాలు ఏవి ? (పుదుద్కోట సమీపంలోని చిత్తన వాసల్ గుహకుడ్య చిత్రాలు )

160. నేటి పలనాడును ఏమని పిలిచేవారు ? ( పల్లవబోగ్గి )
161. ఏ పల్లవ రాజు కాలంలో సముద్ర గుప్తుడు దక్షిణ దిగ్విజయయాత్ర చేసినాడు ? ( విష్ణు గోపుడు)
162. పల్లవుల ధ్వజం ఏది ? ( ఖట్వాంగ ధ్వజము )
163. ఆంధ్ర పదము అనే పదప్రయోగం ఏ రాజుల శాసనంలో మొట్టమొదటిసారిగా కనిపిస్తుంది ?
( బళ్ళారి జిల్లాలో చెక్కబడిన పల్లవ రాజుల శాసనంలో )
164. వాతాపి చాళుక్యరాజగు పులకేశిని జయించి, వాతాపి నగరంలో 'జయస్తంభం' నాటిన పల్లవ రాజు ? (మొదటి నరసింహవర్మ)
165. మొదటి మహేంద్ర వర్మ నిర్మించిన గుహాలయములు ? (మహాబలిపురం, మామంటూరు , దళవానూరు, తిరుచ్చిరాపల్లి,)
166. మహేంద్ర వర్మ కాలం నాటి 'సిత్తన్న వాసరా ' చిత్రములలో ఏ ప్రాచీన చిత్రకళా పోలికలగుపడుచున్నవి?
(అజంతా, అమరావతీ చిత్రకళల పోలికలు )
167. మహేంద్రవర్మకున్న బిరుదు ? ( సంకీర్ణ జాతి)
168. నందికంపేశ్వరాలయ నిర్మాణ కర్త ? ( పల్లవ రాజు కంపవర్మ)
169. పల్లవ మల్లుడన్న బిరుదు గల చివరి పల్లవ రాజు ? ( ఇమ్మడినందివర్మ)
170. పల్లవరాజు అపరాజితుని చంపి తంజావూరు చోళ వంశజుడైన ఆదిత్యుడు ఏ రాజ్యాన్ని వశం చేసుకున్నాడు ? ( పల్లవ రాజ్యాన్ని)

## 11. రాజపుత్రయుగం ( క్రీ.శ. 700 - 1200 )

### రాజపుత్ర రాజ్యాలు

1. రాజపుత్ర యుగ కాలము ఏది ? ( క్రీ.శ. 647 - 1206)
2. హర్షుని మరణానంతరం నుండి మహమ్మదీయ సామ్రాజ్య స్థాపన వరకు ఉత్తరాపథ చరిత్రలో అపూర్వమైన అద్వితీయమైన పాత్ర వహించిన వారెవరు ? ( రాజపుత్రులు)
3. రాజపుత్రులలో మొదట విజృంభించిన వారు ఎవరు ? ( ఘూర్జర ప్రతీహారులు )
4. ఘూర్జర ప్రతీహార వంశ స్థాపకుడు ఎవరు ? ( మొదటి నాగభటుడు )
5. ఘూర్జర ప్రతీహారుల తొలి రాజధాని ఏది ? ( బీన్‌మల్ )
6. ప్రతీహారుల మలి రాజధాని ఏది ? ( కనూజ్ )
7. ప్రతీహార పాలకులలో గొప్పవాడు ఎవరు ? ( మిహిర భోజుడు )
8. మిహిర భోజుని కాలమున కనూజ్ రాజ్యమును సందర్శించిన అరబ్బు దేశస్థుడు ఎవరు ? ( సులేమాన్ )
9. ప్రతీహారుల పాలనా కాలమేది ? ( క్రీ. శ. 783 - 1019 )
10. మిహిర భోజుని కుమారుడెవరు ? ( మహేంద్రపాలుడు )
11. ప్రతీహారులు ఏ మతాభిమానులు ? ( హిందూమతం)
12. అరబ్‌దండయాత్రల నుండి ఆర్యావర్తనమును కాపాడిన వారెవరు ? ( ప్రతీహారులు)
13. ప్రతీహారుల అనంతరం కనూజ్‌ను ఆక్రమించి పాలించిన వారు ఎవరు? (గహద్వాలులు)
14. గహద్వాల వంశ మూలపురుషుడు ఎవరు ? ( చంద్రదేవుడు )
15. గహద్వాలలో సుప్రసిద్ధుడు ఎవరు? ( జయచంద్రుడు )
16. గహద్వాలులకు గల మరొక పేరు ఏది ? ( రాథోరులు)
17. జయచంద్రుని కుమార్తె ఎవరు ? ( రాణి సంయుక్త )
18. గహద్వాలు పాలనాకాలమేది ? (క్రీ.శ. 1085 - 1202 )
19. జయచంద్రుని మహమ్మదీయ ఘోరీ ఏ యుద్ధంలో ఓడించాడు ? ( క్రీ.శ. 1193 లోజరిగిన చందార్ యుద్ధంలో)
20. ప్రతీహార వంశ శిథిలములపై వెలసిన రాజ్యమేది ? ( పరమారుల రాజ్యము )

21. పరమారులు ఎవరు? ( మాళ్వాప్రాంతాన్ని పాలించిన రాష్ట్రకూట వంశ శాఖ అయిన రాజపుత్రులు )
22. పరమార రాజ్య స్థాపకుడు ఎవరు ? ( ఉపేంద్రుడు )
23. పరమారుల పాలనా కాలమేది? ( క్రీ.శ. 950 - 1055 )
24. పరమారుల రాజధాని ఏది ? ( ధారా నగరం)
25. పరమారులలో ప్రసిద్దుడు ఎవరు ? ( వాక్పతి రాజు ( ముంజురాజు )
26. పరమారులలో గొప్ప సాహిత్యవేత్త ఎవరు ? ( పరమారభోజుడు )
27. ముంజురాజు ఆస్థానమందలి కవులెవరు ? ( హలాయుధ, ధనంజయ)
28. ముంజురాజు తరువాత పరమారులలో గొప్పవాడెవరు ? ( భోజుడు )
29. కవిత్వము, వాస్తు శాస్త్రము, వేదాంతము, ఆయుర్వేదము, మతము. మొ॥ వానిపై సుమారు 20 గ్రంథములు రచించిన పరమార రాజెవరు ? (భోజుడు )
30. రాజపుత్ర వంశాలలో బలీయమైన వారు ఎవరు. ? ( చందేలులు)
31. చందేలులు ఏ ప్రాంతాన్ని పాలించారు ? ( మధ్యప్రదేశ్‌లోని బుందేల్ ఖండ్ )
32. చందేలుల రాజధాని ఏది ? ( ఖజురాహో )
33. చందేలుల మూలపురుషుడెవరు ? ( జయశక్తి)
34. స్వతంత్ర చందేల రాజ్యస్థాపకుడెవరు ? (యశోవర్మ )
35. చందేలుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 950 - 1202 (252. సం॥లు)
36. చందేలులలో సుప్రసిద్దులు ఎవరు ? ( విద్యాధరుడు )
37. సుప్రసిద్ధ ఖజురహో దేవాలయ నిర్మాతలు ఎవరు ? (చందేలులు)
38. చందేలులను ఓడించి బుందేల్‌ఖండ్‌ను ఆక్రమించింది ఎవరు ? ఎప్పుడు? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ క్రీ.శ. 1309 లో )
39. చందేలుల దుర్భేద్యములైన, రక్షణ కవచముల వంటి కోటలేవి ? ( గ్వాలియర్ , కలింజర్ )
40. ప్రతీహార రాజ్య శిధిలాలపై గుజరాతు నందు వెలసిన స్వతంత్ర రాజ్యము ఏది ? ( సోలంకి రాజ్యము )
41. సోలంకీల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 945 - 1143 )
42. సోలంకీల రాజ్యమేది ? ( అనిహిల్ వాడ్ గుజరాత్ )
43. సోలంకి రాజ్యస్థాపకుడు ఎవరు ? ( మూలరాజు )
44. ఏ సోలంకి రాజు కాలమున గజనీ మహమ్మదు సోమనాధ్ దేవాలయం ధ్వంసం చేసెను ? ( భీముడు )
45. బిల్హకుడు ఎవరి ఆస్థాన కవి ? (భీముని కుమారుడైన కర్ణుని )
46. బిల్హకుడు రచించిన గ్రంథమేది ? (విక్రమాంకదేవ చరిత్రం)
47. సోలంకి వంశస్థులలో సుప్రసిద్దుడు ఎవరు ? ( కర్ణుని కుమారుడైన జయసింహుడు)
48. సుప్రసిద్ధ జైన పండితుడు హేమచంద్రుడు ఎవరి అనుచరుడు ? ( జయచంద్రుని )
49. సోలంకి రాజ్యాన్ని ఎవరు ఆక్రమించారు ? ( వారి సామంతులైన వాఘేల వంశీయులు )
50. చేది రాజ్య స్థాపకులు ఎవరు ? ( కాల చుర్యులు )
51. చేది రాజ్య స్థాపకుడు ఎవరు ? ( కోకోల్లుడు )
52. కాలచుర్యులలో సుప్రసిద్ధ చక్రవర్తులెవ్వరు ? ( గాంగయదేవుడు, కర్ణదేవుడు)
53. కాలచుర్యులు పాలించిన ప్రాంతమేది ? ( ఒరిస్సా ప్రాంతం )
54. కాలచుర్యుల రాజధాని ఏది ? ( త్రిపుర )
55. కాలచుర్యుల పాలనా కాలమేది? ( క్రీ.శ. 945 - 1212)
56. ఆర్యావర్తమంతయు అధికారము చలాయించిన శతాధిక యుద్ధ వీరుడు ఎవరు ? ( కర్ణ దేవుడు )
57. ఉత్తరాపథ సార్వభౌమత్వమునకై, ప్రతీహారులతోనూ, రాష్ట్ర కూటులతోనూ పోరాడి, బెంగాలు నందు విజృంభించిన వారెవరు? (పాలవంశీయులు )

58. పాలవంశ స్థాపకుడు ఎవరు ? ( గోపాలుడు )
59. పాలవంశీయులలో సుప్రసిద్ధుడెవరు ? ( ధర్మపాలుడు )
60. పాలవంశీయుల పాలనా కాలమేది ? ( క్రీ. శ. 750 - 1138 )
61. ప్రతీహారులనోడించిన పాల వంశీయుడు ఎవరు ? ( ధర్మపాలుడు )
62. నలందా విశ్వవిద్యాలయమువలె పాల రాజులు ఏఏ విశ్వవిద్యాలయములను స్థాపించినారు ? ( విక్రమశిల, ఉద్దంతపురి, జగద్దల )
63. పాల వంశీయులను అంతమొందించి బెంగాలునందు అధికారము చేజిక్కించుకొన్న వారెవరు? (సేన వంశీయులు)
64. సేన వంశ స్థాపకుడు ఎవరు ? ( విజయ సేనుడు )
65. సేన వంశీయుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1138 - 1199 )
66. సేన వంశీయుల రాజధాని ఏది ? ( నాడియా )
67. సేన వంశీయులు ఏమతాభిమానులు ? ( హిందూ )
68. సేన వంశీయులలో సుప్రసిద్ధు డెవరు ? ( లక్ష్మణ సేనుడు )
69. సేన వంశీయులలో చివరివాడు ఎవరు? (లక్ష్మణ సేనుడు)
70. లక్ష్మణసేనుని ఆస్థాన కవుల పేరేమి ? ( పంచ రత్నములు )
71. ' గీతా గోవిందము ' ను రచించిన జయదేవుడు ఎవరి ఆస్థాన కవి. (లక్ష్మణసేనుడు)
72. సేన వంశమును అంతమొందించిన మహమ్మదు ఘోరీ సేనాని ఎవరు ? ( భక్తియార్‌ఖిల్జీ)
73. ప్రతీహారుల అనంతరం అజ్మీరు ప్రాంతంలో స్వతంత్ర రాజ్యమును స్థాపించింది ఎవరు ? (చౌహానులు )
74. చౌహానుల మూలపురుషుడు ఎవరు? ( సింహరాజు )
75. చౌహానులలోనే కాక భారతీయులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( పృథ్వీరాజు )
76. పృథ్వీరాజు ఆస్థాన కవి చాంద్‌బరదాయ్ రచించిన గ్రంథమేది ? ( పృథ్వీరాజ్ రాసో )
77. చౌహానుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 956 - 1192)
78. చౌహానుల రాజధాని ఏది ? ( కనూజ్ )
79. పృథ్వీరాజ్ మహమ్మద్ ఘోరీని ఏ యుద్ధంలో ఓడించాడు ? ఎప్పుడు జరిగింది ? (మొదటి స్థానేశ్వర్ యుద్ధం (క్రీ.శ. 1191)
80. మహమ్మద్ ఘోరీ పృథ్వీరాజ్‌ను ఓడించిన యుద్ధం ఏది ? ఎప్పుడు జరిగింది?( రెండవ స్థానేశ్వర్ యుద్ధం ( క్రీ.శ.1192 )
81. రాజపుత్ర యుగంలో కాశ్మీరును పాలించిన రాజవంశాలేవి ? ( కార్కోట, ఉత్పల, లోహర వంశీయులు )
82. కార్కోట వంశ మూల పురుషుడు ఎవరు ? ( దుర్లభివర్ధనుడు )
83. కార్కోట వంశీయులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( లలితాదిత్యముక్తాపీటుడు )
84. సుప్రసిద్ధ మార్తాండ దేవాలయ నిర్మాత ఎవరు ? ( లలితాదిత్యముక్తాపీటుడు )
85. కార్కోట వంశీయులను నిర్మూలించిన దెవరు ? ( ఉత్పల వంశీయులు)
86. ఉత్పల వంశీయుల మూలపురుషుడు ఎవరు ? ( అవంతీ వర్మ)
87. మిహిరభోజుని, లల్లియసాహిని ఓడించిన ఉత్పల వంశీయుడు ఎవరు ? ( అవంతీవర్మ కుమారుడైన శంకర వర్మ)
88. ప్రజల తిరుగుబాటుతో పదవీచ్యుతుడైన ఉత్పలవంశ రాజు ఎవరు ? ( శంకరవర్మ )
89. ఉత్పల వంశీయుల తరువాత కాశ్మీరును ఏ రాజులు పాలించిరి ? ( లోహర వంశీయులు )
90. రాజపుత్ర యుగంలో పంజాబు, గాంధార ప్రాంతాలను పాలించింది ఎవరు? ( షాహీవంశీయులు )
91. షాహీ వంశీయులెన్ని శాఖలవారు ? ( రెండు . 1. తురుష్క షాహి 2. హిందూ షాహి )
92. హిందూషాహి వంశీయుల రాజధాని ఏది ? ( ఉదభాండాపురము)
93. తురుష్క షాహి వంశీయుల రాజధాని ఏది ? ( కాబాల్)
94. హిందూ షాహి వంశీయులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( జయపాలుడు )
95. రాజపుత్రులు ఎంతకాలం పాలించారు ? ( ఐదున్నర శతాబ్దాలు)

96. రాజపుత్ర యుగంలోని హిందూ త్రిమతాచార్యులు ఎవరు ? (శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు)
97. కుమార భట్టు వ్యాపింపజేసిన హిందూమత సిద్ధాంతమేది ? ( పూర్వమీమాంస)
98. శంకరాచార్యులు వ్యాపింపజేసిన హిందూ దర్శనమేది ? (ఉత్తర మీమాంస)
99. ద్వైతమత స్థాపకుడు ఎవరు ? ( మధ్వాచార్యుడు )
100. అద్వైత మత స్థాపకుడు ఎవరు ? ( శంకరాచార్యుడు )
101 . విశిష్టాద్వైత మతస్థాపకుడు ఎవరు ? ( రామానుజాచార్యుడు )
102. శత్రువుల బారినుండి తప్పించుకొనేందుకు రాజపుత్ర స్త్రీలు సామూహికంగా అగ్నిగుండంలో దూకి చేసుకోనే ఆత్మాహుతిని ఏమందురు ? ( జోహర్ )
103. క్షేమేంద్రుడు రచించిన గ్రంథమేది? (బృహత్కథాకోశము )
104 'గీతగోవిందము'ను రచించింది ఎవరు ? ( జయదేవుడు )
105. భవభూతి ఏమి రచించినాడు ? ( ఉత్తర రామ చరిత్రం, మాలతీమాధవం, మహావీర చరిత్ర)
106. భవభూతి ఎవరి ఆస్థాన కవి ? (కనోజ్ రాజైన యశోవర్మడు )
107. రాజశేఖరుడు ఎవరి ఆస్థానకవి ? ( ప్రతీహార మహీపాలుడు )
108. రాజశేఖరుడు రచించిన గ్రంథాలేవి ? ( కర్పూర మంజరి, బాలరామాయణం )
109. సిద్ధాంత శిరోమణి రచించినది ఎవరు ? ( భాస్కరాచార్యులు )
110. 'చికిత్సా సార సంగ్రహం' గ్రంథాన్ని రచించింది ఎవరు ? ( చక్రపాణిదత్తుడు)

## రాష్ట్రకూటులు

111. కర్ణాటక ప్రాంతాన్ని పాలించిన కన్నడిగులు ఎవరు ? ( రాష్ట్ర కూటులు )
112. రాష్ట్రకూటు రాజ్యస్థాపకుడు ఎవరు ? ( దంతిదుర్గుడు )
113. దంతిదుర్గుని రాజధాని ఏది ? ( ఎల్లోరా )
114. ఎల్లోరా, కైలాసనాథ గుహాలయమును నిర్మించింది ఎవరు ? ( మొదటి కృష్ణుడు )
115. రాష్ట్రకూటుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 753 - 973 )
116. రాష్ట్రకూట రాజులలో గొప్ప కవి ఎవరు ? (అమోఘవర్షుడు)
117. అమోఘవర్షుడు రచించిన గ్రంథాలు ఏవి? ( ' కవి రాజమార్గం', 'ప్రశ్నోత్తర మాల')
118. మొదటి కృష్ణుని తరువాత రాష్ట్రకూట సింహాసనాన్ని అధిష్టించిన ప్రసిద్ధ రాజులెవరు ? ( ధృవుడు, మూడవ గోవిందుడు, అమోఘ వర్షుడు , మూడవ కృష్ణుడు)
119. రాష్ట్రకూట వంశంలో చివరి రాజు ఎవరు ? ( రెండవ కర్కరాజు )
120. రాష్ట్రకూట సామ్రాజ్యాన్ని అంతం చేసింది ఎవరు ? ( కళ్యాణి చాళుక్య రాజైన రెండవ తైలపుడు )

## గాంగులు

121. కర్ణాటక రాష్ట్రంలోని ఉత్తర కెనరా ప్రాంతంవారు ఎవరు? ( (గాంగులు)
122. గాంగులలో ఎన్ని శాఖలు కలవు ? ( రెండు 1. తూర్పుగాంగులు 2. పశ్చిమ గాంగులు )
123. కర్ణాటకలోని ఉత్తర కెనరా ప్రాంతాన్ని పాలించిన గాంగులెవరు ? ( పశ్చిమ గాంగులు)
124. ఒరిస్సాలోని కళింగ ప్రాంతాన్ని పాలించిన గాంగులెవరు ? (తూర్పు గాంగులు)
125. గాంగు శకము ఎప్పుడు ప్రారంభమైనది ? ( క్రీ.శ. 497 )
126. తూర్పు గాంగుల తొలి రాజధాని ఏది ? ( దంతపురం)
127. తూర్పు గాంగులలో పేరెన్నికగన్న మొదటి చక్రవర్తి ఎవరు ? ( ఆధిరాజ ఇంద్రుడు )

128. తూర్పు గాంగులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( అనంతవర్మ చోడ గంగ దేవుడు )

129. సుప్రసిద్ధ పూరీ జగన్నాథాలయము, శ్రీకూర్మం దేవాలయములను కట్టించింది ఎవరు? ( తూర్పుగాంగ చక్రవర్తియైన చోడ గంగదేవుడు )

130. త్రికళింగాధిపతి బిరుదును ధరించిన గాంగురాజు ఎవరు ? ( వజ్రహస్తుడు )

131. ప్రసిద్ధ ఖగోళ గ్రంథమైన "భాస్వతి"ని రచించిన 'శతానందుడు' ఎవరి ఆస్థాన పండితుడు ? ( చోడగంగదేవుడు)

132. ఒరిస్సాలోని ప్రసిద్ధ కోణార్క్ సూర్యదేవాలయాన్ని నిర్మించిన గాంగరాజు ఎవరు ? ( మొదటి నరసింహుడు )

133. గాంగుల తరువాత కళింగను పాలించిన రాజవంశమేది ? ( కళింగ గజపతులు)

134. కళింగ గజపతుల మూలపురుషుడు ఎవరు ? (కపిలేంద్ర గజపతి )

135. తూర్పుగాంగుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 497 - 1434 )

136. గాంగ రాజధానిని 'దంతపురం' నుండి 'కళింగ నగరమున'కు మార్చిన గాంగరాజుఎవరు ? ( హస్తివర్మ)

137. పశ్చిమ గాంగుల మూలపురుషుడు ఎవరు ? ( మొదటి మాధవరాజు )

138. పశ్చిమ గాంగుల రాజధాని ఏది? ( తలకాటు )

139. శ్రావణబెళగోళలోని సుప్రసిద్ధ జైన దేవాలయమును, 56 1/2 అడుగుల గోమటేశ్వర విగ్రహమును నిర్మించిన పశ్చిమ గాంగరాజు ఎవరు ? ( నాల్గవ రాజమల్లుడు )

140. సుప్రసిద్ధ కన్నడ కవిత్రయమైన సంప, రన్న, పోన్నలు, ఎవరి ఆస్థాన కవులు ? ( పశ్చిమ గాంగులు)

## చాళుక్యచోళులు

141. చాళుక్య చోళులు అంటే ఎవరు? ( ఏడో విజయాదిత్యుని మరణం అనంతరం సింహాసనం అధిష్టించిన కులోత్తుంగుని సంతతివారు

142. చాళుక్య చోళ యుగాన్ని ఏమని సిలుస్తారు ? ( మాండలిక యుగం )

143. చాళుక్య చోళయుగ పాలనా కాలమేది ? (క్రీ.శ. 1076 - 1215)

144. కులోత్తుంగుని అసలు పేరు ? ( వేంగీ చాళుక్య రాజేంద్రుడు )

145. 1084లో పాండ్యులు తిరుగుబాటు జరిపిన కాలంలో వేంగీ ప్రభువు ? ( కుమార వీర చోడుడు)

146. మొదటి కులోత్తుంగుని తరువాత చక్రవర్తి అయినది ? (విక్రమ చోడుడు)

147. చక్రకూట సోమేశ్వరుని బిరుదు ఏది ? (వీరచోడ సంహారకాము)

148. వెలనాటి చోడుల మూలపురుషుడెవరు ? ( మల్లవర్మ )

149. వెలనాటి రాజధాని ఏది ? ( సనదుప్రోలు - చందోలు)

150. రెండవ వెలనాటి రాజేంద్రచోళుని బిరుదు ఏది ? (దుర్జయకుల ప్రాకార)

151. వెలనాటిచోళులు ఏ వంశస్తులని భావిస్తున్నారు? ( దుర్జయ వంశస్థులు)

152. వెలనాటిచోళుల పూర్వులలో దుర్జయుడొకడుగలడని తెలియజేయు శాసనం ఏది ? ( పిఠాపుర శాసనము )

153. వెలనాటిచోడులకు ఎవరితో వివాహ సంబంధాలు వుండేవి? ( దుర్జయులగు కొండపమటి రాజులతో )

154. పాండ్య దండయాత్రలో వీరచోడునకు సహాయం చేసినది ? ( వెలనాటి వెదురుడు )

155. వీరచోడుడు 1084లో దక్షిణ దేశానికేగినప్పుడు వేంగి పాలనాభారాన్ని వహించినదెవరు ? (ఎదురుని పిన తండ్రియైన గోంకరాజు)

156. గోంకరాజు మంత్రి ఎవరు? ( నాదెండ్ల గోపయామాత్యుడు )

157. గోంకరాజు కుమారుడు ఎవరు? ( కులోత్తుంగ రాజేంద్రచోళుడు)

158. రాజేంద్రచోళుని కుమారుడు ఎవరు ? (రెండవ గోంకరాజు )

159. కవి రాక్షసుడు, తిట్టుకవి అని ప్రసిద్ధుడైనది ఎవరు ? ( వేములవాడ భీమకవి )

160. మంచనకవి రచించిన గ్రంథమేది? ( కేయూర బాహు చరిత్ర )

161. ఏ యుద్ధంలో వేంగిలో పశ్చిమ చాళుక్యుల అధికారం పూర్తిగా తుడిచి పెట్టబడింది ? ( గోదావరీ యుద్ధం 1133 )
162. 'కాకతి ప్రాల నిర్ధహన' బిరుదు ఎవరికి గలదు ? ( వీర రాజేంద్రుడు, కోటచోడయరాజు)
163. వెలనాటి చోడులలో ప్రసిద్ధుడెవరు ? ( రెండవ రాజేంద్ర చోడుడు)
164. రెండవ రాజేంద్ర చోడుని మంత్రి ? ( నండూరి కొమ్మన )
165. చౌండరాయ చాణూర మురాంతక బిరుదు ఎవరిది ? ( రాచూరు దారపరాజు )
166. వెలనాట చోళయ నిర్మూలన అనే బిరుదు ఎవరిది ? ( సంకర్షణ దేవుని సేనాపతి కాణవయ్య దండనాయకుడు )
167. వెలనాటి చోడుల ప్రభ ఎవరి మరణంతో అంతరించింది ? (రెండో రాజేంద్రచోడుని)
168. రెండో రాజేంద్రచోడుని మనుమడు ఎవరు ? ( పృథ్వీశ్వరుడు )
169. పృథ్వీశ్వరుడు తిరిగి ఏ సంవత్సరమున వెలనాటును ఆక్రమించెను ? ( 1203 )
170. పృథ్వీశ్వరుని మంత్రి ఎవరు ? (వెన్నయామాత్యుడు )
171. త్రిభువన చక్రవర్తి బిరుదుతో వేంగీలో సింహాసనమధి రోహించినది ఎవరు ? ( ముమ్మడి రాజాధిరాజు)
172. ఎవరి మరణంతో వెలనాటిచోడ వంశం అంతరించినది ? ( ముమ్మడిరాజేంద్ర చోడుని)

## ఆగ్నేయ ఆసియా రాజ్యాలు

173. పురాణములలో శ్రీలంకను ఏఏ పేర్లతో పిలిచేవారు ? ( లంక, తామ్రపర్ణి, సింహళం, నాగలోకం)
174. శ్రీలంకలోని "పోలోన్నరువా"లో శివాలయమును నిర్మించింది ఎవరు ? ( రాజరాజ చోళుడు )
175. భారతీయ చారిత్రక విశేషాలు గల సింహళ బౌద్ధ గ్రంథమేది ? ( దీప వంశం)
176. సింహళములో బౌద్ధమత ప్రచారము చేసిన అశోకుని బంధువులు ఎవరు? ( సంఘమిత్ర, మహేంద్ర )
177. పూర్వం భారతీయులు బర్మాను ఏ పేరుతో పిలిచేవారు ? ( సువర్ణ భూమి )
178. బర్మాను పాలించిన హిందూ పాలకులలో సుప్రసిద్దులు ( మ్రామ్మనులు )
179. మ్రామ్మనుల రాజధాని ఏది ? ( పాగన్ )
180. మ్రామ్మనులలో సుప్రసిద్దుడెవరు ? ( అనిరుద్ధుడు )
181. పాగన్‌లోని సుప్రసిద్ధ ష్వజగాన్ బౌద్ధ దేవాలయాన్ని నిర్మించింది ఎవరు? ( అనిరుద్ధుడు )
182. ఇండోనేషియాలోని ద్వీపాలు ఏవి ? (మలయా, సుమిత్రా, జావా, బలి, బోర్నియా)
183. మలయా ముఖ్య రేవు పట్టణం ఏది ? (తకువాపా)
184. సుమిత్రాలోని శ్రీ విజయ బౌద్ధరాజ్యంలో ముఖ్యమైన బౌద్ధ కేంద్రం ఏది? ( పాలెంబాగ్ )
185. శ్రీ విజయ రాజ్య పాలకులెవరు ? ( శైలేంద్ర వంశీయులు )
186. జావా ద్వీపం పూర్వ నామమేది ? (యువద్వీపము)
187. కాంబోడియాను పాలించిన రాజులెవరు ? (˘ంబు, స్వయంభు వంశీయులు )
188. కాంబోడియాలో ప్రఖ్యాతి గాంచిన 'అంగర్‌కోల్‌వాట్' వైష్ణవ దేవాలయ నిర్మాత? ( రెండవ సూర్యవర్మ )
189. ఆగ్నేయాసియాలోని నిర్మాణములన్నింటిలో తలమానికము వంటిదైన జావాలోని స్థూపము ఏది ? ( బోరోరుదురు మహాస్థూపము )
190. అన్నాంనకు గల మరోకపేరు ? ( చంపా )

## ముస్లిం దండయాత్రలు

191. భారతదేశంపై దండెత్తిన మహమ్మదీయులలో మొదటి వారు ఎవరు ? ( అరబ్బులు )
192. భారతదేశంపై దండెత్తిన తొలి ముస్లిం ఎవరు ? ( మహమ్మద్ ఖాశిం)
193. మహమ్మద్ గజనీ మొదటిసారిగా భారతదేశంపై ఎప్పుడు దండెత్తినాడు?(క్రీ.శ. 1000 - 1029 మధ్యకాలంలో (17 సార్లు)

194. గజనీ మహమ్మద్ దాడులను తిప్పికొట్టిన ఏకైక రసపుత్ర వీరుడు ఎవరు ? ( చందేల విద్యాధరుడు )

195. ఫిరదౌసి ఎవరి ఆస్థానంలోని వాడు ? అతడు రచించిన గ్రంథమేది ? (మహమ్మద్ గజనీ, షానామా)

196. ఆల్ బెరూని ఎవరి ఆస్థానంలోని వాడు ? అతడు రచించిన గ్రంథమేది? (గజనీ మహమ్మద్, తారీక్ డెల్ హింద్ )

197. మహమ్మద్ గజనీ సోమనాథ దేవాలయమును ఎప్పుడు కొల్లగొట్టాడు ? ( క్రీ.శ. 1029 లో )

198. ఘోరీ మహమ్మద్ అసలు పేరేమిటి ? (షిహబ్ ఉద్దీన్)

199. భారతదేశంలో మహమ్మదీయ రాజ్యాన్ని స్థాపించినది ఎవరు ? ( మహమ్మద్ ఘోరీ)

200. ఘోరీ రాజ్యం ఎక్కడ ఉంది ? (ఆఫ్ఘనిస్తాన్‌లోని జగనీ హీరట్‌ల మధ్య )

201. ఘోరీ దండయాత్ర సమయంలో కనూజ్‌ను పాలించిన గహద్వాల రాజెవరు? ( జయచంద్రుడు )

202. ఘోరీ దండయాత్ర సమయంలో ఢిల్లీ, ఆజ్మీరులను పాలిస్తున్న చౌహాను వంశీయుడెవరు ? ( పృథ్వీరాజ్)

203. ఘోరీ దండయాత్ర సమయంలో గుజరాత్‌ను పాలించు సోలంకీ వంశస్థుడు ఎవరు? ( రెండవ మాలరాజు )

204. ఘోరీ దండయాత్ర కాలంలో బెంగాలునేలు సేన వంశీయుడెవరు ? ( లక్ష్మణసేనుడు )

205. మొదటి స్థానేశ్వర్ యుద్ధం లేక తరైన్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ఎవరెవరికి జరిగింది ? ఎవరు ఓడిపోయారు? ( క్రీ.శ.1191లో మహమ్మద్ ఘోరీ పృథ్వీరాజ్‌ల మధ్య, మహమ్మద్ ఘోరీ ఓడిపోయాడు )

206. రెండవ తరైన్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ఎవరెవరి మధ్య జరగింది? ఎవరు ఓడిపోయారు ? ( క్రీ.శ.1192లో ఘోరీ,పృథ్వీరాజ్‌ల మధ్య పృథ్వీరాజ్ ఓడిపోయాడు )

207. భారతదేశంలో ముస్లిం రాజ్యస్థాపనకు దారి తీసిన యుద్ధమేది ? ( రెండవ తరైన్ యుద్ధం)

## 12. ఢిల్లీ సుల్తానుల యుగం ( క్రీ.శ. 1206 - 1526 )

### బానిస వంశము (1206 - 1290)

1. భారతదేశ చరిత్రలో ఢిల్లీ సుల్తానుల యుగమేది ? ( క్రీ.శ. 1206 నుండి 1526 )
2. ఢిల్లీలో మొట్టమొదట స్వతంత్ర ముస్లిం రాజ్యాన్ని స్థాపించినదెవరు ? ( కుతబుద్దీన్ ఐబక్ 1206 సం॥)
3. ఢిల్లీని పాలించిన మొదటి ముస్లిం వంశము ఏది ? ( బానిసవంశం)
4. బానిసవంశ స్థాపకుడెవరు ? ( కుతుబుద్దీన్ ఐబక్ )
5. బానిసవంశ పాలనాకాలం ఏది ? ఆ వంశ ముఖ్య రాజులెవరు ? ( క్రీ.శ. 1206 - 1290, కుతుబుద్దీన్ ఐబక్, ఇల్‌టట్‌మిష్, బాల్బన్)
6. బానిసవంశానికి మరియొక పేరు ఏది ? ( యెమ్‌లూక్)
7. ఢిల్లీనేలిన మొదటి తురుష్క వంశమేది ? ( బానిసవంశం )
8. భారతదేశంలో ఘోరీ మహమ్మద్ జయించిన రాజ్యాలకు రాజప్రతినిధి ఎవరు ? ( కుతుబుద్దీన్ ఐబక్ )
9. కుతుబుద్దీన్ ఐబక్ బిరుదేమి ? ( లక్షాబక్ష్)
10. కుతుబుద్దీన్ ఐబక్ ఎప్పుడు మరణించినాడు ? ( క్రీ.శ. 1210 (లాహోర్ లో )
11. కుతుబుద్దీన్ ఐబక్ కట్టించిన మసీదులేవి ? ( ఢిల్లీలోని సువట్ - ఉల్ - ఇస్లాం అజ్మీర్‌లోని అర్హదిన్ కా చోప్రా
12. కుతుబ్‌మీనార్‌ను ప్రారంభించినదెవరు ? పూర్తి చేసినదెవరు ? ( ప్రారంభించినది కుతుబుద్దీన్ ఐబక్, పూర్తి చేసింది ఇల్‌టుట్‌మిష్)
13. కుతుబుద్దీన్ ఐబక్ అల్లుడు ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
14. కుతుబుద్దీన్ ఐబక్ తరువాత ఢిల్లీ సింహాసనమును ఎక్కిన అతని కుమారుడు ఎవరు ? (ఆరామ్ షా క్రీ.శ. 1210 )
15. క్రీ.శ. 1211లో ఆరామ్‌షాను చంపి ఢిల్లీ సింహసనమును ఆక్రమించింది ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
16. ఇల్‌టుట్‌మిష్ కాలంలో భారతదేశంపై దండెత్తిన మంగోలుల నాయకుడు ఎవరు. ( చెంగిజ్‌ఖాన్ )

17. ఇల్‌టుట్‌మిష్ ఆస్థానంలోని చరిత్రకారుడు ఎవరు ? ( మినహాజుద్దీన్ )
18. బాల్యంలో ఇల్‌టుట్‌మిష్‌ను అతని సోదరులు ఎవరికి బానిసగా అమ్మారు? ( జమాలుద్దీన్)
19. జమాలుద్దీన్ ఇల్‌టుటమిష్‌ను ఎవరికి బానిసగా అమ్మెను ? ( కుతుబుద్దీన్ ఐబక్‌కు )
20. గ్వాలియర్ దుర్గాన్ని జయించిన మొదటి ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
21. బానిసవంశ సుల్తానులలో అగ్రగణ్యుడెవరు ? ( ఇల్‌టుట్‌మిష్ )
22. స్వతంత్రంగా అరబ్బీ నాణెములను మొట్టమొదట ముద్రించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
23. ఇల్‌టుట్‌మిష్ ఎప్పుడు మరణించెను ? ( క్రీ.శ. 1236 )
24. ఇల్‌టుట్‌మిష్ యొక్క సాంస్కృతిక ప్రాముఖ్యత ఏమి ? (ముస్లింల అవసరాలకు హిందూ శిల్పరీతులు అన్వయము)
25. మంగోలుల దాడినుండి తనను రక్షింపవలసినదిగా ఇల్‌టుట్‌మిష్‌ను కోరిన క్వారజాల ప్రభువు ? (మంగబార్నీ)
26. భారతదేశమును పాలించిన తొలి ముస్లిం మహిళ ఎవరు ? ( సుల్తానా రజియా (ఇల్‌టుట్‌మిష్ కుమార్తె)
27. తురుష్కేతర ముస్లింలకు ఉన్నత ఉద్యోగాలిచ్చిన సుల్తాన్ ఎవరు ? ( సుల్తానా రజియా)
28. రజియా తరువాత సింహాసనము నధిష్టించిన దెవరు ? (బహరాంషా)
29. బహరాంషా తరువాత ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించిన దెవరు? ( నాసరుద్దీన్ మహమ్మద్ )
30. నాసరుద్దీన్ మహమ్మద్ కాలంలో వాస్తవంగా ప్రభుత్వ కార్యకలాపాలను సాగించిన వ్యక్తి ఎవరు ( బాల్బన్ )
31. బాల్బన్ మొదటి పేరేమి ? ( బహా ఉద్దీన్ )
32. బాల్బన్ ఏ జాతీయుడు ? ( మధ్య ఆసియాలోని ఇల్బారీ తెగకు చెందిన తురుష్క జాతీయుడు )
33. బానిస వంశ రాజుల దర్బారులోని 40 మంది సర్దారుల కూటమి నేమంటారు ? ( చిహాల్ గనీ)
34. బాల్బన్ పాలనా కాలమేది ? అతనెప్పుడు మరణించినాడు ? ( క్రీ.శ. 1266 - 1287, 1287లో )
35. చిహల్‌గనీ ప్రాబల్యాన్ని, మియోలనే దారిదోపిడీ దొంగల నణచినది ఎవరు? ( బాల్బన్ )
36. బాల్బన్ కాలంలో తిరుగుబాటు చేసిన బెంగాలు నాయకుడు ఎవరు ? (టుగ్రీల్ ఖాన్)
37. టుగ్రీల్ ఖాన్ మరణానంతరం బెంగాలు ప్రతినిధియైన బాల్బన్ కుమారుడు ఎవరు. ( బుగ్రాఖాన్ )
38. బాల్బన్ బిరుదు ఏది ? ( ఉల్గుఖాన్ )
39. తైమూర్‌తో పోరాడునపుడు ప్రాణాలు కోల్పోయిన బాల్బన్ పెద్దకుమారుడు ఎవరు? ( మహమ్మద్)
40. బానిస వంశ రాజులలో చివరివాడు ఎవరు ? ( కైకుబాద్ )

## ఖిల్జీ వంశము (1290 - 1320)

41. ఖిల్జీలు ఏ జాతి వారు ? ( ఆఫ్ఘన్ జాతివారు )
42. ఖిల్జీ వంశ స్థాపకుడు ఎవరు ? ( జలాలుద్దీన్ ఖిల్జీ )
43. జలాలుద్దీన్ ఖిల్జీ అసలు పేరేమి ? ఏ సంవత్సరంలో సింహసనమధిష్టించినాడు ? ( మాలిక్ ఫిరోజ్ ఖిల్జీ , క్రీ.శ. 1290లో)
44. జలాలుద్దీన్ ఖిల్జీ పాలనా కాలమేది ? (క్రీ.శ. 1290 - 1296 )
45. ప్రజాహిత నిరంకుశ సూత్రాల ప్రకారం ప్రభుత్వాన్ని నడుపుచు ప్రజాభిమానము పొందుటకై ప్రయత్నించిన మొదటి ఢిల్లీ సుల్తాన్ ఎవరు? ( జాలాలుద్దీన్ ఖిల్జీ )
46. మంగోలులు ఏ సుల్తాను కాలంలో ఇస్లాంమతాన్ని స్వీకరించారు ? ( జలాలుద్దీన్ ఖిల్జీ )
47. జలాలుద్దీన్ ఖిల్జీని హత్య చేసింది ఎవరు ? ఎప్పుడు ? ( అల్లా ఉద్దీన్ ఖిల్జీ క్రీ.శ. 1296లో )
48. తన నాణెములపై ' రెండవ అలెగ్జాండర్' అని ముద్రించుకున్న ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )
49. దక్షణాపథంలో మొదటిసారిగా ఇస్లాం విజయానికి కారకుడెవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )
50. రణతంబోర్ యుద్ధమందు రాజద్రోహమునకు పాల్పడి అల్లాఉద్దీన్‌కు సాయపడిన హంవీరదేవుని మంత్రి ఎవరు ? ( రాణమల్ )

51. దక్షిణదేశ దండయాత్ర నిర్వహించిన  అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాని ఎవరు ? ( మాలిక్ కాఫర్ )

52. మాలిక్  కాఫర్ దక్షిణదేశమందు ఏఏ రాజుల నోడించినాడు ?

( యాదవ రామ చంద్రుడు ( దేవగిరి రాజు ) , రెండవ ప్రతాపరుద్రుడు  (కాకతీయ రాజు ), మూడవ వీర బల్లాలుడు ( హోయసాల రాజు )

53. ఢిల్లీ సామ్రాజ్యానికి క్రమబద్ధమైన పాలనా వ్యవస్థను అందించిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ)

54. రాజ్యమును మతం నుండి వేరు చేసిన మొదటి మహమ్మదీయ చక్రవర్తి ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )

55. అల్లాఉద్దీన్ ఖిల్జీ మరణించింది ఎప్పుడు ? ( క్రీ.శ. 1316 లో )

56. అల్లాఉద్దీన్ ఖిల్జీ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1296 - 1316 )

57. అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంనాటి చరిత్రకారుడెవరు ? ( బరౌని )

58. అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆస్థానములోని పారశీక కవులు ఎవరు ? ( అమీర్ ఖుస్రు , అమీర్ హసన్ )

59. హిందువులపై అవమానకరమైన జయా పన్నును విధించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )

60. అల్లాఉద్దీన్ ఖిల్జీకి రాచరికంపై యున్న అభిప్రాయమేమి ?

( దైవదత్త సిద్ధాంతం )

## తుగ్లక్ వంశము (1320 - 1413 )

61. తుగ్లక్‌లు ఏ జాతివారు ? ( కరౌనా తెగకు చెందిన తురుష్క జాతీయులు )

62. తుగ్లక్ వంశపాలనా కాలమేది ? (  క్రీ.శ. 1320 - 1413 )

63. తుగ్లక్ వంశ స్థాపకుడెవరు ? ( గియాజుద్దీన్ తుగ్లక్ )

64. తుగ్లక్ వంశంలో ప్రసిద్ధి చెందిన సుల్తానులు ఎవరు?(గియాజుద్దీన్ తుగ్లక్, మహమ్మద్‌బిన్ తుగ్లక్, ఫిరోజ్‌షా తుగ్లక్ )

65. గియాజుద్దీన్ తుగ్లక్ నిర్మించిన కొత్త రాజధాని ఏది ? ( తుగ్లక్ బాద్ )

66. అంచలవారీగా గుఱ్ఱాల మీద వార్తలను పంపే తపాలా పద్ధతిని ప్రవేశపెట్టిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( గియాజుద్దీన్ తుగ్లక్)

67. గియాజుద్దీన్ తుగ్లక్ ఎప్పుడు మరణించాడు ? ( క్రీ.శ. 1325 లో )

68. గియాజుద్దీన్ తుగ్లక్ తరువాత ఢిల్లీ సింహాసనమును అధిష్ఠించినది ఎవరు? ( మహమ్మద్ బిన్ తుగ్లక్ ( 1325 లో))

69. ' పిచ్చితుగ్లక్ ' గా పేరుపొందిన మహమ్మద్ బిన్ తుగ్లక్ మొదట పేరేమి? ( జునాఖాన్ )

70. విరుద్ధగుణ నిలయునిగా చిత్రీకరింపబడిన ఢిల్లీ సుల్తానెవరు ? ( మహమ్మద్ బిన్ తుగ్లక్ )

71. రాజధానిని ఢిల్లీ నుండి దేవగిరికి మార్చిన సుల్తాన్ ఎవరు ? ( మహమ్మద్ బిన్ తుగ్లక్ )

72. భారతదేశ చరిత్రలో పరమత సహనం ప్రదర్శించిన మొదటి ముస్లిం చక్రవర్తి  ఎవరు ? (మహమ్మద్ బిన్ తుగ్లక్ )

73. మహమ్మద్ బిన్ తుగ్లక్  పాలనాకాలం ఏది ? ( క్రీ.శ. 1325 - 1351 )

74. దేవగిరికి తుగ్లక్ పెట్టిన పేరు ఏది ? ( దౌలతాబాద్ )

75. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఆస్థానానికి వచ్చిన ఈజిప్టు దేశీయుడెవరు ? ( ఇబాన్  - బటటా )

76. తుగ్లక్ కాలంలో దాడి చేసిన మంగోలు నాయకుడు ఎవరు ? ( టర్మాషిరిన్ )

77. మంగోలు దాడులను నివారించుటకై మంగోలులకు లంచాలనిచ్చుటకు నిర్ణయించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ?

( మహమ్మద్ బిన్ తుగ్లక్ )

78. దక్షిణ ఇండియాకు ఇస్లాం సంస్కృతిలో సాన్నిహిత్యము ఏర్పడుటకు కారణమైన దండయాత్ర

( మహమ్మద్ బిన్ తుగ్లక్ దక్షిణ ఇండియా దండయాత్ర)

79. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఏ దండయాత్రలో మార్గమధ్యంలో మరణించినాడు? ( గుజరాత్ మరియు సింధు )

80. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఎపుడు ? ఎక్కడ మరణించినాడు ? ( క్రీ.శ. 1351, ధట్టావద్ద )

81. మహమ్మద్ బిన్ తుగ్లక్ తరువాత ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించినది ఎవరు? ( ఫిరోజ్ షా తుగ్లక్ క్రీ.శ. 1351 )

82. 'రైతు బాంధవుడని ', ' ఢిల్లీ సుల్తానత్ అక్బరు'గా పేరుపొందిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( ఫిరోజ్ షా తుగ్లక్ )
83. మీరట్, తోప్రాలందలి అశోక స్థంభములను ఢిల్లీకి తరలించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( ఫిరోజ్ షా తుగ్లక్ )
84. ఫిరోజ్ షా ఆస్థానంలోని చరిత్రకారులెవరు ? ( జయాఉద్దీన్ బరానీ, షామ్స్ ఇసిరాజ్ )
85. ఫిరోజ్ షా తుగ్లక్ ఏ సంవత్సరమున మరణించెను ? ( క్రీ.శ. 1388 )

## సయ్యద్ వంశం ( క్రీ.శ. 1414 - 1451 )

86. తుగ్లక్ వంశం తరువాత ఢిల్లీని పాలించిన వంశమేది ? ( సయ్యద్ వంశం )
87. క్రీ.శ. 1398 లో భారతదేశంపై దండెత్తి ఢిల్లీ సుల్తానత్‌ను చావుదెబ్బ కొట్టిన సమర్ ఖండ్ పాలకుడు ఎవరు? (తైమూర్)
88. తుగ్లక్ వంశంలో చివరివాడు, తైమూర్ దండయాత్ర సమయంలో ఢిల్లీ పాలకుడు అయిన సుల్తానెవరు ? ( నసీరుద్దీన్ మహమ్మద్ )
89. తైమూరు జన్మస్థలమేది ? ( టాన్సోక్షియానా )
90. సయ్యద్ వంశ స్థాపకుడు ఎవరు ? సయ్యద్ వంశీయుల జాతి ఏది ? ( తైమూర్ ప్రతినిధి ఖిజీర్ ఖాన్ , అరబ్బు జాతి )
91. సయ్యద్ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1414 - 1451 )
92. సయ్యద్ వంశంలో చివరివాడు ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఆలంషా )

## లోడీ వంశము ( క్రీ.శ. 1451 - 1526 )

93. లోడీ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1451 - 1526 )
94. లోడీ వంశ స్థాపకుడు ఎవరు ? ( బహలాల్ లోడి )
95. లోడీలు ఏ జాతీయులు ? ( ఆఫ్ఘనులు )
96. లోడీ వంశ రాజులు ఎవరు? ( బహలాల్ లోడీ, సికిందర్ లోడీ, ఇబ్రహీంలోడీ )
97. 'ఢిల్లీ సుల్తాన్‌ల పాలనాకాలంలో రూపొందిన క్రొంగొత్త వాస్తు శైలి ఏది ? ( ఇండో - ఇస్లామిక్ )
98. ఢిల్లీ సుల్తానత్ కడపటి చక్రవర్తి ఎవరు ? ( ఇబ్రహీంలోడి)
99. ఢిల్లీ సుల్తానుల పతనము ఏ యుద్ధముతో పూర్తి అయినది ? ఆ యుద్ధము ఎప్పుడు జరిగింది ? ( మొదటి పానిపట్టు యుద్ధం క్రీ.శ.1526 )
100. మొదటి పానిపట్టు యుద్ధంలో ఇబ్రహీంలోడీని ఓడించినదెవరు? ( బాబరు )
101. క్రీ.శ. 14,15, శతాబ్దాలలో భక్తిమార్గం ద్వారా హిందూ మతోద్ధరణకు కృషి చేసిన ఉద్యమమేది ? ( భక్తి ఉద్యమము )
102. రామానందుడు ఏ కాలంవాడు ? అతని జన్మస్థలం ఏది ? ( క్రీ.శ. 14వ శతాబ్దంవాడు, అలహాబాద్ )
103. మీరాబాయి, కబీరు ఎవరి శిష్యులు ? ( రామానందుడు )
104. మీరాబాయి ఎవరు ? ( రాఠోర్ వంశానికి చెందిన రాజవనిత )
105. వల్లభాచార్యుడు ఎప్పుడు ఎక్కడ జన్మించాడు ? ( క్రీ.శ. 1479లో వారణాసిలో )
106. వల్లభాచార్యుడు ప్రబోధించిన మతమేది ? ( శుద్ధాద్వైతము - కృష్ణ భక్తి )
107. బెంగాలులో కృష్ణ భక్తిని ప్రచారం చేసింది ఎవరు ? ( చైతన్యుడు )
108. చైతన్యుడు ఎప్పుడు ? ఎక్కడ జన్మించాడు ? ( క్రీ.శ. 1485లో బెంగాలులోని నాడియాలో )
109. క్రీ.శ. 15వ శతాబ్దంలో మహారాష్ట్ర భక్తి ఉద్యమ ప్రవక్త ఎవరు ? ( నామదేవుడు )
110. సిక్కు మత స్థాపకుడు ఎవరు ? (గురునానక్ )
111. గురునానక్ ఎపుడు, ఎక్కడ జన్మించినాడు ? ( క్రీ.శ. 1469లో పంజాబులోని 'తల్వెండీ'లో )
112. హిందీ, పారశీకం, టర్కీ, అరబ్బీ భాషల మిశ్రమ భాష ఏది ? ( ఉర్దూ)
113. ఉర్దూ భాషలో ఆదికవి ఎవరు ? ( అమీర్ ఖుస్రూ ( అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆస్థాన కవి )
114. మధుర దండయాత్ర సమయంలో మాలిక్ కాఫర్ ధ్వంసం చేసిన హిందూ దేవాలయం ఏది ?(రామేశ్వర దేవాలయం)

115. ఉత్తర హిందూదేశ దండయాత్రను నిర్వహించిన అల్లాఉద్దీన్ సేనానులు ఎవరు ? ( ఉల్లూఖాన్, నస్రత్ ఖాన్, జఫర్ ఖాన్, అలఫ్‌ఖాన్ )

116. గుర్రముల మార్పిడి నిరోధించేందుకు గుర్రములపై ముద్రలు, అలైదర్వాజా ను నియమించిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( అల్లాఉద్దీన్‌ఖిల్జీ)

117. మహమ్మద్ బిన్ తుగ్లక్ వరంగల్లు పేరును ఏమని మార్చినాడు? ( సుల్తాన్‌పూర్ )

118. 'ఆగ్రా' నగరమును నిర్మించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? (సికిందర్ షా లోడీ )

119. వ్యవసాయాభివృద్ధికై మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఏర్పాటు చేసిన వ్యవసాయ శాఖపేరు ? ( దివాన్ ఇకోహి )

120. లోడీ వంశీయులలో సమర్ధవంతమైన గూఢచారి శాఖను ఏర్పాటు చేసినది ఎవరు ? ( సికిందర్ షా లోడీ)

121. ఢిల్లీ సుల్తానుల ప్రధానమంత్రి నేమంటారు ? ( వజీర్)

122. ఢిల్లీ సుల్తానుల విదేశాంగ మంత్రి నేమందురు ? ( దివాన్ - ఇ-రసాలత్ )

123. ఢిల్లీ సుల్తానుల సైనిక మంత్రి నేమంటారు ? ( దివాని అర్జి )

124. ఢిల్లీ సుల్తానుల సైనిక రాష్ట్రం పేరేమి ? ( ఇకా)

125. ఢిల్లీ సుల్తానుల కాలంలో 'జకత్' శిస్తు ఎవరి నుండి వసూలు చేసెడివారు? ( ముస్లింలనుండి )

126. ఢీల్లీ సుల్తానులు వసూలు చేసిన యుద్ధ దోపిడీ పన్నును ఏమంటారు ? ( ఖామ్స్)

127. ఢిల్లీ సుల్తానులు ముస్లిమేతర రైతుల మీద వేసిన పన్నునేమందురు ? ( ఖరజ్ )

128. 'చాచ్ నామా ' గ్రంధకర్త ఎవరు ?, చాచ్ నామా ఎవరి చరిత్రను తెల్పుతుంది ? ( మహమ్మద్ ఆలీబిన్‌బ్రక్ , అరబ్బు దండయాత్ర )

129. తారీఖ్ - ఇ - సింధ గ్రంధాన్ని ఎవరు ఎప్పుడు రచించారు ? ( మీర్ మహమ్మద్ మసూమ్, క్రీ.శ.1600లో )

130. 'తబ్ కత్ - ఇ - నజీర్ అనే గ్రంథాన్ని ఎవరు రచించారు ? అది ఎవరి చరిత్రను తెల్పుతుంది ? ( మినహజ్ సిరాజ్, మహమ్మద్ ఘోరీ దండయాత్రలు)

## దక్షిణ భారతదేశ రాజ్యాలు

### (బి) యాదవులు

131. దక్షిణాపథమున కళ్యాణి చాళుక్య శిథిలాలపై వెలసిన మహారాష్ట్ర రాజ్యమేది? ( దేవగిరి యాదవ రాజ్యం )

132. దేవగిరి యాదవ వంశ మూలపురుషుడు ఎవరు ? ( ధృడ ప్రహారుడు )

133. ధృఢ ప్రహారుని పాలనా కాలమేది ? ( క్రీ.శ 860 - 880)

134. ధృఢ ప్రహారుని రాజధాని ఏది ? ( చంద్రాదిత్య పురం)

135. స్వతంత్ర యాదవ రాజ్యాన్ని స్థాపించినదెవరు ? ( ఐదవ భిల్లముడు )

136. కాకతీయ రుద్రుని వధించిన యాదవ రాజు ఎవరు? ( భిల్లముని కుమారుడు జైతుగి)

137. యాదవ రాజ్యము తెలంగాణా ప్రాంతంలోనికి విస్తరింప చేసిన యాదవరాజు ఎవరు ? ( జైతుగి )

138. యాదవ రాజులలో సుప్రసిద్దుడు ఎవరు ? ( జైతుగి కుమారుడైన సింఘణ)

139. సుప్రసిద్ధ రచయిత, విద్వాంసుడైన హేమాద్రి ఎవరి మంత్రి ? ( యాదవ మహదేవుడు )

140. క్రీ.శ. 1294లో యాదవ రాజ్యంపై దండెత్తి యాదవరాజైన రామచంద్ర దేవుని ఓడించిన ఢిల్లీ సుల్తాను ఎవరు? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ)

141. అల్లాఉద్దీన్ సేనానియైన మాలిక్ కాఫర్ చే వధింపబడిన యాదవ రాజు ఎవరు ? (శంకర దేవుడు )

142. యాదవ రాజులలో చివరివాడు ఎవరు? ( హరపాలదేవుడు )

143. యాదవుల రాజధాని ఏది ? ( దేవగిరి)

144. యాదవుల మాతృభాష ఏది ? (మారాఠి)

145. యాదవ హరపాలదేవుని ఓడించి వధించిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? (ముబారక్ షా ఖిల్జీ )

146. ప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త, భాస్కరాచార్యుని కుమారుడైన లక్ష్మీధరుడు ఎవరి ఆస్థాన విద్యాపతి ? ( జైతుగి )
147. మరాఠీ భాషలో ఆదికవి ఎవరు ? (ముకుందరాయుడు )
148. వివేక సింధు అను వేదాంత గ్రంథమును వ్రాసినదెవరు ? ( ముకుందరాయుడు )
149. మరాఠీ భాషలో మొదటి గ్రంథమేది ? (జ్ఞానేశ్వరీయము )
150. యాదవులు ఎవరి భక్తులు ? ( విష్ణువు )
151. యాదవుల కాలంనాటి మహారాష్ట్ర భక్తి ఉద్యమ ప్రవక్తలెవరు ? ( జ్ఞానదేవుడు, నామదేవుడు, జనాబాయ్ )
152. 'సంగీత రత్నాకరము'ను రచించిన 'సారంగదేవుడు ' ఎవరి ఆస్థాన కవి? ( యాదవ సింఘణ)
153. యాదవ కృష్ణుని సేనాని, ' జల్హన' సంకలనం చేసిన సంస్కృత గ్రంథమేది? (సూక్తి ముక్తావళి )
154. సంస్కృత రచయితలలో మేటి , యాదవ మహాదేవుని మంత్రి ' హేమాద్రి' రచించిన గ్రంథాలేవి ? (చతురభర్గ చింతామణి, దానవాక్యావళి )
155. యాదవుల రాజచిహ్నమేది ? ( గరుడుడు )

## హోయసాలులు

156. హోయసాలుల మూలపురుషుడు ఎవరు ? ( సాలుడు )
157. హోయసాలుల ప్రాభవమునకు పునాది వేసినవాడు ఎవరు ? ( భిత్తిదేవ విష్ణువర్ధనుడు )
158. హోయసాలులు ఏ ప్రాంత పాలకులు ? ( కర్ణాటక )
159. హోయసాలుల రాజధాని ఏది ? ( ద్వార సముద్రం ( హలిబేటు )
160. హోయసాల రాజులు పోషించిన భాషలు ఏవి ? ( సంస్కృతము, కన్నడము )
161. స్వతంత్ర హోయసాల రాజ్యస్థాపకుడెవరు ? ( రెండవ బల్లాలుడు )
162. 'బల్లాలకశకం' ను ఎవరు ప్రారంభించెను ? ( రెండవ బల్లాలుడు )
163. ' చోళ రాజ్య పున: వ్యవస్థాపకుడు' అని పేరు పొందిన హోయసాల రాజు ఎవరు? ( రెండవ నరసింహుడు )
164. హోయసాలుల రాజులలో గొప్పవాడెవరు? ( మూడవ బల్లాలుడు )
165. ద్వైత సిద్ధాంత ప్రవక్త మధ్వాచార్యులు ఎవరి కాలంవాడు ? ( హోయసాలులు )
166. కన్నడ భాషలో మొదటి నవల అయిన 'లీలావతి' ని వ్రాసింది ఎవరు ? ( నేమి చంద్రుడు )
167. ' అభినవపంప ' బిరుదాంకితుడైన ' 'నాగచంద్రుడు' వ్రాసిన గ్రంథమేది? ( జైన రామాయణము )
168. భిత్తిదేవ విష్ణువర్ధనుడు నిర్మించిన ఆలయం ఏది ? ( బేలూరులోని చెన్నకేశవాలయము)
169. ద్వార సముద్రం 'హోయలేశ్వర దేవాలయం' నిర్మించింది ' ఎవరు ? ( హోయసాల మొదటి నరసింహుడు)
170. హోయసాలుల కాలంనాటి సంస్కృత గ్రంథాలలో ముఖ్యమైనవి ఏవి ? ( ప్రస్థాన త్రయ భాష్యాలు )

## కాకతీయులు

171. కాకతీయులు ఎవరు ? ( క్రీ.శ. 1000 నుండి 1323 వరకు తెలుగునేలను పాలించిన ఆంధ్ర రాజులు )
172. కాకతీయులని పేరు ఏ దేవతను ఆరాధించుట వలన వచ్చినది ? (కాకతి )
173. కాకతీయుల జన్మస్థలమేది ? ( కాకతిపురము )
174. కాకతీయుల పాలనాకాలమేది ? ( క్రీ.శ. 1000 - 1323 )
175. కాకతి వంశానికి పునాదులు వేసిన వాడు ఎవరు ? ( గుండయ )
176. కాకతీయులు మొదట ఎవరి సామంత రాజులు ? ( తూర్పు చాళుక్యులు )
177. స్వతంత్ర కాకతీయ రాజ్యమును నిర్మించింది ఎవరు ? ( రెండవ ప్రోలరాజు )
178. కాకతీయుల మొదట రాజధాని ఏది ? ( హనుమకొండ )
179. కాకతీయుల మలి రాజధాని ఏది ? ( ఓరుగల్లు )
180. ప్రోలరాజు ఎవరి చేతిలో హతుడయ్యెను ? ( ఛందోలు రాజు )

181. తన తండ్రిని వధించిన వెలనాటి చోడులపై ప్రతీకారం తీర్చుకున్న కాకతీయ రాజు ఎవరు ? ( రుద్రదేవుడు లేక మొదటి ప్రతాపరుద్రుడు )
182. రుద్రదేవుడు రచించిన గ్రంథమేది ? ( నీతి సారము)
183. యాదవ రాజైన జైతుగిచే వధింపబడిన కాకతీయ రాజెవరు ? ( రుద్రదేవుడు )
184. యాదవులకు బంధీగా చిక్కిన కాకతీయ రాజు ఎవరు? ( గణపతి దేవుడు )
185 . కాకతీయ చక్రవర్తులలో అగ్రగణ్యుడు ఎవరు? ( గణపతిదేవుడు )
186. గణపతి దేవుడు ఎప్పుడు రాజ్యమునధిష్టించెను ? ( క్రీ.శ. 1209 లో )
187. హనుమకొండ నుంచి ఓరుగల్లుకు రాజధానిని మార్చిన కాకతీయరాజు ఎవరు? ( గణపతి దేవుడు )
188. గణపతి దేవుడుచే ఓడింపబడిన యాదవ రాజు ఎవరు? ( కృష్ణుడు )
189. గణపతి దేవుని పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1209 - 1262 )
190. గణపతి దేవుడు ఎప్పుడు మరణించెను ? ( క్రీ.శ. 1262 )
191. గణపతి దేవుని అనంతరం కాకతీయ రాజ్యసింహాసనము అదీష్టించిన దెవరు ? ( గణపతి దేవుని పెద్దకుమార్తె అయిన రుద్రమదేవి)
192. రుద్రమదేవిచే ఓడింపబడిన యాదవ రాజు ఎవరు. ( మహాదేవుడు )
193. రుద్రమదేవి కాలమున కాకతీయ రాజ్యమును సందర్శించిన వెనిస్ వర్తకుడు ఎవరు ? ( మార్కోపోలో)
194. రుద్రమదేవి తరువాత కాకతీయ సింహాసనమును అధిష్టించినది ఎవరు? ( ప్రతాపరుద్రుడు )
195. కాకతీయ చక్రవర్తులలో చివరివాడు ఎవరు? ( ప్రతాపరుద్రుడు )
196. ఒరుగల్లుపై ఏ సంవత్సరమున ముస్లింలు మొదటి దండయాత్ర చేసారు? ( క్రీ.శ. 1300 )
197. క్రీ.శ. 1308 లో కాకతీయ ప్రతాపరుద్రుని ఓడించిన అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాని ఎవరు? ( మాలిక్ కాఫర్ )
198. ప్రతాపరుద్రుని ఓడించి బంధీగా పట్టుకొని ఢిల్లీకి తీసుకొనిపోయిన ముస్లిం సేనాని ఎవరు? ( జునాఖాన్ )
199. కాకతీయ ప్రతాపరుద్రుడు ఏ నదీ తీరంలో ఆత్మహత్య చేసుకున్నాడు? (నర్మదా )
200. కాకతీయుల ముఖ్య రేవు పట్టణము ఏది ? (మోటుపల్లి )
201. కాకతీయులు ఆదరించిన మతమేది ? ( వీరశైవ మతము )
202. కాకతీయులు పోషించిన భాష ఏది? ( సంస్కృతము )
203. ప్రతాపరుద్రుని 'యశోభూషణము' అను అలంకార శాస్త్రమును వ్రాసినదెవరు? ( విద్యానాధుడు )
204. జాయపసేనాని వ్రాసిన గ్రంథమేది ? ( నృత్త రత్నావళి)
205. పాల్కురికి సోమనాధుడు రచించిన గ్రంథాలేవి ? ( బసవపురాణము, పండితారాధ్య చరిత్రము)
206. కాకతీయుల కాలంలోని సుప్రసిద్ధ తెలుగు కవి ఎవరు ? ( తిక్కన సోమయాజి )
207. తిక్కన సోమయాజి రచించిన గ్రంథాలేవి ? ( ఆంధ్ర మహా భారతము, ఉత్తర రామాయణము )
208. తిక్కనకు గల బిరుదులేవి ? ( కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు )
209. 'రంగనాథ రామాయణము ' రచించినది ఎవరు ? ( గోనబుద్దారెడ్డి)
210. 'మార్కండేయ పురాణము'ను రచించినది ఎవరు ? (మారన )

## పాండ్యులు

211. క్రీ.శ. 13వ శతాబ్దంలో పాండ్యుల ప్రతిష్టను పునరుద్ధరించినవాడు ఎవరు? ( కడుంగన్ )
121. పాండ్య రాజులలో అగ్రగణ్యుడు ఎవరు? ( జాటవర్మ కులశేఖరుడు )
213. పాండ్య రాజ్యం ఏది? (నేటితమిళనాడులోని తిరుచెనాపల్లి, తంజావూరు, సేలం, కోయంబత్తూరు జిల్లా ప్రాంతం )
214. పాండ్యుల రాజధాని ఏది ? ( మధురై )
215. పాండ్యుల ముఖ్య రేవు పట్టణం ఏది ? ( కమాల్ )
216. కులశేఖర పాండ్యుని కాలంలో పాండ్య రాజ్యమును సందర్శించిన వెనిస్ యాత్రికుడుఎవరు ? ( మార్కోపోలో)

217. సింహళరాజును ఓడించి ఖుద్ధ ధాతువుని తెచ్చిన పాండ్య రాజెవరు? ( కుల శేఖర పాండ్యుడు )
218. సాండగ్య రాజ్యముపై దేడెత్తిన ముస్లిం సేనాని ఎవరు ? (మాలిక్‌కాఫర్ )
219. పాండ్యులు ముస్లింలలో అవలంభించిన యుద్ధం ఏది ? ( గెరిల్లా యుద్ధపద్ధతి )
220. పాండ్య రాజ్యమును ఢిల్లీ సుల్తానత్ సామ్రాజ్యంలో కలిపినది ఎవరు? (మహమ్మద్ బిన్ తుగ్లక్ )

# దక్షిణ భారతదేశంలో స్వాతంత్రోద్యమాలు

## మునుసూరి నాయకులు

221. కాకతీయుల అనంతరం వరంగల్లు ప్రాంతంలో హిందూ స్వాతంత్రోద్యమమునకు నాయకత్వం వహించినది ఎవరు ? ( బెండపూడి అన్నమంత్రి ,రేచర్ల సింగమ నాయకుడు, మునుసూరి ప్రోలయ నాయకుడు )
222. స్వతంత్ర మునుసూరి నాయక రాజ్య స్థాపకుడు ఎవరు ? (కాపయనాయకుడు)
223. కాపయనాయకుని రాజధాని ఏది ? ( ఓరుగల్లు )
224. 'ఆంధ సురత్రాణ' బిరుదు పొందినది ఎవరు ? ( కాపయనాయకుడు )
225. కాపయనాయకుని కుమారుడైన అనపోతానాయకుని వధించిన బహమనీ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ షా )
226. కాపయనాయకుని ఓడించి ఓరుగల్లును జయించినదెవరు ? (రేచర్ల అనపోతానాయకుడు)

## రేచర్ల పద్మ నాయకులు

227. పద్మనాయకులకు మరొక పేరేమి ? (వెలయ)
228. రేచర్ల పద్మనాయక రాజ్యం స్థాపించినది ఎవరు ? ( సింగమ నాయకుడు )
229. రేచర్ల పద్మనాయకులలో అగ్రగణ్యుడు ఎవరు? ( అనపోతానాయకుడు )
230. రేచర్ల పద్మనాయకుల రాజధాని ఏది ? ( రాచకొండ)
231. దేవర కొండ దుర్గమును నిర్మించినది ఎవరు? ( అనపోతా నాయకుడు )
232. రేచర్ల పద్మనాయకులలో చివరివాడు ఎవరు ? ( రెండవ సింగమనాయకుడు )
233. ఓరుగల్లు శాశ్వతంగా ఎవరికాలంలో బహమనీల వశమయినది ? ( సింగమనాయకుడు)

### రెడ్డి రాజులు

234. రెడ్డి రాజులు ఏ వంశీయులు ? ( దేసటి )
235. స్వతంత్ర రెడ్డి రాజ్యమును స్థాపించినది ఎవరు ? ( ప్రోలయవేమారెడ్డి )
236. ప్రోలయవేమారెడ్డి రాజధాని ఏది ? ( అద్దంకి )
237. ప్రోలయవేమారెడ్డి పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1325 - 1353 )
238. ' ధర్మప్రతిష్టాపన గురు' అను బిరుదు పొందిన రెడ్డి రాజు ఎవరు? ( ప్రోలయవేమారెడ్డి)
239. రెడ్డిరాజుల రాజధానిని ' అద్దంకి' నుండి 'కొండవీటి'కి మార్చిన రెడ్డి రాజు ఎవరు ? (అనపోతారెడ్డి )
240. రెడ్డిరాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? ( అనవేమారెడ్డి)
241. 'కర్పూర వసంతరాయలు' గా పేరుపొందిన రెడ్డిరాజు ఎవరు? ( కుమారగిరి రెడ్డి )
242. రెడ్డిరాజులలో అంతర్యుద్ధము ఏ రాజు కాలములో ప్రారంభమైంది ( కుమరగిరి రెడ్డి కాలంలో )
243. కుమారగిరిరెడ్డి కాలములో రెడ్డి రాజ్యంపై దాడి చేసిన విజయనగర చక్రవర్తి ఎవరు ? (రెండవ హరి హరరాయలు)
244. రాజమండ్రి రెడ్డి రాజ్యస్థాపకుడు ఎవరు ? ( కాటయ వేమారెడ్డి )
245. ' సర్వజ్ఞ చక్రవర్తి ' ఎవరు ? ( పెద కోమటి వేమారెడ్డి )
246. కొండవీటి రెడ్డి రాజులలో చివరి వాడు ఎవరు? (వీర భద్రారెడ్డి )
247. ఆంధ్ర మహాభారతాన్ని పూర్తి చేసిన ఎర్రాప్రగ్గడ ఎవరి ఆస్థానకవి ? ( ప్రొలయ వేమారెడ్డి )
248. 'ఆంధ్రమహాభాగవతమున ' ను రచించింది ఎవరు ? (బమ్మెర పోతన)

249. కుమార గిరిరెడ్డి వ్రాసిన నాట్య శాస్త్ర గ్రంథమేది ? ( వసంత రాజీయము )

250. పెదకోమటి వేమారెడ్డి రచించిన గ్రంథాలేవి ? ( సాహిత్య చింతామణి, సంగీత చింతామణి, శృంగార దీపిక)

251. శ్రీనాథ కవి సార్వభౌముడు ఎవరి ఆస్థానకవి ? (పెదకోమటి వేమారెడ్డి )

252. శ్రీనాథుడు రచించిన గ్రంథాలేవి ? ( శృంగార నైషధం, హర విలాసము, కాశీఖండం, పల్నాటి చరిత్రం)

253. శ్రీనాథుడు ఓడించిన విజయనగర ఆస్థాన పండితుడు ఎవరు? ( గౌడ డిండిమ భట్టు)

## 13. విజయనగర బహమనీ రాజ్యాలు

### (బి) విజయనగర రాజ్యము

1. విజయనగర సామ్రాజ్య స్థాపన ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1336 )
2. విజయనగర రాజ్య స్థాపకులు ఎవరు ? ( హరిహరరాయలు, బుక్కరాయలు )
3. విజయనగర సామ్రాజ్య స్థాపనా ప్రేరకులు ఎవరు? ( విద్యారణ్య స్వామి )
4. విజయనగర చరిత్ర వ్రాసిన దెవరు ? ( రాబర్టు సీవెల్)
5. విజయనగర సామ్రాజ్య పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1336 - 1680 )
6. విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాజవంశములేవి ?

( 1. సంగమ వంశము క్రీ.శ. 1336 - 1485, 2. సాళువ వంశము క్రీ.శ.1485 - 1505 3.తుళువ వంశము క్రీ.శ. 1505 - 1576 4. అరవీటి వంశము క్రీ.శ. 1570 - 1680 )

### సంగమ వంశము

7. సంగమ వంశస్థాపకులు ఎవరు? ( హరిహర రాయలు, బుక్కరాయలు )
8. హరిహర, బుక్క రాయల తండ్రి ఎవరు? ( సంగముడు)
9. విజయనగర రాజ్యమును పాలించిన మొదటి రాజు ఎవరు ? ( మొదటి హరి హర రాయలు )
10. బుక్కరాయల కాలంలో జరిగిన ముఖ్య సంఘటన ఏమి ? ( మధురా విజయము )
11. కంపరాయల మధుర జైత్రయాత్రను ఇతివృత్తముగా స్వీకరించి అతని భార్య గంగాదేవి రచించిన గ్రంథమేది? ( మధురా విజయము )
12. బహమనీ - విజయనగర రాజ్యాల మధ్య దీర్ఘకాల పోరుకు ఏ విజయనగర రాజు కాలంలో నాంది పలికింది ? ( బుక్కరాయలు )
13. బుక్కరాయల ఆస్థానంలోని సుప్రసిద్ధ తెలుగు కవి ఎవరు? ( నాచన సోముడు )
14. సంగమ వంశ రాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? ( రెండవ దేవరాయలు (లేక ) ప్రౌఢ దేవరాయలు)
15. ప్రౌఢదేవరాయల సేనాని ఎవరు? (లక్కణ్ణ)
16. ప్రౌఢదేవరాయలు కాలమున విజయనగరమును సందర్శించిన ఇటలీ యాత్రికుడు ఎవరు ? ( నికోలోకాంటి )
17. ప్రౌఢదేవరాయలు కాలమున విజయనగరమును సందర్శించిన పారశీక రాయబారి ఎవరు ? ( అబ్దుల్ రజాక్ )
18. ప్రౌఢదేవరాయలు ఆస్థానంలోని సుప్రసిద్ధ కన్నడ కవి, వీరశైవ రచయిత ఎవరు ? ( చామరసు )
19. ప్రౌఢ దేవరాయలు రచించిన సంస్కృత గ్రంథాలేవి ? ( మహానాటక సుధానిధివృత్తి)
20. శ్రీనాథ కవి సార్వభౌమునకు కనకాభిషేకం చేసిన విజయనగర రాజు ఎవరు ? ( ప్రౌఢ దేవరాయలు )
21. సంగమ వంశంలో చివరివాడు ఎవరు? ( ప్రౌఢ దేవరాయలు )
22. మొదటిసారిగా తురుష్కులను కొలువులో చేర్చుకొనిన విజయనగర రాజు ఎవరు ? ( ప్రౌఢ దేవరాయలు)
23. విజయనగరములోని ' విఠలస్వామి ఆలయాన్ని' నిర్మించింది ఎవరు ? ( ప్రౌఢ దేవరాయలు)
24. ప్రౌఢదేవరాయల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1422 - 1446 )

## సాళువవంశము

25. సంగం వంశం తరువాత విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాజవంశం ఏది ? ( సాళువ వంశం)
26. సాళువ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ.1485 - 1505 )
27. సంగమ వంశాన్ని తుదముట్టించి విజయనగరాన్ని స్వాధీనం చేసుకున్న విజయనగర రాజుల సేనాని ఎవరు? ( సాళువ నరసింహరాజు )
28. సాళువ నరసింహరాయలు ఆస్థానంలోని సంస్కృత పండితుడు ఎవరు ? ( రాజనాథ డిండిముడు )
29. 'సాళువాభ్యుదయము' ను రచించింది ఎవరు ? ( రాజనాథ డిండిముడు )
30. సాళువ నరసింహరాయలు ఆస్థానంలోని తెలుగు కవి ఎవరు? ( పిల్లలమర్రి పినవీరభద్రుడు)
31. పిల్లలమర్రి పినవీరభద్రుడు తెలుగులో వ్రాసిన గ్రంథములు ఏవి ? ( జైమిని భారతం, శృంగార శాకుంతలము )
32. సాళువ వంశంలో చివరివాడు ఎవరు ?( ఇమ్మడి నరసింహరాయలు )

## తుళువ వంశం

33. సాళువ వంశ పాలకుడైన ఇమ్మడి నరసింహరాయలను వధించి, విజయ నగర సింహాసనం ఆక్రమించి తుళువ వంశమును స్థాపించినది ఎవరు? ( తుళువవీర నరసింహరాయలు)
34. తుళువ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1505 - 1576 )
35. తుళువ వంశంలోనే కాక విజయనగర రాజులలో కూడ అగ్రగణ్యుడు ఎవరు ? ( శ్రీ కృష్ణ దేవరాయలు)
36. శ్రీ కృష్ణ దేవరాయల పాలనా కాలమేది ? ( 1509 - 1529)
37. శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానమును సందర్శించిన పోర్చుగీసు వర్తకుడు ఎవరు? ( డామింగోపేస్ )
38. శ్రీ కృష్ణ దేవరాయల ఆస్థానం పేరేమి ? (భువన విజయము)
39. శ్రీ కృష్ణ దేవరాయల మంత్రి ఎవరు? ( తిమ్మరుసు )
40 . శ్రీకృష్ణ దేవరాయల ఆస్థాన కవుల పేరేమి ? ( అష్ట దిగ్గజములు )
41. ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన రచించిన ప్రబంధమేది ? ( మనుచరిత్ర )
42. నంది తిమ్మన ఎవరి ఆస్థాన కవి ? ఆయన వ్రాసిన గ్రంథమేది ?( శ్రీకృష్ణ దేవరాయలు, పారిజాతాపహరణము)
43. సంస్కృతమున ' సంగీత సూర్యోదయము'ను రచించిన లక్ష్మీ నారాయణ కవి ఎవరి ఆస్థానంలోని వాడు ? ( శ్రీకృష్ణ దేవరాయలు )
44. శ్రీకృష్ణ దేవరాయలు వ్రాసిన తెలుగు ప్రబంధమేది ? ( అముక్తమాల్యద)
45. శ్రీకృష్ణ దేవరాయలు తన తల్లి పేరుతో నిర్మించిన నగరం పేరేమి ? ( నాగలాపురం )
46. విజయనగరంలో శ్రీకృష్ణ దేవరాయలు నిర్మించిన దేవాలయాలు ఏవి ? ( కృష్ణ స్వామి దేవాలయం, హజారా రామాలయము)
47. శ్రీ కష్ణ దేవరాయల బిరుదులేవి ? ( ఆంధ్రభోజ, సాహితీ సమరాంగణ యవన రాజ్యస్థాపనాచార్య )
48. 'పాండురంగ మహాత్మ్యం'ను రచించిన తెనాలి రామకృష్ణుడు ఎవరి ఆస్థానములోని వాడు ? (శ్రీకృష్ణ దేవరాయలు)
49. శ్రీకృష్ణదేవరాయలు చేతిలో దివానీ, కోవిలకొండ యుద్ధాలలో ఓడిపోయిన బీదర్, బీజపూర్, సుల్తానులు ఎవరు? ( మహమ్మద్ యూసఫ్, ఆదిల్ షా )
50. రాయచూర్ యుద్ధంలో శ్రీకృష్ణ దేవరాయల చేతిలో ఓడిన బీజపూర్ సుల్తాను ఎవరు? ( ఇస్మాయిల్ ఆదిల్ షా )
51. శ్రీకృష్ణ దేవరాయల తూర్పు దిగ్విజయ యాత్రకు చిహ్నములుగా విజయస్థంభములు గల ప్రదేశములేవి ? ( సింహాచలము , పొట్నూరు )
52. శ్రీకృష్ణ దేవరాయలుతో సంధి చేసికొని తన కుమార్తె అయిన అన్నపూర్ణా దేవిని అతనికిచ్చి వివాహం చేసిన గజపతి రాజు ఎవరు ? (ప్రతాపరుద్ర గజపతి )
53. శ్రీకృష్ణ దేవరాయలు తరువాత విజయనగర సింహాసనము అధిష్టించింది ఎవరు ? ( అచ్యుత దేవరాయలు )
54. మొగలు సామ్రాజ్య స్థాపకుడైన బాబరుకు సమకాలికుడైన విజయనగర రాజు ఎవరు ? ( శ్రీకృష్ణ దేవరాయలు )

55. శ్రీ కృష్ణ దేవరాయలు ఎప్పుడు మరణించాడు ? ( క్రీ.శ. 1529 లో )

56. దక్షిణ దేశమున విజయనగర సామ్రాజ్యానికి చరమ గీతం పాడిన యుద్ధము ఏది ? ( తళ్ళికోట యుద్ధం ( లేదా ) రాక్షస - తంగడి యుద్ధం)

57. తళ్ళికోట యుద్ధం ఎప్పుడు జరిగింది ? ఎవరెవరి మధ్య జరిగింది ? (క్రీ.శ. 1565లో రామరాయలు నాయకత్వంలోని విజయనగర సైన్యానికి, బీజాపూర్ సుల్తాను ఆలీ ఆదిల్ షా నాయకత్వంలోని బహమనీ రాజ్యకూటమికి)

58. తుళువ వంశంలో చివరివాడు ఎవరు ? తుళువ వంశం ఎప్పుడు అంతరించింది? **( సదాశివ రాయలు, క్రీ.శ. 1576 లో )**

### ఆరవీటి వంశం

59. ఆరవీటి వంశ స్థాపకుడు ఎవరు ? ( తిరుమల రాయలు )

60. ఆరవీటి వంశీయుల రాజధానులు ఏవి ? (పెనుగొండ, నెల్లూరు )

61. ఆరవీటి వంశీయుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1570 - 1680 )

62. 'వసు చరిత్రను రచించిన రామరాజ భూషణుడు ఎవరి ఆస్థాన కవి ? (తిరమలరాయలు )

63. ఆరవీటి వంశస్థులలో గొప్పవాడు ఎవరు ? ( రెండవ వేంకటపతి రాయలు )

64. మొగలు చక్రవర్తియైన అక్బరు పాదుషా సార్వబౌమాధికారాన్ని నిరాకరించిన ఆరవీటి వంశ ప్రభువు ఎవరు ? ( రెండవ వేంకటపతిరాయలు )

65. 'రెండవ ఆంధ్రభోజుడు' అని ప్రసిద్ధి చెందిన విజయనగర రాజు ఎవరు? (రెండవ వేంకటపతి రాయలు )

66. రెండవ వేంకటపతి రాయల ఆస్థానంలోని సుప్రసిద్ధ తెలుగు కవులెవరు? (తెనాలి రామకృష్ణుడు , పింగళి సూరన )

67. ఆరవీటి వంశంలో చివరి పాలకుడు ఎవరు? అతడు ఎప్పుడు మరణించాడు ? (మూడవ శ్రీరంగరాయలు , క్రీ.శ. 1680 లో )

## నాయక రాజ్యాలు

### తంజావూరు నాయకులు

68. తంజావూరు నాయక రాజులలో మొదటివాడు ఎవరు ? ( చెవ్వప్ప నాయకుడు క్రీ.శ. 1535 - 1561 )

69. తంజావూరు చవ్వప్ప నాయక రాజు మంత్రి ఎవరు ? ( గోవింద దీక్షితులు )

70. తంజావూరు నాయక రాజులలో గొప్పవాడు ఎవరు? (రఘునాధరాయలు )

71. పోర్చుగీసువారి దుండగాలను అరికట్టిన తంజావూరు నాయకరాజు ఎవరు? (రఘునాధ రాయలు )

72. రఘునాధరాయలు ఆస్థానంలోని వైదిక విద్వాంసులు ఎవరు ? ( గోవింద దీక్షితులు , యజ్ఞనారాయణ దీక్షితులు )

73. రఘునాధరాయలు ఆస్థానంలోని తెలుగు కవి ఎవరు ? ( చేమకూర వేంకటకవి )

74. రఘునాధరాయలు ఆస్థానంలోని కవయిత్రులు ఎవరు ? ( రామభద్రాంబ, మధురవాణి )

75. రఘునాధరాయలు రచించిన గ్రంథాలు ఏవి ? ( సంగీత సుధ, వాల్మీకి చరిత్ర, పారిజాతాపహరణ నాటకం )

76. తెలుగులో ' యక్షగానములు ' ఎవరి కాలములో ప్రారంభమైనవి ? ( విజయరాఘవుడు క్రీ.శ. 1633 - 1673 )

77. తంజావూరు నాయకరాజులలో చివరివాడు ఎవరు ? ( చంగమలదాసు క్రీ.శ. 1673 - 1676 )

78. చంగమలదాసును తొలగించి తంజావూరు సింహాసనము నాక్రమించిన బీజపూర్ సేనాని ఎవరు? ( వెంకోజి )

### మధుర నాయకులు

79. మధుర నాయక రాజ్యాన్ని స్థాపించినదెవరు? ( విశ్వనాథ నాయకుడు )

80. విజయనగర రాజ్యాన్ని ధిక్కరించి మధుర రాజ్య స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది ఎవరు ? ( ముత్తు వీరప్ప నాయకుడు క్రీ.శ.1602 - 1623)

81. మధుర నాయక రాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? (తిరుమలనాయకుడు)

82. తిరుచురాపల్లి నుండి రాజధానిని మధురకు మార్చినది ఎవరు? ( తిరమల నాయకుడు )

83. తిరుమల నాయకుని ఆస్థానంలోని కవులు ఎవరు ? ( నీలకంఠ దీక్షితులు , కామేశ్వరకవి )

84. నీలకంఠదీక్షితులు వ్రాసిన కావ్యాలు ఏవి ? ( శివలీలా వర్ణనము, నీలకంఠ విజయము )

85. రెండవ చొక్కనాధుని అనంతరం మధురను పాలించిన అతని భార్య ఎవరు? ( మీనాక్షి )

86. సత్యభామా స్వాంతన కర్త ఎవరు ? ( కామేశ్వరకవి )

87. రెండవ వేంకటపతినాయకుడు ముత్తువీరప్పనాయకుని ఏ యుద్ధంలో ఓడించెను ? ( పళ్ళంకోట యుద్ధంలో )

88. మీనాక్షీ దేవిని మోసగించి మధురను ఆక్రమించిన కర్ణాటక నవాబు ఎవరు? ( చందాసాహెబ్ )

89. మధుర నాయక రాజులలో చివరివాడు ఎవరు ? ( రెండవ చొక్కనాధుడు క్రీ.శ.1689 - 1739 )

90. మైసూరునాయక రాజ్య స్థాపకుడు ఎవరు? (చామరాజు) (క్రీ.శ.1617-1637)

## మైసూరు నాయకులు

91. మైసూరునాయక రాజులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( చిక్క దేవరాయలు)

92. చిక్క దేవరాయల రాజధాని ఏది? ( శ్రీరంగపట్టణం )

93. ఆధునిక మైసూరు రాష్ట్ర నిర్మాత ఎవరు ? ( ( చిక్క దేవరాయలు )

94. తెలుగు వచన భారత కర్తఐన కళువెవీరరాజు ఎవరి ఆస్థానంలోని వాడు? ( చిక్క దేవరాయలు )

95. క్రీ.శ. 1761లో మైసూరు రాజ్యాన్ని ఆక్రమించిన సేనాని ఎవరు ? (హైదర్ ఆలీ )

## (బి) బహమనీ రాజ్యాలు

96. బహమనీ రాజ్యం ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ. 1347 లో )

97. బహమనీ రాజ్యస్థాపకుడు ఎవరు? ( హసన్ గంగుబహమని)

98. హసన్‌గంగు బహమని ఏ పేరుతో సింహాసనము నధిష్టించెను?
(అబుల్ ముజఫర్ అల్లాఉద్దీన్‌మహమ్మద్ షా బహమిని )

99. బహమిన్ షా రాజధాని ఏది ? (గుల్బర్గా)

100. అల్లాఉద్దీన్ బహమన్ షా రాజ్యస్థాపనలో సహాయము చేసినది ఎవరు? ( కాపయనాయకుడు )

111. తెలంగాణా ప్రాంతాన్ని బహమనీ రాజ్యంలో విలీనం చేసిన బహమనీ సుల్తాను ఎవరు? ( రెండవ అహమ్మద్ షా )

112. రెండవ అరిస్టాటిల్ అని పేరుపొందిన బహమనీ సుల్తాన్‌ఎవరు ? ( రెండవ అహమ్మద్ షా )

113. 'ప్రాచ్యదేశపు నీరో' అని దూషింపబడిన బహమనీ సుల్తాన్ ఎవరు ? (హుమయూన్ )

114. బహమనీ రాజధానిని ' గుల్బర్గా' నుండి ' బీదర్' కు మార్చిన బహమనీ సుల్తాన్ ఎవరు ? ( రెండవ అహమ్మద్ షా)

115. బహమనీ సుల్తానులలో గొప్పవాడెవరు ? ( మూడవ మహమ్మద్ షా)

116. మూడవ మహమ్మద్ షా రాజ్యవైభవానికి కారకుడు ఎవరు ? ( అతని మంత్రి గవాన్ )

117. మహమ్మద్ గవాన్ ఏ దేశస్థుడు ? ( పారశీకము )

118. పంటపొలములను సర్వే చేయించి పంటను బట్టి శిస్తు నిర్ణయ విధానాన్ని ప్రవేశపెట్టిన బహమనీ సుల్తాన్ మూడవ మహమ్మద్ షా ప్రధాన మంత్రి ఎవరు ? ( గవాన్ )

119. బహమనీ రాజ్యపాలకులలో చివరివాడు ఎవరు? ( కాలీముల్లా)

120. పారశీక వాస్తు శిల్ప కళా రీతులు దక్షిణ ఇండియాలో వ్యాపించుటకు కారకులైన సుల్తానులు ఎవరు ? (బహమనీ సుల్తానులు )

121. బహమనీ రాజ్యం విచ్ఛిన్నమై ఏర్పడిన ఐదు ముస్లిం రాజ్యాలు ఏవి ?
( బీదర్, బీరార్, బీజాపూర్, అహమ్మద్ నగర్ , గోల్కొండ )

122. బీరార్‌లో ఇమ్మద్ షాహీ వంశాన్ని స్థాపించిన వాడు ఎవరు? ( ఫతుల్లా )

123. బీరార్ రాజధాని ఏది ? ( ఎలిచ్‌పూర్ )

124. రాక్షసి - తంగడి యుద్ధంలో బీరార్ ఆటస్థలము వహించుటకు కారకుడు? ( తుఫాల్ ఖాన్ )
125. బీదర్‌ను పాలించిన బరీద్‌షాహి వంశ స్థాపకుడు ఎవరు ? ( ఖాసిం బరీద్ )
126. దక్కన్ గుంట నక్క అని ఎవరినందురు ? ( బీదర్ సుల్తాన్ అమీర్ ఆలీ )
127. అహమ్మద్ నగర్‌ను పాలించిన నిజాంషాహీ వంశ స్థాపకుడు ఎవరు ? ( మాలిక్ అహమ్మద్ )
128. మాలిక్ అహమ్మద్ నిర్మించిన నగరము ఏది ? ( అహమ్మద్ నగరము)
129. బహమనీ రాజ్యంనుండి అహమ్మద్‌నగర్ ఎప్పుడు విడిపోయింది ? ( క్రీ.శ. 1490 )
130. బీరార్ అహమ్మద్‌నగర్‌లో ఎప్పుడు విలీనం చేయబడింది ? ( కీ.శ. 1574లో )
131. బీజపూర్‌ను పాలించిన అదిల్ షాహీ వంశ స్థాపకుడు ఎవరు ? ( యూసఫ్ ఆదిల్ షా )
132. బీజపూర్ బహమనీ రాజ్యం నుండి ఎప్పుడు విడిపోయింది ? ( క్రీ.శ. 1490 )
133. బీదర్ బీజపూర్‌లో ఎప్పుడు విలీనమైంది ? ( క్రీ.శ. 1619 లో )
134. బీదర్‌ను బీజపూర్‌లో విలీనం చేసింది ఎవరు ? ( రెండవ ఇబ్రహీం ఆదిల్ షా )
135. గోల్కొండను పాలించిన కుతుబ్‌షాహి వంశ స్థాపకుడు ఎవరు ? ( కులీకుతుబ్ షా)
136. బహమనీ రాజ్యంనుండి గోల్కొండ ఎప్పుడు విడిపోయింది ? ( క్రీ.శ. 1512 )
137. మొగలు చక్రవర్తులు దక్షిణాపథముపై అడుగుపెట్టేనాటికి దక్షిణాపథములో మిగిలిన ముస్లిం రాజ్యాలేవి?
( అహమ్మద్‌నగర్, బీజపూర్, గోల్కొండ )
138. అహమ్మద్‌నగర్‌ను మొగలు సామ్రాజ్యంలో విలీనం చేసినది ఎవరు.? ( షాజహాన్ కీ.శ. 1631 లో )
139. గోల్కొండ, బీజపూర్‌లను మొగలు సామ్రాజ్యంలో విలీనం చేసిన చక్రవర్తి ఎవరు ? ( ఔరంగజేబు )
140. బీరార్ ఎవరి కాలంలో మొగలు సామ్రాజ్యంలో విలీనమైంది ? ( అక్బర్ )
141. 'బర్యాన్ ఇమసర్ ' అను గ్రంథమును రచించిన ముస్లిం చరిత్రకారుడు , రెండవ బుర్హాన్ షా ఆస్థాన పండితుడు ఎవరు?
(-తబ-తబ)
142. అక్బరుతో వీరోచితముగా పోరాడి, ఓడిన అహమ్మద్ నగర్ పాలకురాలు ఎవరు ? ( చాంద్‌బీబీ)
143. చాంద్‌బీబీ ఎవరి భార్య ? ( ఆలీ ఆదిల్ షా )
144. ' చాంద్ బీబీ ' మరణానంతరం అహమ్మద్‌నగర చరిత్రలో ప్రముఖ పాత్రవహించినది ఎవరు? (మాలిక్ అంబర్ )
145. అహ్మద్ నగర చరిత్రలో ప్రముఖుడైన మంత్రి ఎవరు? ( మాలిక్ అంబర్)
146. అహమ్మద్‌నగర్‌ను పాలించిన నీజాంషాహీ వంశంలో చివరివాడు ఎవరు? (రెండవ మూర్తజా)
147. శివాజీ సమకాలికుడైన బీజపూర్ సుల్తాన్ ఎవరు ? (మహమ్మద్ ఆదిల్ షా )
148. విజయనగర రామరాయలుతో మైత్రి కొనసాగించి పరమత సహనం ప్రదర్శించి, తన రాజ్యాన్ని, కాపాడుకున్న బీజపూర్ సుల్తాన్ ఎవరు ? ( ఇబ్రహిం ఆదిల్ షా)
149. బీజపూర్‌లోని మహమ్మద్ ఆదిల్‌షా సమాధి పేరేమి ? ( జోల్‌గుంభజ్)
150. బీజపూర్‌వంశ రాజులలో చివరి వాడు ఎవరు ?ఎప్పుడు మరణించాడు? ( సికిందర్ షా, క్రీ.శ.1700 )
151. హైదరాబాద్‌ను నిర్మించిన గోల్కొండ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ కులీకుతుబ్ షా క్రీ.శ. 1580 - 1612 )
152. అనేక మంది తెలుగు కవులను పోషించి 'మల్కిభరాం' అని పేరుపొందిన గోల్కొండ సుల్తాను ఎవరు ?
( ఇబ్రహీం కుతుబ్ షా క్రీ.శ. 1550 - 1580 )
153. చార్మినార్‌ను కట్టించిన గోల్కొండ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ కులీకుతుబ్ షా క్రీ.శ . 1593. )
154. గోల్కొండ మొగలు సామ్రాజ్యంలో ఎప్పుడు విలీనమైంది ? ( క్రీ.శ. 1687లో )
155. గోల్కొండను పాలించిన కుతుబ్ షాహి వంశంలో చివరివాడు ఎవరు ? (అబ్దుల్ హసన్ క్రీ.శ. 1672 - 1687 )
156. అబ్దుల్ హసన్ మంత్రులెవరు ? ( అక్కన్న, మాధన్న )
157. శివాజీ సమకాలికుడైన గోల్కొండ నవాబుఎవరు? ( అబ్దుల్ హసన్ )
158. భద్రాచల రామదాసును బంధించిన తానీషా ఎవరు ? ( అబ్దుల్ హసన్ )

159. గోల్కొండ రాజ్య రాజధానిని గోల్కొండ నుండి హైదరాబాద్ కు మార్చిన గోల్కొండ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ కులీకుతుబ్ షా)

160. ఔరంగజేబు తానీషాను ఏకోటలో బంధించెను ?( దౌలతాబాద్ )

## 14. మొగలు యుగం (క్రీ.శ. 1526 - 1707)

1. మొగలు సామ్రాజ్య స్థాపకుడెవరు ? ( బాబరు )
2. మొగలు సామ్రాజ్యం ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ. 1526 లో )
3. ఏ యుద్ధము మొగల్ సామ్రాజ్య స్థాపనకు దోహదము చేసినది ? ( మొదటి పానిపట్టు యుద్ధము)
4. బాబరునకు విజయ పరంపరలను సాధించిపెట్టిన సైన్య విభాగమేది? ( ఫిరంగి దళము )
5. మొదటి పానిపట్టు యుద్ధము ఎవరెవరికి ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1526 లో బాబరు - ఇబ్రహీంలోడీకి )
6. బాబరు పూర్తి పేరేమి ? ( జహీరుద్దీన్ మహమ్మద్ బాబరు )
7. బాబరు ఏ తెగకు చెందినవాడు ? ( టర్కీ జాతికి చెందిన 'చగ్‌కాషి' తెగకు )
8. బాబరు టర్కీభాషలో రచించిన స్వీయ చరిత్ర పేరేమి ? ( తుజక్ - ఇ-బాబరీ)
9. కాల్విహ యుద్ధం ఎవరెవరికి, ఎప్పుడు జరిగింది ? విజేత ఎవరు?
   ( క్రీ.శ. 1527 మార్చి 17న బాబరు, రాణా సంగ్రామ సింహుడు మధ్య విజేత బాబరు )
10. బాబరు పాలనా కాలమేది ? (క్రీ.శ. 1520 - 1530 )
11. బాబరు తరువాత రాజ్యమునకు వచ్చినది ఎవరు ? ( హుమాయూన్ )
12. హుమాయూన్ పూర్తి పేరు ఏమిటి ? ( నసీరుద్దీన్ మహమ్మద్ హుమాయూన్ )
13. చౌసా యుద్ధము ఎవరెవరికి మధ్య ఎప్పుడు జరిగింది ? విజేత ఎవరు ?
   ( హుమాయూన్, షేర్షాల మధ్య 1539లో విజేత షేర్షా )
14. హుమాయూన్ షేర్షా చేతిలో పూర్తిగా ఓడిపోయి అజ్ఞాత వాసమునకు వెళ్ళినది ఏ యుద్ధము తరువాత ? ( క్రీ.శ. 1540లో జరిగిన కనూజ్ యుద్ధం )
15. హుమాయూన్‌ను ఆదరించి సహకరించిన పారశీక చక్రవర్తి ఎవరు ? ( షాతమస్పు )
16. హుమాయూన్ ఢిల్లీ సింహాసనాన్ని ఎపుడు ? ఎవరినోడించి పొందినాడు ? ( క్రీ. శ. 1555 లో సికిందర్ షా )
17. హుమాయూన్ వ్యక్తిత్వమునందు గల విశిష్ట లక్షణమేది ? ( పట్టుదల )
18. అక్బరు తల్లిదండ్రులు ఎవరు ? (హుమాయూన్ - హమీదాబేగం )
19. అక్బరు ఎప్పుడు ? ఎక్కడ జన్మించాడు ? ( క్రీ.శ. 1542. అమర్ కోటలో)
20. హుమాయూన్ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1530 - 40 మరియు 1555 - 56 )
21. హుమాయూన్ తన పఠన మందిరం నుండి దిగుతూ కాలుజారి పడి మరణించింది ఎప్పుడు? ( క్రీ.శ. 1556 జనవరి 26)
22. షేర్షా అసలు పేరేమిటి ? ( ఫరీద్ )
23. అసహాయశూరుడై పులిని చంపినందుకు దక్షిణ బీహారు పాలకుడైన ' బహార్ ఖాన్ లోహనీ ' ఫరీద్‌కు ఇచ్చిన బిరుదు ఏది? (షేర్‌ఖాన్)
24. షేర్షా చునార్ దుర్గాధిపతి ఎపుడు అయినాడు ? ( క్రీ.శ. 1553లో )
25. షేర్షా జన్మస్థలమేది ? ( నసరామ్ )
26. షేర్షా ఏ జాతీయుడు ? ( ఆఫ్ఘను )
27. ఏ యుద్ధం తరువాత షేర్షా ఢిల్లీ పాలకుడైనాడు ? (కనూజ్ యుద్ధం (క్రీ.శ. 1540 ))
28. షేర్షా ఏకోట ముట్టడిలో మరణించాడు ? ( కలింజర్ ( క్రీ.శ. 1545))
29. ప్రజాభీష్టాన్ని ప్రధానంగా చేసుకొని ప్రభుత్వ యంత్రాంగాన్ని నిర్మించటానికి ప్రయత్నించిన ప్రప్రథమ భారతీయ ముస్లిం చక్రవర్తి ఎవరు ? ( షేర్షా )

30. షేర్షా తన రాజ్యాన్ని ఎన్ని సర్కారులుగా విభజించినాడు ? ( 47 )
31. షేర్షా ప్రవేశ పెట్టిన భూమిశిస్తు విధానం ఏది ? ( రైత్వారీ పద్ధతి )
32. సర్కారును పాలించే అధికార్ల పేరేమి ? ( ప్రధాన షిక్దార్ , ప్రధాన మున్సిఫ్)
33. షేర్షా మంత్రిమండలిలోని సభ్యులెవరు ? (నలుగురువారు 1) వజీర్ 2) అరీజ్ 3) రసాలత్ 4) ఇన్షా )
34. షేర్షా పాలన యందు ' వజీర్ ' అనగానెవరు ? ( ప్రధానమంత్రి )
35. షేర్షా పాలనలోని ' అరీజ్' ఎవరు ? ( రక్షణ మంత్రి )
36. షేర్షా పాలనలోని ' రసాలత్ ' ఎవరు ? ( విదేశాంగ మంత్రి )
37. షేర్షా ఆస్థానంలో రాజశాసనాలను, ఉత్తర ప్రత్యుత్తరాలను పరిశీలించే మంత్రి ఎవరు ? ( ఇన్షా )
38. ప్రభుత్వం పట్ల రైతులకు గల బాధ్యతను తెలియజేస్తూ రైతుల నుండి షేర్షా గ్రహించిన పత్రాలేవి ? షేర్షా రైతులకు ఇచ్చిన పత్రాలేవి? ( కబోలియత్‌లు, పట్టాలు )
39. షేర్షా కాలంలో తాలుకా స్థాయి పాలనా విభాగమేది ? ( పరగణా )
40. పరగణాలోని ప్రధాన ఉద్యోగులెవరు ? ( షిక్దార్ , మున్సిఫ్, పోద్దార్ )
41. షేర్షా పాలనలో గ్రామపాలనలో గ్రామ పెద్దలకు సహకరించే ఉద్యోగులెవరు? ( పట్వారీ - చౌకీదార్ - మక్థన్ )
42. ఢిల్లీలోని 'పురాణఖిలా'ను నిర్మించింది ఎవరు ? ( షేర్షా )
43. పాలనా విధానంలో అక్బరుకు మార్గ దర్శకుడు ఎవరు ? ( షేర్షా )
44. అక్బర్ పూర్తి పేరేమి ? (జలాలుద్దీన్ మహమ్మద్ అక్బర్ )
45. అక్బర్ పూర్తి పేరేమి ? ( జలాలుద్దీన్ మహమ్మద్ అక్బర్ )
46. అక్బరు పాదుషా గా ఎప్పుడు ? ఎక్కడ ? ప్రకటింపబడ్డాడు? ( క్రీ.శ. 1556 ఫిబ్రవరి 4వ తేదిన కాల్‌నూర్‌లో )
47. అక్బరు సంరక్షకుడు ఎవరు ? ( బైరాంఖాన్ )
48. రెండవ పానిపట్టు యుద్ధము ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1556 )
49. రెండవ పానిపట్టు యుద్ధం ఎవరెవరికి జరిగింది ? విజేత ఎవరు ? ( హేయు - బైరాంఖాన్‌లకు, బైరాంఖాన్ )
50. అక్బరును వీరోచితంగా ఎదిరించి అసువులు బాసిన రాజపుత్ర వనిత ఎవరు ? ( రాణీ దుర్గావతి )
51. అక్బరుని వీరోచితంగా ఎదిరించిన రసపుత్ర వీరుడెవరు ? ( రాణాప్రతాప సింహుడు )
52. అక్బరు సేనాని రాజామాన్‌సింగ్ రాణాప్రతాపసింహుని ఏ యుద్ధంలో ఓడించాడు? ( హాల్దీ ఘాట్ యుద్ధం క్రీ.శ.1574 )
53. అక్బరు స్థాపించిన నూతన మతమేది ? ( దిన్-ఇ-ఇలాహి క్రీ.శ.1582 )
54. అక్బరు నూతన మతాన్ని స్వీకరించిన ఒకేఒక హిందువు ఎవరు ? ( బీహారీమల్)
55. అక్బరు కట్టించిన పూజామందిరం పేరేమి ? ( ఇబాదత్ ఖానా )
56. అక్బరు నూతన మతమునకు ప్రధానాధికారి ఎవరు ? ( అబుల్ ఫజల్ )
57. అక్బరు రాజ్యంలో రాష్ట్రమును ఏమందురు ? ( సుబా )
58. అక్బరు తన రాజ్యాన్ని ఎన్ని సుబాలుగా విభజించినాడు ? ( 15 సుబాలుగా )
59. అక్బరు కాలంలోని సుప్రసిద్ధ పారశీక కవి ఎవరు ? ( అబుల్ ఫజల్ )
60. అక్బరు ఆస్తాన గాయకుడు ఎవరు ? ( తాన్‌సేన్ )
61. అక్బరు సమకాలీకుడయిన హిందీ రామాయణ కర్త ఎవరు ? ( తులసీదాస్ )
62. అక్బరు ఆస్థాన చిత్రకారులుఎవరు ? ( బసవన్ , దసవంత్ )
63. సలీమ్ చిస్తీ గౌరవార్థం అక్బరు నిర్మించిన పట్టణం ఏది ? ( ఫతేపూర్ సిక్రీ )
64. అక్బరు నిర్మించిన కట్టడము లేవి ? ( బులంద్ దర్వాజ - ఆగ్రా, లాహోరు కోటలు -పంచమహల్, జుమామసీదు - దివాన్ఇఖాస్, దివాన్-ఇ-ఆమ్, ఇబాదత్ ఖాన్)
65. అక్బరు పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1556 - 1605 )

66. అక్బరు ఏ సం॥లో మరణించినాడు ? ( క్రీ.శ. 1605 )
67. అక్బరు తరువాత సింహాసన మధిష్టించిన వారెవరు ? ( జహంగీరు )
68. జహంగీరు అసలు పేరేమి ? ( సుల్తాన్ మహమ్మద్ సలీం)
69. అబుల్ ఫజల్‌ను హత్య చేయించినది ఎవరు ? ( జహంగీరు )
70. జహంగీరు పై తిరుగుబాటు చేసిన అతని కుమారుడు ఎవరు ? ( ఖుస్రూ )
71. జహంగీరు వ్రాసిన స్వీయ చరిత్ర ఏమిటి ? ( తుజ్ - కే - జహంగీరీ )
72. జహంగీర్ నూర్జహానుల వివాహం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1611 లో )
73. జహంగీర్‌ను లోబరచుకొని పారశీకయువతైన నూర్జహాను ఎన్ని సం॥లు మొగలు సామ్రాజ్యాన్ని పాలించినది ? ( 11 సం॥లు క్రీ.శ.1611-1622)
74. జహంగీరు ఆస్థానానికి వచ్చిన ఇంగ్లండ్ రాయబారులెవరు ? (విలియం హాకిన్స్, సర్ థామస్‌రో)
75. జహంగీరు ఆస్థానానికి రాయబారులను పంపిన బ్రిటీష్ చక్రవర్తి ఎవరు ? ( మొదటి జేమ్స్ )
76. న్యాయగంటను ఏర్పాటు చేసిన మొగలు చక్రవర్తి ఎవరు ? ( జహంగీరు )
77. నూర్జహన్ తన మేనకోడలు ముంతాజ్‌మహల్‌ని ఎవరికిచ్చి వివాహం చేసింది? ( షాజహన్ )
78. జహంగీరుచే నిర్మింపబడిన అక్బరు సమాధి ఎక్కడ ఉంది ? ( సికింద్రా )
79. ఆంగ్లేయులు మొదట వర్తక కేంద్రమును జహంగీరు అనుమతితో ఎక్కడ ఏర్పరచుకొనిరి ? ( సూరత్ లో )
80. జహంగీరు పై షాజహాన్ చేసిన తిరుగుబాటును అణచివేసిన మొగలు సేనాని ఎవరు ? ( మహబత్ ఖాన్ )
81. జహంగీరు ఎప్పుడు మరణించాడు ( క్రీ.శ. 1627లో )
82. జహంగీరు సమాధి ఎక్కడ ఉంది ? ( లాహోర్‌లో )
83. నూర్జహాను అసలు పేరేమి ? నూర్జహాను ఎవరి కుమార్తె ?
( మెహరున్నీసా, ఖోరవాన్ వాస్తవ్యుడు పర్షియా మీర్జా ఘీమాస్‌బేగ్ కుమార్తె)
84. నూర్జహాను మొదటి భర్త ఎవరు ? ( షేర్ ఆఫ్ఘన్ )
85. నూర్జహాన్ తన కుమార్తె అయిన లాడ్లీ బేగంను ఎవరికిచ్చి వివాహం చేసింది? ( జహంగీరు కుమారుడైన 'పెరియారు'కు)
86. నూర్జహాన్ లాహోర్ వెళ్ళి తన శేష జీవితాన్ని దైవ చింతనలో గడుపుతూ ఎప్పుడు మరణించింది ? ( క్రీ.శ. 1645. )
87. మొగల్ వంశీయులలో ఎవరి కాలాన్ని స్వర్ణయుగమందురు ? ( షాజహాను )
88. షాజహన్ మొగల్ సింహాసనాన్ని ఎప్పుడు అధిష్టించినాడు ? ( క్రీ.శ. 1628లో)
89. షాజహాన్ అసలు పేరేమి ? ( ఖుర్రం)
90. షాజహాన్ భార్య ముంతాజ్‌మహల్ ఎప్పుడు మరణించింది ? ( క్రీ.శ. 1633 జనవరి 17 )
91. షాజహాన్ భార్య ముంతాజ్‌మహల్ జ్ఞాపకార్థం నిర్మించిన గొప్ప కట్టడం ఏది ? ( తాజ్ మహల్ )
92. షాజహాన్ పై తిరుగుబాటు చేసిన దక్కను పాలకుడు ఎవరు ? ( ఖాన్ జహన్ )
93. షాజహాన్ అహమ్మద్‌నగర్‌ను ఎప్పుడు ఆక్రమించాడు ? ( క్రీ.శ. 1633లో )
94. షాజహాన్ కాలంలో మొగలు సామ్రాజ్యం సందర్శించిన ఫ్రెంచి యాత్రికుడెవరు ? ( బర్నియర్ )
95. మొగలు చక్రవర్తులలో గొప్ప నిర్మాత ఎవరు ? ( షాజహాన్ )
96. 'భువిపై ఆనందమయ స్వర్గం అంటూ ఉంటే అది ఇదే ' అని ఏ కట్టడం గోడలపై వ్రాసి ఉంది ?
( ఎర్రకోట భవనాలులోని రివానీఖాన్ కట్టడంలోని గోడలపై )
97. ఢిల్లీలోని ' జుమ్మా మసీదు ' ఆగ్రాలోని 'మోతీ మసీదు ' ను నిర్మించింది ఎవరు ? ( షాజహన్ )
98. మయూర సింహాసనాన్ని చేయించింది ఎవరు ? ( షాజహాన్ )
99. షాజహాన్ ఆస్థానంలోని సుప్రసిద్ధ సంస్కృత పండితుడు ఎవరు ? ఆయన వ్రాసిన గ్రంథములేవి ?
( జగన్నాథ పండితుడు, రసగంగాధరము, గంగాలహరి)

100. షాజహాన్ పెద్ద కుమారుడు "దారాయ కోల్ " వ్రాసిన గ్రంథమేది ? ( మహా సముద్ర సంగ్రామం )

101 షాజహాన్ ఆస్థానంలోని చరిత్ర కారులు ఎవరు ? ( అబుల్ హమీద్ లాహిరీ, ఇతియత్ ఖాన్ )

102. షాజహాన్ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1628 - 1656 )

103. షాజహాన్‌ను బందీ చేసిన అతని కుమారుడు ఎవరు ? షాజహాన్ ఎప్పుడు మరణించాడు ? ( ఔరంగజేబు క్రీ.శ. 1666లో )

104. ఔరంగజేబు మొగలు సింహాసనాన్ని ఎప్పుడు ఆక్రమించినాడు ? ( క్రీ.శ. 1658 లో )

105. ఔరంగజేబు అసలు పేరు ఏమి ? (మొహిదీన్ మహమ్మద్ ఔరంగజేబు )

106. భారతదేశాన్ని పూర్తిగా మొగల్ సామ్రాజ్యంలోనికి తీసుకువచ్చిన మొగలు చక్రవర్తి ఎవరు ? ( ఔరంగజేబు )

107. ఔరంగజేబుచే వధింపబడిన శిక్కుల మత గురువు ఎవరు ? ( తేజ్ బహదూర్ )

108. హిందూ దేవాలయాలను, పాఠశాలలను ధ్వంసం చేయడానికి ఔరంగజేబు నియమించిన ప్రత్యేకాధికారి ఎవరు ? ( దరోగా )

109. మధుర పరిసరాలలోని జాటలు ఔరంగజేబుపై ఎవరి నాయకత్వంలో తిరుగుబాటు చేశారు ? ( గోక్లా )

110. ఔరంగజేబుపై తిరగుబాటును చేసిన మహరాష్ట్ర నాయకుడు ఎవరు ? ( శివాజీ )

111. ఔరంగజేబు ఎప్పుడు మరణించాడు ? ( క్రీ.శ. 1707లో )

112. ఔరంగజేబు పాలనా కాలమేది ? ( క్రీ.శ.1658 - 1707 )

113. బుందేల్ ఖండ్ స్వాతంత్ర్యాన్ని ప్రకటించి ఔరంగజేబును ఎదిరించిన బుందేల్‌ఖండ్ నాయకుడు ఎవరు? (ఛత్రసాల్ )

114. రాజపుత్రులు ఎవరి నాయకత్వములో ఔరంగజేబుపై తిరుగుబాటు చేశారు ? ( దుర్గాదాస్ )

115. ఎవరి మరణంతో భారతదేశంలో మొగలుల ప్రాభవం అడుగంటుటతోపాటు మధ్యయుగం అంతరించినది ? (ఔరంగజేబు )

116. ఔరంగజేబు తరువాత మొగలు సింహాసనాన్ని అధిష్టించింది ఎవరు ? ( బహదూర్ షా (లేక) మొదటి షా ఆలం )

117. మొగలు పాలనా విధానానికి మూల పురుషుడు ఎవరు ? ( అక్బరు )

118. మొగలుల పరిపాలనలో ప్రభుత్వానికి పెద్ద ఎవరు ? ( చక్రవర్తి )

119. మొగలుల ప్రధాన మంత్రి పేరేమి ? ( వకీల్ )

120. మొగలుల సేనాపతి ఎవరు ? (మీర్ భక్షి)

121. మొగలుల ఆర్థిక మంత్రి పేరేమి ? ( దివాన్ )

122. మొగలుల న్యాయశాఖ మంత్రి ఎవరు? (చీఫ్ ఖాజీ )

123. మొగలుల అంత:పురాధికారి ఎవరు ? ( మీర్ సమన్ )

124. మొగలుల మతాధికారి పేరేమి ? (చీఫ్ సదర్ )

125. పరిపాలనలో అక్బరు ఎవరికి చోటీయలేదు ? ( ఉలేమాలకు )

126. మొగలుల కాలంలో డారోగా -ఇ-టాప్‌కాన్ అనగా ఎవరు ? ( రాజభవనం, కోటల రక్షణాధికారి )

127. మొగలు సామ్రాజ్యంలో రాష్ట్ర స్థాయి పాలనా విభాగం పేరేమి ? దాని పాలకుడు ఎవరు ? ( సుబా - సుబేదార్ )

128. మొగలు పాలనలో జిల్లా స్థాయి విభాగం ఏది ?ఈ విభాగ పాలకుడెవరు ? అతనికి ఏ ఉద్యోగులు సాయం చేస్తారు ? ( సర్కార్ , ఫౌజుదార్ సహాయకులు అమల్ గుజార్, ఖజానాదార్ )

129. మొగలు పాలనలో తాలుకా స్థాయి పాలనా విభాగం పేరేమి ? దీని ప్రధాన పాలకుడు ఎవరు? అతనికి తోడ్పడే ఉద్యోగులు ఎవరు ? ( పరగణా ( లేక ) మహల్ - షిక్‌దార్, సహాయకులు; అమత్ ఫొద్దార్, కానుంగో )

130. మొగలుల కాలంలో గ్రామపాలనను నిర్వహించేవారు ఎవరు? వారికి సహయము చేసే ఉద్యోగులెవరు ? (గ్రామ పంచాయతీ, మక్‌ధన్, పట్వారీ )

131 మొగలాయిల రాష్ట్రంలో పట్టణాధికారి ఎవరు ? ( కొత్వాల్ )

132. పట్వారీ విధులేవి ? ( పంటపొలములు - శిస్తు గూర్చి లెక్కల తయారీ )
133. మక్‌దిన్ విధులేవి ? ( శాంతి భద్రతల పరిరక్షణ )
134. అక్బరు భూమిశిస్తు విధానంలో అతనికి తోడ్పడింది ఎవరు ? ( రాజాతోడర్‌మల్ )
135. భూమిని కొలవటానికి అక్బరు ప్రవేశపెట్టిన సాధనం పేరేమిటి ? (జరీత్ )
136. మొగలాయిలు భూమిని కొలుచుటకు ఉపయోగించు కొలతత్రాడు ఏది? ( తనబ్ )
137. మొగలాయిల కాలంలో చక్రవర్తి పోషించు సైన్యమునేమందురు ? ( స్థిర సైన్యము )
138. మొగలాయిల సైనిక విధానము ఏది ? ( మున్సబ్‌దారీ విధానము )
139. మున్సబ్‌దారీ విధానం అంటే ఏమిటి ? ( క్రమ బద్ధమైన అశ్వికదళ నిర్వహణ )
140. మున్సబ్‌దారులు ఎవరికి బాధ్యత కలిగి ఉంటారు? ( చక్రవర్తికి )
141. అక్బరు ఆస్థాన పండితుడు అబుల్ ఫజల్ బిరుదమేది ? ( కవిరాజు )
142. అక్బరు ఆస్థానంలోని చిత్రకారుడు ఎవరు ? అతని బిరదమేది ? ( అబ్దుల్ సమద్, రమ్యలేఖిని )
143. అక్బరు ఆస్థానంలోని సుప్రసిద్ధ గాయకులలో గొప్పవాడు ఎవరు ? ( తాన్‌సేన్ )
144. అక్బరు కాలంలో తయారుచేయబడిన పారశీక - సంస్కృత నిఘంటువు పేరేమి ? ( పారశీ ప్రకాష్ )
145. అబుల్ ఫజల్ వ్రాసిన పారశీక గ్రంథాలేవి ? ( అక్బరు నామా, దినీ అక్బరీ )
146. 'హుమాయూన్ నామా'ను వ్రాసింది ఎవరు? ( గుల్‌బదన్ బేగం )
147. 'కవిరాయ' అను బిరుదును పొందిన అక్బరు ఆస్థాన కవి ఎవరు ? ( బీర్బల్ )
148. అక్బరు కాలం నాటి సుప్రసిద్ధ హిందీకవి ఎవరు ? ( తులసీదాస్ )
149. ఆగ్రాలోని అంధ గాయకుడు సూరదాసు రచించిన గ్రంథమేది ? ( సూర్ సాగర్ )
150. తబకత్ - ఇ - అక్బరీ అను చరిత్ర గ్రంథాన్ని రచించింది ఎవరు ? ( నిజాముద్దీన్ అహమ్మద్ )
151. ఏ మొగలు చక్రవర్తి కాలంలో వాస్తు శిల్పం మహోన్నత స్థితికి చేరుకుంది ? ( షాజహాన్ )
152. 'చిత్రలేఖనం' మహోన్నత స్థితికి చేరుకొన్నది ఏ మొగలు చక్రవర్తి కాలంలో? ( జహంగీర్ )
153. జహంగీర్ కాలంలో ప్రసిద్ధి గాంచిన హిందూ చిత్రకారులు ఎవరు? ( బిషన్ దాస్, మనోహర్, గోవర్ధన్ )
154. షాజహాన్ ఆస్థానంలోని సుప్రసిద్ధ గాయకుడు ఎవరు.? ( లాల్ ఖాన్ )
155. ఏ మొగలు చక్రవర్తి కాలంలో లలిత కళలకు నిరాదరణ లభించింది ? ( ఔరంగజేబు)
156. 'ఫతావా ఇ అలంఘీరీ అను న్యాయ శాస్త్రమును తయారు చేయించిన దెవరు ? ( ఔరంగజేబు )
157. పారశీక చక్రవర్తి నాదిర్షా భారతదేశంపై ఎప్పుడు దండెత్తినాడు ? అప్పటి మొగలు చక్రవర్తి ఎవరు ? ( క్రీ.శ. 1739 లో, మహమ్మద్ షా )
158. మొగలు చక్రవర్తుల చివరి వాడెవరు? ( రెండవ బహదూర్ షా )
159. రెండవ బహదూర్‌షా ఎప్పుడు ఎక్కడ మరణించినాడు ? ( క్రీ.శ.1862 రంగూన్‌లో, ఆంగ్లేయుల బందీగా )

## శిక్కులు

160. శిక్కు మత స్థాపకుడెవరు ? ( గురునానక్ )
161. నానక్ శిష్యులనేమందు? ( శిక్కులు )
162. శిక్కుల పుణ్య క్షేత్రమేది ? ( అమృతసర్ లోని స్వర్ణ దేవాలయము )
163. శిక్కుల పవిత్ర గ్రంథమేది ? (' ఆదిగ్రంథ్ ' లేక గ్రంథ సాహెబా .)
164. గురునానక్ ఏ మొగలు చక్రవర్తి సమకాలికుడు ? ఆయన జీవిత చరిత్రను వ్రాసిన శిక్కు గురువెవరు ? ( బాబరు, గురుఅంగదుడు )
165. గురు నానక్ ఎప్పుడు ? ఎక్కడ జన్మించినాడు ? ( క్రీ.శ. 1469లో పంజాబులోని తల్వెండి గ్రామములో )
166. శిక్కుల పుణ్యక్షేత్రమైన అమృతసర్‌లోని స్వర్ణ దేవాలయ నిర్మాణాన్ని అమృత సరస్సును త్రవ్వించిన శిక్కు గురువు ఎవరు ( గురు రామదాస్ )

167. 'ఆధిగ్రంథ్' - శిక్కు మత గ్రంథాన్ని వ్రాసిన శిక్కు గురువు ఎవరు ? ( గురు అర్జున్ సింగ్ )
168. శిక్కుల ప్రథమ పాలకుడైన శిక్కు గురువు ఎవరు ? ( గురు అర్జున్ సింగ్ )
169. గురు అర్జున్ సింగ్ ను మొగలు ఆస్థానంలో వధించిన చక్రవర్తి ఎవరు? ( జహంగీర్ )
170. రాజలాంచనాలతో గురుపీఠాన్ని అలంకరించిన శిక్కుగురువు ఎవరు ? (గురు హర గోవింద సింగ్ )
171. శిక్కులను యుద్ధ వీరులుగా మార్చిన శిక్కు గురువు ఎవరు ? ( గురు హరగోవింద సింగ్ )
172. ఔరంగజేబుచే వధింపబడిన శిక్కు గురువు ఎవరు ? ( తేజ్ బహదూర్ )
173. శిక్కు మత గురువులలో చివరి వాడుఎవరు ? ( గురు గోవింద సింగ్ )
174. 'ఖల్సా' అనే శిక్కు సైన్యాన్ని నిర్మించిన శిక్కు గురువు ఎవరు ? ( గురు గోవింద సింగ్ )
175. ఖల్సాలో చేరిన శిక్కులనేమంటారు ? ఇందులో చేరిన శిక్కులు ధరించ వలసిన పంచ క' కారములేవి ?
( సింగ్, కంఘీ (దువ్వెన), కచ్(పొట్టిలాగు),కర్డ్ ( చాకు), కేశ ( జుట్టు), కృపాల్ ( ఖడ్గము )
176 గురుగోవింద సింగ్ తరువాత శిక్కులకు నాయకత్వం వహించినది ఎవరు? ( బందా బహదూర్ )
177. బందా మరణం పిమ్మట ఏర్పడిన శిక్కులలోని చీలికలు ఏవి ? (బందాఖాల్సా, తాత్ ఖల్సా)

## మహారాష్ట్రులు

178. స్వతంత్ర మహారాష్ట్ర రాజ్య నిర్మాత ఎవరు ? ( శివాజీ )
179. శివాజీ ఆధ్యాత్మిక గురువు ఎవరు? ( సమర్ధ రామదాసు )
180. శివాజీ తల్లిదండ్రులు ఎవరు? శివాజీ ఎప్పుడు ఎక్కడ జన్మించాడు ?
( జిజియాబాయి, షాజీ భాన్స్లే, క్రీ.శ. 1630లో శివనేర్ దుర్గంలో)
181. శివాజీకి యుద్ధ విద్యలను నేర్పించిన గురువు ఎవరు ? ( దాదాజీ ఖాండదేవ్ )
182. శివాజీ ఆక్రమించిన మొదటి దుర్గము ఏది ? ( తోరణ దుర్గం క్రీ.శ.1646 )
183. శివాజీ స్వాతంత్ర్యమును ఎప్పుడు ప్రకటించెను ? ( క్రీ.శ. 1653లో )
184. శివాజీని అణచడానికి ఎవరెవరు ఏఏ సేనానులను పంపినారు ?
( బీజపూర్ సుల్తాన్ - అఫ్జర్ఖాన్, ఔరంగజేబు - షయిస్తాఖాన్ )
185. శివాజీకి చెందిన కొండ నాగిరి దుర్గాన్ని పట్టుకొనుటలో విఫలుడయిన మొగలు సేనాని ఎవరు? ( జస్వంతసింగు )
186. క్రీ.శ. 1665 లో మొగలు సేనాని రాజా జయసింగ్ తో శివాజీ చేసుకున్న సంధి ఏది ? ( పురందర సంధి )
187. శివాజీకి గల బిరుదేమి ? శివాజీ స్థాపించిన స్వతంత్ర రాజ్యం పేరేమిటి? ( ఛత్రపతి, స్వరాజ్యం )
188. శివాజీ పట్టాభిషేకం ఎప్పుడు, ఎక్కడ జరిగింది? ( క్రీ.శ. 1674 జూన్ 16, రాయగఢ్లో )
189. శివాజీ స్వరాజ్యానికి రాజధాని ఏది ? ( రాయగఢ్ )
190. శివాజీ ఇలవేలుపు ఎవరు? ( తుల్జా భవానీ దేవి )
191. శివాజీ ఏ కోటను జలదుర్గంగా మార్చాడు ? ( సదాసివఘడ్ )
192. మొట్టమొదట మనదేశంలో జాతీయ ప్రభుత్వ స్థాపన చేసినది ? ( శివాజీ )
193. శివాజీ ఎప్పుడు మరణించాడు ( క్రీ.శ. 1680లో )
194. ఆధునిక మహారాష్ట్ర జాతి నిర్మాత ఎవరు ? (శివాజీ )
195. శివాజీ మంత్రి మండలి పేరు ఏమిటి ? ( అష్ట ప్రధానులు )
196. శివాజీ రాజ్యంలో ప్రధాన మంత్రి నేమందురు ? ( పీష్వా )
197. శివాజీ అష్టప్రధానులు ఎవరు? ( పీష్వా, అమాత్య, మంత్రి, సచివ, సేనాపతి, పండిత రావ్, సుమంత, న్యాయాధీశ)
198. శివాజీ కాలంలో సర్కాబత్ అనగా నెవరు ? (అశ్వదళాధిపతి )
199. శివాజీ రాజ్యంలో రాష్ట్రాలెన్ని ? రాష్ట్ర పాలనాధికారి ఎవరు ? ( నాలుగు, రాష్ట్రాధిపతి )
200. పొరుగు రాజ్యాల నుండి శివాజీ వసూలు చేసిన పన్నులేవి ? (చౌత్, సర్దేశ్ ముఖి)
201. ఎవరి అనుమతితో ఫ్రెంచివారు పాండిచేరిలో వర్తకం చేసుకొనుటకు అధికారము సంపాదించారు ? ( శివాజీ)

203. శివాజీ కాలం నాటి మొగలు చక్రవర్తి ఎవరు ? ( ఔరంగజేబు )
204. శివాజీ నిర్మించిన కోటల సంఖ్య ఎంత ? ( 280 )
205. శివాజీ అనంతరం మహారాష్ట్ర సింహాసనం అధిష్టించిన వారు ఎవరు . ? ( శంభూజీ 1680 )
206. శంభూజీ ఎప్పుడు ఎవరిచే చంపబడ్డాడు ? ( క్రీ.శ. 1689లో ఔరంగజేబుచే )
207. శంభూజీ తరువాత మహారాష్ట్ర పాలకుడెవరు ? ( రాజారాం 1689 )
208. రాజారాం భార్య ఎవరు ? ( తారాబాయి )
209. రాజారాం ఎప్పుడు, ఎక్కడ మరణించాడు ? ( క్రీ.శ. 1700 మార్చి 12న సింహఘడ్ దుర్గంలో )
210. రాజారాం అనంతరం మహారాష్ట్రులకు నాయకత్వం వహించిన మహిళ ఎవరు ? ( తారాబాయి )
211. శివాజీ అనంతరం విచ్ఛిన్నమైన మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని పునరుద్ధరించింది ఎవరు ? ( పీష్వాలు )
212. పీష్వాలలో మొదటివాడు ఎవరు? ( బాలాజీ విశ్వనాథ్ ( 1713 - 1720 )
213. మహారాష్ట్ర సామ్రాజ్యానికి రెండవ వ్యవస్థాపకుడు ఎవరు? ( బాలాజీ విశ్వనాథ్ )
214. ' హింధూ పద్ పద్ షాహీ ' ఆదర్శంగా గల పీష్వా మరియు బాలాజీ విశ్వనాథ్ తరువాత మహారాష్ట్ర నేలిని పీష్వా ఎవరు? ( బాజీరావు 1720 - 1740 )
215. హిందూ పద్ పద్ షాహీ అంటే ఏమిటి ? ( అఖిల భారత హిందూ సామ్రాజ్యం )
216. బాజీరావు తరువాత పీష్వా ఎవరు ? ( బాలాజీ బాజీరావు 1746 - 1761)
217. మూడవ పానిపట్టు యుద్ధం ఎప్పుడు జరిగింది ? అప్పటి పీష్వా ఎవరు?(క్రీ.శ. 1761 జనవరి 14న, బాలాజీ బాజీరావు)
218. మూడవ పానిపట్టు యుద్ధం ఎవరెవరికి జరిగింది ?
(ఆఫ్ఘను రాజైన అహమ్మద్ షా అబ్దాలీకి మొగలు చక్రవర్తి రెండవ షా ఆలం రక్షణ బాధ్యత తీసుకున్న మహారాష్ట్రులకు)
219. మూడవ పానిపట్టు యుద్ధ విజేత ఎవరు? ( అహ్మద్‌షా అబ్దాలీ )
220. ఏ యుద్ధంలో మహారాష్ట్రుల 'హిందూ పదపద్ షాహీ ' ఆశయం నేలకూలింది ? ( మూడవ పానిపట్టు యుద్ధం )
221. మూడవ పానిపట్టు యుద్ధంలో మహారాష్ట్ర సైన్యానికి నాయకత్వం వహించింది ఎవరు ? ( సదాశివరావు )
222. మూడవ పానిపట్టు యుద్ధంలో పాల్గొన్న జాట్ నాయకుడు ఎవరు ? ( సూరజ్ మల్ )
223. మూడవ పానిపట్టు యుద్ధంలో మహారాష్ట్రులు ఓడిపోవుటకు కారణము ఏమి ? ( గెరిల్లా యుద్ధ రీతులను అనుసరించకపోవటం)
224. బాలాజీబాజీరావు లేదా నానా సాహెబు ఎపుడు మరణించాడు ? ( క్రీ.శ.1761లో )
225. బాలాజీ బాజీరావు తరువాత అధికారములోనికి వచ్చిన వారు ఎవరు? ( మాధవరావు )

## 15. యూరోపియన్ల రాక - ఆంగ్ల రాజ్య స్థాపన

### క్రీ.శ. 1707 -1856

1. ఆటోమాన్ టర్క్‌లు కాన్‌స్టాంటినోపుల్‌ను ఎప్పుడు ఆక్రమించారు? ( క్రీ.శ.1453లో )
2. భారతదేశానికి నూతన సముద్ర మార్గమును కనిపెట్టిన పోర్చుగీసు నావికుడు ఎవరు? ( వాస్కోడిగామా )
3. వాస్కోడిగామా కాలికట్‌కు ఎప్పుడు చేరాడు ? ( క్రీ.శ. 1498 లో )
4. వాస్కోడిగామా సందర్శించిన కాలికట్ రాజు ఎవరు ? ( జమోరిన్ )
5. భారత దేశానికి వర్తకానికి వచ్చిన తొలి యూరోపియన్లు ఎవరు? వారు ఏ దేశస్థులు ? (పోర్చుగీసువారు, పోర్చుగల్ )
6. పోర్చుగీస్ వారి మొదటి స్థావరాలేవి ? ( కాలికట్, కొచ్చిన్, కన్ననూర్ )
7. ఇండియాలోని పోర్చుగీస్ స్థావరాలకు మొదటి గవర్నరు ఎవరు? ( ఆల్‌మీడా )
8. పోర్చుగీస్ వ్యాపారాన్ని విస్తరింప చేయడానికి ఆల్‌మీడా అనుసరించిన విధానానికేమని పేరు ? (బ్లూవాటర్ పాలసీ )
9. పోర్చుగీసు వారికి శత్రువులు ఎవరు? ( మొగలు చక్రవర్తులు, మహారాష్ట్రులు, బహమనీ సుల్తానులు )
10. పోర్చుగీసు వారికి వర్తకంలో మొదటి పోటీదారులు ఎవరు ? ( అరబ్బులు )

11. ఇండియాలో రెండో పోర్చుగీస్ గవర్నర్ ఎవరు ? ( అప్పాన్ - సో- డి-ఆల్బూక్లర్క్ )
12. ఇండియాలో పోర్చుగీసు వారి వలస సామ్రాజ్య నిర్మాత ఎవరు ? ( అల్బూక్లర్క్ )
13. ఇండియాలో పోర్చుగీసు వారి వలస సామ్రాజ్యానికి రాజధాని ఏది ? (గోవా )
14. ఇండియాకు మొట్టమొదటగా వచ్చి చిట్టచివరిగా వెళ్ళిన ఐరోపావారు ఎవరు? ( పోర్చుగీసువారు )
15. డచ్చివారు ఐరోపాలో ఏ దేశస్థులు ? ( హాలెండ్ )
16. భారతదేశంలోనూ, తూర్పు ఇండియా దీవులలోనూ వర్తకం ప్రారంభించిన డచ్చి సంఘం పేరేమిటి ? ( యునైటెడ్-ఈస్టిండియా కంపెనీ )
17. యునైటెడ్ ఈస్టిండియా కంపెనీ ఎప్పుడు స్థాపించబడినది? ( క్రీ.శ. 1602 )
18. డచ్చివారి భారతదేశ స్థావరములకు కేంద్రము లేవి ? ( పులికాట్, సూరత్, నాగపట్టణం )
19. ఇండియాలో పోర్చుగీస్‌ల అధికారాన్ని విచ్ఛిన్నం చేసిన వారెవరు? (డచ్చివారు )
20. డచ్చివారు అంబాయిన్ హత్యలు జరిపినదెప్పుడు ? ( క్రీ.శ. 1623లో )
21. ఇంగ్లీష్ తూర్పు ఇండియా కంపెనీ ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ. 1600 )
22. ఆంగ్లేయులు భారతదేశంలో తమ మొట్టమొదటి వర్తక కేంద్రాన్ని ఎక్కడ ఎప్పుడు స్థాపించారు? ( క్రీ.శ. 1613లో సూరత్ వద్ద)
23. క్రీ.శ. 1615లో ఇంగ్లండు రాజైన మొదటి జేమ్స్ జహంగీర్ కొలువుకు ఎవరిని రాయబారిగా పంపాడు? (సర్ థామస్‌రో )
24. దక్షిణ ఇండియాలో ఇంగ్లీషువారు తమ మొదటి ఫ్యాక్టరీని ఎప్పుడు ఎక్కడ నెలకొల్పారు ? ( 1611లో, మచిలీపట్టణంలో)
25. మద్రాసులోని సెయింట్ జార్జి కోటను ఆంగ్లేయులు ఎప్పుడు నిర్మించారు? ( క్రీ.శ.1641 లో ).
26. క్రీ.శ. 1639లోఫ్రాన్సిస్‌డే అనే ఆంగ్ల ఉద్యోగి ఎవరి వద్ద నుండి మద్రాసును అద్దెకు తీసుకున్నాడు ? ( చంద్రగిరి పాలకుడైన శ్రీరంగరాయలు )
27. 1661లో పోర్చుగీసువారు బొంబాయిని ఎవరికి అరణంగా ఇచ్చారు? ( రెండవ చార్లెస్ కు )
28. 1687లో సూరత్‌కు బదులు ఏది ఇంగ్లీషు వారి వర్తక కేంద్రమయ్యింది ? ( బొంబాయి )
29. కలకత్తాలోని సెయింట్ విలియం కోటను ఆంగ్లేయులు ఎప్పుడు నిర్మించారు? ( క్రీ.శ. 1699లో)
30. ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ ఎప్పుడు స్థాపితమయ్యింది ? ( క్రీ.శ.1664లో )
31. ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ ప్రారంభించినదెవరు? ( 14వ లూయీ మంత్రి కోల్ బర్ట్ )
32. 1666లో ఔరంగజేబు ఫర్మానాను పొందిన వారెవరు ? ( ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీవారు )
33. వర్తకం కోసం భారతదేశానికి చివరిగా వచ్చిన ఐరోపా వారు ఎవరు ? ( ఫ్రెంచివారు )
34. భారతదేశంలో ఫ్రెంచివారు మొట్టమొదటి వర్తక కేంద్రం ఎక్కడ స్థాపించారు? (సూరత్ క్రీ.శ. 1668 )
35. ఇండియాలోని ఫ్రెంచి వలసలకు ప్రధాన కేంద్రం ఏది ? ( పాండిచేరి )
36. ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీవారు రక్షణ కోసం నిర్మించికొన్న కోట ఏది? ( పోర్టు లూయీ కోట )
37. ఫ్రెంచి గవర్నర్లలో ప్రసిద్ధి పొందినవారు ఎవరు ? ( ఫ్రాన్సిస్ మార్టిన్, లేనాయర్,డ్యూమాస్, డూప్లే )
38. డూప్లే ఎవరు ? (ఫ్రెంచి డైరెక్టర్ కుమారుడు )
39. కోరమండల్ తీరమునకు ఐరోపా వారు పెట్టిన పేరేమి ? ( కర్ణాటక )
40. మొదటి కర్ణాటక యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది? (క్రీ.శ. 1796 - 48 మధ్య ఆంగ్లేయులకు ఫ్రెంచి వారికి)
41. మొదటి కర్ణాటక యుద్ధం సమయంలో కర్ణాటక నవాబు ఎవరు? ( అన్వరుద్దీన్ )
42. ఫ్రెంచి గవర్నరైన డూప్లే కర్ణాటక నవాబుసైన్యాన్ని ఏ యుద్ధంలో ఓడించాడు? ( క్రీ.శ. 1746లో జరిగిన శాంథామ్ లేదా అటమార్ యుద్ధంలో )
43. మొదటి కర్ణాటక యుద్ధం ఎప్పుడు ఎలా ఆగింది ? ( క్రీ.శ. 1748లో ఆక్సులా - షాపెల్ సంధివల్ల )
44. రెండవ కర్ణాటక యుద్ధం ఎప్పుడు, ఎవరెవరి మధ్య జరిగింది ? (క్రీ.శ. 1749 - 54 మధ్య, ఆంగ్లేయులకు - ఫ్రెంచి వారికి
45. రెండవ కర్ణాటక యుద్ధమునకు ప్రధాన కారణమేమిటి ? ( దక్కను వారసత్వ తగాదాలు )

46. రెండవ కర్ణాటక యుద్ధంలో ఫ్రెంచి వారు ఎవరి పక్షం వహించారు ? ( ముజఫర్ జంగ్ - చందాసాహెబ్ పక్షం )
47. రెండవ కర్ణాటక యుద్దంలో ఆంగ్లేయులు ఎవరి పక్షం వహించారు ? ( నాజర్ జంగ్ - మహమ్మదాలీ )
48. రెండవ కర్ణాటక యుద్ధ సమయంలో ఫ్రెంచి గవర్నరు ఎవరు ? ( డూప్లే )
49. రెందవ కర్ణాటక యుద్ధసమయంలో ఫ్రెంచి ఇంగ్లీష్ గవర్నర్లు ఎవరు ? ( ప్లాయరు - సౌండర్స్ )
50. మొదటి కర్ణాటక యుద్ధ ప్రధాన ఫలితమేది ? ( భారతీయ సైనిక బలహీనత బహిర్గతమయినది)
51. రెండవ కర్ణాటక యుద్ధ ప్రధాన ఫలితమేది ?
(దక్కనులో ఆంగేయులు ప్రాబల్యం వృద్ధి చెందింది , ఫ్రెంచి ప్రాబల్యం క్షీణించింది )
52. మూడవ కర్ణాటక యుద్ధ ఎప్పుడు జరిగింది ? మూడవ కర్ణాటక యుద్ధానికి ప్రధాన కారణమేది ? ( క్రీ.శ. 1756 - సం॥ - 63 సం॥ల మధ్య , ఐరోపాలోజరిగిన సప్తవర్ష సంగ్రామం )
53. మూడవ కర్ణాటక యుద్ధ సమయంలో ప్రెంచి, ఇంగ్లీషు గవర్నర్లు ఎవరు?
( కౌంట్-జ-లాలీ - ఫ్రెంచి, రాబర్టు క్లైవ్ - ఇంగ్లీషు)
54. మూడవ కర్ణాటక యుద్ధ ప్రధాన ఫలితమేది ? ( ఆంగ్లరాజ్య స్థాపన -ఫ్రెంచి పరాజయం )
55. క్రీ.శ. 1760లో జరిగిన వందవాసి యుద్ధం ఎవరెవరి మధ్య జరిగింది ? విజేత ఎవరు?
( ఫ్రెంచి, ఆంగ్లేయులకు మధ్య, విజేతలు - ఆంగ్లేయులు)
56. భారతదేశంలో బ్రిటీష్ సామ్రాజ్యానికి పునాదులు వేసిన వాడెవరు? ( రాబర్ట్ క్లైవ్ )
57. 'ఆర్కాట వీరుడ ' నే బిరుదెవరికి గలదు ? (రాబర్ట్ క్లైవ్ )
58. రాబర్ట్ క్లైవ్ ఫ్రెంచి వారి పై సాధించిన మొట్టమొదటి విజయమేది ? ( ఆర్కాటు ముట్టడి క్రీ.శ. 1752 )
59. ప్లాసీ, యుద్ధం ఎప్పుడు, ఎవరెవరి మధ్య జరిగింది?( క్రీ.శ. 1757లో, బెంగాలు నవాబైన సిరాజ్ ఉద్దౌలాకు, ఆంగ్లేయులకు)
60. 'ప్లాసీ విజేత బిరుదెవరికి గలదు? ( రాబర్ట్ క్లైవ్ )
61. ప్లాసీ యుద్ధానంతరం బెంగాలు గవర్నరెవరు ? ( రాబర్ట్ క్లైవ్)
62. ఇండియాలో డచ్చివారి ప్రాబల్యం నశించటానికి ప్రధాన కారణమేమి ?
( క్రీ.శ. 1759లో రాబర్ట్ క్లైవ్‌చే చిన్సురా ఆక్రమణ )
63. బక్సార్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ.1769 అక్టోబర్ 22న )
64. బక్సార్ యుద్ధం ఎవరెవరికి మధ్య జరిగింది ? విజేత ఎవరు ?
( మీర్ ఖాసిం, షుజా ఉద్దౌలా, రెండవ షాఆలం కూటమికి, ఆంగ్లేయులకు విజేతలు -ఆంగ్లేయులు )
65. బక్సార్ యుద్ధంలో ఆంగ్లేయుల విజయానికి కారణమైన ఆంగ్లసేనాని ఎవరు? ( మేజర్ మన్రో )
66. అలహాబాద్ సంధి ఎవరెవరికి, ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1765లో రాబర్ట్ క్లైవ్ రెండో షా ఆలంకు )
67. బెంగాలులో ద్వంద్వ పాలన ఎప్పటి నుండి మొదలైంది ? (అలహాబాద్ సంధి తర్వాత నుండి )
68. అలహాబాద్ సంధి ప్రకారం కంపెనీ ఏమి సంపాదించింది ? ( బెంగాల్, బీహార్ , ఒరిస్సాల పై దీవానీ అధికారం )
69. రెవిన్యూ అధికారం వేరుగా, ప్రభుత్వ పాలన నిర్వహించే అధికారం వేరుగా ఉండేదానినేమంటారు ? (ద్వంద్వపాలన)
70. బ్రిటీష్ కంపెనీవారు స్థానిక ఉద్యోగులకు ఇచ్చే లైసెన్స్‌నేమందురు ? ( దస్తక్ )
71. ఇండియా లో యుద్ధాలలో మరణించినా లేక అంగవైకల్యం పొందిన బ్రిటీష్ సైనికుల సహాయార్థం ఏర్పరచిన నిధి ఏది ? ( క్లైవు నిధి )
72. ఇండియాలో మొదటి బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( వారన్ హేస్టింగ్స్ ( 1774 - 1785))
73. ఇండియాలో సివిల్ పాలనా విధానానికి పునాదులు వేసిన మొదటి గవర్నరు జనరల్ ఎవరు? ( వారన్ హేస్టింగ్స్ )
74. హేస్టింగ్ కాలంలో హిందూ ధర్మ శాస్త్రాన్ని 'సంక్షిప్త హిందూ ధర్మ శాస్త్రం ' పేరు తో ఆంగ్లంలోకి అనువదించినది ఎవరు ? (హాల్ హెడ్ )
75. రాబర్ట్ క్లైవ్ నెలకొల్పిన ద్వంద్వ ప్రభుత్వాన్ని రద్దు చేసినది ఎవరు? ( వారన్ హేస్టింగ్స్ )

76. భారతీయ సంస్కృతి పరిరక్షణకు వారన్ హేస్టింగ్స్ స్థాపించిన " ఆసియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాలు" అధ్యక్షుడు ఎవరు ?
( సర్ విలియం జాన్స్)
77. వారన్ హేస్టింగ్స్ కాలంలో జరిగిన ప్రధాన యుద్ధమేది ? ( మందటి మహారాష్ట్ర యుద్ధం )
78. వారన్ హేస్టింగ్స్ ప్రవేశపెట్టిన సంస్కరణలేవి ? ( రెవిన్యూ న్యాయ సంస్కరణలు )
79. మొదటి మహారాష్ట్ర యుద్ధ ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1778 - 82 మధ్య నానాఫట్నవీస్ నాయకత్వలోని మహారాష్ట్ర కూటమికి, ఆంగ్లేయులకు)
80. మొదటి మహారాష్ట్ర యుద్ధం ఏ సంధితో ముగిసింది . ( సాల్బే సంధి )
81. మొదటి మైసూరు యుద్ధ ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది?
( క్రీ.శ. 1767 - 69 మధ్య, మైసూరు నవాబు హైదరాలీకు, ఆంగ్లేయులకు మధ్య )
82. రెండవ మైసూరు యుద్ధం ఎప్పుడు ,ఎవరెవరికి జరిగింది ? ఆ సమయంలో బ్రిటీష్ గవర్నరు జనరల్ ఎవరు ?
( క్రీ.శ. 1780 - 84 మధ్య, వారన్ హేస్టింగ్)
83. మూడవ మైసూర్ యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి మధ్య జరిగింది ?
( క్రీ.శ. 1790లో టిప్పు సుల్తానుకు - ఆంగ్లేయులకు మధ్య )
84. నాల్గవ మైసూర్ యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ? (టిప్పు సుల్తాన్ ఆంగ్లేయులకు , క్రీ.శ. 1799 లో )
85. మొదటి మైసూర్ యుద్ధ ఏ సంధితో ముగిసింది ? ( మద్రాసు సంధి )
86. రెండవ మైసూర్ యుద్ధ ఏ సంధితో ముగిసింది ? ( మంగుళూరు సంధి )
87. మూడవ మైసూర్ యుద్ధం ఏ సంధితో ముగిసింది ? ( శ్రీరంగ పట్టణ సంధి )
88. ఇండియాలో పోలీసు శాఖకు పునాదులు వేసింది ఎవరు ? ( కారన్ వాలీస్ )
89. సైన్య సహకార పద్ధతిని ప్రవేశ పెట్టిన బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( వెల్లస్లీ )
90. సైన్య సహకార పద్ధతికి అంగీకరించిన మొదటి స్వదేశీరాజు ఎవరు ? ( హైదరాబాద్ నిజామ్ )
91. వెల్లస్లీ కాలంలో జరిగిన యుద్ధాలేవి ? ( నాల్గవ మైసూరు యుద్ధం, రెండవ మహారాష్ట్ర యుద్ధం )
92. భారతదేశంలోని బ్రిటీష్ రాజ్యాన్ని బ్రిటీఫ్ సామ్రాజ్యంగా మార్చింది ఎవరు? ( వెల్లస్లీ )
93. మద్రాసు ప్రెసిడెన్సీ నిర్మాత ఎవరు ? ( వెల్లస్లీ )
94. కలకత్తాలోని ఫోర్టు విలియం కళాశాలను స్థాపించింది ఎవరు ? (వెల్లస్లీ )
95. రెండవ మహారాష్ట్ర యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ? విజేతలు ఎవరు ? ( క్రీ.శ. 1802 - 1805 లోసింథియా, భాణ్స్లేలలో కూడిన మహారాష్ట్ర కూటమికి - ఆంగ్లేయులకు )
96. రెండవ మహారాష్ట్ర యుద్ధము తరువాత జరిగిన సంధి ఏది ? (బేసిన్ సంధి)
97. మూడవ మహరాష్ట్ర యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1818లో మహారాష్ట్ర నాయకులైన పీష్వా బాజీరావు, అప్పారావు హోల్కారులకూ, ఆంగ్లేయులకూ మధ్య
98. పీష్వా పదవిని రద్దు చేసినదెవరు ? (హేస్టింగ్స్ ప్రభువు )
99. 'సామంత సంబంధ నిరోధ విధానము'ను ప్రవేశ పెట్టినది ఎవరు ? ( మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్ )
100. 1775 - 1818 మధ్య ఆంగ్లేయులకు, మహారాష్ట్రులకు మధ్య ఎన్ని యుద్ధాలు జరిగినాయి ? ( 3 )
101. నేపాల్ యుద్ధం లేక గూర్ఖా యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
(క్రీ.శ.1814 - 16లో పృధ్వీ నారాయణ నాయకత్వంలోని గూర్ఖాలకు - ఆంగ్లేయులకు )
102. సగాలీ సంధి ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ? ( క్రీ.శ. 1816లో ఆంగ్లేయులకు గూర్ఖాలకు మధ్య )
103. పిండారులనే దారి దోపిడి దొంగల నణచిన గవర్నర్ జనరల్ ఎవరు ? ( మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్)
104. పఠానుల బెడద నుండి భారత దేశాన్ని రక్షించింది ఎవరు? ( హేస్టింగ్స్ )
105. థగ్గులను దారి దోపిడి దొంగలను అణచింది ఎవరు? ( విలియం బెంటింక్ )
106. బ్రిటీష్ సామ్రాజ్యానికి స్వదేశీ సంస్థానాలు చేర్చి సామ్రాజ్య విస్తరణ కార్యక్రమాన్ని పూర్తి చేసిన వాడెవరు ? ( డల్హౌసీ )

107. డల్హౌసీ ప్రవేశపెట్టిన సిద్ధాంతమేది ? (రాజ్య సంక్రమణ సిద్ధాంతం )
108. భారత దేశంలో తంతి తపాలా పద్ధతి, ఏ గవర్నర్ జనరల్ కాలంలో ప్రవేశపెట్టబడినది ? ( డల్హౌసి)
109. భారత దేశంలో మొదటి రైలు మార్గం ఎప్పుడు ? ఎక్కడ నుండి ఎక్కడకు ఎవరి కాలంలో వేయబడింది ?
( క్రీ.శ. 1853 లో బొంబాయి నుండి థానాకు డల్హౌసీ కాలంలో )
110. బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టింది ఎవరు? ( మార్క్వస్ ఆఫ్ హేస్టింగ్స్ )
111. భారత దేశంలో ఆంగ్లభాష రాజభాష ఎప్పుడు అయినది ? ఎవరు చేశారు ? (క్రీ.శ. 1835 మార్చి 7 విలియం బెంటింక్ )
112. సతీసహగమనమును ఎవరు, ఎప్పుడు నిషేధించిరి ? ( క్రీ.శ. 1829లో విలియం బెంటింక్ )
113. ఏ బ్రిటీష్ గవర్నరు జనరల్ కాలంలో ఇంగ్లండు, ఇండియాల మధ్య ప్రప్రథమంగా పొగ ఓడలు ప్రవేశపెట్టబడినవి?
(విలియం బెంటింక్)
114. సతీ సహగమన నిషేధం ప్రవేశపెట్టటంలో బెంటింక్‌కు సహకరించిన భారతీయుడు ఎవరు? (రాజా రామమోహన రాయ్)
115. భారతదేశంలో ఆంగ్లభాషను ప్రవేశపెట్టటానికి విలియం బెంటింక్‌కు సహకరించిన ఆంగ్లేయుడు ఎవరు?(లార్డ్ మెకాలే)
116. బొంబాయి, కలకత్తా, మద్రాసు విశ్వ విద్యాలయాలు ఎవరి కాలంలో స్థాపించబడినవి ? ( డల్హౌసీ )
117. ' రాజస్థాన్ కథావళి' రచించింది ఎవరు ? ( కర్నల్ టాడ్ )
118. 'మధ్య ఇండియా గాథలు ' రచించింది ఎవరు ? ( మాల్కామ్ )
119. శిక్కులకు జాతీయ రాజ్యం నిర్మించి పంజాబు సింహంగా పేరుపొందింది ఎవరు ? ( రంజిత్ సింగ్ )
120. రెగ్యులేటింగ్ చట్టం ఎప్పుడు ప్రవేశపెట్టబడింది ? ( క్రీ.శ. 1773 )
121. రెగ్యులేటింగ్ చట్టం ప్రాముఖ్యత ఏమిటి ? ( కంపెనీ రాజ్యం క్రమబద్ధం చేయబడింది )
122. పిట్ ఇండియా చట్టం ఎప్పుడు చేయబడింది ? (క్రీ.శ. 1784లో )
123. చార్టర్ చట్టము లెన్ని ? అవి ఏ సంవత్సరాలలో చేయబడినవి ? ( నాలుగు 1793, 1813, 1833,1853 )
124. మొదటి శిక్కు యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1845లో లాల్ సింగ్, తేజ్ సింగ్ నాయకత్వంలోని శిక్కులకు, ఆంగ్లేయులకు )
125. మొదటి శిక్కు యుద్ధ సమయంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( హార్డింజ్ )
126. రెండవ శిక్కు యుద్ధం ఎప్పుడు,ఎవరెవరి మధ్య జరిగింది ? ( క్రీ.శ. 1849 లో శిక్కులకు, ఆంగ్లేయులకు )
127 రెండవ శిక్కు యుద్ధ సమయంలోబ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( డల్హౌసీ )
128. మొదటి ఆఫ్ఘన్ యద్ధ ఎప్పుడు,ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1838 - 42 మధ్య, ఆఫ్ఘన్ రాజైన దోస్త్ మహ్మద్‌కు - ఆంగ్లేయులకు )
129. రెండవ ఆఫ్ఘన్ యుద్ధం ఎప్పుడు , ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1878 లో ఆఫ్ఘన్ రాజైన షేర్ ఆలీకి - ఆంగ్లేయులకు )
130. మొదటి, రెండవ ఆఫ్ఘన్ యుద్ధ సమయంలోబ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( లిట్టన్)
131. మూడవ ఆఫ్ఘన్ యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
(క్రీ.శ. 1919లో ఆఫ్ఘన్ రాజైన హబీబుల్లాకు - ( ఆంగ్లేయులకు )
132. మూడవ ఆఫ్ఘన్ యుద్ధ సమయంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( మాంటేగ్ చెమ్సుఫర్డ్ )
133. మొదటి బర్మా యుద్ధ ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ.1824 - 26 మధ్య, బర్మా చక్రవర్తి పాగ్విదోవాకు, ఆంగ్లేయులకు అమ్‌హరెస్ట్ )
134. రెండవ బర్మా యుద్ధం ఎప్పుడు ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1852లో బర్మా రాజైన ధెరావడేకి - ఆంగ్లేయులకు ( డల్హౌసీ )
135. మూడవ బర్మా యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1886 - 1897 మధ్య, బర్మా రాజైన థీబాకు, ఆంగ్లేయులకు ( డఫ్రిన్ )

# 16. భారత జాతీయోద్యమము (క్రీ.శ. 1857 – 1947)

1. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ( లేక ) సిపాయిల తిరుగుబాటు ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1857లో )
2. సిపాయిల తిరుగుబాటు ఎక్కడ ప్రారంభమైంది ? ( మీరట్‌లో )
3. సిపాయిల తిరుగుబాటు సమయంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( లార్డ్ కానింగ్ )
4. సిపాయిల తిరుగుబాటుకు గల రాజకీయ కారణం ఏది ? ( డల్హౌసీ అనుసరించిన దురాక్రమణ విధానం )
5. సిపాయిల తిరుగుబాటుకు గల ఆర్థిక కారణం ఏమి ? ( బ్రిటీష్ వారి నూతన ఆర్థికవిధానం)
6. సిపాయిల తిరుగుబాటుకు గల సాంఘిక కారణం ఏది ? ( హైందవ సాంఘిక వ్యవస్థను ఖండించుట )
7. సిపాయిల తిరుగుబాటుకు గల సైనిక కారణం ఏమి ? ( ఇండియా , ఐరోపా సైనికుల మధ్య ఉన్న తారతమ్యం )
8. సిపాయిల తిరుగుబాటు సమయంలో ఢిల్లీ ముట్టడిలో ఆంగ్లేయులు సాగించిన దారుణ హింసాకాండను వర్ణించిన ఉర్దూ కవి ఎవరు ? (గాలిబ్ )
9. సిపాయిల తిరుగుబాటుకు కాన్పూర్‌లో ఎవరు నాయకత్వం వహించారు? ( నానాసాహెబ్ )
10. సిపాయిల తిరుగుబాటుకు అయోధ్యలో నాయకత్వం వహించింది ఎవరు? ( రాణీబేగం హజ్రత్‌మల్ - బాలాసాహెబ్ )
11. సిపాయిల తిరుగుబాటుకు ఝాన్సీలో నాయకత్వం వహించింది ఎవరు ? ( ఝాన్సీ లక్ష్మీబాయి )
12. మధ్య ఇండియాలో సిపాయిల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన దెవరు? ( తాంతియాతోపే )
13. సిపాయిల తిరుగుబాటు కాలంలో ఢిల్లీ సైనికులు ఎవర్ని పాదుషాగా ప్రకటించారు ? ( మొగల్ చక్రవర్తి రెండో బహదూర్ షాను )
14. సిపాయిల తిరుగుబాటు ఫలితంగా 1958లో బ్రిటీష్ పార్లమెంటు ఆమోదించిన చట్టం ఏది ? ( ఆక్ట్ ఫర్ బెటర్ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా )
15. సిపాయిల తిరుగుబాటును అణచివేయడంలో ప్రముఖపాత్ర వహించిన బ్రిటీష్ సేనానులు ఎవరు? ( సర్ జేమ్స్, అవుట్రామ్, హ్యావ్‌లాక్, నికల్‌సన్, నెయిల్‌లారెన్స్, సర్ రోజ్‌వుడ్ )
16. సిపాయిల తిరుగుబాటు అనంతరం చేయబడిన భారత ప్రభుత్వ చట్టమేది? ( 1858 భారత ప్రభుత్వ చట్టం)
17. విక్టోరియా మహారాణి ప్రకటన ఎప్పుడు వెలువడింది ? ( క్రీ.శ. 1858 నవంబరు 1 )
18. విక్టోరియా మహారాణి ప్రకటనను ఎవరు ఎక్కడ చదివారు ? (లార్డ్ కానింగ్ - అలహాబాద్‌లో )
19. భారతదేశపు మొట్ట మొదటి బ్రిటీష్ రాజప్రతినిధి ( వైశ్రాయ్ ) ఎవరు ? (లార్డు కానింగ్ )
20. ఈస్టిండియా కంపెనీ పాలన ఏ తిరుగుబాటుతో అంతమైంది ? ( సిపాయిల తిరుగుబాటు )
21. భారత ప్రభుత్వ వ్యవహారాలకు బాధ్యత వహించే బ్రిటీష్ ప్రభుత్వ విధానాన్ని ఏమందురు ? ( గృహ ప్రభుత్వం )
22. కార్యనిర్వాహక శాఖ నుంచి శాసన నిర్మాణశాఖను వేరు చేసిన చట్టం ఏది? ( 1861 శాసన సభల చట్టం )
23. బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్, బోర్డు ఆఫ్ కంట్రోలు ఏ చట్టం రాకతో రద్దయినవి? ( 1858 భారత ప్రభుత్వ చట్టం )
24. గవర్నర్ జనరల్ అధికారాలను విస్తృతం చేసిన చట్టం ఏది ? ( 1870 చట్టం)
25. బెంగాల్ గవర్నర్ జనరల్ , ఇండియా గవర్నర్ జనరల్‌గా మారింది ఏ చట్టం వల్ల ? అలా మారిన మొదటి గవర్నరు జనరల్ ఎవరు.? ( 1833 చార్టరు చట్టం, విలియం బెంటింక్ )
26. గవర్నరు జనరల్ సలహా సంఘంలో న్యాయసభ్యుడు ఏ చట్టం వల్ల నియమింపబడ్డాడు ? అలా నియమింపబడిన మొదటి న్యాయ సభ్యుడు ఎవరు ?( క్రీ.శ. 1833 చార్టరు చట్టం వల్ల, లార్డ్ మెకాలే )
27. బ్రిటీష్ గవర్నర్ జనరల్, బ్రిటీష్ రాజప్రతినిధిగా ఏ చట్టం వల్ల మారాడు? ( 1858 భారత ప్రభుత్వ చట్టం )

28. మనదేశంలో తొలిసారిగా ఏ బ్రిటీష్ గవర్నరు జనరల్ కాలంలో జనాభా లెక్కల సేకరణ జరిగింది ? ( లార్డు మేయో - 1871లో )

29. కార్మికుల సంక్షేమం కోసం మనదేశంలో కర్మాగార చట్టం ప్రప్రథమంగా ఎప్పుడు చేయబడింది? అప్పుడు రాజప్రతినిధి ఎవరు? (క్రీ.శ. 1881లో, లార్డు రిప్పన్ )

30. భారత పౌర ఉద్యోగ చట్టం ఎప్పుడు చేయబడింది ? (క్రీ.శ. 1862లో )

31. చట్ట బద్ధ ఉద్యోగ వ్యవస్థను ఎప్పుడు ప్రవేశ పెట్టారు? ( క్రీ.శ. 1879లో )

32. ఎర్ర సముద్రం గుండా కేబుల్ ద్వారా ఇంగ్లండ్‌కు వార్తలు పంపే సౌకర్యం తొలిసారిగా ఏ బ్రిటీష్ రాజప్రతినిధి కాలంలో ఏర్పడింది. ( లార్డు మేయో )

33. మనదేశంలో పౌర ధర్మశాస్త్రాన్ని ఎప్పుడు ప్రచురించారు ? (క్రీ.శ. 1858లో )

34. మనదేశంలో నేర ధర్మశాస్త్రాన్ని ఎప్పుడు ప్రచురించారు ? ( క్రీ.శ. 1860లో )

35. భారతదేశంలో స్థానిక స్వపరిపాలన చట్టాలు ఎప్పుడు చేయబడినవి? (కీ.శ. 1880 - 84 )

36. మనదేశంలో స్థానిక పరిపాలనా పితామహుడు ఎవరు? ( లార్డు రిప్పన్ )

37. భారతీయ మేజిస్ట్రేట్‌కు యూరోపియన్ నిందితులను విచారించటానికి అధికారాన్నిచ్చే బిల్లు ఏది ? ( ఇల్బర్టు బిల్లు )

38. ఇల్బర్టు బిల్లును ఎవరు ప్రవేశపెట్టారు ? (లార్డు రిప్పన్ )

39. 'ఇల్బర్టు బిల్లు'ను ఎవరు రూపొందించారు ?( గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక మండలిలోని న్యాయశాఖ సభ్యుడైన ఇల్బర్టు)

40. దేనికి నిరసనగా లార్డ్ రిప్పన్ తన పదవికి రాజీనామా చేశాడు ? ( ఇల్బర్టు బిల్లు సవరణకు నిరసనగా )

41. రెండో కర్మాగార చట్టం ఏ గవర్నర్ జనరల్ కాలంలో అమలులోకి వచ్చినది? ( లార్డు లాన్స్‌డౌన్ )

42. భారతదేశంలో యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషన్ ఎప్పుడు నెలకొల్పబడింది? ( క్రీ.శ. 1866లో లార్డ్ డఫ్రిన్)

43. ఏ బ్రిటీష్ రాజప్రతినిధి పాలనా కాలం 'కమీషన్ల కాలం' గా పిలువబడింది? ( లార్డు కర్జన్ )

44. 'రైతబాంధవుడు' అని పేరు పొందిన వైస్రాయ్ ఎవరు.? ( లార్డు కర్జన్ )

45. ' Do Quick Viceroy 'గా పేరొందిన వైశ్రాయ్ ఎవరు ? ( లార్డు కర్జన్ )

46. భారతదేశంలో ప్రత్యేక పురావస్తు శాఖను ఏర్పాటు చేసిన వైశ్రాయ్ ఎవరు? ( లార్డు కర్జన్ )

47. భారత దేశంలో పురావస్తుశాఖ మొట్టమొదటి డైరెక్టర్ జనరల్ ఎవరు? ( సర్ జాన్ మార్షల్ )

48. బెంగాల్ భూమిశిస్తు చట్టాన్ని ఎప్పుడు ప్రవేశపెట్టారు ? ( క్రీ.శ. 1859 )

49. పూనాలో వ్యవసాయ పరిశోధనా కేంద్రం ఎప్పుడు స్థాపించబడింది ? ( క్రీ.శ. 1901 )

50. మనదేశంలో ఆధునిక విద్య ప్రవేశపెట్టడానికి ఎవరు సూచన చేశారు ? ( లార్డు మెకాలే )

51. మనదేశంలో ఆధునిక విద్యను ప్రవేశపెట్టినది ఎవరు? ( విలియంబెంటింక్ )

52. దేశ భాషా పత్రికల చట్టాన్ని అమలు జరిపిన గవర్నర్ జనరల్ ఎవరు? ( లార్డు లిట్టన్ )

53. 1862లో స్వదేశ సంస్థానాదిపతులు బ్రిటీష్ రాజ్యాధిపతి సామంతులని ప్రకటించిన దెవరు ? (లార్డు కానింగ్ )

54. విక్టోరియారాణి 'భారత చక్రవర్తి'ని అనే బిరుదు ధరించినదెప్పుడు ? ( క్రీ.శ. 1877లో )

55. స్వదేశ సంస్థానాలు ఆంతరంగిక వ్యవహారాలలో చురుకుగా జోక్యం చేసుకొన్నదెవరు? ( లార్డు లాన్స్‌డౌన్ )

56. శాశ్వత కౌలు పద్ధతి ద్వారా నిజామ్ నుంచి బీరార్ ప్రాంతాన్ని వేరు చేసి బ్రిటీష్ పాలిత ప్రాంతాలలో విలీనం చేసినదెవరు? (లార్డు కర్జన్ )

57. ఆఫ్ఘనిస్థాన్ - పాకిస్తాన్ మధ్య నున్న ' డ్యూరాండ్ సరిహద్దు రేఖ ' ఎప్పుడు ఏ రాజ ప్రతినిధి కాలంలో నిర్ణయించబడింది ? (క్రీ.శ. 1892, లార్డు లాన్‌డౌన్)

58. చైనా - భారతదేశం మధ్య నున్న మెక్‌మోహన్ సరిహద్దు రేఖ ఎప్పుడు, ఏ రాజ ప్రతినిధి కాలంలో నిర్ణయింపబడింది? ( లార్డు రెండవ హర్డింజ్ )

59. వహాబీ తిరుగుబాటును అణచివేసినదెవరు ? ( మొదటి ఎల్జిన్ )

60. గడతేరిన ఉపేక్షావిధానం లేదా కుశలస్తబ్ద విధానం అనుసరించిన దెవరు? ( జాన్ లారెన్స్ )

61. భూటాన్ ను ఆక్రమించిన గవర్నర్ జనరల్ ఎవరు ? ( జాన్ లారెన్స్ )
62. బ్రిటీష్ ఇండియా, భూటాన్‌ల మధ్య జరిగిన సంధి ఏది ? ( సించులా సంధి )
63. భారతదేశంలో తొలిసారిగా సి.ఐ.డి. లను ప్రవేశపెట్టినదెవరు? ( లార్డు కర్జన్ )
64. విశ్వ విద్యాలయాల చట్టాన్ని రూపొందించిన దెవరు? ( లార్డు కర్జన్ )
65. బెంగాల్ ను విభజించిన బ్రిటీష్ రాజ ప్రతినిధి ఎవరు? ( లార్డు కర్జన్ )
66. బెంగాల్ విభజన ఎప్పుడు జరిగింది ? (క్రీ.శ. 1905 )
67. బెంగాలులోని 'పూసా' ఇంపీరియల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూట్‌ను నెలకొల్పింది ఎవరు ? ( లార్డు కర్జన్ )
68. ప్రత్యేక రైల్వే బోర్డు ఎవరి కాలంలో నెలకొల్పబడింది ? ( లార్డు కర్జన్ )
69. అఖిల భారత ముస్లింలీగ్ స్థాపన ఎప్పుడు జరిగినది ? ( క్రీ.శ. 1906లో )
70. మింటోమార్లే సంస్కరణలు ఎప్పుడు ప్రవేశ పెట్టబడినవి ? ( క్రీ.శ. 1909లో )
71. భారత జాతీయ కాంగ్రెస్ ఎప్పుడు ఆవిర్భవించింది ? ( క్రీ.శ. 1885లో )
72. జాతీయ కాంగ్రెసును, ముస్లింలను సంతృప్తి పరచడానికి బ్రిటీష్ ప్రభుత్వం 1909లో ప్రవేశపెట్టిన సంస్కరణ చట్టం ఏది ( మింటోమార్లే సంస్కరణలు )
73. విభజించు పాలించు విధానానికి నాంది పల్కిన సంస్కరణలు ఏవి ? (మింటోమార్లే సంస్కరణలు )
74. కలకత్తా నగరం ఏఏ గ్రామాల కలయిక వలన ఏర్పడింది ? (సుతమతి, కాశీ ఘట్టం, గోవిందపూర్‌లు )
75. భారతదేశ రాజధాని కలకత్తా నుండి ఢిల్లీకి ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో మార్చబడింది ? (క్రీ.శ. 1911 లార్డు రెండవ హార్డింజ్ )
76. కేంద్ర వ్యవసాయ శాఖను ఎప్పుడు ఏర్పాటు చేశారు ? ( క్రీ.శ. 1906లో )
77. దేశ వ్యవసాయాభివృద్దికి అనేక ముఖ్య సూచనలు చేసిన లార్డ్‌లిన్‌బర్‌గో కమీషన్ ఎప్పుడు నియమించబడింది. (క్రీ.శ. 1923 లో )
78. మింటో మార్లే సంస్కరణలకు గల మరో పేరేమిటి ? ( 1909 శాసన సభల చట్టం )
79. ఇంగ్లండు చక్రవర్తి ఐదవ జార్జి భారతదేశాన్ని ఎప్పుడు సందర్శించాడు ? నాటి బ్రిటీష్ రాజ ప్రతినిధి ఎవరు. ? ( క్రీ.శ. 1911, లార్డు రెండవ హార్డింజ్ )
80. ఢిల్లీలోని ఇండియా గేటు ఎందుకు నిర్మించబడింది ? ( మొదటి ప్రపంచ యుద్ధ మృత వీరుల స్మారక చిహ్నంగా )
81. ప్రథమ ప్రపంచ యుద్ధ కాలంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు? ( లార్డ్ ఛెమ్స్‌ఫర్డ్ )
82. మాంటేగు - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు దేనికి సంబంధించినవి ? (నూతన రాజ్యాంగ సంస్కరణలు)
83. మాంటేగు - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు ఎప్పుడు ప్రవేశపెట్టబడినవి ? (క్రీ.శ. 1919 )
84. స్వయం పరిపాలనా ఉద్యమం లేదా హోంరూల్ లీగ్ ఎప్పుడు స్థాపించబడింది ? ( కీ.శ. 1916లో )
85. హోమ్ రూల్ ఉద్యమం ప్రారంభించిన దెవరు? ( డా॥ అనిబిసెంట్, బాల గంగాధర తిలక్‌లు )
86. గాంధీజీ నాయకత్వంలోని సహాయ నిరాకరణోద్యమం ఎప్పుడు ప్రారంభమైంది ? ( క్రీ.శ. 1920లో )
87. బ్రిటీష్ ప్రభుత్వం లార్డ్ సైమన్ కమీషన్‌ను ఎప్పుడు నియమించినది ? ( క్రీ.శ. 1927లో )
88. భారతదేశంలో సైమన్ కమీషన్ పర్యటన నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు ఇర్విన్ )
89. భారతజాతీయ కాంగ్రెస్ దేశానికి సంపూర్ణ స్వాతంత్రం కావాలని ఎప్పుడు తీర్మానించింది ? ( డిశంబరు 1929లో )
90. గాంధీజీ నాయకత్వంలో శాసనోల్లంఘనోద్యమం ఎప్పుడు ప్రారంభమైంది? (క్రీ.శ. 1930 లో )
91. సైమన్ కమీషన్ నివేదిక ఆధారంగా రూపొందించిన భారత ప్రభుత్వ చట్టాన్ని బ్రిటీష్ పార్లమెంటు ఎప్పుడు ఆమోదించింది ? (క్రీ.శ.1935లో )
92. కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌కు గల మరో పేరేమిటి ? (ఎగువసభ లేదా రాజ్యసభ)

93. కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌లో మొత్తం సభ్యుల సంఖ్య ఎంత ?
( 260 మంది 156 మంది బ్రిటీష్ పాలిత ప్రాంతాలకు, 104 మంది స్వదేశీ సంస్థానాలకు చెందిన వారు )
94. ఫెడరల్ అసెంబ్లీకి గల మరోక పేరేమిటి ? ( దిగువ సభ లేదా శాసన సభ)
95. ఫెడరల్ అసెంబ్లీలో మొత్తం సభ్యుల సంఖ్య ఎంత ? ( 375 మంది )
96. మనదేశంలో ద్వి సభ విధానానికి పునాదులు వేసిన చట్టం ఏది ? ( 1919 భారతప్రభుత్వ చట్టం )
97. కేంద్ర కార్య నిర్వాహక మండలిలో భారతీయునికి ప్రాతినిధ్యం ఏ చట్టం వల్ల కల్పించబడింది ? ( 1909 ఇండియా కౌన్సిల్ చట్టం )
98. కేంద్ర కార్యనిర్వాహక మండలిలో సభ్యుడైన ప్రప్రధమ భారతీయుడు ఎవరు ? ( ఎస్.పి. సిన్హ )
99. రాష్ట్రాలలో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వం ఏ బ్రిటీష్ ప్రభుత్వ చట్టం వల్ల వచ్చింది ? ( 1935 భారత ప్రభుత్వ చట్టం )
100. మొదటి రౌండు టేబుల్ సమావేశం ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగింది ? ( క్రీ.శ. 1930, లార్డు ఇర్విన్ )
101. రెండు, మూడు అఖిల పక్ష సమావేశాలు ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగినవి ? ( క్రీ.శ. 1931, 32 - లార్డు విల్లింగ్‌టన్ )
102. మొదటి ప్రపంచ యుద్ధం (1911 -16 ) కాలం నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు రెండవ హార్డింజ్ )
103. రెండవ ప్రపంచ యుద్ధం ( 1939 - 45 ) కాలం నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు లిన్‌లిత్ గో)
104. బెంగాల్ విభజన రద్దు ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగింది ? ( క్రీ.శ. 1911లో, లార్డు రెండవ హార్డింజ్ )
105. ఢిల్లీ దర్బారు ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగింది ? ( క్రీ.శ. 1911లో, లార్డు రెండవ హార్డింజ్ )
106. నేటి భారత రాజ్యాంగానికి ప్రాతిపదిక అయిన బ్రిటీష్ ప్రభుత్వ చట్టం ఏది ? (1935 భారత ప్రభుత్వ చట్టం )
107. శాసన సభ్యులకు పరోక్ష ఎన్నికల విధానం ప్రప్రథమంగా ఏ బ్రిటీష్ చట్టం వల్ల ప్రవేశపెట్టబడింది ? (క్రీ.శ. 1892 భారత కౌన్సిల్ చట్టం)
108 . క్విట్ ఇండియా ఉద్యమం ( 1942 ) నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు లిన్‌లిత్‌గో )
109. మంత్రి త్రయ రాయబారం ( 1946 ) నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు వేవెల్ )
110. మన దేశానికి వచ్చిన చివరి రాజప్రతినిధి ఎవరు? ( లార్డు మౌంట్ బాటన్ 1947 - 48 )
111. సివిల్ మారేజ్ యాక్ట్ ఎప్పుడు చేయబడింది ?; ( క్రీ.శ. 1872లో )
112. బాల్య వివాహాలను నిషేదించే శారదా చట్టం ఎప్పుడు వచ్చింది ? ( క్రీ.శ. 1930 )
113. ఉమన్స్ ఇండియా అసోసియేషన్ ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? ( క్రీ.శ. 1923 - మద్రాసు )
114. కుటుంబ నియంత్రణ లీగ్ ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? ( క్రీ.శ. 1923 - బోంబాయి )
115. బర్మా ఆంగ్ల సామ్రాజ్యంలో భాగంగా బ్రిటీష్ - ఇండియాలో ఎప్పుడు విలీనమైంది ? ( క్రీ.శ. 1897లో )
116. బ్రిటీష్ ఇండియా నుండి బర్మా ఎప్పుడు విడదీయబడింది ? ( క్రీ.శ. 1937లో )
117. బర్మా ఎప్పుడు స్వాతంత్ర్యం పోందింది ? ( క్రీ.శ. 1948 జనవరి 4వ )
118. ఏ చట్టం ద్వారా సమాఖ్య న్యాయస్థానం ఏర్పడింది ? ( 1935 చట్టం )
119. కేంద్ర విద్యా సలహా సంఘాన్ని ఎప్పుడు స్థాపించారు ? ( క్రీ.శ. 1920లో )
120. అంతర్విశ్వవిద్యాలయ బోర్డు ఎప్పుడు ఏర్పాటయింది ? ( క్రీ.శ. 1924లో )
121. మొట్టమొదటి ఆంగ్ల విద్యాలయం ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? (క్రీ.శ. 1818, కలకత్తాలో )
122. హంటర్ కమీషన్ ఏ బ్రిటీష్ రాజ ప్రతినిధి కాలంలో నియమించబడింది? ( కీ.శ. 1883, రిప్పన్ )
123. సర్ చార్లెస్ ఉడ్ పథకం ఎప్పుడు తయారైంది ? నాటి రాజప్రతినిధి ఎవరు ? (క్రీ.శ. 1854 - డల్హౌసీ )
124. బోంబాయిలోని ఎలి ఫిన్ స్టన్ కళాశాల ఎప్పుడు స్థాపించబడింది ? (క్రీ.శ. 1834 )

125. 1834లో 'ధర్మసభ' అనే సంస్థను స్థాపించినదెవరు ? ( కాశీప్రసాద్ ఘోష్ )
126. హైదరాబాద్, లక్నో, కాశీ, ఆలీఘడ్ విశ్వవిద్యాలయాలు ఎప్పుడు స్థాపించబడినాయి ? (క్రీ.శ. 1920 లో )
127. అలహాబాద్ విశ్వవిద్యాలయం ఎప్పుడు స్థాపించబడింది ? ( క్రీ.శ. 1921లో )
128. ఢిల్లీ విశ్వవిద్యాలయం ఎప్పుడు స్థాపించబడింది ? (క్రీ.శ. 1922లో)
129. రవీంద్రనాథ్ ఠాగూర్ శాంతినికేతన్ ఎప్పుడు స్థాపించాడు ? (క్రీ.శ. 1921లో)
130. ఏ న్యాయస్థానాల చట్టాన్ని అనుసరించి పాట్నాలో హైకోర్టు స్థాపించారు? ( 1911. న్యాయస్థానాల సవరణ చట్టం )
131. ఆధునిక భారతీయ పునరుజ్జీవన ఉద్యమానికి పునాది వేసినదెవరు ? (రాజారామమోహన రాయ్ క్రీ.శ. 1774 - 1833)
132. 'బ్రహ్మ సమాజ' స్థాపకుడు ఎవరు ? అది ఎప్పుడు స్థాపించబడింది ? ( రాజారామమోహన్ రాయ్ క్రీ.శ. 1828)
133. సతీసహగమన నిషేధానికి కృషి చేసిన సంఘ సంస్కర్త ఎవరు? ( రాజారామమోహనరాయ్ )
134. సతీసహగమన నిషేధాన్ని అమలు చేయాల్సిందిగా రామమోహనరాయ్ ఎవరికి విజ్ఞప్తి చేశారు ? (గవర్నర్ జనరల్ విలియం బెంటింక్ )
135. వర్ణ భేదాలు కూడదని, పరమత సహనం పాటించాలని అన్ని మతాల సారమొక్కటేనని ప్రచారం చేసిన సమాజం ఏది ? (బ్రహ్మసమాజం )
136. 'సాధారణ బ్రహ్మ సమాజం' నాయకుడు ఎవరు ? ( పండిత శివనాథ శాస్త్రి)
137. ' రాజారామమోహన రాయ్ ' స్థాపించిన బెంగాలీ వారపత్రిక ఏది ? ( సంవాద కౌముది )
138. రాజారామమోహనరాయ్‌కు 'రాజా' అనే బిరుదు నిచ్చినవారు ఎవరు? ( మొగలు చక్రవర్తి ఐన రెండవ అక్బరు)
139. రాజారామమోహనరాయ్ మరణించిన తరువాత బ్రహ్మ సభకు ఆధిపత్యం వహించినదెవరు? (మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ )
140. బ్రహ్మ సమాజంలో ఏర్పడిన శాఖలేవి ?
( 1. ఆదిసమాజము 2. అఖిల భారత సమాజము 3. సాధారణ బ్రహ్మ సమాజము )
141. 'ఆది సమాజం' నాయకుడు ఎవరు ? ( దేవేంద్రనాథ్ ఠాగూర్ )
142. 'అఖిల భారత సమాజం ' నాయకుడు ఎవరు ? ( కేశవ చంద్రసేన్ )
143. ' బ్రహ్మధర్మము ' అనే గ్రంథాన్ని రచించిన దెవరు ? ( మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ )
144. 'తత్త్వ బోధిని' అనే పత్రికను స్థాపించినదెవరు ? ( మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ )
145. 'తత్త్వ బోధినీ' పత్రికా సంపాదకుడు ఎవరు ? ( అక్షర కుమార దత్తు )
146. 'తత్త్వబోధినీ' సభను స్థాపించింది ఎవరు ? అది ఎప్పుడు స్థాపించబడింది? (దేవేంద్రనాథ్ ఠాగూర్, క్రీ.శ. 1839లో)
147. ఆంధ్రలో బ్రహ్మ సమాజ నాయకులెవరు ? ( రఘుపతి వెంకటరత్నం నాయుడు , కందుకూరి వీరేశలింగం పంతులు)
148. 'ఆర్య సమాజం' స్థాపకుడు ఎవరు ? అది ఎప్పుడు స్థాపించబడింది ? ( స్వామి దయానంద సరస్వతి, క్రీ.శ. 1875లో)
149. ' Go back to vedas ' అనే నినాదాన్ని ఇచ్చింది ఎవరు ? ( స్వామి దయానంద సరస్వతి )
150. స్వామి దయానంద సరస్వతి రచించిన గ్రంథమేది ? ( సత్యార్థ ప్రకాశిక )
151. మతైక్యత సాధించాలన్న లక్ష్యంతో ' శుద్ధి' అనే సంస్కారాన్ని ప్రవేశపెట్టినదెవరు ? ( దయానంద సరస్వతి )
152. స్వామి దయానంద సరస్వతి గురువు ఎవరు ? ( విరజానందుడు )
153. ఆర్య సమాజానికి కేంద్రం ఏది ? ( పంజాబు )
154. స్వామి దయానంద సరస్వతి అసలు పేరేమిటి ? ( మూలేచంద్ )
155. ఆర్య సమాజం ప్రసాదించిన ప్రముఖ జాతీయ నాయకుడు ఎవరు ? (లాలా లజపతిరాయ్ )
156. స్వామి దయానంద సరస్వతి ఎప్పుడు జన్మించాడు ? ( క్రీ.శ. 1824 )
157. ప్రార్థనా సమాజాన్ని ఎవరు స్థాపించారు ? అది ఎప్పుడు స్థాపించబడింది? ( ఆత్మారాం పాండురంగ క్రీ.శ. 1867లో )
158. మహారాష్ట్ర లో మత సంస్కరణ ఉద్యమ నిర్వహణ కోసం వెలసిన సంఘం ఏది ? ( ప్రార్థనా సభ, 1849 )
159. ప్రార్థనా సమాజాన్ని అభివృద్ధి చేయడంలో ప్రముఖ పాత్ర వహించినది ఎవరు ?( ఆర్.జి. భండార్కర్, మహదేవ్ గోవింద రనడే )

160. దివ్య జ్ఞాన సమాజం ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? ( అమెరికా క్రీ.శ. 1875 లో )
161. దివ్యజ్ఞాన సమాజ స్థాపకులు ఎవరు? ( మేడమ్ బ్లావిస్కీ, కల్నల్ ఓల్కాట్ )
162. భారతదేశంలో దివ్యజ్ఞాన సమాజం ఎప్పుడు స్థాపింపబడింది ? ( క్రీ.శ. 1879)
163. మనదేశంలో దివ్యజ్ఞాన సమాజ కేంద్ర స్థానం ఏది ? ( మద్రాస్ వద్ద నున్న అడయార్ )
164. మన దేశంలో దివ్యజ్ఞాన సమాజాన్ని వ్యాపింప చేసిన ప్రముఖ వ్యక్తి ఎవరు? ( అనిబిసెంట్ )
165. అనిబిసెంట్ తరువాత దివ్యజ్ఞాన సమాజాభివృద్ధికి కృషి చేసినది ఎవరు ? ( జిడ్డు కృష్ణమూర్తి, భగవాన్ దాస్ )
166. పంధొమ్మిదో శతాబ్దం రెండో భాగంలో ఉద్భవించిన గొప్ప మత సంస్కరణ ఉద్యమం ఏది ? ( రామకృష్ణమిషన్ )
167. రామకృష్ణ మిషన్ ఎవరు, ఎప్పుడు స్థాపించారు ? ( స్వామివివేకానంద, క్రీ.శ. 1896లో )
168. రామకృష్ణ మిషన్‌కు గల మరొక పేరేమిటి ? ( వేదాంతోద్యమం )
169. వివేకానందుని గురువు ఎవరు ? ( రామకృష్ణ పరమహంస 1833 - 1886 )
170. రామకృష్ణ పరమహంస తొలి పేరు ఏమిటి ? ( గదాధరుడు )
171. స్వామి వివేకానందుని తొలి పేరు ఏమిటి ? ( నరేంద్రనాధ్ దత్తు )
172. స్వామీ వివేకానంద ప్రారంభించిన పత్రిక ఏది ? ( ప్రబుద్ధ భారత్ )
173. క్రీ.శ. 1893లో అమెరికాలోని చికాగోలో జరిగిన విశ్వమత మహాసభకు భారతదేశ ప్రతినిధిగా హాజరైంది ఎవరు ? (స్వామి వివేకానంద )
174. బ్రహ్మ సమాజానికి ప్రామాణిక గ్రంథమేది ? దానిని ఎవరు రచించారు? ( బ్రహ్మ ధర్మము దేవేంద్రనాధ్ ఠాగూర్ )
175. స్త్రీ విద్యను, వితంతు పునర్వివాహములను ప్రోత్సహించిన బ్రహ్మసమాజీకులలో ప్రముఖుడు ఎవరు ? ( ఈశ్వర చంద్ర విద్యాసాగర్ )
176. ఆంధ్ర ప్రదేశ్‌లో సంఘసంస్కరణ సమాజమును స్థాపించి, సంఘసంస్కరణకు జీవితాన్ని అంకితం చేసింది ఎవరు ? (కందుకూరి వీరేశలింగం పంతులు )
177. కందుకూరి వీరేశలింగం గారు స్థాపించిన పత్రికలేవి ? ( వివేకవర్ధిని, హాస్య సంజీవని, సతీహితభోధిని )
178. రాజమండ్రిలో హితకారిణీ సమాజాన్ని స్థాపించింది ఎవరు ? ( కందుకూరి వీరేశలింగం పంతులు గారు )
179. బోంబాయిలో దక్కను విద్యా సంస్థను స్థాపించింది ఎవరు? ( మహదేవ గోవింద రెనడే. 1861 )
180. వితంతువులను విద్యావంతులను చేయడానికి ' హిందూ వితంతు గృహాన్ని' స్థాపించిన దెవరు? ( బాబా శశిపాద బెనర్జీ - 1887 )
181. బాల్య వివాహాలను నిరోధించడానికి కృషి చేసిన పార్సీ సంఘ సంస్కర్త ఎవరు ? ( బి.ఎం. మల్‌బారీ)
182. బ్రహ్మ ప్రకాశిక, ఫెలోవర్కర్ అనే పత్రికలు నిర్వహించినది ఎవరు ? ( రఘుపతి వెంకటరత్నం నాయుడు )
183. బాల్యవివాహ నిరోధ చట్టం లేదా శారదా చట్టం ఎప్పుడు ప్రవేశపెట్టబడినది? ( క్రీ.శ. 1930లో )
184. వేశ్యవృత్తిని, దేవదాసీ వ్యవస్థను నిర్మూలించేందుకు కృషి చేసిన ఆంధ్ర సంస్కర్త? (రఘుపతి వెంకటరత్నం నాయుడు )
185. ధవళేశ్వరంలో మొట్టమొదటి బాలికా పాఠశాలను స్థాపించినది ఎవరు? ( వీరేశలింగం పంతులు గారు 1874 )
186 . భారతనిమ్న జాతి ఉద్ధారణా సమితి ఎప్పుడు ఏర్పడింది ? ( క్రీ.శ. 1906 లో )
187. కలకత్తాలో హిందూ కళాశాలను స్థాపించినది ఎవరు ? ( రాజారామోహనరాయ్ )
188. ఆలీఘర్ కళాశాలను స్థాపించినది ఎవరు ? (సయ్యద్ అహమ్మద్ ఖాన్ )
189. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేసినది ఎవరు? ( మదన్ మోహన మాలవ్య, 1915 )
190. కందుకూరి వీరేశలింగం గారికి గల బిరుదు ఏది ? ( గద్యతిక్కన )
191. రఘుపతి వెంకటరత్నం నాయుడు ఎప్పుడు జన్మించారు ? ( క్రీ.శ.1802, మచిలీపట్నంలో )
192. క్రీ.శ. 1818 ఏప్రిల్ లో కలకత్తా సమీపంలోని సిరాంపూర్ లో క్రైస్తవ మిషనరీలు స్థాపించిన మొదటి పత్రిక ఏది ? ( దిగ్దర్శనం )
193. భారతీయులచే స్థాపింపబడిన మొదటి పత్రిక ఏది ? ( బెంగాల్ గజట్, 1818 మే నెల)

194. రాజారామమోహనరాయ్ స్థాపించిన పత్రిక ఏది ? ( వంగదూత )

195. 'హిందూ పేట్రియాట్ ' ఎప్పుడు స్థాపించారు ? ( 1853. కలకత్తా లో )

196. ' ఇండియన్ మిర్రర్ ' పత్రిక ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడినది ? ( క్రీ.శ. 1861 - కలకత్తా )

197. 'అమృత బజార్ పత్రిక' ఎక్కడ, ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ.1868 - కలకత్తా)

198. అమృత బజారు పత్రిక సంపాదకుడెవరు ? ( శిశిర్‌కుమార్ ఘోష్ )

199. 'ఇండియాలీగ్ ' అనే సంఘాన్ని ఎవరు స్థాపించారు ? ( శిశిర్‌కుమార్ ఘోష్ - 1875)

200. 'ఇండియన్ అసోసియేషన్ ' అనే సంఘాన్ని ఎవరు స్థాపించారు ? ( సుదేంద్రనాథ్ బెనర్జీ, ఆనంద్ మోహన్ బోసులు )

201. కలకత్తాలో'ఇండియన్ అసోసియేషన్ ' ఎప్పుడు ప్రారంభింపబడింది ? ( క్రీ.శ. 1876 )

202. భారత దేశంలో జరిగిన మొట్టమొదటి జాతీయ సభ ఏది?(1883 డిసెండరు 28 - 30 తేదీల లో కలకత్తాలో జరిగిన సభ)

203. ముస్లిం మహిళలు 'పర్దా ' పద్దతిని విడనాడాలని ఉద్ఘాటించినదెవరు? ( సయ్యద్ అహ్మద్ ఖాన్ )

204. అఖిల భారత మహమ్మదీయ మహిళా సమావేశం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1914లో)

205. వహాబీ ఉద్యమం ఎక్కడ ప్రారంభమైది ? (అరేబియాలో )

206. వహాబీ ఉద్యమ నాయకుడెవరు ? ( ఇబిన్ అబ్దుల్ వహాబీ )

207. ఇస్లాం మతాన్ని ఆధునికీకరించటం కొరకు ఏర్పడిన ఉద్యమం ఏది ? (' ఆలీఘర్ )

208. ఆలీఘర్ ఉద్యమాన్ని నిర్వహించినది ఎవరు? ( సయ్యద్ అహ్మద్ ఖాన్ )

209. బోంబాయి సంఘం ఎప్పుడు ఏర్పడింది ? ( క్రీ.శ.1852లో)

210. 'పశ్చిమ ఇండియా' సంఘం ఎప్పుడు ఏర్పడింది ? ( క్రీ.శ. 1871లో )

211. బోంబాయి రాష్ట్ర సంఘం ఎప్పుడు స్థాపితమైంది ? ( క్రీ.శ. 1885 )

212. భారత జాతీయ కాంగ్రెస్ ఎప్పుడు స్థాపింపబడినది ? ( క్రీ.శ. 1885 )

213. భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించినది ? ఎవరు? ( ఎ.ఓ.హ్యూమ్ )

214. భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ సమావేశం ఎప్పుడు ఎక్కడ జరిగింది? ( క్రీ.శ. 1885 డిశంబరు 28, బోంబాయి )

215. భారత జాతీయ కాంగ్రెస్ ప్రప్రథమ అధ్యక్షుడు ఎవరు? ( డబ్ల్యు.సి.బెనర్జీ )

216. భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ సమావేశానికి ఎంత మంది ప్రతినిధులు హాజరైనారు? ( 72 మంది)

217. భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన నాటిబ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు? ( లార్డు డఫ్రిన్ )

218. బ్రిటీష్ పార్లమెంటుకు ఎన్నికైన ప్రథమ భారతీయుడెవరు ? ( దాదాబాయ్ నౌరోజి )

219. 'ది గ్రాండ్ ఓల్డ్‌మేన్ ' అని పేరుపొందింది ఎవరు ? ( దాదాబాయ్ నౌరోజి )

220. ఇంగ్లండులో దాదాభాయ్ నౌరోజి స్థాపించిన సంఘం పేరేమి ? ( ది లండన్ ఇండియన్ సొసైటి )

221. దాదాభాయ్ నౌరోజీ భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షునిగా ఏఏ సంవత్సరాలలో ఎన్నుకోబడినాడు ?
( క్రీ.శ. 1886, 1893, 1906 సం॥లు)

222. 'పావర్టీ అండ్ అన్ బ్రిటీష్ రూల్ ' గ్రంథాన్ని రచించినది ఎవరు ? ( దాదాభాయ్ నౌరోజీ )

223. 'ఇండియన్ డెమోస్థనీస్' బిరుదు ఎవరిది ? (సురేంద్రనాథ్ బెనర్జీ)

224. సురేంద్రనాథ్ బెనర్జీ స్థాపించిన పత్రిక ఏది ? ( బెంగాలీ )

225. ' ఏ నేషన్ ఇన్ మేకింగ్ ' గ్రంథ రచయిత ఎవరు ? ( సురేంద్రనాథ్ బెనర్జీ )

226. గాంధీజీ రాజకీయ గురువు ఎవరు? ( గోపాలకృష్ణ గోఖలే )

227. ఆధునిక భారతదేశ ప్రథమ రాజనీతిజ్ఞుడుగా పేరొందినది ఎవరు? ( గోపాలకృష్ణ గోఖలే )

228. 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ 'ని స్థాపించినది ఎవరు? ( గోపాలకృష్ణ గోఖలే )

229. ' దేశ భక్తులలో రాజు' గా కీర్తింపబడిన జాతీయ నాయకుడుఎవరు ? ( బాలగంగాధర తిలక్ )

230. ' స్వరాజ్యం నా జన్మ హక్కు' అనే నినాదాన్ని ఇచ్చినది ఎవరు ? ( బాలగంగాధర తిలక్ )

231. 'తిలక్'ను ప్రజలు ప్రేమతో ఏమని పిలిచేవారు ? ( లోకమాన్య )

232. 'తిలక్' ప్రారంభించిన ఆంగ్ల పత్రిక ఏది ? ( మరాఠీ )

233. 'తిలక్' ప్రారంభించిన మరాఠీ పత్రిక ఏది ? ( కేసరి )

234. భారత దేశ పారిశ్రామికాభివృద్ధికి తిలక్ ఏర్పాటు చేసిన నిధి పేరేమి ? ( పైసాఫండు )

235. ' ఆర్కిటిక్ హోమ్ ఆఫ్ ఆర్యన్స్ ' గ్రంథాన్ని రచించినది ఎవరు? ( బాలగంగాధర తిలక్ )

236. భారత జాతీయ కాంగ్రెస్ అతివాద, మితవాద పక్షాలుగా ఎప్పుడు చీలిపోయింది ? ( క్రీ.శ. 1907 సూరత్ సమావేశంలో)

237. భారత జాతీయ కాంగ్రెస్ అతివాద వర్గ నాయకుడు ఎవరు ? ( బాలగంగాధర తిలక్ )

238. భారత జాతీయ కాంగ్రెస్ మితవాద వర్గ నాయకుడు ఎవరు? ( గోపాలకృష్ణ గోఖలే )

239. ముస్లిం లీగు ఎప్పుడు స్థాపించబడింది ? దాని నాయకుడు ఎవరు? ( క్రీ.శ. 1906లో, సలీముల్లా)

240. ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలను కేటాయించిన బ్రిటీష్ చట్టమేది? (1909 భారత శాసన సభల చట్టం)

241. భీతావహోద్యమము ఎప్పుడు నిర్వహింపబడింది ? ( క్రీ.శ. 1905 - 1915 మధ్య కాలంలో )

242. భీతావహోద్యమ కాలంలో ప్రజలలో విప్లవ భావాలను వెదజల్లిన పత్రికలేవి? (యుగంతర్, సంధ్య, వందేమాతరం )

243. తొలుత విప్లవకారుడు గా రాజకీయ జీవితాన్ని ప్రారంభించి చివరకు ఆధ్యాత్మిక రంగానికి మళ్ళిన జాతీయ నాయకుడెవరు? (అరవింద ఘోష్ )

244. విప్లవోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన కలకత్తా సంఘం ఏది ? (అనుశీలన సమితి )

245. అరవిందుడు స్థాపించిన విప్లవ పత్రిక ఏది ? (యుగాంతర్ )

246. జాతీయవాదులకు 'బైబిల్' లాంటిదిగా పేరొందిన నవల ఏది ? ( ఆనంద్ మఠ్ )

247. 'ఆనంద్ మఠ్' నవలను రచించినది ఎవరు ? ( బంకించంద్ర చటర్జీ )

248. ' వందేమాతరం ' గేయం ఏ నవలలోనిది ? (ఆనంద్ మఠ్ )

249. విప్లవోద్యమంలో పాల్గొన్న అరవిందుని తమ్ముడు ఎవరు ? ( బరీంద్రఘోష్ )

250. 'ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ' అనే గ్రంథాన్ని రచించినది ఎవరు ? ( వినాయక్ దామోదర్ సావర్కార్ )

251. 'నాసిక్' హత్యకేసులో ప్రధాన నిందితుడు ఎవరు? ( వినాయక్ దాయోదర్ సావర్కాఁట్ )

252. మజఫర్ పూర్ హత్య కేసులోప్రధాన నిందితుడు ఎవరు? ( కుదీరాంబోస్, ప్రఫుల్ల చౌకీ )

253. అభినవ భారత్ అనే విప్లవ సంఘాన్ని స్థాపించినది ఎవరు? ( గణేశ సావర్కార్ )

254. 'నేషనలిస్ట్ పార్టీ' అనే పార్టీ ఎప్పుడు స్థాపించబడింది ? ( 1906 లో )

255. ప్లేగు నివారణ చర్యల పేరుతో ప్రజలను హింసించిన బ్రిటీష్ సైనికాధికారి 'రాండ్' ను హత్య చేసిన మహారాష్ట్ర విప్లవకారులెవరు ? ( చాపేకర్ సోదరులు )

256. వారణాసి కుట్ర కేసులో ప్రధాన నిందితుడు ఎవరు? ( సచీన్ సన్యాల్ )

257. బాలాసోర్ కుట్ర కేసులో ప్రధాన నిందితుడు ఎవరు? (జతీన్ ముఖర్జీ )

258. జలియన్ వాలబాగ్ దురంతానికి 1918 మర్చి 13, భాద్యుడైన జనరల్ డయ్యర్ ను హతమార్చిన విప్లవకారుడు ఎవరు? ( ఉద్దాంసింగ్ )

259. 'చిట్టగాంగ్' ఆయుధ కర్మాగార దోపిడీని నిర్వహించింది ఎవరు? ( సూర్య సేన్ )

260. ఎవరి నాయకత్వంలో హిందూస్థాన్ రిపబ్లిక్ ప్రజాసైన్యం నిర్మితమైనది? ( సూర్యసేన్ )

261. యుగాంతర్ అనే విప్లవ సంస్థను స్థాపించినది ఎవరు? ( జతీన్ ముఖర్జీ, 1907 )

262. కేంద్ర శాసన సభలో బాంబు వేసిన ప్రసిద్ధ విప్లవకారులు ఎవరు? ( భగత్ సింగ్, భటుకేశ్వర దత్)

263. క్రీ.శ. 1924 లో జరిగిన కాకోరీ కుట్రకేసులో ప్రధాన నిందితుడు ఎవరు? ( రామ్ ప్రసాద్ బిస్మిల్ )

264. కాన్పూర్ కుట్ర కేసులో ప్రధాన నిందితులు ఎవరు ? (నళినీగుప్త, సోకత్ఉస్మాన్, ముజఫర్ అహమ్మద్ )

265. గదర్ పార్టీని స్థాపించినది ఎవరు ? ( లాలాహరదయాళ్, 1913లో )

266. గదర్ పార్టీ ప్రధాన కార్యాలయం ఏది ? ( అమెరికాలోని శాన్ఫ్రాన్సిస్కో )

267. లాహోర్ కుట్ర కేసులో ఉరి శిక్షకు గురైనది ఎవరు ? ( భగత్ సింగ్, రాజగురు, సుఖదేవులు )
268. మద్రాసు లో విప్లవకారులు ఏ రహస్య సంస్థ ద్వారా పని చేశారు? (భారత మాల్ సంఘం )
269. గదర్ పార్టీలో చేరిన ఏకైక ఆంధ్రుడు ? (దర్శి చెంచయ్య)
270. 'ఇంక్విలాబ్ జిందాబాద్ ' అనే నినాదాన్ని అందించిన విప్లవకారుడు ఎవరు ? (భగత్ సింగ్ )
271. భగత్ సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను బ్రిటీష్ ప్రభుత్వం ఎప్పుడు ఉరితీసింది ? ( క్రీ.శ. 1927 లో )
272. జైలులో నిరాహార దీక్ష చేసి మృతి చెందిన విప్లవకారుడు ఎవరు? ( జతీన్ దాస్ )
273. బ్రిటీష్ పోలీసులతో ప్రత్యక్ష పోరాటంలో చనిపోయిన విప్లవకారుడు ఎవరు? ( చంద్ర శేఖర్ అజాద్ )
274. 1907లో కోటప్పకొండ తీర్థంలో పోలీసుల దుశ్చర్యలను ప్రతిఘటించినది ఎవరు? ( చిన్నప్పరెడ్డి )
275. 1921లో పల్నాటిలో జరిగిన ఉద్యమానికి నాయకత్వం వహించినది ఎవరు? ( కన్నెగంటి హనుమంతు )
276. తూర్పుగోదావరి జిల్లా గిరిజనులు ఎవరి నాయకత్వంలో విప్లవం నడిపారు? ( అల్లూరి సీత రామరాజు )
277. సీతారామరాజు నడిపిన విప్లవం ఏది ? (మన్య విప్లవం )
278. సీతారామ రాజును కాల్చి చంపిన ఆంగ్లేయాధికారి ఎవరు? ( మేజర్ గుడాల్ )
279. వందేమాతర ఉద్యమం ఎప్పుడు ప్రారంభమైంది ? ( క్రీ.శ. 1905లో )
280. వందేమాతర ఉద్యమం ఎప్పుడు ముగిసింది ? ( క్రీ.శ. 1911లో )
281. హోంరూల్ ఉద్యమాన్ని ఎవరు, ఎప్పుడు ప్రారంభించారు ? ( క్రీ.శ. 1916 లో అనిబిసెంట్, తిలక్ )
282. గాంధీజీ జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎప్పుడు ఎన్నుకోబడినాడు? (క్రీ.శ. 1920 నాగపూర్ సమావేశంలో )

283. లాలాలజపతి రాయ్ ఎప్పుడు,ఎక్కడ, జన్మించాడు? (క్రీ.శ. 1865లో పంజాబ్‌లోని ఫిరోజ్ పూర్ జిల్లా 'ఝుడికె'లో )
284 లాలా లజపతిరాయ్ జాతీయ కాంగ్రెస్‌లో ఎప్పుడు చేరాడు ? ( క్రీ.శ.1883లో )
285. 'పంజాబు కేసరి' ఎవరు ? ( లాలాలజపతి రాయ్ )
286. గాంధీజీ అసలు పేరేమిటి ? ( మోహన్ దాస్ కరంచంద్ గాంధీ)
287. గాంధీజీ జన్మస్థలం ఏది ? ( గుజరాత్ లోని పోర్ బందర్ )
288. 1931 లో జరిగిన రెండవ అఖిల పక్ష సమావేశానికి హాజరైన కాంగ్రెస్ ప్రతినిధి ? ( గాంధీజీ )
289. సహాయ నిరాకరణోద్యమం ఎప్పుడు ప్రారంభమైంది ? ( క్రీ.శ. 1920 )
290. సహాయ నిరాకరణోద్యమం ఎందుకువిరమించబడింది ? ( చౌరాచౌరీ సంఘటన వలన)
291. బీహార్‌లోని చాంపరాం జిల్లా నీలిమందు రైతుల హక్కుల పరిరక్షణకు గాంధి ఎప్పుడు సత్యాగ్రహం నిర్వహించారు? ( క్రీ.శ. 1917 )
292. ధేశంలో మతతత్వ వాదాన్ని " బ్రిటీష్ ఆగమనముతోపాటు వచ్చిన కీడు'' గా వర్ణించినది ? ( గాంధీజీ )
293. ఉప్పు సత్యాగ్రహమునకు మరోక పేరు ఏమి ? ( దండి సత్యాగ్రహము )
294. దండి సత్యాగ్రహము ఎప్పుడు జరిగింది ? (క్రీ.శ. 1930 ఏప్రియల్, 7న )
295. గాంధీజీ, ఇర్విన్ ఒడంబడిక ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ.1931 )
196. మొదటి రౌండ్ టేబుల్ సమావేశం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1930 )
297 . రెండవ రౌండ్ టేబుల్ సమావేశం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1931 )
298. కాంగ్రెస్ పాల్గొన్న రౌండ్ టేబుల్ సమావేశం ఏది? ( రెండవ రౌండ్ టేబుల్ సమావేశం )
299. మూడవ రౌండ్ టేబుల్ సమావేశం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1932 )
300. మూడవ రౌండ్ టేబుల్ సమావేశంలో తీసుకున్న నిర్ణయాలననుసరించి చేసిన శ్వేత పత్రం ఆధారంగా యేర్పడిన చట్టం ఏది ? ( 1935 భారత ప్రభుత్వ చట్టం )
301. పూనా ఒడంబడిక ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ.1933.)
302. పూనా ఒడంబడిక ఎవరెవరి మధ్య జరిగింది ? ( గాంధీజీకి - అంబేద్కర్‌కు మధ్య )

303 భారత జాతీయ స్వాతంత్ర్యం కోసం 1930 లో ప్రారంభమై 1934లో ఆగిపోయిన ఉద్యమం యేది ? ( శాసనోల్లంఘన ఉద్యమం)

304. గాంధీజీ ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహంలో మొట్టమొదటి సత్యాగ్రహి ఎవరు? ( వినోబా భావే )

305. " ఖుదాయే ఖిద్మత్‌గార్ " అనే సంస్థను యేర్పాటు చేసినది ఎవరు ? ( ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ )

306. 'ఫార్వడ్ బ్లాక్ 'ను స్థాపించినదెవరు? ( నేతాజి సుభాష్ చంద్రబోస్ )

307. స్వరాజ్య పార్టీ ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ.1925లో )

308. స్వరాజ్య పార్టీలోని ప్రసిద్ధ జాతీయనాయకులెవ్వరు? ( మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్ )

309. స్వరాజ్య పార్టీ లక్ష్యమేమిటి ? ( శాసన సభలోప్రవేశించి ప్రభుత్వానికి ఆటంకం కలిగించుట )

310. నెహ్రూ నివేదికను ఎవరు తయారు చేశారు ? (మోతీలాల్ నెహ్రూ)

311. సైమన్ కమీషన్ ఎప్పుడు నియమింపబడినది ? ( క్రీ.శ. 1927లో )

312. 'సైమన్ కమీషన్'ను సమర్థించిన ముస్లిం వర్గం ఏది ? ( సర్ మెహమ్మద్ షఫి)

313. 'సైమన్ కమీషన్'ను వ్యతిరేకించిన మస్లిం వర్గం నాయకుడెవ్వరు? ( మహమ్మద్ ఆలీజిన్నా )

314. కాంగ్రెస్ - ముస్లింలీగ్‌ల మధ్య ఒప్పందం కుదిరినదెప్పుడు ? ( క్రీ.శ. 1916 )

315. బ్రిటీష్ ప్రభుత్వానికి సహకరించిన మొట్టమొదటి మహమ్మదీయ నాయకుడు? ( సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్)

316. 'ది ఇండియన్ ముసల్మాన్' అనే గ్రంథాన్ని ప్రచురించినది ఎవరు ? (విలియం హంటర్, క్రీ.శ.1871 )

317. దేశంలో ద్విజాతి సిద్ధాంతానికి పునాది వేసినవాడు ? ( ఆలీఘర్ కళాశాల ప్రథమ ప్రిన్సిపాల్ బెక్ )

318. క్రీ.శ. 1906 డిసెంబరులో అఖిల భారత ముస్లిమ్ లీగ్ స్థాపించినది ఎవరు? ( ఆగాఖాన్, టక్కానవాబ్ )

319. మద్రాసులో సైమన్ కమీషన్ వ్యతిరేక ప్రదర్శనల నాయకత్వం వహించినది ఎవరు? ( టంగుటూరి ప్రకాశం )

320. అలహాబాద్ లో సైమన్ కమీషన్ వ్యతిరేక ప్రదర్శనలో నాయకత్వ వహించినది ? ఎవరు ? (జవహార్‌లాల్ నెహ్రూ)

321. కమ్యూనల్ అవార్డు ఎప్పుడ ప్రకటించబడింది ? ( క్రీ.శ. 1931లో )

322. ప్రతి జాతికి స్వయం పాలనాధికారం గుర్తిస్తూ బ్రిటీష్ ప్రధాని చర్చిల్, అమెరికి అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ 1941 ఆగష్టు లో విడుదల చేసిన ప్రకటనను ఏమందురు ?( అట్లాంటిక్ చార్టరు )

323. నేతాజీ సుభాష్ చంద్రబోస్ 'ఆజాద్ హింద్ ఫౌజ్' ను ఏ దేశంలో ఎప్పుడు నిర్మించాడు ? (సింగపూర్, క్రీ.శ. 1943 లో )

324. 'ఆజాద్ హింద్ ఫౌజ్'కు తోడ్పడిన దేశం ఏది ? ( జపాన్ )

325. 'ఆజాద్ హింద్ ఫౌజ్ ' లోని మహిళా సైన్యవిభాగానికి నాయకురాలు ఎవరు ? ( కెప్టెన్ లక్ష్మి )

326. 1938 - 39 లలో కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికైనది ? ( సుభాష్ చంద్ర బోస్ )

327. 'సరిహద్దు గాంధీ' ఎవరు ? ( ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ )

328. 'రెడ్ షర్టుల' నాయకుడు ఎవరు ? ( ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ )

329. 'సారేజహాసే అచ్చా , హిందూస్థాన్ హమారా ' అనే గీతాన్ని రచించింది ఎవరు ? ( మహమ్మద్ ఇక్బాల్ )

330. 'నవజీవన్' పత్రికను స్థాపించింది ఎవరు? ( గాంధీజీ )

331. 'ఆల్‌హిలాల్' ప్రతికను స్థాపించింది ఎవరు ? ( అబుల్ కలామ్ ఆజాద్ )

332. 'ఇండియా డివైడెడ్ ' గ్రంథ రచయిత ఎవరు? (డా ॥ రాజేంద్ర ప్రసాద్ )

333. 'హింద్ స్వరాజ్ ' గ్రంథ రచయిత ఎవరు ? ( గాంధీజీ )

334. 'ఇండియా విన్స్‌ఫ్రీడం ' గ్రంథ రచయిత ఎవరు? ( అబుల్ కలామ్ ఆజాద్ )

335. భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ అధ్యక్షురాలు ఎవరు? ( సరోజినీ నాయుడు )

336. నైటింగేల్ ఆఫ్ ఇండియా గా ప్రసిద్ధి చెందిన మహిళ ఎవరు ? ( సరోజినీ నాయుడు )

337. క్విట్ ఇండియా ఉద్యమం ఎప్పుడు ప్రారంభమైంది ? ( 1942 ఆగష్టు 8న )

338. క్రిప్స్ రాయబారం ఎపుపడు జరిగింది ? ( 1942లో )

339. క్రిప్స్ రాయబారం విఫలమైన తరువాత వచ్చిన ఉద్యమం ఏది ? ( క్విట్ ఇండియా ఉద్యమం )

340. మంత్రి త్రయ రాయబార ప్రణాళిక ఎప్పుడు ప్రకటింపబడింది ? ( 1946 మే 16 )

341. మంత్రి త్రయ రాయబారం సిఫార్సుల ననుసరించి ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వానికి నాయకుడు ఎవరు.? ((జవహార్‌లాల్ నెహ్రూ )

342. జవహర్ లాల్ నెహ్రూ నాయకత్వంలో తాత్కాలిక ప్రభుత్వం ఎప్పుడు ఏర్పడింది? ( 1946 సెప్టెంబర్ లో )

343. భారత రాజ్యాంగ పరిషత్తు ఎప్పుడు ఏర్పాటు చేయబడింది ? ( క్రీ.శ. 1946లో )

344. భారత రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు ఎవరు? ( డా॥బాబా రాజేంద్ర ప్రసాద్)

345. రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం ఎప్పుడు జరిగింది ? (క్రీ.శ. 1946 డిశంబరు 9న)

346. రాజ్యాంగ రచనా సంఘానికి అధ్యక్షుడు ఎవరు? ( డా॥బి.ఆర్.అంబేద్కర్ )

347. భారత రాజ్యాంగ పరిషత్తు రాజ్యాంగ నిర్మాణాన్ని పూర్తిచేసి ఎప్పుడు ఆమోదించింది ? ( 1949 నవంబరు 26న)

348. స్వదేశీ సంస్థానాలను భారత దేశంలో విలీనం చేసినది ఎవరు? ( సర్దార్ వల్లభాయ్ పటేల్ )

349. 'ఉక్కు మనిషి' మరియు 'ఇండియన్ బిస్మార్క్' గా పేరు పొందిన జాతీయ నాయకుడు ఎవరు ? (సర్థార్ వల్లభాయ్ పటేల్

350. భారతదేశానికి జూన్ 1948 లోపల స్వాతంత్ర్యాన్ని ఇస్తున్నట్లు 'అట్లీ' చేసిన ప్రకటన వెలువడినప్పుడు బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? (లార్డ్ వేవెల్)

351. బ్రిటీష్ ప్రధాని అట్లీ ప్రకటన ఎప్పుడు వెలువడింది ? ( 1947 ఫిబ్రవరి 20 న )

352. ఇండియా - పాకిస్తాన్‌లను విడదీసిన మౌంట్‌బాటన్ ప్రణాళిక ఎప్పుడు వెలువడింది ? ( క్రీ.శ. 1947 జూన్ 3 )

353. భారత స్వాతంత్ర్య చట్టాన్ని బ్రిటీష్ పార్లమెంట్ ఎప్పుడు ఆమోదించింది? ( క్రీ.శ. 1947 జులై 18న )

354. భారతదేశానికి స్వాతంత్ర్యం ఎప్పుడు వచ్చింది ? ( 1947 ఆగష్టు 15న )

355. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటి బ్రిటీష్ అధికార పార్టీ ఏది ? ప్రధానమంత్రి ఎవరు? ( లేబర్ పార్టీ క్లిమెంట్ అట్లీ )

## 17.స్వాతంత్ర్యానంతర భారతదేశం

1. స్వతంత్ర భారతదేశ మొదటి గవర్నరు జనరల్ ఎవరు. ( లార్డు మౌంట్ బాటన్ )
2. స్వతంత్ర భారతదేశ మొదటి భారతీయ గవర్నరు జనరల్ ఎవరు? ( సి.రాజగోపాలాచారి )
3. భారత దేశ ప్రథమ ప్రధాన మంత్రి ఎవరు ? ( జవహర్ లాల్ నెహ్రూ )
4. భారతదేశ ప్రథమ రాష్ట్రపతి ఎవరు ? ( డా॥ బాబూ రాజేంద్రప్రసాద్ )
5. డా॥బాబూ రాజేంద్ర ప్రసాద్ ప్రప్రథమ రాష్ట్రపతిగా ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు ? ( 1950 జనవరి 26 )
6. రాజేంద్ర ప్రసాద్ ఎప్పుడు మరణించారు ? ( 1963 ఫిబ్రవరి 28 )
7. జవహర్‌లాల్ నెహ్రూ ఎప్పుడు మరణించారు ? ( 1964 మే 27 )
8. మహాత్మాగాంధీ హత్య ఎప్పుడు జరిగింది ? ( 1948 జనవరి 30 )
9. సర్దార్ వల్లభాయ్ పటేల్ ఎప్పుడు మరణించారు ? ( 1950 డిసెంబరు 15 )
10. లోక్ సభకు మొదటిసారిగా ఎన్నికలు ఎప్పుడు జరిగినవి ? ( క్రీ.శ. 1952 లో )
11. భారతదేశాన్ని ప్రప్రథమంగా పరిపాలించిన రాజకీయ పార్టీ ఏది ? ( భారతజాతీయ కాంగ్రెస్ )
12. భారతదేశాన్ని మొట్టమొదట సందర్శించిన చైనా ప్రధాని ఎవరు. ? ( చౌ-ఎన్-లై )
13. భారత - చైనాల మధ్య పంచశీల ఒప్పందం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ.1954 లో )
14. మొదటి పంచవర్ష ప్రణాళిక ఎప్పుడు ప్రారంభింపబడింది ? ( క్రీ.శ. 1951 లో )
15. రెండవ పంచవర్ష ప్రణాళిక ఎప్పుడు ప్రారంభింపబడింది ? ( క్రీ.శ. 1956 లో )
16. లోక్ సభకు రెండవ సార్వత్రిక ఎన్నికలు ఎప్పుడు జరిగినవి ? (క్రీ.శ. 1957 లో)
17. భారతదేనశంలో ఆసియా క్రీడలు మొట్టమొదటిసారిగా ఎప్పుడు జరిగినవి? ( 1951లో )
18. ఎవరెస్టు శిఖరాన్ని ప్రప్రథమంగా ఎవరు, ఎప్పుడు అధిరోహించారు ? ( 1953లో టెన్సింగ్ నార్కే, ఎడ్మండ్ హిల్లరీ )

19. పోర్చుగీసువారి ఆధీనం నుండి గోవా ఎప్పుడు విముక్తి చేయబడింది ? ( 1961లో )
20. మూడవ పంచవర్ష ప్రణాళిక ఎప్పుడు ప్రారంభించబడింది ? ( 1961లో )
21. మూడవ సార్వత్రిక ఎన్నికలు ఎప్పుడు జరిగినవి ? ఏ పార్టీ విజయం సాధించింది ? ( 1962లో, భారత జాతీయ కాంగ్రెస్ )
22. భారత్ - చైనా యుద్ధం ఎప్పుడు జరిగింది ? ( 1962, అక్టోబరు 20 )
23. నెహ్రూ తరువాత భారతదేశ ప్రధాన మంత్రి ఎవరు? ( శ్రీలాల్ బహదూర్ శాస్త్రి )
24. లాల్ బహదూర్ శాస్త్రి ఎప్పుడు, ఎక్కడ మరణించారు ? ( 1966 జనవరి 11న రష్యాలోని తాష్కెంట్‌లో )
25. ప్రథమ భారత - పాకిస్థాన్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ( 1965లో )
26. ప్రథమ భారత్ పాక్ యుద్ధం తరువాత భారత్ - పాకిస్తాన్ మధ్య జరిగిన ఒప్పందం ఏది?(తాష్కెంట్ ఒప్పందం, 1966)
27. లాల్ బహదూర్ శాస్త్రీ తరువాత భారతదేశ ప్రధానమంత్రి ఎవరు? ( శ్రీమతి ఇందిరాగాంధీ, 1966 జనవరి 24 )
28. నాల్గవ సార్వత్రిక ఎన్నికలు ఎప్పుడు జరిగినవి ? (1967లో )
29. నాల్గవ సార్వత్రిక ఎన్నికల తరువాత ఏ పార్టీ అధికారంలోకి వచ్చింది ? ( భారత జాతీయ కాంగ్రెస్ )
30. భారత రాష్ట్రపతిగా రెండుసార్లు ప్రమాణ స్వీకారం చేసింది ఎవరు ? ( రాజేంద్ర ప్రసాద్ )
31. డా॥సర్వేపల్లి రాధాకృష్ణ రాష్ట్రపతిగా పదవీ ప్రమాణ స్వీకారం ఎప్పుడు చేశారు ? (1962 మే 13)
32. భారత తృతీయ రాష్ట్రపతి ఎవరు? ఆయన ఎప్పుడు పదవీ స్వీకారం చేశారు. (డా॥ జాకీర్ హుస్సేన్ 1967 మే 13 )
33. హర్యానా రాష్ట్రం ఎప్పుడు ఏర్పడింది ? ( 1966లో )
34. మన జాతీయ చిహ్నం మూడు సింహాల గుర్తు భారత ప్రభుత్వంచే ఎప్పటి నుండి అనుసరించబడుతుంది ? ( 1950 జనవరి 26 )
35. భారత దేశం గణతంత్ర రాజ్యంగా ఎప్పటినుండి అమలులోకి వచ్చింది? ( 1950 జనవరి 26 )
36. మన జాతీయ గీతాన్ని రాజ్యాంగ పరిషత్తు ఎప్పుడు ఎంపిక చేసింది ? ( 1950 జనవరి 24న )
37. రాజ్యాంగ పరిషత్తు చే జాతీయ పతాకము ఎప్పుడు ఎంపిక చేయబడింది? ( 1947 జులై 22)
38. 'జనగణమన' జాతీయ గీతం మొదటిసారిగా ఎప్పుడు, ఎక్కడ అలా పిలవబడింది ?
( 1911 డిసెంబరు 27 .భారత జాతీయ కాంగ్రెస్ కలకత్తా సమావేశంలో )
39. భారత జాతీయ కాంగ్రెస్ స్వాతంత్ర్యానంతరం మొదటిసారిగా ఎప్పుడు విడిపోయింది ? ( 1969 లో )
40. అర్ధాంతరంగా రద్దు చేయబడిన ప్రథమ లోక్‌సభ ఏది ? అది ఎప్పుడు రద్దు చేయబడింది?(నాల్గవ లోక్ సభ 1970లో)
41. బ్యాంకులు ఎప్పుడు జాతీయం చేయబడినవి ? ( 1969లో )
42. ఐదవలోక్‌సభకు ఎన్నికలు ఎప్పుడు జరిగినవి ? ఏ పార్టీ విజయం సాధించింది ? ( 1971 లో భారతజాతీయ కాంగ్రెస్ )
43. రెండవ భారత్ -పాక్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ( 1971లో )
44. బంగ్లాదేశ్ ఎప్పుడు ఏర్పడింది ? ( 1971 లో )
45. రెండవ భారత్ పాక్ యుద్ధం తరువాత పాకిస్తాన్ - భారత్ దేశాల మధ్య జరిగిన ఒప్పందం పేరేమి ? ( సిమ్లా ఒప్పందం )
46. సిమ్లా ఒప్పందం ఎప్పుడు ఎవరెవరి మధ్య జరిగింది ? ( 1972లో ఇందిరాగాంధీ జెడ్.ఏ.భుట్టో మధ్య)
47. మైసూరు రాష్ట్రం పేరు కర్ణాటకగా ఎప్పుడు మార్చబడింది ? ( 1973 నవంబరు, 1న)
48. భారత నాల్గవ రాష్టపతిగా శ్రీవి.వి.గిరి. ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు? ( 1969 మే 3న )
49. భారత ప్రభుత్వం రాజభరణాలను ఎప్పుడు రద్దు చేసింది ? ( 1970 నవంబరు 21)
50. భారత ఐదవ రాష్ట్రపతి గా శ్రీఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు? ( 1974 ఆగష్టు 24 న )
51. భారతదేశంలో మొదటిసారిగా అత్యవసర పరిస్థితి ఎప్పుడు విధించబడింది? ( 1975 జూన్ 25 )
52. అత్యవసర పరిస్థితి నాటి రాష్ట్రపతి, ప్రధానమంత్రులు ఎవరు ? (ఫక్రుద్దీన్ ఆలీఅహమ్మద్ , శ్రీమతి ఇందిరాగాంధీ)
53. అత్వవసర పరిస్థితి ఎప్పుడు ఉపసంహరింపబడింది ? ( 1977 మార్చి 21 )

54. ఆరవ లోక్‌సభ ఎన్నికలు ఎప్పుడు జరిగినవి ? ఏ పార్టీ విజయం సాధించినది? ( 1977 మార్చిలో, జనతా పార్టీ )
55. స్వాతంత్ర్యానంతరం కేంద్రంలోఏర్పడిన ప్రప్రథమ కాంగ్రెసేతర ప్రభుత్వమేది ? కాంగ్రెసేతర ప్రధాని ఎవరు?
( జనతా ప్రభుత్వం, మోరార్జీ దేశాయ్)
56. ఆరవ రాష్ట్రపతిగా శ్రీనీలం సంజీవరెడ్డి ఎప్పుడు పదవీ ప్రమాణ స్వీకారం చేశారు ? ( 1977 జులై 25 )
57. 1975లో అత్యవసర పరిస్థితిలో జరిగిన దురంతాలను విచారించేందుకు జనతాప్రభుత్వం నియమించిన కమీషన్ పేరేమి ?
(షా కమీషనర్ )
58. శ్రీ మొరార్జీ దేశాయ్, ప్రధాన మంత్రి పదవికి ఎప్పుడు రాజీనామా చేశారు? ( 1979 జూన్ 15న )
59. శ్రీ చరణ్ సింగ్ ప్రధాన మంత్రిగా ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు ? ( 1979 జులై 28 )
60. ఆరవ లోక్ సభ ఎప్పుడు రద్దు చేయబడింది ? ( 1979 ఆగష్టు 31న )
61. శ్రీమతి ఇందిరాగాంధీ తిరిగి ప్రధానమంత్రి పదవిని ఎప్పుడు చేపట్టారు? (1980 జనవరి 14న )
62. భారతదేశంలో మొదటి అణు పరీక్ష ఎప్పుడు, ఎక్కడ జరిగింది ? ( 1974 మే 18 రాజస్తాన్ లోని పోకారాంలో)
63. రోదసీ యుగంలోకి భారతదేశం ఎప్పుడు ప్రవేశించింది ? ( 1975 ఏప్రిల్ 19 )
64. రోదసీలోకి వెళ్ళిన మొట్టమొదటి భారతీయుడు ఎవరు ? ఆయన రోదసీలో ఎప్పుడు వెళ్ళాడు ? ( రాకేష్ శర్మ - 1984 ఏప్రిల్ 3న )
65. భారతదేశ మొట్టమొదటి ఉపగ్రహం 'ఆర్యభట్ట' ఎప్పుడు ప్రయోగింప బడింది ? ( 1975 ఏప్రిల్ 19 )
66. భారత దేశ రెండవ ఉపగ్రహం 'భాస్కర' ఎప్పుడు, ఎక్కడ నుండి ప్రయోగింపబడినది ?
( 1978 జూన్ 7, సోవియట్ రోదసీ ప్రయోగశాల నుండి )
67. వాయుదూత్ ఎప్పుడు నెలకోల్పబడింది ? ( 1981 లో )
68. భారతదేశం స్వయంగా 'రోహిణి' ఉపగ్రహన్ని ఎప్పుడు ప్రయోగించింది? ( 1980 జులై 18న )
69. భారత దేశపు బహుళార్ధ సాధక ఉపగ్రహం ఇన్ శాట్ -1ఎ ఎప్పుడు ప్రయోగింపబడినది ? ( 1982 ఏప్రియల్ 10 )
70 . భారత దేశపు బహుళార్ధ సాధక ఉపగ్రహం ఇన్‌శాట్ - 1బి అమెరికాలోని కానెవెరల్ అగ్రం నుండి ఎప్పుడు ప్రయోగింపబడింది
(1983 ఆగష్టు 30 న )
71. రూ10,000, రూ. 5,000, రూ. 1000 విలువైన కరెన్సీ నోట్లు ఎప్పుడు రద్దు చేయబడినవి ? ( 1978 లో )
72. రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా ఎప్పుడు స్థాపించబడింది ? ( 1935 ఏప్రిల్ 1న )
73. రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా ఎప్పుడు జాతీయం చేయబడింది ? (1949 జనవరి 1 )
74. పూర్తిగా భారతీయులచే స్థాపింపబడిన మొట్టమొదటి బ్యాంక్ ఏది ? అది ఎప్పుడు స్థాపిపబడింది ?
(ఔద్ కమర్షియల్ బ్యాంక్, 1881 లో)
75. భారత దేశపు మొట్టమొదటి జియో స్టేషనరీ ఉపగ్రహము 'ఆపిల్' ఎప్పుడు, ఎక్కడు నుండి ప్రయోగింపబడింది ?
( 1981 జూన్ 8, ఫ్రెంచిగయానాలోని కౌరూ నుండి )
76. గ్రామీణ బ్యాంకులు ఎప్పుడు నెలకోల్పబడినవి ? ( 1975 లో )
77. హిమాచలప్రదేశ్‌కు రాష్ట్ర ప్రతిపత్తి ఎప్పుడు లభించింది ? ( 1971 జనవరి 25 )
78. త్రిపుర రాష్ట్రం ఎప్పుడు ఏర్పడింది ? ( 1972 జనవరి 20 )
79. మేఘాలయ క్రొత్త రాష్ట్రంగా ఎప్పుడు ఏర్పడింది ? ( 1972 జనవరి 20 )
80. అస్సాం రాష్ట్రం ఎప్పుడు పునర్నిర్మించబడింది ? ( 1972 జనవరి 20 )
81. అరుణాచల్‌ప్రదేశ్, మిజోరాం కేంద్ర పాలిత ప్రాంతంగా ఎప్పుడు మారినాయి ? ( 1972 జనవరి 20 న )
82. మిజోరాం 3వ రాష్ట్రంగా ఎప్పుడు రూపొందింది ? ( 1987 ఫిబ్రవరి 20న )
83. అరుణాచల్‌ప్రదేశ్ 24న రాష్ట్రంగా ఎప్పుడు ఏర్పడింది ? ( 1987 జూన్ 20 న )
84. గోవా 25వ రాష్ట్రముగా ఎప్పుడు ఏర్పడింది ? ( 1987 మే 31 )
85. ఆంధ్రప్రదేశ్ ఎప్పుడు ఏర్పడింది ? ( 1956 నవంబర్ 1న )

86. భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి గ్రహీత సర్. సి.వి.రామన్ ఎప్పుడు మరణించారు ? ( 1970 నవంబరు 21)

87. జనతా పార్టీ ఆవిర్భావానికి కారకుడైన లోకనాయక్ జయప్రకాష్ నారాయణ్ ఎప్పుడు మరణించార? (1979 అక్టోబరు 8)

88. ఇందిరాగాంధీ రెండవ కుమారుడు సంజయ్ గాంధీ విమాన ప్రమాదంలో మరణించింది ఎప్పుడు ? ( 1980 జూన్ 23 )

89. భారత జాతీయ కాంగ్రెస్‌లో మూడవసారి చీలిక ఎప్పుడు వచ్చింది ? ( 1981 ఆగష్టు 5 )

90. కాశ్మీరు సింహం షేక్ అబ్దుల్లా ఎప్పుడు మరణించారు ? ( 1982 సెప్టెంబరు 8 )

91. ఆచార్య వినోబాభావే ఎప్పుడు మరణించాడు ? ( 1982 నవంబరు 15 )

92. ఆచార్య వినోబాభావేకు మరణానంతరం పురస్కారం ఎప్పుడు లభించింది? ( 1983 జనవరి 25న )

93. అంటార్కిటికా ఖండం మీదకు భారత దేశపు మొట్టమొదటి పరిశోధనా బృందం ఎప్పుడు చేరింది ? ( 1982 జనవరి 11)

94. అంటార్కిటికా ఖండానికి భారతదేశ రెండవ పరిశోధనా బృందం ఎప్పుడు చేరింది ? ( 1982 డిసెంబరు 28 )

95. ప్రపంచంలో అతి పొడవైన వంతెన 'గాంధీ సేతువు ' ఎప్పుడు ప్రారంభింపబడినది ? ( 1982 మార్చి 2 )

96. 'గాంధీ సేతువు ' ఏ నది పై నిర్మింపబడినది ? ( గంగానది )

97. భారత వైమానిక దళం స్వర్ణోత్సవాలను ఎప్పుడు జరుపుకుంది ? ( 1982 అక్టోబరు 7 )

98 . ఐదవ ఆసియా క్రీడలు ఢిల్లీలో ఎప్పుడు ప్రారంభమైనవి ? ( 1982 నవంబరు 19 )

99. 'కల్పక్కం' అణువిద్యుత్కేంద్రం మొదటి యూనిట్ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీచే ఎప్పుడు ప్రారంభింపబడింది ?
( 1983 జులై 23 )

100. ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన మొట్టమొదటి భారతీయ మహిళ ఎవరు? బచేంద్రిపాల్( 1984 మే 23 )

101. శ్రీమతి ఇందిరాగాంధీ హత్య ఎప్పుడు జరిగింది ? హత్య చేసిన వారెవరు?
( 1984 అక్టోయరు 31 న ఆమె అంగరక్షకులైన బియాంత్ సింగ్, సత్వంత్ సింగ్‌లు )

102. శ్రీ రాజీవ్ గాంధీ ప్రధాన మంత్రిగా ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు? ( 1984 అక్టోబరు 31 )

103. శ్రీ రాజీవ్ గాంధీ, శ్రీ లాంగోవాలా మధ్య ' పంజాబు ఒప్పందం ' ఎప్పుడు జరిగింది? ( 1985 జులై 24 )

104. రాజీవ్ గాంధీకి, అస్సాం విద్యార్థులకు మధ్య 'అస్సాం ఒప్పందం' ఎప్పుడు జరిగిది ? ( 1985 ఆగష్టు 15న )

105. కేంద్రానికి మిజోనాయకుడు లాల్‌డెంగా మధ్య 'మజో ఒప్పందం ఎప్పుడు జరిగింది ? ( 1986 జూన్ 30 )

106. భారతదేశపు మొట్టమొదటి 'టెస్ట్ ట్యూబ్ బేబీ' ఎప్పుడు, ఎవరికి ఎక్కడ జన్మించింది ?
( 1986 జూన్ 14, శ్రీమతి శ్యాంజీచేడాకు, బోంబాయిలోని కె.ఇ.ఎం.హాస్పిటల్‌లో )

107. కేంద్ర ప్రభుత్వోద్యోగులకు ఐదు రోజుల పనివారం ఎప్పుడు ప్రవేశపెట్టబడింది ? ( 1985 జూన్ 3 )

108. విడాకులు తీసుకున్న ముస్లిం మహిళలు భరణానికి అర్హులు అని చెప్పిన షాబానో తీర్పును సుప్రీంకోర్టు ఎప్పుడు ప్రకటించింది
(1985 ఎప్రిల్ 23న )

109. భారత ఏడవ రాష్ట్రపతిగా జ్ఞానీజైల్‌సింగ్ ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు ? (1982 జులై 25 )

110. భారత ఎనిమిదవ రాష్ట్రపతిగా శ్రీరామస్వామి వెంకట్రామన్ ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు ? ( 1987 జులై 27 )

111. భారత తొమ్మిదో రాష్ట్రపతి గా శ్రీ శంకర్‌దయాళశర్మ ఎప్పుడు ప్రమాణ స్వీకారం చేశారు ? ( 1992 జులై 27 )

112. సరిహద్దు గాంధీ, ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ కు భారత రత్న బిరుదు ప్రధానం ఎప్పుడు జరిగింది ? (1987 ఆగష్టు 14 )

113. శ్రీ . ఎం.జి. రామచంద్రన్ కు మరణానంతరం భారతరత్న బిరుదు ప్రధానం ఎప్పుడు జరిగింది? (1988 జనవరి 25 )

114. అమృత్‌సర్ స్వర్ణ దేవాలయంలోని ఉగ్రవాదుల మీద ' బ్లూ స్టార్ ఆపరేషన్ ' ఎప్పుడు జరిగింది ? ( 1984 జూన్ 5 )

115. అమృత్‌సర్ స్వర్ణ దేవాలయం పై రెండవసారి జరిగిన సైనికచర్య పేరేమి? అది ఎప్పుడు జరిగింది ? (ఆపరేషన్ బ్లాక్ థండర్, 1988 మే15 )

116. మాజీమంత్రి, హరిజన నాయకుడు బాబా జగజ్జీవన్ రామ్ ఎప్పుడు మరణించాడు ? ( 1986 జులై 6 )

117. భారత ద్వితీయ రాష్ట్రపతి, ప్రపంచ ప్రఖ్యాత తత్త్వవేత్త డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఎప్పుడు మరణించాడు ? ( 1975 ఎప్రిల్ 17 )

118. మహాత్మాగాంధీ శిష్యురాలు శ్రీమతి మీరాబెన్ ఎప్పుడు మరణించారు ? ( 1982 జులై 20 )

119. ప్రఖ్యాత భారతీయ తత్త్వవేత్త శ్రీజిడ్డు కృష్ణమూర్తి ఎప్పుడు ఎక్కడ మరణించారు ? (1986 ఫిబ్రవరి 17న, కాలిఫోర్నియాలోని ఓజాల్ లో)

120.. శ్రీ రాజీవ్ గాంధీని హత్యచేసినదెవరు? అది ఎక్కడ ఎప్పుడు జరిగింది? ( 1991 మే 21 న శ్రీపెరంబుదూరులో 'థాను, అనే ఎల్.టి.టి.ఇ. మహిళా కార్యకర్త )

121. భోపాల్ గ్యాస్ ట్రాజెడీ ఎప్పుడు జరిగింది ? ( 1984 డిసెంబరు 3 )

122. అయోధ్య రామ జన్మభూమిలో కరసేవకులపై కాల్పులు జరిగినది ఎప్పుడు? (1990 అక్టోబరు 30 )

123. ఫూదోర్జీ ఎవరెస్టు శిఖరాన్ని ఆక్సిజన్ లేకుండా ఎప్పుడు ఎక్కారు ? ( 1984 మే 9 )

124. షాబీనో కేసులో సుప్రీమ్ కోర్టు తీర్పు ప్రభావం లేకుండా చేసేందుకు ఉద్దేశించిన ముస్లిం మహిళల చట్టాన్ని లోక్‌సభ ఎప్పుడు ఆమోదించింది? ( 1996 మే 5 )

125. వయోజన ఓటింగ్ వయస్సును 21 నుండి 18కి తగ్గించిన 62వ రాజ్యాంగ సవరణను పార్లమెంట్ ఎప్పుడు ఆమోదించింది? (1988డిసింబరు 20 )

126. అండమాన్ నికోబార్ దీవులలోని సెల్యూలర్ జైల్ జాతీయ స్మారక చిహ్నంగా ఎప్పుడు ప్రకటింపబడింది ? ( 1979 ఫిభ్రవరి 11 )

127. భారదేశ ప్రప్రథమ ఖండాంత క్షిపణి 'పృథ్వీ ఎప్పుడు ప్రయోగింపబడింది? ( 1988 ఫిబ్రవరి 25 )

128. దేశంలో మొట్టమొదటి వైద్య విశ్వవిద్యాలయం ఎప్పుడు, ఎక్కడ స్థాపింపబడినది? ( 1986 ఏప్రిల్ 8 ( విజయవాడ లో )

129. జాతీయ క్యాలెండర్ ఎప్పుడు వాడుకలోకి వచ్చింది ? ( 19576 మార్చి 22 )

130. జీవిత భీమా సంస్థ ఎప్పుడు జాతీయం చేయడింది ? ( 1956లో )

131. మెట్రిక్ పద్ధతి తూనికలు - కొలతలు ఎప్పటి నుండి అమలులోకి వచ్చాయి? ( 1958 నుండి )

132. భారత రాజ్యాంగానికి మొదటి సవరణ ఎప్పుడు జరిగింది ? ( 1951 లో )

133. భారతదేశాన్ని సామ్యవాద, లౌకిక గణతంత్ర రాజ్యంగా మార్చిన 42వ రాజ్యాంగ సవరణ ఎప్పుడు చేయబడింది ? (1976 నవంబరు 2న)

134. ఇండియన్ ఎయిర్‌లైన్స్ ఎయిర్ ఇండియా సంస్థలు ఎప్పుడు స్థాపింపబడినవి ? ( 1953 జూన్ 15న )

135. పౌరులకు ప్రాథమిక విధులను ప్రవేశపెట్టిన రాజ్యాంగ సవరణ ఏది ? ( 42వ రాజ్యాంగ సవరణ )

136. కేంద్ర రాష్ట్ర సంబంధాల పరిశీలనకు సర్కారియా కమీషన్ ఎప్పుడు నియమింపబడింది ? అధ్యక్షుడు ఎవరు ? ( 1983 మార్చి24, జస్టిస్ ఆర్. ఎస్. సర్కారియా )

137. 'ఇండియన్ స్టాండర్డ్ ఇన్‌స్టిట్యూట్ ' పేరు ' బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ గా ఎప్పుడు మారింది? (1987 ఎప్రిల్ 2)

138. బ్రిటన్ కు చెందిన హెచ్.ఎమ్. ఎస్. హెర్మెస్ భారత నౌకాదళంలో ఐ.ఎన్.ఎస్ విరాట్ గా ఎప్పుడు చేరింది ?( 1987 మే 12 )

139. భారత దేశంలో మొట్టమొదట వార్తాపత్రిక ఏది ? అది ఎప్పుడు, ఎక్కడ స్థాపింపబడింది ? ( కలకత్తా గెజిట్, 1781 జనవరి 29, కలకత్తాలో )

140. భారతదేశంలో మొట్టమొదటి 'టెలిగ్రాఫ్ లైన్ ఎప్పుడు, ఎక్కడ నుండి ఎక్కడకు వేయబడింది ? ( 1851 కలకత్తానుండి డైమండ్ హర్బరుకు)

141. భారత దేశంలో మొట్టమొదటి రైలు మార్గం ఎప్పుడు, ఎక్కడ నుండి ఎక్కడికి యేయబడింది ? ( 1953 ఎప్రిల్ 16న, బోంబాయి నుండి థానాకు )

142. భారత దేశంలో మొట్టమొదటి ఆధునిక ఇనుము- ఉక్కు కర్మాగారం ఎప్పుడు, ఎక్కడ స్థాపింపబడింది ?(1887 కుల్టీ )

143. భారత దేశంలో మొట్టమొదట జలవిద్యుత్కేంద్రం ఎప్పుడు ఎక్కడ స్థాపింపబడింది ? ( 1897 డార్జిలింగ్ )

144. భారతదేశంలో ప్రప్రథమంగా నిర్మించిన న్యూక్లియర్ రియాక్టర్ పేరేమి? అది ఎప్పుడు నిర్మింపబడింది ? ( అప్సర 1956 ఆగష్టు 4)

145. భారతదేశంలో పోస్టల్ డిపార్టుమెంట్ ఎప్పుడు నెలకొల్పబడింది ? అప్పుడు మనదేశంలో ఎన్ని పోస్టాఫీసులు పని చేస్తుండేవి (1854న 700 )

146. మనదేశంలోపోస్టల్ డిపార్ట్మెంట్ పిన్‌కోడ్ పద్ధతిని ఎప్పుడు ప్రారంభించింది ? ( 1972 లో )

147. మనదేశంలో టెలిగ్రాఫ్ సర్వీస్ ఎప్పుడు ప్రారంభమైంది ? ( 1953 నవంబరు లో )

148. మనదేశంలో ప్రప్రథమ టెలిఫోన్ ఎక్స్ఛేంజి ఎప్పుడు, ఎక్కడ నెలకొల్పబడింది ? ( 1881 లోకలకత్తా )

149. ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ సర్వీస్ ఎప్పుడు ప్రారంభమైంది ? (1930లో )

150. మన దేశంలో టెలివిజన్ సర్వీసు ప్రయోగాత్మకంగా ఎప్పుడు ప్రవేశపెట్టబడింది ? ( 1959 లో)

151. ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా ఎప్పుడు నెలకోల్పబడింది ? ( 1947 ఆగష్టు 27న )

152. పూర్తిగా భారతీయమైన మొట్టమొదటి మూకీ చలన చిత్రం ఏది ? దానిని ఎవరు, ఎప్పుడు నిర్మించారు ? (రాజాహరిశ్చంద్ర -ధూండిరాజ్ గోవింద్ ఫాల్కే (దాదాసాహెబ్ ఫాల్కే2) - 1913 లోనిర్మించారు)

153. 'భారత చలన చిత్ర పిత' గా పేరు పొందినది ఎవరు ? ( దాదాసాహెబ్ ఫాల్కే )

154. ప్రప్రథమ భారతీయ టాకీ చలన చిత్రం ఏది ? దానిని ఎవరు నిర్మించారు? దాని డైరెక్టర్ ఎవరు? అది ఎప్పుడు ఎక్కడ విడుదల చేయబడింది ?

( ఆలం ఆరా, ఇంపీరియల్ ఫిల్మ్ కంపెనీ, ఆర్దెషీర్ ఇరానీ, 1931 మార్చి 14 మెజిస్టిక్ సినిమా, బొంబాయి)

155. మొట్టమొదటి భారతీయ రంగుల చిత్రం ఏది? దానిని ఎవరు నిర్మించారు? ( 'కిషన్ కనయా' - ఆర్దెషీర్ ఇరానీ )

156. భారతదేశంలో మొట్టమొదటి అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ఎప్పుడు, ఎక్కడ జరిగింది ? ( 1952 బొంబాయి)

157. మొట్టమొదటి తెలుగు టాకీ చిత్రమేది ? ఎప్పుడు నిర్మించబడింది ? (భక్త ప్రహ్లాద - 1931)

158. రైల్వే బోర్డు ఎప్పుడు స్థాపింపబడింది ? ( 1905 లో )

159. రైలు ఇంజన్లు తయారు చేసే 'చిత్తరంజన్ లోకోమోటీవ్ వర్క్స్, ఎప్పుడు ఉత్పత్తి ప్రారంభించింది? ( 1950 నవంబరు 1)

160. వారణాసి డీజిలు రైలు ఇంజన్ల కర్మాగారం ఎప్పుడు ప్రారంభమైంది ? ( 1964 లో )

161. పెరంబూర్ రైలు పెట్టెల కర్మాగారం ఎప్పుడు ఉత్పత్తి ప్రారంభించింది? ( 1955 లో )

162. భారతదేశంలో మొట్టమొదటి మెట్రో రైల్వే ఏది ? అది ఎప్పుడు ప్రారంభించింది ? ( 1984 కలకత్తా ఏప్రిల్ 14)

163. దూరదర్శన్ మొట్టమొదటగా రెండో ఛానలను ఎప్పుడ ఎక్కడ ప్రారంభించింది ? ( 1984 ఢిల్లీ )

164. రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్స్, కార్యాలయం ఎప్పుడు ప్రారంభింపబడింది? ( 1956 జులై1న )

165. భారతదేశంలో ఇంకా చలామణిలో ఉన్న అతి పురాతన వార్తా పత్రిక ఏది ?అది ఎప్పుడు స్థాపింపబడింది ?

(బాంబే సమాచార్ (గుజరాతీ పత్రిక) 1822లో )

RAMAKRISHNA

# భారతదేశ చరిత్ర

## 1. చారిత్రక ఆధారములు

సాహిత్య ఆధారములు

పురావస్తు ఆధారములు

దేశీయ రచనలు

విదేశీ రచనలు

శాసనాలు

నాణెములు

పురావస్తు శిధిలాలు

(లేక) కట్టడాలు

ఎ) సింహళ,బౌద్ధమత గ్రంథాలు
బి) మెగస్తనీసు (ఇండికా)
సి) ఫాహియాన్,హుయాన్‌త్సాంగ్, ఇత్సింగ్ రచనలు

మత గ్రంథాలు

మతేతర గ్రంథాలు
ఎ) కౌటిల్యుని - అర్థశాస్త్రము
బి) కల్హణుని - రాజతరంగిణి

హిందూమత గ్రంథాలు
ఎ) నాలుగు వేదాలు
(ఋగ్వేదము,యజుర్వేదము,సామవేదము,
అధర్వణ వేదములు)
బి) ఇతిహాసాలు, రామాయణము,
భారతములు
సి) పురాణాలు
(విష్ణు, మత్స్య, వాయు మొ॥వి)
డి) ఉపనిషత్తులు
(చాందోగ్య, బృహదారణ్య,ముండక, ఈశ మొ॥వి)

బౌద్ధమత గ్రంథాలు
ఎ) త్రిపీఠకములు
(వినయ, సుత్త,అభిదమ్మ)
బి) బుద్ధుని జాతక కథలు

జైనమత గ్రంథాలు
ఎ) అంగములు
బి) భద్రబాహుని
కల్పసూత్రములు

1. భారతదేశ చరిత్రకు ముఖ్య ఆధారములు ఏవి ? **(1 . లిఖిత లేక వాఙ్మయ ఆధారములు 2. అలిఖిత లేక పురావస్తు ఆధారములు)**
2. ఆర్యుల తొలి చరిత్రను తెలుసుకొనుటకు ముఖ్య ఆధారము ఏది ? **(ఋగ్వేదము)**
3. చారిత్రక ప్రాధాన్యము గల గ్రంధములలో ముఖ్యమైనది ఏది? **( కౌటిల్యుని అర్థశాస్త్రము)**
4. భారతీయ చరిత్ర - సంస్కృతిని గూర్చి తెలుసుకొనుటకు సహాయపడిన ఆధారములలో రెండవ స్థానమును ఆక్రమించినది ఏమిటి ? **(పురావస్తు ఆధారములు)**
5. పురావస్తు ఆధారములను ఎన్ని రకాలుగా విభజించవచ్చు? అవి ఏవి? **( 3 రకములు, అవి 1 శాసనములు 2 నాణెములు 3 చిహ్నములు లేక శిధిలములు)**
6. భారతదేశ చరిత్రకు ఆధారములయిన పురావస్తు ఆధారములలో ముఖ్యమైన శాసనములు ఏ భాషలయందు గలవు ? **(బ్రాహ్మిలిపి, ఖరోష్ఠిలిపి, పాళీభాష, సంస్కృతము, తమిళము, తెలుగు)**
7. చారిత్రక ఆధారములయిన శాసనములు ఎన్నిరకములు ? అవి ఏవి? **(రెండు అవి 1 స్వదేశీ శాసనములు 2 విదేశీ శాసనములు)**
8. స్వదేశీ శాసనములలో ప్రాచీనమయినవి ఏవి ? **(అశోకుని శిలా శాసనములు)**

9. శాసనముల వలె చరిత్రకు అమూల్యమయిన మరొక ఆధారములనదగినవి ఏవి ? **(నాణెములు)**

10. భారతదేశములో ఎవరితో నాణెముల యుగము ఆరంభమయినది ? **( ఇండో బాక్ట్రియన్ గ్రీకు రాజులతో)**

11. వేద కాలమున ఉపయోగించిన నాణెము లేవి ? **( నిష్క, శతమాన, సువర్ణ, కార్షపన)**

12. భారతదేశ చరిత్రకు ఆధారములయిన సుప్రసిద్ధ ఇతిహాసము లేవి ? **(మహాభారతము, రామాయణము)**

13. ఆర్యులు మన దేశమునకు ఎట్లు వలస వచ్చినారో తెలియజేయు శాసనము ఏది ? **( బోగజ్ కోయీ శాసనము)**

14. పురావస్తు సముదాయకములు ఏవి**(భవన శిథిలములు, వాడిన పాత్ర సామగ్రులు, ఆయుధములు, శిల్పములు, చిత్రలేఖనము)**

15. దక్షిణ భారతదేశమున ఆర్యుల సంస్కృతి వ్యాపించిన విధమును తెలియజేసినది ఏది ? **(రామాయణము)**

16. శాసనములను ముఖ్యముగా వేటిపైన చెక్కుదురు ? **(రాళ్ళు, స్థంభములు, రాగి, ఇత్తడి లోహములు, గుహలపైన)**

17. శాసనములు సాధారణముగా ఏ విషయములపై యుండెను ? **(విజయ యాత్రలు, సంస్కరణలు మొ॥వి)**

18. పూర్వం రాజులచే ముద్రింపబడిన నాణెములకు ఏఏ లోహములను ఉపయోగించినారు ? **(బంగారము, వెండి, రాగి)**

19. మొట్టమొదటగా నాణెముల ముద్రణ భారతదేశములో ఎప్పటి నుంచి వచ్చెను ? **( అశోకుని తరువాత నుండి)**

20. నాణెములను బట్టి ఏ కాలమునకు ఆ నాణెములు చెందినవో ఎలా చెప్పుదురు ? **(నాణెముపై ఉన్న భాష, లిపి, స్వరూపములను బట్టి)**

21. నాణెము యొక్క స్వరూపము, లోహము, కళను బట్టి ఏమి తెలుసుకోవచ్చును ? **(ఆనాటి ఆర్థిక పరిస్థితులు)**

22. చరిత్ర యొక్క పూర్వ యుగమును ఏ విధముగా కనుగొనుట జరిగినది? **(పురావస్తు సంపదను బట్టి)**

23. ఏఏ పీటకములను త్రిపీటకములు అందురు ? **(వినయ, సుత్త, అభిదమ్మ)**

24. ముద్రారాక్షసము అనే నాటకము ఎవరిచే రచించబడెను ? **(విశాఖదత్తుడు)**

25. భారతదేశము వివిధ జాతుల చోద్యమైన ప్రదర్శనశాల అని ఏ చరిత్రకారుడు అన్నాడు **( వి.ఎ. స్మిత్ )**

26. రెండవ చంద్రగుప్తుని కాలంలో భారతదేశాన్ని సందర్శించి చైనా యాత్రికుడు ఎవరు ? **(ఫాహియాన్)**

27. విష్ణు పురాణము ఏ రాజుల చరిత్రను తెలియజేయును **(మౌర్య)**

28. కళింగ చక్రవర్తి అయిన ఖారవేలుని విజయములను సూచించు శాసనము **( హతిగుంఫా శాసనము)**

29. వేద సాహిత్యంలో ప్రఖ్యాతి గాంచిన నాలుగు వేదములు **(ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, ఆథర్వణవేదము)**

30. భారతదేశాన్ని ఏ పర్వత శ్రేణులు ఉత్తర, దక్షిణ భారతములుగా విభజించినవి ? **(వింధ్య)**

## 2. చరిత్ర పూర్వ యుగము (క్రీ.పూ.3000 వరకు)

1. చారిత్రక యుగము అనగా ఏమి? **(మానవుడు లిపి కనిపెట్టిన తరువాతి కాలం)**

2. చరిత్ర పూర్వ యుగం అంటే ఏమిటి ? **(మానవుడు లిపి కనిపెట్టటానికి ముందున్న కాలం)**

3. చారిత్రక యుగం అని ఏ కాలాన్ని అంటారు? **(5000 క్రీ.పూ. నుండి నేటి వరకు)**

4. పూర్వ చారిత్రక యుగం అని ఏ కాలాన్ని అంటారు ? **(క్రీ.పూ. 5000 సంవత్సరముల ముందున్న కాలం)**

5. భారతదేశ చరిత్రలో సింధు నాగరికతకు ముందున్న కాలాన్ని ఏమందురు. ? **(చరిత్ర పూర్వయుగం)**

6. భారతదేశ చరిత్రలో సింధు నాగరికతకు తరవాత కాలాన్ని ఏమందురు? **( చారిత్రక యుగం)**

7. చరిత్ర పూర్వయుగమును ఎన్ని రకములుగా విభజించుట జరిగినది ? **(శిలాయుగము, లోహయుగము)**

8. శిలా యుగమును మరల ఏ విధముగా అభివర్ణించిరి ? **(పాతరాతియుగము, సూక్ష్మరాతియుగం, నవీన శిలాయుగం)**

9. శిలా యుగము అంటే ఎమిటి ? **( మానవుడు రాతి పనిముట్లు వాడిన కాలం)**

10. పాతరాతి యుగమునకు సంబంధించిన నిదర్శనం ఎక్కడ కనపడినది? **(కర్నూలు, రాయఘడ్ నందలి సింగ్యపూర్ గుహలలో)**

11. పాతరాతియుగమునకు సంబంధించినవారు ఏ జాతికి చెందినవారు **(నీగ్రో జాతివారు)**

12. పాత రాతి యుగంలో మానవుడు వాడిన పనిముట్లు ఏవి ? **(గులకరాళ్ళు, రాతి గొడ్డళ్ళు, గీకుడు రాళ్ళు)**

13. పాతరాతి యుగంలో మానవుని ఆహారమేమిటి ? **(పండ్లు, కాయలు, కందమూలాలు, పక్షులమాంసము)**

14. ప్రాచీన శిలాయుగం అని ఏ కాలాన్ని అంటారు ? (క్రీ.పూ. 50,000 - క్రీ.పూ. 25,000)

15. నవీన శిలాయుగం అని ఏ కాలాన్ని అంటారు ? (క్రీ.పూ. 8000 - 500)

16. లోహయుగం అని ఏకాలాన్ని అంటారు ? (క్రీ.పూ. 5000 - 500)

17. రాగి, కంచుయుగం అని ఏకాలాన్ని అంటారు ? (క్రీ.పూ. 5000-1000)

18. మధ్యశిలాయుగం అని ఏకాలాన్ని అంటారు ? (క్రీ.పూ. 10,000 - 8000)

19. సూక్ష్మరాతియుగమునకు గల మరొక పేరు ఏమిటి ? (మధ్యశిలాయుగం)

20. మధ్యరాతి యుగములో మానవుడు ఉపయోగించిన పరికరములు ఏవి?
(మొనతేలిన రాతి ముక్కలను, ఎముకలకు, కర్రలకు అమర్చి గొడ్డళ్ళుగా, ఈటెలుగా ఉపయోగించుట)

21. మధ్యరాతియుగ ప్రజల ఆభరణములేవి ? (దంతములు, గవ్వలతో చేసిన పూసలు)

22. మత విశ్వాసములు మొట్టమొదటి సారిగా ఎప్పుడు ఏర్పడినవి అని చెప్పుదురు ? (మధ్యశిలాయుగ కాలమున)

23. నవీన శిలాయుగమునకు గల మరొక పేరు ఏమి ? (కొత్త రాతియుగము)

24. పితృదేవతారాధన ఏ కాలమునందు ప్రారంభమైనది ? (కొత్తరాతి యుగ కాలము)

25. లోహ యుగమునకు గల మరియొక పేరు ఏమిటి ? (తామ్రశిలాయుగము)

26. తామ్రశిలాయుగ స్థావరములు ఎక్కడ లభించినవి ?
(తీహర్(రాజస్తాన్), నగ్ద(చెంబల్ నదీ ప్రాంతము), నవదలోలి(నర్మదా నదివద్ద), నాసిక్, గోదావరిప్రాంతము)

27. మానవుడు జంతువులను మచ్చిక చేయడం ఎప్పుడు ప్రారంభించాడు? (మధ్యరాతియుగంలో)

28. మానవుడు ప్రప్రథమంగా మచ్చిక చేసిన జంతువు ఏది ? (కుక్క)

29. నవీన శాలా యుగంలో మానవుడు ఉపయోగించిన పనిముట్లు ఏవి?(నునుపుగా, పదునుగా నాగరికంగా ఉన్న రాతి పనిముట్లు)

30. నేటి మానవుని నాగరికతా లక్షణాలన్నీ ఎప్పుడు ప్రారంభమైనవి ? (నవీన శిలాయుగంలో)

31. మానవుడు వ్యవసాయం చేయటం, వస్త్రాలను నేయటం, కుమ్మరిసారెపై కుండలు చేయటం ఎప్పుడు ప్రారంభించాడు?
(నవీన శిలాయుగంలో)

32. మానవుడు రాతి పనిముట్లకు బదులు లోహంతో చేసిన పనిముట్లను ఎక్కువగా వాడిన కాలం ఏది?(లోహయుగం)

33. మానవుడు మొట్టమొదట ఉపయోగించిన లోహమేది ? (రాగి)

34. ఏ లోహం వాడుకతో మానవ నాగరికత ఉచ్ఛదశకు చేరింది ? (ఇనుము)

35. దక్షిణ భారతదేశంలోని నవీన శిలాయుగం మానవులు మరణించిన వారికి పెద్ద పెద్ద బండలతో నిర్మించిన సమాధులను ఏ మందురు? ( రాక్షస గుళ్ళు)

36. భారత దేశంలో మానవుని ఉనికిని సూచించే అతి పురాతన ప్రాంతమేది? (శివాలిక్ పర్వత ప్రాంతము)

37. మానవుడు లోహ పరికరాలను మొట్టమొదటగా ఏపని చేసేందుకు ఉపయోగించాడు ? (అడవులు నరకటానికి)

38. నవీన శిలాయుగం నిర్మాతలైన మానవులు ఏ జాతికి చెందినవారు ? (ఆస్ట్రలాయిడ్)

39. మానవుడు మచ్చిక చేసిన జంతువుల వరుస క్రమం ఏది? (కుక్క, మేక, ఆవు,ఎద్దు,గాడిద, గుర్రం)

40. ప్రాచీన శిలాయుగంలో మానవుడు పనిముట్లను తయారు చేసేందుకు ఉపయోగించిన రాయి ఏది? (క్వార్ట్జైట్)

41. ప్రాచీన శిలాయుగపు పనిముట్లు లభ్యమైన ప్రాంతం ఏది ? (పాకిస్తాన్‌లోని సోన్ నదీలోయ ప్రాంతం)

42. అతి ప్రాచీన శిలాయుగం సాధారణంగా ఏ యుగానికి చెందినదిగా భూగోళ శాస్త్రవేత్తలు భావిస్తారు? (మంచు యుగం)

43. ప్రాచీన, మధ్య, నవీనశిలాయుగపు నాటి అవశేషాలు ఒకే చోట సేకరించబడినది ఎక్కడ ? (వింధ్య పర్వత శ్రేణులలోని భేలన్ లోయ)

44. యజమాని మరణానంతరం అతడితోపాటు పెంపుడు కుక్కను కూడ పాతిపెట్టినట్లుగా దొరికిన సమాధులు ఏ కాలం నాటివి ? (నవీన శిలా యుగం)

45. నవీన శిలాయుగంలో ధాన్యం పండించారనడానికి చిహ్నాలు ఎక్కడ లభ్యమైనాయి ? (అలహాబాద్ ప్రాంతం)

46. ఆంధ్రప్రదేశ్‌లో నవీన శిలాయుగపు నాగరికతకు సంబంధించిన పనిముట్లు దొరికిన సుప్రసిద్ధ స్థలాల ఏవి? **(పిక్లీహిల్, ఉట్నూర్)**

47. ప్రాచీన శిలాయుగపు మానవుడు ఏ జాతివాడు ? **(నీగ్రిటోజాతి)**

48. మధ్యయుగపు మానవుడు ఏ జాతికి చెందినవాడు ? **(హెవెంట్ జాతి)**

49. మానవుడు స్థిర జీవనం ప్రారంభించిన కాలం ఏది? **( నవీన శిలాయుగం)**

50. నవీన శిలాయుగపు మానవుడు ఏ జాతివాడు ? **(ద్రావిడ జాతి)**

51. ఆదిమ మానవుడు విపరీతంగా దేనికి భయపడేవాడు? **(ఉరుములు, మెరుపులకు)**

52. మానవుని జీవన గమనంలో విప్లవాత్మకమైన తొలి మలుపు ఏది ? **(నిప్పును కనుగొనడం)**

53. భారతదేశంలో మొదట నివసించిన ఆదిమ మానవులు ఎవరు ? **(నీగ్రిటోలు)**

54. ఉత్తర భారతదేశములో నవీన శిలాయుగము అనంతరము వాడుకలోనికి వచ్చిన లోహముల ఏవి? **(రాగి, తరవాత ఇనుము.)**

55. నవీన శిలాయుగపు గొడ్డళ్ళు లభ్యమైన బూర్జహమ్ ఎక్కడ కలదు ? **(కాశ్మీర్ లోయలో శ్రీనగర్ కు 40 కి.మీ. దూరంలో)**

56. మెడిటరేనియన్‌జాతికి చెందినవారు ఎవరు ? **(ద్రావిడులు)**

57. భారతదేశములో దేవాలయ నిర్మాణానికి పునాదులు వేసిన వారెవరు ? **(ద్రావిడులు)**

58. పురావస్తు శాఖను రూపొందించిన వ్యక్తి ఎవరు ? **(లార్డ్ కర్జన్)**

59. ద్రావిడ నాగరికత ప్రధానంగా ఏ నాగరికత ? **(పట్టణ నాగరికత )**

60 ద్రావిడ కుటుంబంలో పెద్ద ఎవరు ? **(తల్లి)**

61. ద్రావిడుల ప్రధాన వృత్తి ఏది ? **(వ్యవసాయము)**

62. భారతదేశానికి నిజమైన నాగరికత, సంస్కృతి ఎవరిద్వారా లభించాయని భావిస్తున్నారు? **(ద్రావిడులు)**

63. ద్రావిడ భాషలు అనగా ఏవి ? **(తెలుగు,కన్నడ, తమిళ, మళయాళ భాషలు)**

64. మన దేశమునకు వలస వచ్చిన జాతులలో నాగరీకులు ఎవరు ? **(ద్రావిడులు)**

65. ద్రావిడులు ప్రథమ నివాస స్థలము ఏదని ప్రధానంగా భావించబడుచున్నది? **(మధ్యధరా సముద్ర ప్రాంతము)**

66. ద్రావిడులు దేనియందు కడు నేర్పరులుగా భావించబడుచున్నారు ? **(నౌకా నిర్మాణము)**

67. ద్రావిడుల ముఖ్య ఎగుమతులు లేవి ? **(నూలుబట్టలు, కలప, చందనము)**

68. ద్రావిడులు ఏఏదేశములతో వర్తక వాణిజ్యములు నడిపేవారు ? **(ఈజిప్టు, రోమ్, పర్షియా, బాబిలోనియా)**

69. ద్రావిడుల ముఖ్య పరిశ్రమలు ఏవి ? **( చేనేత పరిశ్రమ, కుండలు చేయుట)**

70. ద్రావిడులు ఎలా నివసించేవారు ? **( తెగలుగా)**

71. ద్రావిడుల ముఖ్య దుస్తులేవి ? **(ధోవతి, తలపాగ,లేక ఉత్తరీయము, శాలువా)**

72. ద్రావిడుల ముఖ్య ఆయుధము లేవి ? **(కత్తి, ఈటె, బాణము)**

73. ద్రావిడుల శిల్ప కళకు నిదర్శనము లేవి? **(ఆ కాలపు మట్టిపాత్రలపై గల కళ )**

74. ద్రావిడుల ప్రధాన దైవములు ఎవరు ? **( ఆదిశక్తి, శివుడు, భూతములు)**

75. దేవతల తృప్తి కొరకు నరబలులిచ్చెడి ఆచారమే సంస్కృతి యందు గలదు ? **(ద్రావిడ సంస్కృతి)**

76. ద్రావిడ భాష యొక్క లిపి ఏదేశం నందు ఉద్భవించినదని చరిత్రకారుల అభిప్రాయం ? **(సుమేరు)**

77. ద్రావిడ భాషలకు ఏ భాషలకు సంబంధము కలదు ? **(సింధియా)**

78. నేడు మన మతమునందు గల పెక్కు లక్షణములు ఎవరివని చెప్పవచ్చు ? **(ద్రావిడులు)**

79. హిందూమతం ఏఏ సంస్కృతుల సమ్మేళనం ? **(ఆర్య, ద్రావిడ)**

80. ద్రావిడ చిహ్నములు ఎక్కడ కన్పించినవని పండితుల అభిప్రాయము? **(వేదకాలపు సంస్కృతములో)**

## 3. సింధు నాగరికత యుగము (క్రీపూ.3000 - 1500)

1. మన దేశంలో అతిపురాతన నాగరికత ఏది ? ( సింధు నాగరికత)
2. సింధూ నాగరికత ఏ కాలమునకు చెందినది ? (తామ్ర శిలాయుగము)
3. సింధూ నాగరికత బయల్పడిన ముఖ్య ప్రాంతములు ఏవి ? ( హరప్పా, మొహంజోదారో)
4. తొలిసారిగా సింధునదీ ప్రాంతంలో త్రవ్వకాలకు నిర్వహణ భాధ్యత వహించిన పురావస్తు శాఖ డైరెక్టరుఎవరు? (సర్ జాన్ మార్షల్)
5. సింధు నాగరికత విలసిల్లిన కాలము ఏది ? (క్రీ.పూ. 2800 - 2200)
6. సింధులోయ నాగరికత శిధిలాలను ఎప్పుడు కనుగొన్నారు ? ( 1921 లో)
7. ప్రధానంగా సింధు ప్రజల నాగరికత ఏది ? (పట్టణ నాగరికత)
8. సింధు నాగరికత నిర్మాతలుగా భావించబడిన జాతి ఏది ? (మధ్యధరా జాతి)
9. సింధు నాగరికతకు మరొక పేరేమిటి ? ( హరప్పా నాగరికత)
10. సింధు నాగరికత అవశేషాలను ఎన్ని ప్రదేశాలలో గుర్తించారు ? (250 పైగా ప్రదేశాలలో)
11. సింధు నాగరికతకు సమకాలీనమైన నాగరికతలు ఏవి ? (అస్సీరియో, బాబిలోనియా, ఈజిప్టు నాగరికతలు)
12. హరప్పా సంస్కృతి యొక్క ప్రత్యేకత ఏమిటి ? (పటిష్టమైన పట్టణ ప్రణాళిక)
13. సింధూ నాగరికత ప్రదేశాలలో పట్టణాలు ఎన్ని ? అవి ఏవి? (ఆరు. అవి 1, హరప్పా 2. మొహంజొదారో, 3.చాన్హు దారో, 4. లోథల్ 5.కలిబంగన్ 6. బన్వారీ)
14. హరప్పా నగరాలలో నిర్మించబడిన ఇళ్ళ ప్రత్యేకత ఏమిటి ? (రోడ్డుకు ఒకవైపే వరుసగా పేర్చబడినట్లు నిర్మించడం)
15. పాకిస్థానులోని పశ్చిమ పంజాబు రాష్ట్రంలోని మాంటిగోమరీ జిల్లాలో ఉన్న నగరం ఏది ? ( హరప్పా)
16. భారత ఉపఖండంలో అతిపురాతన నగరాలేవి ? (హరప్పా, మొహంజదారో)
17. మొహంజదారో ఎక్కడ ఉంది ? (పాకిస్థాన్‌లోని సింధు రాష్ట్రంలోని లార్ఖానా జిల్లాలో)
18. హరప్పా, మొహంజదారోలు ఏ నది ఒడ్డున ఉన్నాయి ? (సింధు నది)
19. హరప్పా, మొహంజదారోలు ఎప్పుడు శిధిలమైనవి ? (క్రీ.పూ. 1750 నాటికి)
20. సింధు నాగరికత వ్యాపించిన ప్రదేశం వైశాల్యం ఎంత ? ( 12 లక్షల 99 వేల 600 చ.కి.మి.)
21. సింధు ప్రజలు వ్యవసాయమునకు ఉపయోగించు జంతువు ఏది ? (ఎద్దు)
22. సింధు నాగరికత వ్యాపించిన ప్రదేశానికి ఉత్తర, దక్షిణ సరిహద్దులు ఏవి? (జమ్మూ, నర్మదానది)
23. సింధునాగరికత వ్యాపించిన ప్రదేశానికి తూర్పు, పశ్చిమ సరిహద్దులు ఏవి ? (మీరట్, బెలూచిస్థాన్ లోని మక్రాన్.)
24. శుభ్రతకు, ఆరోగ్యానికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చిన ప్రాచీన నాగరికత ఏది ? (సింధు నాగరికత)
25. సింధు ప్రజలకు తెలిసిన లోహాలేవి ? (రాగి, వెండి, బంగారము)
26. సింధు ప్రజలకు ఏ లోహం తెలియదు ? (ఇనుము)
27. సింధు ప్రజల ప్రధాన ఆహారపంటలేవి ? (గోధుమ, బార్లీ,వరి)
28. అతి తూర్పున ఉన్న హరప్పానాగరికత గల ప్రదేశము ఏది? (అలంఘీర్ పూర్ )
29. అతి పశ్చిమాన ఉన్న హరప్పా నాగరికత గల ప్రదేశము ఏది ? (సుట్ కోజెండర్)
30. అతి ఉత్తరాన ఉన్న హరప్పా నాగరికత గల ప్రాంతమేది ? (మాండా)
31. అతి దక్షిణాన ఉన్న హరప్పా నాగరికత గల ప్రాంతమేది ? (దైమాబార్)
32. మొహంజదారో అంటే ఏమిటి? (మృత్యు దిబ్బ)
33. ఏ సింధూలోయ పట్టణం చాలాసార్లు సింధునది వరదల్లో మునిగినట్లు దాని శిధిలాలను బట్టి తెలుస్తుంది? (మొహంజదారో)
34. సింధూ నాగరికత గల పట్టణాలలో అతి విశాలమైన పట్టణం ఏది ? (హరప్పా)
35. సింధూ ప్రజలు వరి పండించినట్లు ఏఏ సింధూలోయ పట్టణ శిధిలాల వల్ల తెలుస్తుంది ? (లోథలు, రంగపూర్)

36. ఏ సింధూనాగరికత పట్టణంలో త్రాసు లభించింది ? (లోథల్)

37. ఉత్తర ప్రదేశ్‌లోని మీరట్‌కు సమీపంలో గల సింధూ నాగరికత ప్రదేశం ఏది ? (అలంఘీర్ పూర్)

38. సింధూ నాగరికత కాలంలో ప్రధాన రేవు పట్టణం ఏది ? (లోథల్)

39. మెసపొటేమియా, హరప్పాల మధ్యగల వర్తక కేంద్రమేది ? దాని ప్రస్తుత నామం ఏమిటి ? (డిల్‌మాన్) (ప్రస్తుతం - బహ్రైన్)

40. సింధూ ప్రజల ముఖ్యవృత్తి ఏమిటి ? (వ్యవసాయము)

41. సింధూనాగరికత గల పట్టణాలలో అత్యాశ్చర్యకరమైన విషయం ఏమిటి ? (భూగర్భ మురుగునీటి పారుదల వ్యవస్థ)

42. హరప్పా కాలంనాటి ముద్రలు ఎన్ని లభించాయి ? (రెండు వేలకు పైగా)

43. సింధూ లోయలో లభించిన ముద్రలు మీద ఏ జంతువుల బొమ్మలున్నాయి? (ఎద్దు, గేదె, పులి, మేక, ఏనుగు, ఖడ్గమృగం)

44. సింధూ ప్రజలు పూజించే దేవతలు ఎవరు ? (మాతృదేవత, పశుపతి మహాదేవుడు)

45. సింధూ ప్రజలు మరణించిన వారిని ఏమి చేసేవారు ? (దహనం లేదా పాతి పెట్టడం)

46. సింధూ ప్రజలు పూజించిన పక్షి ఏది? (పావురం)

47. స్వస్తిక్ గుర్తు ఏ నాగరికతకు చెందినది ? (సింధూనాగరికత)

48. సింధు ప్రజల నిర్మాణాలలో సాటిలేనిది ఏది? (స్నానవాటిక)

49. సింధు ప్రజల లిపి ఏది? (బొమ్మల లిపి)

50. సింధూ ప్రజల లిపి ఏ వైపు నుండి ఏ వైపుకు వ్రాసేవారు ? (కుడి నుండి ఎడమకు తిరిగి ఎడమ నుండి కుడికి)

51. సింధూ నాగరికతలో తూర్పు దక్షిణ వీధులను కలిపే కూడలిని ఏమందురు? (ఆక్స్‌ఫర్డ్ సర్కస్)

52. హరప్పా నిర్మాణాలలో ఉపయోగించిన పదార్థం ఏది ? (మట్టి మోర్టర్)

53. సింధూలోయ నాగరికత శిధిలాలు స్పష్టముగా వ్యక్తము చేయునది ఏమి? (వెట్టి చాకిరీ గురించి)

54. సింధు ప్రజల కుండలు ఏ రంగులో వేయబడినవి ? (పసుపు, నలుపు, ఎరుపు రంగులలో)

55. సింధూ ప్రజలకు తెలియని జంతువు ఏది ? (గుర్రం)

56. సింధూ నాగరికత కాలపు ప్రభుత్వము ఏది? (ఏకస్వామ్య మతాధిపత్యం)

57. కాలిబంగన్ అంటే ఏమిటి ? ( నల్ల గాజులు)

58. హరప్పా, మొహంజోదారోలు ఎప్పుడు శిధిలమైనవి ? (క్రీ.పూ. 1750 నాటికి)

59.' నేసిన గుడ్డముక్క' సింధూలోయ ఏ ప్రదేశంలో లభించినది ? (మొహంజొదారోలో)

60. సింధూ ప్రజలు వ్యవసాయానికి నాగలి వాడినట్లు ఏ సింధూలోయ పట్టణ శిధిలాలను బట్టి తెలుస్తుంది ? (కాలిబంగన్)

61. మొహంజొదారో యందలి పౌరులు ఎన్ని జాతుల వారు ? (నాలుగు)

62. మొహంజొదారో నగరమందు గల స్నానాగార వైశాల్యమెంత ? (11,440 చ.అ)

66. సింధూ నాగరికతా కాలంలో భారతదేశం నుండి ఎగుమతి చేయబడిన వస్త్రాలమూట లభించిన పశ్చిమ ఆసియాలోని ప్రదేశంఏది? (ఉమ్మా)

67. సింధూ కాలం నాటి ఏ ప్రాంతంలో మట్టతాయెత్తు, ఓడ బొమ్మ, పాత్ర చిత్రించిన ముద్ర లభించినాయి? (మొహంజోదారో)

68. సింధూలోయ నుండి మెసపొటేమియాకు నూలు వస్త్రాలు ఎగుమతి అయిన వనేందుకు ఆధారమేది? (సమీర్ లో లభించిన హరప్పా ముద్రగల నూలు గుడ్డ.)

69. హరప్పాలిపి లో ఎన్ని గుర్తులున్నాయి ? (400)

70. మొహంజోదారోలో వీధుల వెడల్పు ఎంత ? (135 అడుగుల నుండి 83 అడుగుల వరకు)

71. లోథాల్ రేవు పట్టణం ఏ ఆకారంలో ఉంటుంది ? (విస్తీర్ణమైన చతురస్రాకారంలో)

72. హరప్పా ప్రజల ఆరాధనా స్వభావము గురించి ఇప్పటికీ నిర్ధారణ కాని విషయం ఏది ?**(ప్రకృతి శక్తుల ఆరాధన గురించి)**

73. హరప్పా పై పొరల్లో ఎక్కువగా కనుగొనబడిన కళాసాధనాలు ఏవి ? **(బీటుతో చేయబడిన సాధనాలు)**

74. సింధూ సంస్కృతికి, ఇతర సుమేరియన్ సంస్కృతులకు మౌలికంగా గోచరించే వైవిధ్యం దేనిలో ? **(మత, మృత సంస్కారాలు గురించి)**

75. పూర్వ హరప్పా సంస్కృతికి సంబంధించిన ఆధారాలు లభ్యమయినది ఎక్కడ ? **(గుజరాత్‌లోని ఘల్వర్ జిల్లాలోని రంగాపూర్ వద్ద)**

76. మొహంజోదారో త్రవ్వకములు ఎవరి నేతృత్వములో నిర్వహింపబడెను? **(డా॥ D.R బెనర్జీ)**

77. సింధూలోయ ప్రజలను ఎవరు పరిపాలించెడి వారు? **(ఎక్కువగా వర్తకులు )**

78. సింధూ ప్రజలుపయోగించిన ఆయుధములేవి ? **(గోడ్డలి , ఈటె, బాకు, బడిసె, విల్లంబులు)**

79. సింధూ ప్రజల వినోదము లేవి ? **(సంగీతము, నాట్యము, వేట, పాచికలాట,చదరంగము, ఎద్దులపోట్లాట)**

80. సింధూ ప్రజల పిల్లల ఆట వస్తువు లేవి ? **(ఈలలు, గిలకలు, బండ్లు, జంతువుల బొమ్మలు, మనుషుల బొమ్మలు)**

## 4. వేదయుగం ( క్రీ.పూ. 1500 - 600)

1. వేదములెన్ని అవి ఏవి? **(4. అవి 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము)**

2. వేదాలు ఎవరి పవిత్ర గ్రంథాలు ? **(హిందువుల)**

3. వేదయుగాన్ని ఎన్ని భాగాలుగా విభజించారు ? అవి ఏవి? **(2 అవి 1, ఋగ్వేదయుగం 2 ఋగ్వేదానంతర యుగం లేదా ఇతిహాసయుగం**

4. వేదాలలో అతి పురాతన గ్రంథమేది ? **(ఋగ్వేదము)**

5. ఋగ్వేద కాలం ఏది ? **(క్రీ. పూ. 1600 నుండి 1000 వరకు)**

6. ఇతిహాసయుగ కాలం ఏది ? **(క్రీ.పూ. 1000 నుండి 600 వరకు)**

7. భారత యుద్ధం ఎప్పుడు జరిగింది ? **(క్రీ.పూ. 950 లో)**

8. ఋగ్వేదమునందు ఎన్ని మంత్రములు కలవు? **(1071)**

9. శ్రావ్యమయిన స్వర సంకలనమునకు రూపొందించబడిన వేదము ఏది ? **(సామవేదము)**

10. మంత్ర తంత్రములకు, మానవాతీత శక్తులకు సంబంధించిన వేదము ఏది ? **(అధర్వణ వేదము)**

11. ఋగ్వేద ఆర్యనాగరికత ముఖ్య లక్షణము ఏది ? **(గ్రామీణ నాగరికత)**

12. ఋగ్వేద కాలమునాటి ఆర్యుల ప్రధాన దైవము ఏది ? **(ఇంద్రుడు)**

13. ఋగ్వేదకాలమునాటి ప్రసిద్ధి చెందిన కవయిత్రులు ఎవరు ? **(గార్గి లోపాముద్ర)**

14. ఋగ్వేద ఆర్య నాగరికత కాలమునాటి సమాజవ్యవస్థ ఏది? **(పితృస్వామిక వ్యవస్థ )**

15. వేదకాలములో వ్యాపారము ఏ పద్ధతిలో నడచుచుండెడిది ? **(వస్తు మార్పిడి పద్ధతి)**

16. వస్తుమార్పిడి పద్ధతిలో ఆర్యులు ఉపయోగించు సాధనములు ఏవి ? **(బంగారము మరియు ఆవు)**

17. ఋగ్వేద ఆర్యులు రాజులకు చెల్లించే పన్నును ఏమందురు ? **(బలి)**

18.“రాజే దైవాంశ సంభూతుడు” అనే సిద్ధాంతము ఎప్పుడు ప్రచారములోనికి వచ్చెను ? **(ఇతిహాస లేక మలి వేదకాల ఆర్య నాగరికత కాలంలో)**

19. ఆర్యులు అంటే అర్థం ఏమిటి ? **(పూజ్యులు)**

20. ఆర్యులు ఎవరితో యుద్ధం చేయవలసి వచ్చింది ? **(దస్యులతో)**

21. ఆర్యులు మొట్టమొదట ఎక్కడ స్థిర పడ్డారు ? **(సప్త, సింధూ ప్రాంతంలో లేదా పంజాబులో )**

22. ఆర్యుల సాంఘిక వ్యవస్థకు ప్రాథమిక ప్రమాణమేది ? **(కుటుంబం)**

23. ఋగ్వేదకాలంనాటి ఆర్యుల ప్రధాన వినోద కాలక్షేపం ఏది ? **(రథాల పందెములు)**

24. ‘పురుష సూక్తం’ ఏ వేదంలో ఉన్నది ? **(ఋగ్వేదంలో)**

25. 'చాతుర్వర్ణ వ్యవస్థ' ప్రప్రథమంగా ఏ వేదంలో పేర్కొనబడింది ? **(ఋగ్వేదంలో)**
26. ఋగ్వేద కాలంలో రాజుకు సలహాలనిచ్చే ప్రజా సభలను ఏమనేవారు ? **(సమితి, సభ)**
27. ఋగ్వేద కాలంలో గణ నాయకుని ఏమనేవారు ? **(రాజన్)**
28. ఋగ్వేద కాలంలో ప్రసిద్ధి చెందిన యుద్ధం ఏది ? **(దశరాజ యుద్ధం)**
29. ఋగ్వేద కాలంలో రాజు యొక్క ప్రధాన సలహాదారులు ఎవరు ? **(పురోహితుడు, సేనాని, గ్రామణి)**
30. వేద కాలంలో పవిత్రమైన పానీయం ఏది ? **(సోమరసం)**
31. ఋగ్వేద కాలంలో ఆర్యుల ప్రధాన వృత్తి ఏమి ? **(పశుపోషణ)**
32. వేదకాలంలో గ్రామాధికారిని ఏమని పిలిచేవారు ? **(గ్రామణి)**
33. వేదకాలంలో కులపెద్దను ఏమనేవారు ? **(కులపా)**
34. ఋగ్వేదకాలంలో వాణిజ్యం ఎవరు చేసేవారు ? **(ఫణి లనే అనార్యజాతి)**
35. ఆర్యులు వాడుకలో పెట్టిన నాణెములేవి ? **(నిష్క,శతమాన, సువర్ణ,కార్ష, పణి)**
36. వేదకాలంలో గ్రామ సముదాయాన్ని ఏమనేవారు ? **(విష్)**
37. ఆర్యనాగరికతకు ప్రధాన ఆధారం ఏది ? **(వేద వాఙ్మయం)**
38. మలివేద కాలంలో ఆర్యుల రాష్ట్రాధిపతిని ఏమని పిలిచేవారు ? **(స్థపతి లేక శతపతి)**
39. మలివేద కాలంలో ఆర్యుల ప్రధాన వృత్తి ఏమి ? **(వ్యవసాయము)**
40. మలివేద యుగంలో ఆర్యుల ప్రధాన దేవతలు ఎవరు ? **(బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు)**
41. ఉపనిషత్తులు ఏ కాలంలో రచింపబడినవి ? **(క్రీ.పూ.600)**
42. సంస్కృత మహా భారతమును ఎవరు వ్రాశారు ? **(వ్యాస మహర్షి)**
43. సంస్కృత రామాయణమును రచించింది ఎవరు ? **(వాల్మీకి మహర్షి)**
44. ఋగ్వేదానంతర కాలంలో జరిగిన ప్రధాన యుద్ధమేది ? **(మహాభారతయుద్ధం లేక కురుక్షేత్రం)**
45. కురుక్షేత్ర సంగ్రామము ఎవరెవరికి జరిగినది ? **(కౌరవులకు, పాండవులకు)**
46. భగవద్గీత ఏ గ్రంథంలో భాగం ? **(మహాభారతం)**
47. ప్రాచీన భారత దేశంలోని ప్రముఖ స్మృతి ఏది ? **(మనుస్మృతి)**
48. ఆయుర్వేద వైద్యవిధానానికి మూలమైన వేదం ఏది ? **(అధర్వణ వేదం)**
49. సంగీత విద్యకు మూలమైన వేదం ఏది ? **(సామవేదం)**
50 'శ్రుతులు' అంటే ఏవి ? **(వేదములు)**
51. ఋగ్వేదానంతర నాగరికత ముఖ్య లక్షణమేమి ? **(వర్గ వ్యవస్థ బలపడుట)**
52. ఆర్య భాషయైన సంస్కృతమునందు ఎన్ని ద్రావిడ పదములు ఉన్నవి ? **(సుమారు 450)**
53. హిందూ మత గ్రంథము లేవి ? **(వేదములు, పురాణములు, ఇతిహాసములు, ఉపనిషత్తులు)**
54. ఉపనిషత్తులు వేటికి సంబంధించినవి **(వేదాంతము)**
55. ఉత్తరదేశ సార్వభౌమాధికారమును, ఆర్య రాజులకు మధ్య సంఘర్షణను వివరించినది ఏది? **(మహా భారతము)**
56. దక్షిణ భారతదేశమున ఆర్యుల సంస్కృతి వ్యాపించిన విధమును తెలియజేయునది ఏది ? **(రామాయణము)**
57. చరిత్ర రచనకు ఉపకరించిన పురాణాలు ఏవి ? **(అష్టాదశ పురాణములు)**
58. ఆర్యుల కాలంలో శిక్షావిధానం ఎలా ఉండెడిది ? **(దేశ బహిష్కరణ, అంగ విచ్ఛేదము)**
59. ఆర్యుల కాలంలో రాజులపై కూడా అధికారాన్ని కలిగి ఉండినది ఎవరు ? **(బ్రహ్మణులు)**
60. ఆర్యుల కాలంలో రాజ్య భాగాలను ఏలెడి వారిని ఏమనెడివారు ? **(శతపతి)**
61. ఆర్యుల కాలంలో రాజుకు న్యాయ పాలనలో సహకరించే ఉద్యోగి ఎవరు? **(రాజన్యుడు)**
62. ఆర్యుల కాలంలో గ్రామాధికారితో పాటుగా ఉండే మరో ఉద్యోగి ఎవరు? **(అధీకృత)**
63. ఆర్యుల కాలంలో ప్రయాణ సాధనాలు ఏవి ? **(పశువుల బండ్లు,రధాలు)**

64. ఆర్యుల కాలంలో విదేశీ వ్యాపారం చేసేవారిని ఏమనేవారు ? **(ఫణిజులు.)**

65. ఆర్యులు ఏఏ దేశాలతో వాణిజ్య సంబంధాలు జరిపేవారు ? **(పశ్చిమాసియా, బాబిలోనియా)**

66. ఆర్య రాజులు ఏఏ బిరుదులను సాంప్రదాయకంగా ధరించేవారు ? **(సామ్రాట్, ఏకరాట్, సార్వభౌమ, రాజాధిరాజ)**

67. ఆర్యులు ఏ వంశమునకు చెందిన వారు ? **(నార్డిక్ జాతి)**

68. రామాయణమును తమిళములోనికి ప్రథమముగా అనువదించిన వారు ఎవరు ? **(కంబన్)**

69. ప్రపంచ సాహిత్యంలో ఆది గ్రంథం ఏది ? **(ఋగ్వేదము)**

70. సంహిత అనగానేమి ? **(కూర్పు)**

71. సంహితలోని ప్రార్ధనా శ్లోకములు ఏవి? **(ఋక్కులు)**

72. ఋగ్వేదము ఎన్ని మండలాలుగా విభజించబడినవి . **(10 భాగాలు)**

73. యజ్ఞము కన్నా తపస్సు ఉత్తమమని ప్రభోదించు మోక్షమార్గ చర్చల సారాంశమును ఏమంటారు ? **(అరణ్యకము)**

74. అరణ్యకములలో ముఖ్యమైనవి ఏవి ? **(ఐతరేయ, తైత్తరీయ అరణ్యకము)**

75. గురువు శిష్యుల మధ్య ప్రకృతి ధర్మం గురించి జరిగిన చర్చలసారాంశం ఏమిటి ? **(ఉపనిషత్తు)**

76 ఉపనిషత్ అన్న పదానికి  సాహితీపర వివరణ ఏది ? **(ఒకరి వద్ద కూర్చోనుట)**

77. సామవేదములోని మొత్తం శ్లోకములు ఎన్ని ? **(1603)**

78. కృష్ణ యజుర్వేదం యొక్క ప్రత్యేకత ఏమిటి ? **(పద్య గద్య భాగాలుండటం)**

79. యజుర్వేదములోని ప్రధాన భాగాలు ఏవి ? **(కృష్ణ,శుక్ల, విభాగాలు)**

80. యజుర్వేదములోని శ్లోకాలు ఎన్ని ? **(1836)**

81. అధర్వణ వేదంలోని మొత్తం శ్లోకములు ఎన్ని ? **(731)**

82. అధర్వణ వేదము ఎన్ని భాగాలుగా విభజించబడినది ? **(20 భాగాలు)**

83. జ్యోతిష శాస్త్ర బీజాలు దేనిలో ఉన్నాయి ? **(అధర్వణ వేదము)**

84. చాందోగ్య బ్రాహ్మణం దేనిలోనిది ? **(సామవేదం)**

85. శతపథ బ్రాహ్మణం దేనిలోనిది? **(యజుర్వేదము)**

86. సామవేదమందు గల ఉపాంగము ఏది ? **(తాంట్య, మహమనీయ బ్రాహ్మణులు)**

87. చారిత్రక వివరణగల ఉపనిషత్తులు మొత్తం ఎన్ని ? **(13)**

88. సాంప్రదాయవాదుల నమ్మకం ప్రకారం మొత్తం ఉపనిషత్తులు ఎన్ని ? **(108)**

89. అపౌరుషేయములని వేనినందురు ? **(వేదములు)**

90. జీవాత్మ, పరమాత్మలో లీనమగుటను ఏమందురు ? **(మోక్షము)**

91. వేదములను అధ్యయనం చేయడానికి, అర్ధం చేసుకోవడానికి నిర్దేశించబడిన శాస్త్ర విషయాలనేమంటారు ? **(వేదాంగములు)**

92. వేదాంగములు ఏవి ? **(శిక్ష,కల్ప, నిరుక్త, వ్యాకరణ ఛందస్సు, జ్యోతిషం)**

93. వేదాంగములలో వేద పఠనమునకు అవసరమైన ఉచ్చారణ గూర్చి తెలుపునదేది ? **(శిక్ష (ఫొనెటిక్స్)**

94. వేదాంగములలో  కల్పదేని గూర్చి తెలుపును ? **(వేదములలోని కర్మకాండ (రిట్యువల్)**

95. వేదాలలోని అంతర్గత రహస్యాలను అర్ధం చేసుకోవడానికి అనుగుణమైన శబ్దవ్యుత్పత్తి శాస్త్రం ఏది ? **నిరుక్త (ఎధిమాలజి)**

96. వ్యాకరణము దేని గురించి తెలుపును ? **(వేదముల అధ్యయనం అర్ధవంతంగా అధ్యయనం చేయుట తెలుపును)**

97. వేద పఠనమునకు అత్యావశ్యకమైనదేది ? **(ఛందస్సు)**

98. ఆర్యుల వేద సాహత్యంలో "జ్యోతిష" ప్రాధాన్యత ఏమిటి ? **(ఆర్యుల జీవన వ్యవస్థను ప్రధానంగా ప్రభావితం చేసినది)**

99. సూత్ర వాజ్మయం ఎన్ని భాగాలుగా వర్గీకరించబడెను ? **(నాలుగు వర్గాలు)**

100. కర్మకాండకు సంబంధించి వేద సూత్ర వాజ్మయం ఏది ? **(శ్రౌత సూత్రములు)**

101. దైనందన గృహవ్యవహారాలకు సంబంధించి నిర్దేశిత సూత్ర నిబంధనావళి గల వాజ్మయం ఏది? **(గృహ సూత్రములు)**

102. సాంఘీక బాధ్యతల గూర్చి ధర్మబద్ధమైన జీవనం గురించి తెలిపే వాఙ్మయం ఏది ? **(ధర్మసూత్రములు)**
103. గృహ నిర్మాణమునకు సంబంధించిన శాస్త్ర వివరణ గల సూత్ర వాఙ్మయం ఏది ? **(సుల్య సూత్రములు)**
104. ఋగ్వేదమందు చివరి భాగమేది ? **(పురుషసూక్తము)**
105. పురుషసూక్తమందు పేర్కొనబడిన నాలుగు వర్ణములేవి ? **(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు)**
106. వేద కాలంలో గ్రామ సముదాయాన్ని ఏమనేవారు ? **(విష్)**
107. 'సత్యమేవజయతే' అను వాక్యం ఏ గ్రంథంలోనిది ? **(ముండకోపనిషత్తు)**
108. చతురాశ్రమములేవి ? **(బ్రహ్మచర్యము, గార్హస్థము, వానప్రస్థము, సన్యాసము)**
109. బ్రాహ్మణములు ఏవి ? **(ఐతరేయబ్రహ్మణం, శతపథ బ్రాహ్మణం, జైమినీయ బ్రాహ్మణం, గోపదబ్రాహ్మణం)**
110. అరణ్యకములు ఏవి ? **(ఐతరేయారణ్యకం, తైత్తరేయారణ్యకం, బృహదారణ్యకం, తలవరకారణ్యకము)**
111. ఉపనిషత్తులయందు చర్చించబడిన దేమి ? **(కర్మ, పునర్జన్మ, ముక్తి,ఆత్మ, పరమాత్మ, లేనక విశ్వాత్మ)**
112. మనదేశమున పెక్కు సారస్వత గ్రంథములకు ఆధారములేవి ? **(ఇతిహసములు)**
113. ఋగ్వేదంలో చాలా విషయాలతో సామ్యంగల మరో ప్రాచీన గ్రంథం ఏది ? **(జెండా అవెస్తా)**
114. జెండా అవెస్తాలో పెర్కోనబడ్డ ప్రధాన దేవత ఎవరు ? **(అహర్ మిజ్దా)**
115. జెండా అవెస్తా ఏ దేశపు ఆది గ్రంథం ? **(ఒకప్పటి పర్షియా నేటి ఇరాన్)**
116. వేదాలలో వర్ణించబడిన నదులలో ప్రస్తుతం భౌతికంగా అంతరించిన నదులు ఏవి ? **(సరస్వతి, ద్రిషద్వతి)**
117. ఋగ్వేద కాలంలో అతి పవిత్రంగా భావించబడిన దేవత ఎవరు ? **(సరస్వతి)**
118. ఋగ్వేద కాలంలో భూమిపై ఆధిపత్యం ఎవరిది ? **(వ్యక్తులు వారి కుటుంబాలు)**
119. అనార్యులపై ఆర్యుల విజయానికి ప్రధాన కారణంఏమిటి? **(శక్తివంతమైన సైనిక వ్యూహం, ఆయుధాలు)**
120. ఋగ్వేద ఆర్యులు ఎన్ని తెగలుగా వర్ణించబడ్డారు ? **(పంచజన)**
121. పరుష్ణ నదిగా ఇప్పుడు గుర్తించబడినది ఏది ? **(రావి నది)**
121. సభ, సమితితోబాటు ఋగ్వేద కాలపు ఇతర సలహావేదికలు ఏవి ? **(విధాత, గణ)**
122. ప్రజలు చెల్లించే 'బలి' ఏ రూపంలో ఉండేది ? **(ధాన్య రూపంలో గాని, ఆవుల రూపంలో గాని)**
123. ఋగ్వేద కాలంలో 'బలి' ఎందుకు చెల్లించేవారు ? **(శత్రువు నుండి తమను తమ పశుగణాన్ని కాపాడినందుకు)**
125. 'పుచ్ఛరిష్ణు ' దేనికి సంబంధించినది ? **(కదిలే కోటలు)**
126. వ్యాకరణ శాస్త్రాన్ని రచించింది ఎవరు ? **(పాణిని మహర్షి)**
127. చందశ్శాస్త్రాన్ని రచించింది ఎవరు ? ఆ గ్రంథం పేరేమి? **(పింగళుడు - ఛందోవిచితి)**
128. ప్రాచీన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఎవరు ? **(లగదుడు - గర్గుడు)**
129. రామాయణంలో భాగాలను ఏమంటారు ? అవి ఎన్ని అవిఏవి ?
**(కాండలు ఆరు అవి 1.బాలకాండ 2.అయోధ్యకాండ 3.అరణ్యాకాండ 4.కిష్కింధకాండ 5.సుందరకాండ 6.యుద్ధకాండ)**
130. భారతంలో భాగాలను ఏమంటారు ? అవి ఎన్ని? అవి ఏవి ?
**(పర్వములు. 18 అవి 1 ఆది పర్వము 2 సభాపర్వము 3 అరణ్యపర్వము 4 విరాట పర్వము 5 ఉద్యోగపర్వము 6 భీష్మ పర్వము 7 ద్రౌణ పర్వము 8 కర్ణపర్వము 9. శల్యపర్వము 10 సౌప్తిక పర్వము 11 స్త్రీ పర్వము 12 శాంతి పర్వము 13 అనుశాసనిక పర్వము 14 అశ్వమేధ పర్వము 15 ఆశ్రమవాస పర్వము 16 మౌసల పర్వము 17 మహా ప్రస్థానిక పర్వము 18. స్వర్గారోహణ పర్వము)**
131. దశరాజ యుద్ధములో విజేత ఎవరు ? **(సుధాముడు)**
132. ఆర్యుల ఆసియా వలసకు నిదర్శనము ? **(భోగజ్కోయి శాసనము)**

## 5. జైన, బౌద్ధ మతాలు (క్రీ.పూ. 600-300)

1. క్రీ.పూ. 6వ శతాబ్దంలో భారతదేశంలో ఉద్భవించిన మతములు ఏవి ? **(జైన బౌద్ధ మతములు)**
2. జైనమత స్థాపకుడు ఎవరు ? **(పార్శ్వ నాధుడు)**
3. జైన మతగురువులను ఏమని పిలుస్తారు ? **(తీర్ధంకరులు)**
4. తీర్ధంకరులనగానేమి ? **(జీవన స్రవంతిని దాటించువారు)**
5. జైనులలో 23వ తీర్థంకరుడు ఎవరు ? **(పార్శ్వనాధుడు)**
6. జైనులలో 24వ తీర్ధంకరుడు ఎవరు ? **(వర్ధమాన మహావీరుడు)**
7. జైన తీర్ధంకరులు ఎంతమంది ఉన్నారు ? **(24 మంది)**
8. జైనుల మొదటి తీర్ధంకరుడు ఎవరు ? **(ఋషభనాథుడు)**
9. వర్ధమాన మహావీరుడు ఎప్పుడు ఎక్కడ జన్మించాడు ? **(క్రీ.పూ. 540లో వైశాలికి సమీపంలోని కుందగ్రామంలో)**
10. వర్ధమాన మహావీరుని తల్లిదండ్రులు ఎవరు ? **(సిద్ధార్థుడు, త్రిశాలదేవి)**
11. మహావీరుని భార్య పేరేమి? **(యశోద)**
12. మహావీరుని కుమార్తె పేరేమిటి ? **(ప్రియదర్శని)**
13. వర్ధమానుని బిరుదులు ఏవి ? **(జనుడు, కేవలి, నిగ్ర గ్రంధుడు, మహావీరుడు)**
14. వర్ధమాన మహావీరుని అనుయాయుల నేమంటారు ? **(జైనులు)**
15. వర్ధమాన మహావీరుడు ఎప్పుడు? ఎక్కడ, మరణించాడు ? **(క్రీ.పూ. 468లో రాజగృహం సమీపంలోని పావపురిలో)**
16. వర్ధమానునికి ఎప్పుడు ఎక్కడ జ్ఞానోదయమైంది? **(తన 42వ సంవత్సరములో జృంబిక గ్రామసమీపంలో సాలవృక్షం కింద)**
17. పార్శ్వనాధుడు ప్రతిపాదించిన నాలుగు సూత్రములేవి ? **(1. అసత్యమాడరాదు, 2.ఆస్తిపాస్తులుండరాదు 3.జీవహింస చేయరాదు 4. దొంగతనంచేయరాదు)**
18. పార్శ్వనాధుని నాలుగు సూత్రాలకు వర్ధమానుడు చేర్చిన ఐదవ సూత్రము ఏది? **(బ్రహ్మచర్యము అవలంభించుట)**
19. మహావీరుడు భోధించిన పంచ సూత్రములను ఏమంటారు ? **(పంచ వ్రతములు)**
20. జైన మత గ్రంథములేవి ? అవి ఎన్ని ? **(అంగములు అవి పన్నెండు)**
21. జైన మత త్రిరత్నము లేవి ? **(సద్భక్తి, సత్ జ్ఞానము, సదాచారము)**
22. జైన మతమును ప్రోత్సహించిన మౌర్య చక్రవర్తి ఎవరు? **(మౌర్య చంద్ర గుప్తుడు)**
23. ఏ మౌర్య చక్రవర్తి కాలంలో పాటలీపుత్రంలో జైన పరిషత్తు జరిగింది ? **(మౌర్య చంద్ర గుప్తుడు)**
24. జైనమతం ఎన్ని శాఖలుగా విడిపోయినది? అవి ఏవి? **(రెండు 1 శ్వేతాంబరులు 2. దిగంబరులు)**
25. జైన మతమును దక్షణ భారతదేశంలో వ్యాపింపజేసింది ఎవరు ? **(భద్ర భాహువు)**
26. జైన పరిభాషలో 'కుద్ధశాల' లేక ' కేవలావస్థ' అంటే ఏమిటి ? **(మోక్షం)**
27. పార్శ్వనాధుడు జ్ఞాని అగుటకు తపస్సు చేసిన కాలము ఎంత? **(84 రోజులు)**
28. జైనమతము అనుపేరు ఎవరి వల్ల వచ్చినది ? **(వర్ధమాన మహావీరుడు)**
29. ఏసత్యాన్వేషణలో వర్ధమానుడు తపస్సుచేసిన కాలమెంత ? **(12 సం॥లు)**
30. చేతనా, అచేతనములందు జీవము కలదని ఏమతస్థుల విశ్వాసము **(జైన)**
31. జైనులలో తెల్లని వస్త్రములను ధరించువారు ఎవరు ? **(శ్వేతాంబరులు)**
32. జైనుల కొరకు ఉదయగిరి వద్ద గుహలు తవ్వించిన కళింగ చక్రవర్తి ఎవరు? **(మహరాజా ఖారవేలుడు)**
33. జ్ఞానోదయమైన పిదప వర్ధమానుడు ఏ పేరుతో పిలువబడెను ? **(కేవలి)**
34. మోక్ష సాధనకు జైనమతము సూచించిన విధానము ఏమిటి ? **(సల్లేఖన వ్రతము)**
35. జైన మతములోని అత్యంత కఠినమయిన సిద్దాంతాలు ఏమిటి ? **(బ్రహ్మచర్యము, అహింస)**
36. బౌద్ధ,జైన మతములలో ఏది ప్రాచీనమైనది ? **(జైన మతము)**

37. జైనమతము సాహిత్యము నేమంటారు ? (ద్వాదశాంగములు)
38. శరీరాన్ని క్రమంగా శుష్కింప జేసికొనుటను ఏమందురు ? (సల్లేఖనం)
39. జైన భిక్షువుల నివాసము నేమందురు ? (భిక్షుగృహ)
40. శ్రావణ బెళగోళలోని జైన భిక్షువు విగ్రహము ఎవరిది ? (బాహుబలి)
41. శ్రావణబెళగొళ ఏ రాష్ట్రము నందుగలదు ? (కర్ణాటక)
42. సల్లేఖన దీక్ష ద్వారా శరీరమును త్యజించిన మౌర్య చక్రవర్తి ఎవరు ? (చంద్రగుప్తమౌర్యుడు)
43. ఆత్మ నిగ్రహము దేనిని ఆపుదల చేయునని పార్శ్వనాధుడు బోధించెను? (కర్మను)
44. కర్మను నిర్మూలించుటకు పార్శ్వనాధుడు బోధించిన మార్గం ఏది ? (తపస్సు)
45. మహావీరుని కాలమున మగధను పరిపాలించే రాజు ఎవరు ? (బింబసారుడు)
46. మహవీరుడు ప్రామాణిక గ్రంథములు అని వేనినవెను ? (వేదములు)
47. బౌద్ధమత స్థాపకుడు ఎవరు ? (బుద్ధుడు)
48. బుద్ధుని అసలు పేరేమి ? (సిద్ధార్ధుడు)
49. బుద్ధుడు ఏ ప్రదేశమున జన్మించినాడు ? (లుంబిని)
50. బుద్ధుని తల్లిదండ్రులు ఎవరు ? (శుద్ధోధనుడు, మాయాదేవి)
51. బుద్ధుని భార్య పేరేమిటి ? (యశోధర)
52. బుద్ధుని కుమారుని పేరేమిటి ? (రాహులుడు)
53. గౌతమ బుద్ధుడు పుట్టిన సంవత్సరము ఏది ? (క్రీ.పూ. 567)
54. బుద్ధుడు క్షత్రియ కులములో ఏశాఖకుచెందిన రాజు ? (శాక్య)
55. బుద్ధుడు ఏ రాజ్యమునకు యువరాజు ? (కపిలవస్తు)
56. బౌద్ధ మతములో బుద్ధుడు ఇల్లువదలి వెళ్ల సంఘటనకు ఏమనిపేరు ? (మహాభినిష్క్రమణము)
57. బుద్ధుని జీవితములో గొప్ప మార్పు తెచ్చిన నాలుగు ముఖ్య దృశ్యములేవి?
(రోగ గ్రస్తుడు, వృద్ధుడు సన్యాపి, మృతదేహము)
58. ఇల్లు వదలి వెళ్ళునప్పటికి బుద్ధుని వయసు ఎంత ? (29వ సం॥ము)
59. బుద్ధునికి ఎచ్చట జ్ఞానోదయమైనది ? (గయలోని భోధివృక్షము క్రింద)
60. బుద్ధుడు జ్ఞానోదయము పొందిన సంఘటనకు బౌద్ధమతములో ఏమని పేరు ? (సంబోధి)
61. జ్ఞానోదయమయిన పిమ్మట బుద్ధుడు తాను కనుగొన్న సత్యములను ప్రప్రథమముగా ప్రకటించిన స్థలము పేరేమిటి ?
(సారనాధ్)
62. బుద్ధుని సాహిత్యమునకు ఏమని పేరు ? (త్రిపీఠకములు)
63. గౌతమ బుద్ధుని " ఆసియాజ్యోతి" గా వర్ణించిన దెవరు ? (ఎడ్విన్ ఆర్నాల్డ్)
64. గౌతమ బుద్ధుని " ప్రపంచ జ్యోతి" గా వర్ణించిన దెవరు ? (శ్రీమతి రైన్ డేవిడ్స్)
65. బుద్ధుడు కుశి నగరమున నిర్యాణము చెందునప్పటికి ఆయన వయసు ఎంత ? (80వ సం॥ము)
66. బుద్ధుడు ఎన్ని సంవత్సరములు ధర్మబోద చేసెను ? (సుమారు 45సం॥లు)
67. బుద్ధుని రధసారధి పేరు ఏమిటి ? (చెన్న)
68. బౌద్ధ మహాసభలను ఏమంటారు ? (సంగీతి)
69. ధర్మచక్ర పరివర్తనము ఏ మతమునకు చెందినది? (బౌద్ధమతమునకు)
70. బుద్ధుడు కనుగొనిన చతురాస్య సూత్రములు ఏవి ?
**(ఎ) లోకము ధు:ఖమయము బి)దు:ఖమును పోగొట్టుటకు కోరికలను త్యజింపుము పి) దు:ఖమునకు కోరికలే కారణము డి) కోరికలను జయించుటకు అష్టాంగ మార్గమును అనుసరించవలేను)**

71. అష్టాంగ మార్గములు ఏవి? (సత్ వాక్కు, సత్ క్రియ, సత్‌జీవనము, సత్ శ్రమ, సత్ ఆలోచన, సత్ ధ్యానము, సత్ నిశ్చయము, సత్ దృష్టి)

72. బుద్ధుని అనుచరులు ఎవరు? (ఆనందుడు, ఉపాలి)

73. వినయస్తుతి పీఠికలు వేనిఆధారముగా రూపొందించబడినవి ? (బుద్ధుని ఉపదేశములు)

74. మొదట బౌద్ధ సంగీతి ఎవరి పాలనకాలంలో జరిగినది (అజాత శత్రువు)

75. మొదటి బౌద్ధ సంగీతికి అధ్యక్షత వహించిన వారెవరు ? (మహకాశ్యపుడు)

76. మొదటి బౌద్ధ సంగీతి ఎచ్చట జరిగినది ? (రాజగృహము)

77. మొదటి బౌద్ధ సంగీతి నందు రూపొందింపబడినవి ఏమిటి? (వినయ, సుత్త పీఠికలు)

78. రెండవ బౌద్ధ సంగీతి ఎక్కడ జరిగినది ? (వైశాలి నందు)

79. బౌద్ధులు మహాసాంఘీకులుగానూ, స్థవిరవాదులుగానూ చీలిపోయిన సంగీతి ఎన్నవది ? (రెండవది)

80. పీఠికములు ఏ భాషలో వ్రాయబడినవి ? (పాళి భాష)

81. మూడవ బౌద్ధ సంగీతి ఎక్కడ ఏర్పాటు చేయబడెను ? (పాటలిపుత్రము నందు)

82. మూడవ బౌద్ధ సంగీతి ఏర్పాటు చేసినవారు ఎవరు ? (అశోకుడు)

83. మూడవ బౌద్ధ సంగీతికి అధ్యక్షత వహించిన వారెవరు ? (మొగ్గలి వుత్తతిస్స)

84. మూడవ బౌద్ధ సంగీతిలో రూపొందించబడినవి ఏవి ? (అభిదమ్మ పీఠిక)

85. నాల్గవ బౌద్ధ సంగీతి ఎక్కడ జరిగింది ? (కుందలవనము జలంధర్)

86. నాల్గవ బౌద్ధ సంగీతి ఎవరికాలంలో జరిగింది ? (కనిష్కుడు)

87. నాల్గవ బౌద్ధ సంగీతికి అధ్యక్షత వహించినది ఎవరు ? (వసుమిత్రుడు)

88. నాల్గవ బౌద్ధ సంగీతిలో బౌద్ధ మతము ఎలా విడిపోయెను ? (హీనయానము, మహాయానము)

89. బుద్ధుని దేవునిగా ఆరాధించెడివారిని ఏమందురు ? (మహాయానులు)

90. బుద్ధుని లేక సుప్రసిద్దబౌద్ధ బిక్షువుల అస్థికలపై నిర్మించిన కట్టడములు ఏవి ? (స్థూపములు)

91. బౌద్ధుల విశ్రాంతి గృహములను ఏమని పిలుస్తారు ? (ఆరామములు)

92. బుద్ధుడు ఏ సం॥ము నిర్యాణము చెందినాడు ? (క్రీ.పూ. 487)

93. బుద్ధుని మరణమును ఏమంటారు ? (మహాపరి నిర్యాణము)

94. బుద్ధుడు బోధించిన నీతి నియమావళి ఏది ? (అహింస, దయ, భోగవిసర్జన, ప్రేమ, సత్యము)

95. బుద్ధుని రథసారథి పేరేమిటి ? (చెన్నుడు)

96 బుద్ధుని ప్రథమ జ్ఞాన బోధను ఏమంటారు ? (ధర్మచక్ర ప్రవర్తనము)

97. బౌద్ధుల ప్రార్ధనా మందిరాలను ఏమంటారు ? (చైత్యములు)

98. బౌద్ధ భిక్షువుల విశ్రాంతి మందిరాలను ఏమంటారు ? (ఆరామములు)

99. భారతదేశ చరిత్రలో ప్రప్రథమ సామ్రాజ్యమేది ? (మగధ సామ్రాజ్యము)

100. ఏఏ సిద్ధాంతములను జైన, బౌద్ధ మతములు అంగీకరించెను ? (కర్మ, పునర్జన్మ)

## 6. మగధ రాజ్య ప్రాబల్యము ( క్రీ.పూ. 6వ శతాబ్ధము)

1. షోడశ మహా జనపదములు ఏ శతాబ్దమునకు చెందినవి ? **(క్రీ.పూ. 6వ శతాబ్దం)**
2. క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో ఉత్తర భారతదేశం ఎన్ని జనపదాలుగా విభజింపబడినది ? వాటి పేరేమిటి ? **(16, అవి షోడశ మహజనపదములు))**
3. షోడశ మహజనపదము లేవి ? **(అంగ, కాశీ, కోసల, మగధ, చేది, వత్స, కురు, పాంచాల, మత్స్య, శూరసేన, అశ్మక, అవంతి, గాంధార, కాంభోజ, వజ్జి, దుల్ల)**
4. ఇతిహస కాలంలో మగధను పాలించిన రాజవంశం ఏది? **(బృహద్రధ వంశం)**
5. జరాసంధుడు ఏ వంశానికి చెందినవాడు ? **(బృహద్రధ వంశం)**
6. బృహద్రధ వంశం తరువాత మగధను పాలించిన వంశం ఏది? **(హార్యంక వంశం)**
7. హార్యంక వంశ స్థాపకులు ఎవరు ? **(బింబిసారుడు)**
8. బింబిసారుని కాలంలో మగధ రాజధాని ఏది ? **(గిరి వ్రజము)**
9. బింబిసారుని పాలనా కాలం ఏది ? **(క్రీ.పూ 547 నుండి 495 వరకు)**
10. బింబిసారుని కుమారుడు ఎవరు ? **(అజాత శత్రువు)**
11. అజాత శత్రువు పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 495 నుండి 464)**
12. అజాత శత్రువు కుమారుడు ఎవరు ? **(ఉదయనుడు)**
13. మగధ రాజధానిని రాజగృహం నుండి పాటలీపుత్రమునకు మార్చిన హర్యంక వంశ పరిపాలకుడెవరు ? **(ఉదయనుడు)**
14. హార్యంక వంశము తరువాత మగధనేలిన రాజవంశం ఏది? **(శైశునాగవంశం)**
15. శైశునాగవంశం నిర్మాత ఎవరు ? **(శిశునాగుడు)**
16. శిశునాగుని కుమారుడెవరు ? **(కాలాశోకుడు)**
17. శైశు నాగవంశం తరువాత మగధను పాలించిన రాజవంశం ఏది ? **( నందవంశం)**
18. నందవంశ స్థాపకుడు ఎవరు ? **(మహపద్మనందుడు)**
19. మహపద్మనందుని బిరుదు ఏది ? **(ఏక్‌రాట్)**
20. నంద వంశమును నిర్మూలించినది ఎవరు ? **(చాణుక్యుడు - మౌర్య చంద్ర గుప్తుడు)**
21. నందవంశం తరువాత మగధను పాలించిన రాజవంశంఏది? **(మౌర్యవంశం)**
22. భారతదేశంపై జరిగిన మొదటి విదేశీ దండయాత్ర ఏది ? **(పారశీక దండయాత్ర)**
23. సింధూ, పంజాబు రాష్ట్రాలను జయించటానికి పారశీక రాజైన డరయస్ పంపిన గ్రీకు సేనాని ఏవరు ? **(స్కైలాక్స్)**
24. పారశీకులు భారతదేశంలో ప్రవేశ పెట్టిన లిపి పేరేమి ? **(ఖరోష్టి లిపి)**
25. పారశీక రాష్ట్రాన్ని ఏమంటారు ? **(సత్రప్)**
26. అలెగ్జాండరు దగ్గం చేసిన పారశీక రాజధాని ఏది ? **(పెర్సి పోవస్)**
27. భారతదేశ చరిత్రలో మొట్టమొదట దేశద్రోహి ఎవరు ? **(తక్షశిల రాజు అంభి)**
28. అలెగ్జాండరు తండ్రి పేరేమిటి ? **(ఫిలిప్స్)**
29. ఫిలిప్స్ ఏదేశపు రాజు ? **(మాసిడోనియా)**
30. అలెగ్జాండరును ఎదిరించిన భారతీయ రాజు ఎవరు ? **(పురుషోత్తముడు)**
31. అలెగ్జాండరు పురుషోత్తముని ఏ సంవత్సరంలో, ఏ యుద్దంలో ఓడించెను? **(క్రీ.పూ.326లో జరిగిన జీలం యుద్ధం)**
32. అలెగ్జాండరు ఎక్కడ మరణించాడు ? **(బాబిలోనియాలో)**
33. మహభారత యుద్ధ కాలము ఎప్పుడు జరిగినట్టుగా నిర్ధారించబడుతున్నది.? **(క్రీ.పూ. 3138)**
34. శ్రీ కృష్ణ నిర్యాణము ఎప్పుడు జరిగినదని నిర్ధారించబడినది ? **(క్రీ.పూ 3102)**

35. కలియుగ ప్రారంభము ఎప్పుడని చెప్పబడినది ? **(క్రీ.పూ. 3102)**
36. ఆరవ శతాబ్ద ముఖ్యలక్షణములు ఏవి ? **(రాజకీయ అనైక్యత, ఆధ్యాత్మిక అశాంతి, సాంఘీక విభేదములు)**
37. 6వ శతాబ్ద కాలములో ఉన్న 16 జనపదములలో గణ రాజ్యములెన్ని ? **(రెండు)**
38. 6వ శతాబ్ద కాలములో ఉన్న 16 జనపదములలో రాజరిక వ్యవస్థ గల జనపదములు ఎన్ని ? **(14)**
39. వారణాశి ఏఏ నదుల సంగమ స్థానమున నిర్మింపబడినది ? **(వరుణ,అశి)**
40. వారణాశి రాజధాని ఏది ? **(కాశీ)**
41. ఆరవ శతాబ్దమున గొప్ప విద్యా కేంద్రముగా ప్రసిద్దికెక్కిన నగరము ఏది? **(వారణాశి)**
42. ఆరవ శతాబ్దము నాటి జనపదాలలో బలీయమైనది ఏది ? **(మగధ)**
43. ఆరవ శతాబ్దమునాటి మగధ ఎచ్చట కలదు ? **(బీహారులోని పాట్న, గయ జిల్లాల ప్రాంతము)**
44. ఆరవ శతాబ్దము నాటి ఛేది జనపదం ప్రస్తుతం ఏది? **(బందేల్‌ఖండ్ ప్రాంతం)**
45. ఛేది జనపద రాజధాని ఏది ? **(సుత్తిమతి)**
46. వత్స ఏ నదికి దక్షణముగా ఉన్న జనపదం ? **(యమునా)**
47. వత్స జనపదమునకు, రాజధాని ఏది ? **(కీశాంబి)**
48. ఉదయనుని జీవితమును నాటకముగా రచించిన కవి ఎవరు ? **(భాసుడు)**
49. మహభారత యుద్ధ రంగస్థలమైన జనపదమేది ? **(కురు)**
50. నేడు కురు జనపద ప్రాంత మేది ? **(ఢిల్లీ, మీరట్ జిల్లాల ప్రాంతం)**
51. గంగానది ఉత్తర దక్షణ భాగాలుగా విభజించు జనపదమేది ? **(పాంచాల)**
52. పాంచాల జనపదం నేడెచ్చట గలదు ? **(ఉత్తర ప్రదేశ్‌లోని బడౌన్, ఫరూఖాబాద్ జిల్లాప్రాంతము)**
53. మత్స్య జనపదము నేడెచ్చట కలదు ? **(రాజస్తాన్ లోని జయపూర్ ప్రాంతం)**
54. మత్స్య జనపదము రాజధాని ఏది ? **(విరాట నగరము)**
55. శూరసేన జనపద రాజధాని ఏది ? **(మధుర)**
56. శూరసేన జనపదం నేడెచ్చట గలదు ? **(ఢిల్లీ, ఆగ్రాల మధ్య ప్రాంతం)**
57. గోదావరి పై నున్న ఆంధ్ర జనపదమేది ? **(ఆస్మక)**
58. బుద్దుని కాలంలో అస్మక జనపద రాజుఎవరు ? **(సుజాతుడు)**
59. అస్మక రాజధాని ఏది ? **(పుతిన్)**
60. అవంతి జనపదము నేడెచ్చట కలదు ? **(మధ్యప్రదేశ్ లోని మాళ్వా ప్రాంతం)**
61. గాంధార జనపదము రాజధాని ఏది? **(తక్షశిల)**
62. గాంధార జనపదము నేడెచ్చట కలదు ? **(రావల్పిండి పెషావరుల ప్రాంతం)**
63. కాంభోజ జనపదము రాజధాని ఏది ? **(రాజపురము)**
64. గణ రాజ్య సమాఖ్య లేవి ? **(వజ్జి గణ రాజ్య సమాఖ్య, మల్ల గణ రాజ్య సమాఖ్య)**
65. పోషక మహా జనపదములందు పాలనా వ్యవస్థ ఏన్ని రకములు ? **(రెండు)**
66. బింబిసారుని ఆస్థాన వైద్యుడు ఎవరు ? **(జీవకుడు)**
67. ప్రపంచ విశ్వ విద్యాలయముగా పేరుపొందిన విద్యాలయము ఎచట కలదు? **(తక్షశిల)**
68. భూమండలమందలి క్షత్రియులందరిని నిర్మూలించినాడని పురాణములలో పేర్కొనిన రాజు ఎవరు ?
**(మహాపద్మనందుడు)**
69. చాణక్యుని నామముతో ధననందుని వధించిన వారెవరు ? **(చంద్ర గుప్త మౌర్యుడు)**
70. నందులు ఏ మతాన్ని అవలంభించినారు ? **(జైన మతము)**
71. అలెగ్జాండర్ ఎవరి శిష్యుడు ? **(ఆరిస్టాటిల్ )**
72. అలెగ్జాండర్ భారతదేశ దండయాత్రలకు ఆధారములు ఏవి ? **(స్ట్రాబ్ ఎరియన్ ప్లూటర్స్ మొ॥ గ్రీకు రచయితల రచనలు)**

73. అలెగ్జాండర్‌ను మన దేశమునకు దండెత్తి రమ్మని కోరిన వారెవరు ? **(అంభి)**
74. అంభి ఏ దేశపు జనపదమునకు రాజు ? **(తక్షశిల)**
75. పుష్కలావతి ఆక్రమించిన గ్రీకు సేనాధిపతులెవ్వరు ? **(హఫెష్టియన్ పెర్డికాస్)**
76. జీలం లేక హైడస్పస్ యుద్ధము ఎప్పుడు జరిగింది ? **(క్రీ.పూ. 326 లో)**
77. జీలం యుద్ధ విజేత ఎవరు ? **(అలెంగ్జాండరు)**
78. పారశీక చక్రవర్తి డరయస్‌ను అర్బేలా యుద్ధంలో ఓడించిన రాజు ఎవరు? **(అలెగ్జాండరు)**

## 7.మౌర్యుల యుగం ( క్రీ.పూ. 300 - 200 )

1. మౌర్య వంశ స్థాపకుడు ఎవరు ? **(మౌర్య చంద్రగుప్తుడు)**
2. చరిత్రలో ఒక గొప్ప చారిత్రాత్మక సంఘటన ఏది ? **(మౌర్య సామ్రాజ్య స్థాపన)**
3. మౌర్యుల చరిత్రకు మూలాధారము లేవి ?
**(కౌటిల్యుని అర్థశాస్త్రము, మెగస్తనీస్ ఇండికా, అశోకుని శిలాశాసనాలు,ముద్రారాక్షసము)**
4. చంద్రగుప్త మౌర్యుని పరిపాలనా విధానమునకు, నాటి రాజనీతి తెలుసుకోనుటకు ముఖ్యాధారము ఏది ? **(కౌటిల్యుని అర్థశాస్త్రము)**
5. చంద్రగుప్త మౌర్యుని ప్రధాన మంత్రి ఎవరు ? **(చాణక్యుడు లేక కౌటిల్యుడు లేక విష్ణు గుప్తుడు)**
6. అర్థ శాస్త్రము ఏ భాషలో వ్రాయబడెను ? **(సంస్కృతము)**
7. అర్థ శాస్త్రములో ఎన్ని అధ్యాయాలున్నాయి ? **(150)**
8. అర్థ శాస్త్రములో ఎన్ని శ్లోకములు ఉన్నాయి? **(6,000)**
9. అర్థశాస్త్రమునందు కౌటిల్యుడుపదేశించినదేమిటి ? **(సామ్రాజ్యమును సంపాదించి దానిని పాలించు విధానము)**
10. యధా రాజ తధా ప్రజ అని చెప్పిన దెవరు ? **(కౌటిల్యుడు)**
11. 'ఇండికా' గ్రంధకర్త ఎవరు ? **(మెగస్తనీసు)**
12. మెగస్తనీసు ఎవరు ? **(గ్రీకు రాజు సెల్యూకస్ నికేటర్ యొక్క రాయబారి)**
13.' ఇండికా' గ్రంధం ప్రకారం పాటలీపుత్ర వైశాల్యమెంత ? **(13 కి. మి. పొడవు. రెండున్నర కి.మి. వెడల్పు)**
14. 'ఇండికా' ప్రకారము పాటలీపుత్రనగర పాలనకు ఉన్న 'పురపాలక సంఘ సభ్యులు ఎంతమంది ? **(30 మంది)**
15. మౌర్యులను గూర్చి తెలియజేసే సింహళ ఇతిహాసిక గ్రంధాలు ఏవి ? **(ద్వీపవంశము,మహావంశము)**
16. చంద్రగుప్తమౌర్యుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 322 నుండి 298 వరకు)**
17. చంద్రగుప్త మౌర్యుడు ఓడించిన గ్రీకు సేనాని ఎవరు ? **(సెల్యుకస్ నికేటర్)**
18. మౌర్య చంద్రగుప్తునికి జైనమత దీక్షను ఇచ్చిన జైనమత గురువు ఎవరు ? **(భద్రభాహువు)**
19. మౌర్య చంద్రగుప్తుడు ఏ సంవత్సరంలో ధననందుని చంపి మగధను ఆక్రమించాడు ? **(క్రీ.పూ. 322)**
20. నంద వంశనిర్మూలనకు చంద్రగుప్త మౌర్యునికి తోడ్పడింది ఎవరు ? **(చాణక్యుడు)**
21. చంద్రగుప్త మౌర్యుడు ఎక్కడ మరణించాడు ? **(కర్ణాటకలోని శ్రావణ బెళగోళలో)**
22. మౌర్య చక్రవర్తులలో గొప్పవాడు ఎవరు ? **(అశోకుడు)**
23. అశోకుని తండ్రి పేరేమిటి ? **(బిందుసారుడు)**
24. అశోకుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 274 నుండి 237)**
25. బిందుసారుని పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 298 నుండి 274 వరకు)**
26. అశోకుని జీవిత గతిని మార్చిన యుద్ధమేది ? **(కళింగ యుద్ధము)**
27. కళింగ యుద్ధం ఎప్పుడు జరిగింది ? **(క్రీ.పూ. 261లో)**
28. కళింగ యుద్ధ వర్ణనము గల అశోకుని శిలాశాసనము ఏది ? **(13వ శిలా శాసనము)**
29. అశోకుని శిలాశాసనములను బట్టి అతని రాజ్యవిస్తీర్ణమెంత ? **(తమిళనాడు,అస్సాము తప్ప మిగిలి భారతదేశమంతా.)**

30. అశోకుడు ఎవరి వలన బౌద్ధమతము స్వీకరించెను ? (ఉప గుప్తుడు)
31. బుద్ధము, ధర్మము, సంఘమునందు అశోకుడు విశ్వాసము ప్రకటించినట్లు దేనియందుండెను ? (బైరాట్ శాసనము లేక బధు శాసనం)
32. అశోకుడు దర్శించిన బౌద్ధ మత క్షేత్రంలేవి ? (లుంబినీ, గయ, కుశి, సారనాథ్)
33. అశోకుడు కట్టించిన బౌద్ధ స్థూపములేవి ? (సాంచి సారనాథ్, చార్యుత్)
34. అశోకుడు వ్యాప్తిచేసిన మతమేది ? (బౌద్ధమతము)
35. అశోకుని కాలంలో జరిగిన బౌద్ధ సంగీతి ఏది ? (మూడవ బౌద్ధ సంగీతి)
36. ఇతర మతములను గౌరవించుట వలనే తన మత ఆధిక్యత పెరుగును అని భావించిన చక్రవర్తి ఎవరు ? (అశోకుడు)
37. అశోకుని బిరుదులు ఏవి ? (దేవానాంప్రియ, ప్రియదర్శి)
38. ఎవరి శిలా శాసనములో మనదేశమునకు తొలి లిఖిత ఆధారములు లభించినవి ? (అశోకుని)
39. రెండువేల సంవత్సరాల క్రితమే యుద్ధములను త్యజించమనిన విశ్వశాంతి దూత ఎవరు ? (అశోకుడు)
40. జంతు బలులను, మాంసాహారమును సేవించుటలో జంతువధను అశోకుడు నిషేధించెననుటకు ఆధారమేది? (మొదటి రాతి శాసనము)
41. దేశ సమైక్యతను, సమగ్రతను, ప్రగతిని సాధించుటకు అశోకుడు ప్రవేశపెట్టిన క్రొత్త విధానము ఏమిటి ? (ధర్మము)
42. ధర్మప్రచారమునకు అశోకుడు నియమించిన ప్రత్యేకాధికారులెవరు ? (ధర్మమహామాత్రులు)
43. కాశ్మీర్, గాంధార ప్రాంతాలలో ధర్మ ప్రచారానికి అశోకుడు ఏవరిని పంపాడు ? (మజహంతకుడు)
44. ధర్మ ప్రచారానికి మైసూరు ప్రాంతానికి అశోకుడు ఎవరిని పంపాడు ? (మహాదేవుడు)
45. అశోకుడు బౌద్ధమత ప్రచారము కొరకు సింహళమునకు ఎవరిని పంపెను? (మహేంద్ర, సంఘమిత్ర)
46. మహారాష్ట్రలో బౌద్ధమత ప్రచారానికి అశోకునిచే పంపబడింది ఎవరు ? (మహాధర్మ రక్షితుడు)
47. అశోకుడు బౌద్ధమత ప్రచారము కొరకు బర్మాకు ఎవరిని పంపెను ? (శోన, ఉత్తర)
48. అశోకుడు సింహాసనము అధిష్టించక పూర్వము ఏ రాష్ట్రమునకు గవర్నరుగా నుండెను ? (ఉజ్జయిని)
49. అశోకుని కుమారుడు ఎవరు ? (కుణాలుడు)
50. అశోకుని మత విధానమునకు మూలసూత్రమేది ? (పరమత సహనము)
51. చిట్టచివరి మౌర్య చక్రవర్తి ఎవరు ? (భృహద్రధుడు)
52. అశోకుడు మరణించిన ఎంతకాలములో మౌర్య సామ్రాజ్యము పూర్తిగా అంతరించెను ? (అర్ధ శతాబ్ధి)
53. అశోకుని ఏ విధానము మౌర్య సామ్రాజ్య పతనమునకు కారణము అని కొందరి భావన ? (మతవిధానము)
54. మౌర్య సామ్రాజ్యం అంతమొందిన దెపుడు ? (క్రీ.పూ. 186 సం॥)
55. అశోకుని పరిపాలనలో ముఖ్య సూత్రములు ఏవి ? (అహింస, మైత్రి)
56. చివరి మౌర్య చక్రవర్తిని వధించింది ఎవరు ? (పుష్యమిత్రశుంగుడు)
57. బ్రాహ్మణుడైన మౌర్యసేనాని ఎవరు ? (పుష్యమిత్రశుంగుడు)
58. మౌర్యుల పాలన ఎటువంటిదని స్మిత్ అభిప్రాయము ? (ఉదాత్తమైన, రాజరిక వ్యవస్థ)
59. మౌర్యుల కాలంలో రాజ్యమునకు సర్వాధికారి ఎవరు ? (చక్రవర్తి)
60. మౌర్యుల కాలములో ఉన్నత న్యాయాధీశుడు ఎవరు ? (చక్రవర్తి)
61. మౌర్యుల గూఢచారుల నేమనేవారు ? (సత్రములు)
62. మౌర్యులు తమ ధ్యేయముగా దేనినెంచి పాలించిరి ? (ప్రజాక్షేమము)
63. రాజ్యపాలనలో చక్రవర్తికి సలహా ఇచ్చుటకు తోడ్పడునది ఏది ? (మంత్రి పరిషత్తు)
64. మంత్రి పరిషత్తు నందు ముఖ్యులెవరు? (ముఖ్యమంత్రి, పురోహితుడు, యువరాజు, సేనాని)
65. మంత్రిపరిషత్తు నందు ఉపమంత్రులు ఎందరు ? (14 గురు)
66. మౌర్యుల కాలంలో కోశాధికారి ఎవరు ? (సన్నిధాత)

67. మౌర్యుల కాలంలో ప్రభుత్వము ఎన్ని శాఖలుగా విభజింపబడింది ? **(32)**
68. మౌర్యుల కాలంలో రక్షక భటాధికారి ఎవరు? **(ప్రశస్తి)**
69. సమర్ధవంతమైన గూఢచారి వ్యవస్థ ఉన్న రాజునేమనేవారు ? **(చారచక్షువు)**
70. మౌర్యుల కాలంలో రాజధానికి సమీపముగా ఉన్న రాష్ట్రములను ఎవరు నిర్వహించెడి వారు ? **(మహామంత్రులు)**
71. మౌర్యుల పాలనలో జిల్లాస్థాయి పాలనాంశం పేరేమిటి ? దాని అధికారి ఎవరు ? **(ప్రాదేశములు లేక ఆహారములు, ప్రాదేశికుడు)**
72. ప్రాదేశికునకు ఏఏ ఉద్యోగులు సాయపడేవారు ? **(రజ్జకుడు,యుక్త)**
73. రజ్జకుడు ఏఏ అధికారములు నిర్వహించేవారు ? **(రెవిన్యూ, న్యాయాధికారాలు)**
74. మౌర్యుల గ్రామాధికారి పేరేమి ? **(గ్రామికుడు)**
75. మౌర్యుల కాలంలో ఐదు, పది గ్రామాలపై అధికారి నేమంటారు ? **(గోపుడు)**
76. గోపునపై ఉన్నతాధికారి ఎవరు ? **(స్థానికుడు)**
77. ప్రాదేశములో నాల్గవ వంతు ప్రాంతమును పర్యవేక్షించేది ఎవరు ? **(స్థానికుడు)**
78. మౌర్యుల నాటి ప్రజాసంఘాలేవి ? **(రాజధాని ప్రతినిధులు)**
80. జనపదము నందు ఎవరుంటారు ? **(గ్రామ ప్రతినిధులు)**
81. మౌర్యుల కాలంలో గ్రామాలనుండి వచ్చు ముఖ్యాదాయము ఏమిటి ? **(భూమిశిస్తులు)**
82. మౌర్యుల కాలంలో పన్నులు ఏవి. **(భాగ, బలి)**
83. స్వంత భూమియున్న రైతులు రాజుకు చెల్లించే పన్ను ఏది ? **(భాగ)**
84. భాగ పన్ను ఎంత ? **(పంటలు 1/6 వంతు నుండి 1/4 వంతు వరకు ఉంటుంది)**
85. బలి అనగా ఏమి ? **(రాజు భూములను రైతులు సాగు చేసుకున్నందుకు కౌలు)**
86. గుజరాతులోని సుదర్శన తటాకమును త్రవ్వించింది ఎవరు ? **(చంద్రగుప్తమౌర్యుని సామంతుడైన 'పుష్యగుప్తుడు')**
87. మౌర్యులు వేయించిన రాచబాటలలో ముఖ్యమైనదేది ? **(పాటలీపుత్రము నుండి తక్షశిలకు వేయబడిన రాచబాట)**
88. ఆదాయశాఖకు ముఖ్యాధికారిఎవరు ? **(సమాహర్త)**
89. మౌర్యుల కాలంలో క్రిమినల్ కోర్టులను ఏమనేవారు ? **(కంటక శోధన)**
90. మౌర్యుల కాలంలో సివిల్ కోర్టులను ఏమనేవారు. ? **(ధర్మస్థీయ)**
91. మౌర్యుల కాలంలో అత్యున్నత న్యాయమూర్తి ఎవరు ? **(రాజు)**
92. మౌర్యుల కాలంలో గ్రామాలలో న్యాయపాలనను ఎవరు చూసేవారు ? **(గ్రామపెద్దలు)**
93. మౌర్యుల కాలంలో 10 గ్రామాలకు గల న్యాయస్థానం పేరేమి ? **(సంగ్రహము)**
94. మౌర్యుల కాలంలో 400 గ్రామాలకు గల న్యాయస్థానం పేరేమి ? **(ద్రోణముఖ)**
95. మౌర్యుల కాలంలో 800 గ్రామాలకు గల న్యాయస్థానంపేరేమి ? **(స్థానీయము)**
96. మౌర్యుల నగర పాలకుని పేరేమి **(నాగరికుడు)**
97. మౌర్యుల కాలం నాటి శిక్షలలో ఒకటి తెలుపుము ? **(అంగ విచ్ఛేదనము)**
98. మౌర్యుల రాజులలో ఎవరి కాలంలో శిక్షాస్మృతి తగ్గించబడింది ? **(అశోకుడు)**
99. మౌర్యుల కాలంలో వర్తక సంఘాలను ఏమనేవారు ? **(శ్రేణులు)**
100. మౌర్యుల కాలంలో రాజభాష ఏది? **(ప్రాకృతము)**
101. మౌర్యుల కాలంలో సుప్రసిద్ధ విశ్వవిద్యాలయం ఏది ? **(తక్షశిల)**
102. అశోకుని శాసనముల భాష ఏది ? **(ప్రాకృతము)**
103. అశోకుని శాసనములు ఎక్కువగా ఏ లిపిలో ఉన్నాయి ? **(బ్రాహ్మీలిపి)**
104. భారత ప్రభుత్వ రాజముద్ర (మూడు సింహాల గుర్తు అశోకుని ఏ స్థూపము నుండి గ్రహింపబడినది ? **(సారనాథ్)**
105. అశోకుడు ఎప్పుడు జన్మించాడు ? **(క్రీ.పూ. 269)**

106. మధ్యప్రదేశ్‌లోని సాంచీ స్థూపాన్ని ఎవరు నిర్మించారు ? **(అశోకుడు)**
107. మౌర్య చక్రవర్తుల పాలనాక్రమం ఏది ? **(చంద్ర గుప్తుడు -బిందుసారుడు - అశోకుడు)**
108. నేడు బీహారు రాష్ట్ర రాజధానియైన పాట్న, ప్రాచీన నామమేది ? **(పాటలీపుత్రము )**
109. మౌర్యులకాలంలో ప్రమాణ నాణెము ఏది ? **(పణము)**
110. మౌర్యుల కాలంలో రాగి నాణెము పేరేమి ? **(దుష్కర)**
111. మౌర్యులచే విధింపబడిన కఠిన సుంకాలేవి . **(కార-విష్టి)**
112. మౌర్యుల విదేశాంగ మంత్రి పేరేమి ? **(సంధి విగ్రహుడు)**
113. మౌర్యుల ప్రధాన న్యాయాధికారి పేరేమి ? **(ప్రాడ్వివాకుడు)**
114. అశోకుని కాలంలో దక్షిణ భారతదేశంలో ప్రవేశపెట్టబడిన లిపి ఏది ? **(బ్రాహ్మి లిపి)**
115. అశోకుని లిపిని ఎవరు ? ఎప్పుడు చదివారు ? **(జేమ్స్ ప్రిన్సెప్ 1837లో)**
116. ప్రత్యేక శిలాశాసనాలు అని అశోకుని ఏ శిలాశాసనాలను అంటారు ? **(రెండు కళింగ శిలా శాసనాలను)**
117. ప్రప్రథమ అఖిల భారత సామ్రాజ్యం నిర్మించిన వంశమేది ? **(మౌర్యవంశం)**
118. మౌర్యుల పరిపాలనా కాలమెంత ? ( 137 సం॥ లు **(క్రీ.పూ. 322-185)**
119. అశోకుని స్థంభ శాసనాలకు ఉపయోగించిన రాయి ఎక్కడ నుండి తీసుకుని రాబడినది ? **(చునార్ గని నుండి)**
120. బిందుసారుని బిరుదు ఏది ? **(అమిత్ర ఘాతుడు)**
121. 'ధర్మబాంధవుడ'ని పేరుపొందిన మౌర్య చక్రవర్తి ఎవరు ? **(అశోకుడు)**
122. అశోకుడు చెక్కించిన స్థంభ శాసనములు ఎన్ని ? **(ఏడు)**
123. అశోకుడు చేయించిన గుహాశాసనములు ఎన్ని ? **(మూడు)**
124. అశోకుడు ఎప్పుడు మరణించినాడు ? **(క్రి.పూ. 232)**
125. మౌర్య పాలకులలో చివరి రాజు ఎవరు ? **(బృహద్రధుడు)**

## 8. మౌర్యానంతర యుగం ( క్రీ.పూ. 200 క్రీ.శ.300) ఎ. శుంగులు

1. శుంగ వంశ స్థాపకుడు ఎవరు ? **(పుష్యమిత్రశుంగుడు)**
2. శుంగ వంశ పాలనా కాలమేది ? **(క్రీ.పూ. 187 -75 ( 112 సం॥లు)**
3. పుష్యమిత్రుని అనంతరం ఎంతమంది శుంగ రాజులు రాజ్యపాలన చేసినారు? **(తొమ్మిదిమంది)**
4. శుంగుల చరిత్రకు ఆధారములనదగినవి ఏవి ?
**(పతంజలి-మహాభాష్యము, బాణుని-హర్షచరిత్ర, కాళిదాసు-మాళివికాగ్నిమిత్రము,యోగపురాణము, దివ్యవదాన)**
5. శుంగవంశ రాజుల మతమేది ? **(వైదికమతము)**
6. పుష్యమిత్రుడు మౌర్యుల సామ్రాజ్యంలో ఏభాగాన్ని, హస్తగతం చేసుకొన్నాడు? **(తూర్పుభాగమును)**
7. పుష్యమిత్రుని కుమారుడు ఎవరు ? **(అగ్ని మిత్రుడు)**
8. పుష్యమిత్రుడు, అగ్నిమిత్రుని ఏ ప్రాంతమునకు అధిపతిగా నియమించెను? **(దిశ)**
9. విదర్భను జయించిన శుంగవంశ రాజు ఎవరు ? **(అగ్నిమిత్రుడు)**
10. కాళిదాసు రచించిన 'మాళవికాగ్నిమిత్రం' లో నాయకుడు ఎవరు ? **(అగ్నిమిత్రుడు)**
11. మాళవికాగ్నిమిత్రం కథానాయకి ఎవరు ? **(విదర్భరాజైన యజ్ఞసేనుని కుమార్తె)**
12. పుష్యమిత్ర శుంగుని మనుమడు ఎవరు ? **(వసుమిత్రుడు)**
13. పుష్యమిత్రుని ఓడించిన మనుమడు ఎవరు ? **(వసుమిత్రుడు)**
14. వైదిక మతాభిమాని అయిన శుంగ వంశ రాజు ఎవరు ? **(పుష్యమిత్రుడు)**
15. పుష్యమిత్ర శుంగుని కాలములోని ప్రసిద్ధ వైయాకరణుడు ఎవరు ? **(పతంజలి)**
16. శుంగ వంశంలో చివరి రాజు ఎవరు ? **(దేవభూతి)**

17. దేవభూతి మంత్రి ఎవరు ? (వాసుదేవ కణ్వుడు)
18. శుంగ వంశ కాలమునందే తయారైనది అని భావింపబడుచున్న హిందూ ధర్మ శాస్త్రమేది ? (మను సంహిత)
19. పుష్యమిత్రుడు ఎన్ని అశ్వమేధ యాగములు చేసినాడు ? (రెండు)
20. శుంగ వంశాన్ని అంత మొందించినది ఎవరు ? (వాసుదేవ కణ్వుడు)

## కణ్వులు

21. కణ్వ వంశ స్థాపకుడు ఎవరు ? ( వాసుదేవ కణ్వుడు)
22. వాసుదేవ కణ్వుని కుమారుడెవరు? ( భూమి మిత్రుడు)
23. కణ్వ వంశం చివరి రాజు ఎవరు ? ( సుశర్మ )
24. కణ్వ వంశాన్ని అంతం చేసిన వారెవరు ? ( శాతవాహనులు)
25. కణ్వ వంశం పరిపాలనా కాలమేది ? ( క్రీ.పూ. 75-29 (46. సం॥)

## బాక్ట్రియన్ గ్రీకులు

26. సిరియా రాజధాని ఏది ? ( బాక్ట్రియా)
27. మౌర్య సామ్రాజ్య విచ్ఛిన్నతకు కారకులైన బాక్ట్రియానందు స్థిరపడిన గ్రీకులనేమంటారు ? (బాక్ట్రియన్ గ్రీకులు)
28. బాక్ట్రియన్ గ్రీకులకు గల ఇతర పేర్లేమి ? (ఇండోగ్రీకులు, యవనులు)
29. పుష్యమిత్రుని కాలంలో భారతదేశంపై దండెత్తిన బాక్ట్రియన్ గ్రీకు రాజు ఎవరు ? (డెమెట్రియస్)
30. సుప్రసిద్ధ బాక్ట్రియన్ గ్రీకు రాజు ఎవరు ? (డెమెట్రియస్)
31. బాక్ట్రియ ఎక్కడ ఉన్నది ? (నేటి ఆఫ్ఘనిస్థాన్ ఉత్తర ప్రాంతం)
32. పంజాబు నందు స్థిరపడిన డెమెట్రియస్ వంశస్థులు ఎంతకాలం పాలించిరి? (100 సం॥లు)
33. బౌద్ధ గ్రంధాలలో 'మిళిందుడు' అని ప్రసిద్ధిచెందిన ఇండోగ్రీకు రాజు ఎవరు ? (మీనాండర్)
34. మీనాండర్ పాలనా కాలమేది ? (క్రీ.పూ. 165- 1450)
35. మీనాండర్ రాజధాని ఏది ? (సాకాల ( నేటి సియోల్ కోట)
36. మీనాండర్ ఏ మతమును ఆదరించినాడు ? (బౌద్ధ మతము)
37. మీనాండర్ ఆస్థానములోని బౌద్ధ పండితుడు ఎవరు ? (నాగసేనుడు)
38. మీనాండర్ నాగసేనుల బౌద్ధమత సంవాదమును తెలిపే గ్రంథం ఏది ? (మిళిందపన్హ)
39. హిందూ - గ్రీకు శిల్పకళల మిశ్రమములో ఏర్పడిన శిల్ప కళ ఏది ? (గాంధార శిల్పకళ)
40. భారత దేశంలో మొట్టమొదట బంగారునాణెములను ముద్రించిన రాజులు ఎవరు ? (బాక్ట్రియన్ గ్రీకులు)

## శకులు

41. శకులు ఎవరు ? (సిధియన్లు మధ్య ఆసియావాసులు)
42. శకులు ప్రధమ నివాస స్థలమేది ? (సర్ డెరియానది ఉత్తర ప్రాంతము)
43. శకుల మొదటి రాజు ఎవరు ? (మవుస్)
44. మవుస్ బిరుదమేది ? (రాజాధిరాజు)
45. సంస్కృతములో ప్రప్రథమంగా పెద్ద శిలా శాసనమును వేయించిన శకరాజు ఎవరు ? (రుద్రదమనుడు)
46. శక రాజులలో గొప్పవాడు ఎవరు ? (రుద్రదమనుడు)
47. శక రాజులలో సుదర్శన సరస్సు బాగుచేయించిన వారెవరు ? (రుద్ర దమనుడు)
48. శకుల రాష్ట్రములను, రాష్ట్ర పాలకులను ఏమంటారు? (సత్రపీ- క్షాత్రపులు, మహాక్షాత్రపులు)
49. శకుల మొదటి రాజుల పరిపాలనా ప్రాంతం ఏది ? (వాయువ్య పంజాబ్)

50. క్షాత్రపుడనగా ఎవరు ? **(యువరాజు)**
51. మహాక్షాత్రపుడనగా ఎవరు ? **(రాష్ట్ర మండలాధిపతి)**
52. క్షాత్రపులలో సుప్రసిద్ధులు ఎవరు ? **(పశ్చిమ క్షాత్రపులు)**
53. క్షాత్రపులలో ఎన్ని తెగలున్నాయి ? **(రెండు 1. ఉత్తర క్షాత్రపులు 2. పశ్చిమ క్షాత్రపులు)**
54. పశ్చిమ క్షాత్రపులలో ఎన్ని తెగలున్నాయి ?**(రెండు 1. మహారాష్ట్ర లేక క్షహరాట క్షాత్రపులు 2. మాళవ లేక కార్ధమక క్షాత్రపులు)**
55. క్షాత్రపులలో ప్రసిద్ధులెవరు ? **(పశ్చిమ క్షాత్రపులు)**
56. మహారాష్ట్ర క్షాత్రప రాజ్యమును స్థాపించిన వారే వంశస్థులు ? **(క్షహరాట)**
57. క్షహరాట క్షాత్రప రాజ్యమును స్థాపించినది ఎవరు ? **(భూమకుడు)**
58. క్షహరాట క్షాత్రపుల రాజధాని ఏది ? **(బరుకచ్ఛము లేదా నాసిక్)**
59. భూమకుని అనంతరం రాజు ఎవరు ? **(సహపణుడు)**
60. సహపణుని పాలనా కాలమేది ? **(క్రీ.శ. 119 - 124)**
61. మహారాష్ట్ర క్షహరాట క్షాత్రపులలో సుప్రసిద్ధుడు ఎవరు ? **(సహపణుడు)**
62. సహపణుడు శాతవాహనుల నుండి జయించిన వేవి ? **(మాళ్వా, మాహారాష్ట్రములు)**
63. క్షహరాట వంశర్మూలనము గావించినవాడు ఎవరు ? **(గౌతమీపుత్ర శాతకర్ణి)**
64. మాళవ క్షాత్రవ రాజ్యమును స్థాపించిన వారెవరు? **(కార్ధమక వంశంకారు)**
65. కార్ధమక క్షాత్రవులు పాలించిన ప్రాంతమేది ? కార్ధమక వంశమూలపురుషుడు ఎవరు ? **(మాళవ ప్రాంతము - యశమితిక)**
66. కార్ధమక వంశస్థులలో అగ్రగణ్యుడు ఎవరు ? **(రుద్ర దమనుడు)**
67. రుద్రదమనుని బిరుదు ఏమిటి ? **(మహా క్షత్రిప)**
68. రుద్రదమనుని పాలనా కాలమేది ? **(క్రీ.శ 130 నుండి 150 వరకు)**
69. రుద్రదమనునిచే ఓడింపబడి, అతనికి అల్లుడైన శాతవాహన రాజు ఎవరు? **(శివశ్రీ శాతకర్ణి)**
70. రుద్రదమనుని శాసనములు ఎక్కడ ఉన్నాయి ? **(అంధౌ, గిర్నార్)**
71. కార్ధమక వంశస్థులలో చివరివాడు ఎవరు ? **(మూడవ రుద్రసింహుడు)**
72. కార్ధమక వంశస్థులలో చివరివాడు ఎప్పుడు, ఎవరిచే ఓడించబడ్డాడు ? **(క్రీ.శ.388లో చంద్రగుప్త విక్రమాదిత్యునిచే)**

## పార్థియనులు

73. పార్థియన్లు ఎవరు ? **(ఐరోపాలోని కాస్పియన్ సముద్ర తీర ప్రాంతములోని పార్థియా దేశంవారు)**
74. పార్థియన్లకు గల మరొక పేరు ఏది ? **(పహ్లావులు)**
75. పార్థియన్లు చక్రవర్తులలో సుప్రసిద్ధుడు ఎవరు ? **(గండోఫర్నిస్)**
76. సంస్కృత గ్రంథాలలో విందవర్ధుడని పేరు పొందిన పార్థియన్ చక్రవర్తి ఎవరు ? **(గండోఫర్నిస్)**
77. గండోఫర్నిస్ పాలనాకాలం ఏది ? **(క్రీ.శ. 19 నుండి 45 వరకు)**
78. గండోఫర్నిస్ ఏ ప్రాంతాన్ని పాలించాడు ? **(తూర్పు పర్షియానుండి భారతదేశ వాయవ్య సరిహద్దు ప్రాంతాన్ని పాలించాడు)**

## కుషాణులు

79. కుషాణులు ఎవరు ? **(మంగోలియాలోని యూచీ తెగకు చెందిన వారు)**
80. కుషాణులలో మొదట వాడెవరు? **(కుజుల కాడ్ఫేసెస్)**
81. కాడ్ ఫేసెస్ పాలనా కాలమేది ? **(క్రీ.శ. 15 నుండి 65)**
82. కుజుల కాడ్ ఫేసెస్ కుమారుడెవరు ? **(వానుకాడ్ ఫేసెస్)**
83. కుషాణుల అధికారమును మాళ్వా వరకు వ్యాప్తి చేసిన రాజెవరు ? **(వానుకాడ్ ఫేసెస్)**
84. వాన్ కాడ్ ఫేసెస్ బిరుదములేవి ? **(రాజాధిరాజు, మహేశ్వరుడు, రక్షకుడు)**

85. కుషాణు చక్రవర్తులలో అగ్రగణ్యుడు ఎవరు ? (కనిష్కుడు)
86. కనిష్కునిపాలనా కాలమేది ? (క్రీ.శ. 78 - 101)
87. శక సంవత్సరమును ప్రారంభించిన కుషాణురాజు ఎవరు ? (కనిష్కుడు)
88. కనిష్కుని కాలమున జరిగిన బౌద్ధ సంగీతి ఏది? (నాల్గవ బౌద్ధ సంగీతి)
89. బౌద్ధమతము హీనయానము - మహాయానముగా ఎప్పుడు చీలింది ? (కనిష్కునికాలంలో)
90. కనిష్కుడు ఏ బౌద్ధమత శాఖను ఆదరించినాడు ? (మహాయానము)
91. కనిష్కుడు మగధను జయించి తీసుకువచ్చిన బౌద్ధ పండితుడెవరు ? (అశ్వఘోషుడు)
92. కనిష్కుడు బౌద్ధమతమును ఎవరి ప్రభోధము వలన స్వీకరించెను ? (అశ్వఘోషుడు)
93. కనిష్కుని బిరుదు లేవి ? (దేవపుత్ర, సీజరు)
94. కనిష్కుని ఆస్థానంలోని సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడు ఎవరు ? (చరకుడు)
95. చరకుడు వ్రాసిన ఆయుర్వేద వైద్య గ్రంథమేది (చరక సంహిత)
96. నాల్గవ బౌద్ధ సంగీతి నందు క్రోడీకరించబడిన గ్రంథమేది? (మహావిభాష శాస్త్రము)
97. చైనా, టిబెట్టులలో బౌద్ధమత వ్యాప్తికి కనిష్కుడు పంపిన బౌద్ధ బిక్షువు ఎవరు ? (కశ్యప మాతంగుడు)
98. కనిష్కుడు నిర్మించిన పట్టణమేది ? (కనిష్కపురము)
99. కనిష్కుడు కాశ్మీరును జయించి కనిష్క పట్టణమును నిర్మించెను అనుటకు ఆధారమేది ? (కల్హణుని రాజతరంగిణి)
100. కనిష్కుని రాజధాని ఏది ? (పురుషపురము లేక పెషావర్)
101. కనిష్కుని ఆస్థాన కవి ఎవరు ? (అశ్వఘోషుడు)
102. 'బుద్ధ చరిత్రము' 'సౌందర నందము'. అను గ్రంథాలను రచించింది ఎవరు ? (అశ్వఘోషుడు)
103. కనిష్కుడు పోషించి ఆదరించిన చిత్రకళ ఏది ? (గాంధార)
104. ప్రథమంగా బుద్ధుడు ఏ శిల్పకళలో విగ్రహ రూపం పొందినాడు ? (గాంధార శిల్పకళ)
105. నాల్గవ బౌద్ధ సంగీతికి ఎంతమంది బౌద్ధ భిక్షువులు హాజరైనారు ? (500)
106. నాల్గవ బౌద్ధ సంగీతి నందు పాల్గొనిన సుప్రసిద్ధ బౌద్ధ భిక్షువులు ఎవరు? (నాగార్జునుడు, పార్శ్వుడు)
107. ఆచార్య నాగార్జునుడు ఎవరి ఆస్థానంలోనివాడు? (కనిష్కుడు)
108. ఆచార్యనాగార్జునుడు రచించిన గ్రంథములేవి ? (మాధ్యమిక సిద్ధాంతం , సుహ్రుల్లేఖ)
109. ఇండియన్ ఐన్‌స్టీన్ గానూ, మార్టిన్ లూథర్ గానూ ప్రసిద్ధిపొందినది ఎవరు ? (ఆచార్య నాగార్జునుడు)
110. ఆచార్య నాగార్జునుని జన్మ స్థలం ఏది ? (ఆంధ్రదేశంలోని వేదలి)
111. ప్రపంచములో వెలుగొందు నలుగురు విజ్ఞాన సంపన్నులలో నాగార్జునుడు ఒకడు అని కీర్తించిన దెవరు?(హ్యుయాన్‌త్సాంగ్)
112. వసుమిత్రుడు ఎవరి ఆస్థానంలోనివాడు ? (కనిష్కుని)
113. వసుమిత్రుడు రచించిన గ్రంథం ఏది ? (మహావిభాష శాస్త్రము)
114. కనిష్కుని నాణెములు ఎచ్చటెచ్చట దొరికినవి ? (గోరక్‌పూర్, గజపూర్)
115. కనిష్కుని తరువాత రాజ్యమునకు వచ్చిన రాజెవరు? (వశిష్టుడు)
116. రెండవ అశోకుడు అని ఎవరిని పిలిచేవారు ? (కనిష్కుడు)
117. కనిష్కుడు ఎక్కడ కొయ్యతో పదమూడు అంతస్థులు కలిగిన గోపురమును నిర్మించెను ? (పురుషపురం)

## ఛేది వంశము

118. కళింగను పాలించిన సుప్రసిద్ధ రాజవంశం ఏది ? (ఛేదివంశము (లేక)మహా మేఘవాహన వంశము)
119. ఛేది వంశములో సుప్రసిద్ధుడు ఎవరు? (ఖారవేలుడు)
120. ఖారవేలుని పాలనా కాలమేది ? (క్రీ.పూ. 170 నుండి 157 వరకు)
121. 'కళింగాధిపతి', కళింగ చక్రవర్తి' ఎవరు ? (ఖారవేలుడు)

122. ఖారవేలుని దిగ్విజయ యాత్రలను కీర్తించే శాసనం ఏది ? (హాతి గుంఫా శాసనము)
123. హాతిగుంఫా శాసనము ఎక్కడ ఉంది ? (భువనేశ్వర్‌కు సమీపంలోని ఉదయగిరి కొండలలో)
124. ఖారవేలుడు ఆదరించిన మతమేది ? (జైనమతము)
125. ఖారవేలుని కాలంలో జైన పరిషత్తు ఎక్కడ సమావేశమైంది ? (కుమారగిరిపై)
126. ఖారవేలుడు నిర్మించిన రాజభవనము పేరేమి ? (మహావిజయ ప్రాసాదము)
127. ఖారవేలునిచే ఓడింపబడిన మగధరాజు ఎవరు ? (పుష్యమిత్రశుంగుడు)
128. ఖారవేలునిచే ఓడింపబడిన శాతవాహన రాజు ఎవరు ? (మొదటి శాతకర్ణి)

## శాతవాహనులు

129. ఆంధ్ర దేశాన్నిపాలించిన తొలి రాజవంశం ఏది ? (ఆంధ్ర శాతవాహనులు)
130. శాతవాహన వంశ మూల పురుషుడు ఎవరు ? (శ్రీముఖుడు)
131. శాతవాహనుల ప్రసక్తి గల పురాణమేది? (మత్స్య పురాణము)
132. ఆంధ్రుల ప్రసక్తి గల మొదటి గ్రంథమేది ? (ఐతరేయ బ్రాహ్మణము)
133. శాతవాహనుల జన్మస్థలమేది ? (కృష్ణా, గోదావరుల మధ్యప్రాంతము)
134. శాతవాహనుల తొలి రాజధాని ఏది ? (పైఠాన్ లేదా ప్రతిష్ఠానం)
135. శాతవాహనుల మలి రాజధాని ఏది ? (ధరణికోట లేదా ధాన్యకటకం)
136. శాతవాహనులు వాడిన తొలి భాష ఏది ? (ప్రాకృతము)
137. 'లీలావతి' అనే ప్రాకృత కావ్యం రచించినది ? (శర్వివర్మ)
139. 'బృహత్కథ' రచించినది ? (గుణాఢ్యుడు)
140. శ్రీముఖుని సోదరుడు ఎవరు ? (కృష్ణుడు)
141. మాళ్వను జయించిన మొదటి ఆంధ్రరాజు ఎవరు ? (మొదటి శాతకర్ణి)
143. 'దక్షిణాపథపతి' , అప్రతిహతఃచక్ర అనే బిరుదులు గల శాతవాహన రాజు ? (మొదటి శాతకర్ణి)
144. 'నానాఘాట్' శాసనం వల్ల ఏ శాతవాహన రాజు దిగ్విజయ యాత్రలు తెలుస్తున్నాయి ? (మొదటి శాతకర్ణి)
145. నానాఘాట్ శాసనం చేయించినదెవరు ? (మొదటి శాతకర్ణి భార్య నాగానిక)
146. రెండు అశ్వమేధములు, ఒక రాజసూయము చేసిన శాతవాహన రాజు ? (మొదటిశాతకర్ణి)
147. మొదటి శాతకర్ణికి సమకాలీనుడైన కళింగ రాజు ? (ఖారవేలుడు)
148. మొదటి శాతకర్ణి ఏ మతాభిమాని ? (వైదిక)
149. మగధ రాజధానియైన పాటలీపుత్రాన్ని ఆక్రమించిన శాతవాహనరాజు ? (రెండవ శాతకర్ణి)
150. ఎవరి పాలన అనంతరం శాతవాహన సామ్రాజ్యం తొలిసారిగా ఛిన్నాభిన్నం అయినది? (రెండవ శాతకర్ణి)
151. విక్రమాదిత్యుని సమకాలీనుడైన శాతవాహన రాజు ఎవరు? (మూడవ శాతకర్ణి)
152. మగధ రాజైన 'సుశర్మ'ను వధించిన శాతవాహన రాజు ? (మొదటి పులోమావి)
153. ప్రాకృతిభాష స్థానే సంస్కృతము రాజభాషగా ఎవరి కాలంలో వచ్చినది? (కుంతల శాతకర్ణి)
154. కుంతల శాతకర్ణి ఆస్థాన మంత్రులు ఎవరు ? (గుణాఢ్యుడు, శర్వ వర్మ)
155. సహపణుని ఓడించి, అతని నాణెములను తిరిగి తనపేర ముద్రించుకున్న శాతవాహన రాజు ఎవరు?(గౌతమీపుత్ర శాతకర్ణి)
156. పూర్వ శాతవాహనులలో ఆఖరి రాజు ఎవరు ? (హాల చక్రవర్తి)
157. 'కవి వత్సలుడు అను బిరుదు పొందిన శాతవాహన రాజు ఎవరు ? (హాలుడు)
158. హాలుని సమకాలీనుడైన పశ్చిమ క్షాత్రపులు ఎవరు ? (బౌమికుడు, సహపాణుడు)
159. 'గాథా సప్తశతి'ని రచించింది ఎవరు ? (హాలుడు)
160. 'గాథా సప్తశతి' ఏ భాషలో రచించబడింది ? (ప్రాకృతం)

161. 'గాథా సప్తశతి'ని పోలిన గ్రంథం ? (వజ్జలగ్గ)
162. 'వజ్జలగ్గ' ఎవరి రచన ? (జయవల్లభుని)
163. ఏరాజు దగ్గర నుంచి తల్లిపేరు పెట్టుకొనుట కనిపిస్తున్నది ? (చకోర శాతకర్ణి)
164. గౌతమీపుత్ర శాతకర్ణికి సంబంధించిన శాసనాలు ఏవి ? (నాసిక్, కార్లీశాసనాలు)
165. గౌతమీపుత్ర శాతకర్ణి తల్లి ? (గౌతమీ బాలశ్రీ)
166. సాంచీస్థూప దక్షిణతోరణం నిర్మించిన దెవరు ? (గౌతమీపుత్ర శాతకర్ణి)
167. గౌతమీపుత్ర శాతకర్ణి బిరుదులు ఏవి ? (త్రిసముద్రాధీశా, ధ్విజకుల వర్ధన, ఏక బ్రాహ్మణ)
168. శాతవాహనుల రాజధాని ధరణి కోటగా ఎవరి కాలం నుంచి వర్ధిల్లినది ? (గౌతమీపుత్ర శాతకర్ణి)
169. రాజర్షి వధుగా వర్ణించబడిన శాతవాహన స్త్రీ ఎవరు ? (గౌతమీ బాలశ్రీ)
170. కడపటి శాతవాహనులలో గొప్పవాడు ఎవరు ? (యజ్ఞశ్రీ శాతకర్ణి)
171. ఆచార్య నాగార్జునుని పోషించిన శాతవాహన చక్రవర్తి ? (యజ్ఞశ్రీ శాతకర్ణి)
172. నాగార్జున కొండ స్థూపాన్ని, విహారాన్ని నిర్మించిన వారు ? (యజ్ఞశ్రీ శాతకర్ణి)
173. యజ్ఞశ్రీ శాతకర్ణిని త్రిసముద్రాధీశ్వరుడని కీర్తించినది ? (బాణ మహాకవి)
174. శాతవాహనుల పాలనా కాలమేది ? (క్రీ.పూ. 230 నుండి క్రీ.శ. 225 ( 455. సం॥లు)
175. శాతవాహనుల కాలంలో ప్రసిద్ధికెక్కిన సంస్కృత గ్రంథం ? (నాగార్జునుని సుహృల్లేఖ)
176. నాగార్జున కొండకు గల మరొక పేరు. (శ్రీ పర్వతం)
177. శాతవాహనుల పశ్చిమతీర రేవు పట్టణములేవి ? (బరుకచ్ఛం సోపారు , కళ్యాణ్)
178. శాతవాహనుల తూర్పుతీర రేవు పట్టణములేవి ? (ఘంటసాల, మైసోలియా, కొట్టూరు)
179. శాతవాహనుల మంత్రుల పేరేమి ? (విశ్వాసామాత్యులు)
180. శాతవాహనుల రాజ్య విభాగాలేవి ? (జనపదము ( రాష్ట్రం ), ఆహరము ( జిల్లా, గ్రామము)
181. శాతవాహనుల పాలనలో జనపధమునకు అధిపతి ఎవరు ? (రాజన్, మహాభాజ, మహారథి)
182. శాతవాహనుల పాలనలో ఆహరమునకు అధిపతి ఎవరు ? (అమాత్యుడు)
183. శాతవాహనుల పాలనలో గ్రామాధిపతి ఎవరు ? (గ్రామణి)
184. శాతవాహనుల నగర పాలన సంస్థల పేరేమి ? (నిగమ సభలు)
185. అమరావతి, జగ్గయ్యపేట, నాగుర్జున కొండ వంటి బౌద్ధ స్థూపములు, కార్లే, కన్హేరీ, నాసిక్ వంటి గుహ విహార చైత్యములు ఎవరి కాలంలో నిర్మింపబడినవి ? (శాతవాహనుల కాలంలో)
186. శాతవాహనుల కాలంలో ఆంధ్ర దేశంలో ప్రసిద్ధిపొందిన విశ్వవిద్యాలయం? (నాగార్జున విశ్వవిద్యాలయం)
187. యోగశాస్త్రమును రచించినది ఎవరు ? (పతంజలి)
188. శాతవాహనుల అధికార భాష ఏది ? అది ఏ లిపిలో వ్రాయబడినది ? ('ప్రాకృతం- బ్రాహ్మీలిపి')
189. శాతవాహనులలో చివరివాడు ? (మూడో పులోమావి)
190. శాతవాహన వంశాన్ని అంతమొందించిన వారెవరు ? (ఇక్ష్వాకులు)

## సంగం యుగం ( లేదా ) ప్రాచీన తమిళ రాజ్యాలు

191. ప్రాచీన తమిళ రాజ్యము చరిత్రకు ముఖ్యాధారము ఏది ? (సంగం వాఙ్మయము)
192. తమిళ వాఙ్మయ చరిత్రలో స్వర్ణ యుగమేది ? (సంగం యుగము)
193. సంగం అంటే ఏమటి ? (మధురలోని ప్రాచీన తమిళ కవి పండిత పరిషత్తు)
194. సంగం యుగ కాలమేది ? (క్రీ.శ. 100 నుండి 200 వరకు)
195. సంగం యుగమందు గల సుప్రసిద్ధ రచయితలు ఎవరు ? (సిత్తాలై పత్తనార్ ఇలంగో అడిగళి)
196. 'మణిమేఖల' ను ఎవరు రచించారు. (సిత్తాలై సత్తనార్)

197. ‘ శిలప్పధికారం’ ఎవరు  రచించారు ? **(ఇలంగో అడిగళి)**

198. కృష్ణానదికి దక్షిణముగా కన్యాకుమారి అగ్రము వరకు ఉన్న దేశము నేమందురు ? **(దక్షిణాత్యము)**

199. దక్షిణాత్యమందలి మూడు పెద్ద రాజ్యములేవి ? **(చోళ, చేర,  పాండ్య)**

200. ప్రాచీన చోళరాజ్యం ఎక్కడ ఉంది? దాని రాజధాని ఏది? **(కావేరి డెల్టా దాని పరిసర ప్రాంతం రాజధాని -ఉరయూరు)**

201. ప్రాచీన చేరరాజ్యం ఎక్కడ ఉంది? దాని రాజధాని ఏది? **(పశ్చిమ తీరంలోని దక్షిణ కొంకణప్రాంతం రాజధాని -వంజి)**

202. ప్రాచీన పాండ్య రాజ్యం ఎక్కడ ఉంది?దాని రాజధాని ? **(పుదుక్కోట జిల్లాలోని వల్లూరు నదికి కన్యాకుమారికి మధ్యనున్న తూర్పుతీర ప్రాంతం రాజధాని -మధురై)**

203. ప్రాచీన చోళ, చేర, పాండ్య రాజ్యాల ఉత్తర సరిహద్దు ఏది ? **( వెంగడం ( నేటి తిరుపతి)**

204. ప్రాచీన చోళులలో సుప్రసిద్ధుడు ఎవరు ? **(కరికాలచోళుడు)**

205. దక్షిణాత్య సార్వభౌమత్వమునకై ఎవరెవరి మధ్య ఎడతెరపి లేకుండా యుద్ధములు సాగినవి ? **(చేర, చోళ, పాండ్యరాజ్యముల మధ్య)**

206. కరికాలచోళుడు ఏ యుద్ధమున పాండ్య, చేర, రాజ్యములను ఓడించాడు? **(వెణ్ణి యుద్ధము)**

207. చోళుల రేవు పట్టణం ఏది ? **(కావేరీ పట్టణం)**

208. పాండ్య రాజ్యమందు గల ముఖ్య రేవు పట్టణాలేవి ? **(కోర్కుచ కమాల్)**

209. చేరరాజుల ముఖ్య రేవువ పట్టణములు ఏవి ? **(ముజరస్, వైక్కరై)**

210. కరికాలుని దిగ్విజయములలో సుప్రసిద్ధమైనదేది ? **(సింహళ దండయాత్ర)**

211. సింహళ రాజును ఓడించి, బందీలైన సింహళీయుల చేత పుహర్ రేవుకు దక్షిణ శ్రేణులను, కావేరీనదికి వరద కట్టలను కట్టించిన చోళ రాజు ఎవరు ? **(కరికాలుడు)**

212. కరికాలచోళుని పాలనా కాలమేది ? **(క్రీ.శ. 190)**

213. కరికాలుడే మతాభిమాని ? **(శైవ మతం)**

214. కరికాలుడు కట్టించిన శివాలయములేని ? **(70)**

215. కావేరి నదికి శ్రీరంగం వద్ద ఆనకట్ట నిర్మించిన దెవరు ? **(కరికాలుడు)**

216. చోళుల యందేగాక దక్షిణాత్య రాజ్య వంశీయులలోనే సుప్రసిద్ధ చక్రవర్తి ఎవరు ? **(కరికాలచోళుడు)**

217. కరికాలచోళుని అనంతరము దక్షిణాత్య సార్వభౌమత్వమును కైవసం చేసుకొన్నవారెవరు ? **(చేర వంశస్థులు)**

218. చేర రాజులలో సుప్రసిద్ధుడు ఎవరు ?  అతని పాలనా కాలమేది ? **(సెంగుట్టవాన్  క్రీ.శ. 180)**

219. శిలప్పాదికారం రచించిన ఇలంగోఅళిగళ్ ఎవరి సోదరుడు ? **(సెంగుట్టవాన్)**

220.సెంగట్టవాన్ అనంతరం పాండ్యులు ఎవరి నాయకత్వమున విజృంభించినారు? **(ముడిగుడిమి వెరువలడి)**

221. పాండ్యరాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? అతని పాలనా కాలమేది ? **(నెటుంజెలియన్ క్రీ.శ. 210)**

222. చేర, చోళ కూటమిని ఓడించిన పాండ్య రాజెవరు ? **(నెటుంజెలియన్)**

223. నెటుంజెలియన్ ఏమతాభిమాని ? **(వైదిక)**

224. సాంస్కృతికముగా భారతదేశ సమైక్యతకు గట్టి పునాదులు ఏ యుగమున ఏర్పడినవి? **(సంగం యుగమున)**

225. సంగం యుగమందు గల నాలుగు ముఖ్య వర్గములేవి ? **(వణం, తుడియం,వరియలీ, కడంబన్)**

## 9. గుప్త యుగం ( క్రీ.శ. 300 - 500 )

1. గుప్తుల చరిత్రకు గల ముఖ్య ఆధారాలేవి ? **(వాఙ్మయ ఆధారములు, పురావస్తు ఆధారాలు, విదేశీరచనలు)**
2. గుప్తుల నాటి రాజకీయ పరిస్థితులను వివరించినదేది ? **(విష్ణు పురాణము)**
3. అష్టాదశ పురాణములలో చాలా వరకు ఏ కాలమున వ్రాయబడినవి ? **(గుప్తుల కాలమున)**

4. అష్టాదశ పురాణములందు గుప్తుల చరిత్ర గూర్చి తెలుపునవేవి? **(వాయు, విష్ణు, బ్రహ్మాండ పురాణములు)**

5. గుప్తుల కాలమునాటి సామాజిక ఆర్థిక పరిస్థితులను విశదీకరించునవేవి?**(వ్యాస, హరీతి, సితామహ మున్నగువారి స్మృతులు)**

6. గుప్తుల నాటి ప్రముఖ గణ రాజ్యముల ప్రస్తావన దేనియందు కలదు? **( ముద్రా రాక్షసము )**

7. గుప్తుల చరిత్రకు అమూల్య ఆధారములు ఏవి ? **( గుప్తులు వేయించిన శాసనములు )**

8. గుప్త చక్రవర్తుల ప్రజల మతవిశ్వాసముల గూర్చి దేని యందు వర్ణింపబడినది ? **(ముద్రా రాక్షసము)**

9. గుప్తులకాలం నాటి విదేశీ రచనలలో ముఖ్యమైనవి ఏవి ? **(పాహియాన్, యువాన్‌ఛాంగ్, ఇత్సింగ్,ఆల్‌బెరూనీల రచనలు)**

10. గుప్తవంశ మూలపురుషుడు ఎవరు ? **(శ్రీ గుప్తుడు)**

11. గుప్త సామ్రాజ్య స్థాపకుడు ఎవరు ? **(మొదటి చంద్రగుప్తుడు)**

12. గుప్త శకమును ప్రారంభించింది ఎవరు ? **(మొదటి చంద్ర గుప్తుడు)**

13. మొదటి చంద్రగుప్తుని పాలనా కాలం ఏది ? **(క్రీ.శ. 320 నుండి 335 ( 15 సం॥లు)**

14. శ్రీ గుప్తుని మనుమడు ఎవరు ? **(మొదటి చంద్రగుప్తుడు)**

15. గుప్త చక్రవర్తులలోనే గాక భారతీయ చక్రవర్తులలో అగ్రగణ్యుడెవరు ? **(సముద్ర గుప్తుడు)**

16. 'ఇండియన్ నెపోలియన్ ' గా పేరుగాంచిన గుప్త చక్రవర్తి ఎవరు ? **(సముద్ర గుప్తుడు)**

17. సముద్ర గుప్తుని ముఖ్య లక్ష్యమేమి ? **(సమైక్య భారతదేశ నిర్మాణము)**

18. సముద్ర గుప్తుని పాలనా కాలమేది ? **(క్రీ.శ. 335 నుండి 380 (45 సం॥లు)**

19. సముద్రగుప్తుని ఆస్థాన కవి ఎవరు ? **(హరిసేనుడు)**

20. సముద్రగుప్తుడు కవితాపటిమకు నిదర్శనముగా ఏ బిరుదు పొందెను ? **(కవిరాజు)**

21. దక్షిణాపథమున ఎంతమంది చక్రవర్తులను సముద్రగుప్తుడు ఓడించెను? **(12 మంది)**

22. ఆర్యావర్తనమున ఎంతమంది చక్రవర్తులను సముద్రగుప్తుడు ఓడించెను? **(9 మంది)**

23. సముద్రగుప్తుని దిగ్విజయ యాత్రను తెల్పే శాసనం ఏది ? **(అలహాబాద్ ప్రశస్తి)**

24. సాధించిన విజయములకు చిహ్నముగా సముద్రగుప్తుడు ఏయాగము చేసెను? **(అశ్వమేధ యాగము)**

25. సముద్రగుప్తుని ఆస్థాన మందలి బౌద్ధమత వేదాంతి ఎవరు ? **(వసుబంధుడు)**

26. సముద్రగుప్తుడే మతాభిమాని ? **(బ్రాహ్మణ మతము)**

27. సముద్రగుప్తుని బిరుదు లేవి ? **(కవిరాజు , అశ్వమేధయోగి, ఇండియన్ నెపోలియన్)**

28. వీణమీటుతున్న బొమ్మగల నాణెములను ముద్రించిన గుప్త చక్రవర్తి ఎవరు? **(సముద్రగుప్తుడు)**

29. చంద్రగుప్త విక్రమాదిత్యుని పాలనాకాలం ఏది ? **(క్రీ.శ.380 - 414)**

30. సముద్రగుప్తుని పెద్ద కుమారుడు ఎవరు ? **(రామగుప్తుడు)**

31. రామగుప్తుని సోదరుడు ఎవరు ? **(రెండవ చంద్రగుప్తుడు)**

32. రెండవ చంద్రగుప్తుని బిరుదులేవి ? **(విక్రమాదిత్యుడు, శకారి , సాహసాంక)**

33. చంద్రగుప్తుని భార్య పేరేమి ? **(కుబేరనాగ)**

34. చంద్రగుప్తుని కుమార్తె పేరేమి ? **(ప్రభావతి గుప్త)**

35. గుప్తుల మొదటి రాజధాని ఏది ? **(పాటలీపుత్రము)**

36. గుప్తుల రాజధానిని ఉజ్జయినికి మార్చిన గుప్త చక్రవర్తి ఎవరు ? **(చంద్రగుప్త విక్రమాదిత్యుడు)**

37. చంద్రగుప్తుని మంత్రి ఎవరు ? **(శబరవీరసేనుడు)**

38. చంద్రగుప్తుని సేనాని ఎవరు ? **(అమరకరదేవుడు)**

39. చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలమున భారతదేశమును దర్శించిన చైనా యాత్రికుడు ఎవరు ? **(పాహియాన్)**

40. చంద్రగుప్తుని ఆస్థానమందలి సంస్కృత పండితులకేమని పేరు ? **(నవ రత్నములు)**

41. చంద్రగుప్తుని ఆస్థానమందు నవరత్నములెవరు ?

**(కాళిదాసు, వరాహమిహిరుడు, ధన్వంతరి, అమరసింహుడు, క్షిపణుకుడు, శంకు, భేతాళభట్టు, ఘటకర్పరుడు, వరరుచి)**

42. చంద్రగుప్తుని ఆస్థానమందలి నవరత్నములలో అగ్రగణ్యుడెవరు ? **(కాళిదాసు)**

43. మహకవి కాళిదాసు రచనలలో గొప్పవేవి ? **(కుమార సంభవము, అభిజ్ఞాన శాకుంతలం, మేఘ సందేశము)**

44. చంద్రగుప్తుడే మతాభిమాని ? **(వైష్ణవ మతాభిమాని)**

45. అన్యమతస్థులకు సైతము ఉన్నత పదవులిచ్చిన గుప్త రాజెవరు ? **(చంద్రగుప్త విక్రమాదిత్యుడు)**

46. సముద్రగుప్తుడు ప్రారంభించిన దిగ్విజయ యాత్రలను ఎవరు పూర్తి చేసెను? **(చంద్రగుప్త విక్రమాదిత్యుడు)**

47. భారతదేశమున స్వర్ణ యుగమేది ? **(గుప్త యుగం)**

48. చంద్రగుప్తుని కాలము సుఖశాంతులకు, సిరి సంపదలకు నిలయమై గణనీయమైన సాంస్కృతాభ్యుదయమును. సాధించుటచే చరిత్రకారులు ఏమన్నారు ? **(స్వర్ణ యుగము)**

49. గుప్తయుగంలో ప్రసిద్ది చెందిన ఖగోళ గణిత శాస్త్రజ్ఞులు ఎవరు ? **(ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మ గుప్తుడు)**

50. గుప్తుల స్వర్ణ యుగమునకు మాయని మచ్చలైన వేవి ? **(వర్ణ వ్యవస్థ, అస్పృశ్యత)**

51. గుప్తులకాలము నాటి ప్రజల విశ్వాసమేది ? **(రాజు దైవాంశ సంభూతుడని)**

52. నేటి హిందూమతమందలి పండుగలు చేసికొనుట, వ్రతములు సలుపుట, దేవతలను, పూజించు లక్షణములు ఏ కాలము నాటివి ? **(గుప్తుల కాలము)**

53. దేవతలకు ఆలయములను నిర్మించుట ఏకాలమున ప్రారంభమయ్యెను? **(గుప్తుల కాలం)**

54. చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలంలో గొప్ప విద్యాకేంద్రం ఏది ? **(ఉజ్జయిని)**

55. భారతీయ తర్కశాస్త్ర పితామహుడెవరు ? **(దిఙ్నాగుడు)**

56. గుప్తయుగము ఏఏ శాస్త్రములందు అభివృద్ది సాధించబడినది ? **(గణిత, ఖగోళ భౌతిక, వైద్య శాస్త్రాలందు)**

57. 'దశాంశ పద్ధతి ' ' సున్న' విలువ ఉపయోగము ఏ కాలమున ఆవిర్భవించినవి? **(గుప్తులకాలమున)**

58. గుప్తుల కాలంనాటి వైద్య శాస్త్ర గ్రంథములలో సుప్రసిద్ధమైన దేది ? **(వాగ్భటుడు రచించిన అష్టాంగ సంగ్రహము)**

59. వైద్య శాస్త్ర గ్రంథములలో ముఖ్యమైనది ఏది ? **(పాలకాప్య రచించిన హస్త ఆయుర్వేదము)**

60. ప్రపంచ సారస్వతమందు సుప్రసిద్ధ మొదటి నూరు గ్రంథములలో ఒకటిగా విమర్శకులచే పరిగణింపబడినదేది ? **(కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలము)**

61. 'మృచ్ఛ కటికమును' రచించింది ఎవరు ? **(శూద్రకుడు)**

62. 'ముద్రా రాక్షసము' ను రచించినది ఎవరు ? **(విశాఖ దత్తుడు)**

63. 'రావణవధ' లేక బట్టి కావ్యమును రచించింది ఎవరు ? **(భట్టి)**

64. వరాహమిహిరుడు రచించిన గ్రంథమేది ? **(భృహత్ సంహిత)**

65. నీతి కథల సముచ్చయమైన ' పంచతంత్రము' వ్రాసిన వారు ? **(విష్ణుశర్మ)**

66. 'అమరకోశం' అనే సంస్కృత నిఘంటుకర్త ఎవరు ? **(అమర సింహుడు)**

67. 'ఆర్యభట్టీయం' అనే గణిత గ్రంథాన్ని రచించినది ఎవరు? **(ఆర్యభట్టు)**

68. 'స్వప్న వాసవదత్తమ్'ను రచించినది ఎవరు ? **(సుబంధుడు)**

69. 'ఆర్యసిద్ధాంతం' అనే ఖగోళ శాస్త్ర గ్రంథాన్ని రచించింది ఎవరు ? **(ఆర్యభట్టు)**

70. 'భృహత్సంహిత' అనే విజ్ఞాన సర్వస్వం రచించినది ఎవరు ? **(వరాహమిహిరుడు)**

71. శుశ్రుతుడు రచించిన గ్రంథమేది ? **(శుశ్రుతము)**

72. రెండవ చంద్రగుప్తుని అనంతరం గుప్త సింహాసనాన్ని అధిష్టించినదెవరు? **(కుమార గుప్తుడు)**

73. మొదటి కుమారగుప్తుని తరువాత గుప్త సింహాసనానికి వచ్చింది ఎవరు ? **(స్కంద గుప్తుడు)**

74. ఎవరి తరవాత గుప్తవంశ చరిత్ర అస్తవ్యస్థమైనది ? **(స్కంధ గుప్తుని)**

75. గుప్త సామ్రాజ్య పతనమునకు ముఖ్య కాణమనదగినది ఏది ? **(వారసత్వ యుద్దములు)**

76. గుప్త సామ్రాజ్య పతనము ప్రధానంగా ఎవరి దండయాత్రల వల్ల జరిగింది? **(హూణుల దండయాత్ర వల్ల)**

77. భారతదేశంపై దండయాత్ర చేసిన హుణులు ఎవరు ? **(శ్వేత హూణులు)**

78. గుప్తుల పాలనను ఇంగ్లండు పాలించిన ఏ రాజు పాలనతో పోలుస్తారు ? **(ఎలిజబెత్ రాణి)**

79. గుప్తుల కాలమును గ్రీసు దేశంలోని ఎవరి పాలనతో పోలుస్తారు ? **(పెరిక్లిస్)**

80. గుప్తరాజైన నరసింహగుప్త బాలాదిత్యని ఓడించి తక్షశిల విశ్వ విద్యాలయాన్ని ధ్వంసం చేసిన హూణరాజుఎవరు? **(తోరమానుడు)**

81. గుప్తుల కాలంలో నగర పాలనను నిర్వహించింది ఎవరు ? **(ఐదుగురు సభ్యులతో కూడిన నగరసభ)**

82. నగర సభలలోని సభ్యులు ఎవరు ? **(నగర శ్రేష్టి, ప్రథమ కులికుడు, సార్థవాహుడు, ప్రథమకాయస్థుడు , పుస్తపాలకుడు)**

83. గుప్తుల కాలమున రాజుకు సలహా ఇచ్చుటలో సాయపడుటకు ఏమి ఉన్నది. **(మంత్రి పరిషత్తు)**

84. మంత్రి పరిషత్తులోని మంత్రులెవ్వరు ? **(మహాదండనాయకుడు, సంధివిగ్రహికుమారామాత్యుడు)**

85. గుప్తులు తమ సామ్రాజ్యమును ఎలా విభజించినారు ? **(రాష్ట్రాలుగా)**

86. గుప్తుల కాలమునాటి రాష్ట్రమునేమందురు ? **(భుక్తి)**

87. భుక్తికి అధిపతి ఎవరు ? **(ఉపరిక లేక గోప్త్రి)**

88. గుప్తుల కాలమున నగరములనేమనేవారు ? **(విషయములు)**

89. విషయము అధిపతి ఎవరు ? **(విషయపతి)**

90. గుప్తుల కాలంలోని విషయమెలా విభజించబడినది ? **(గ్రామములు)**

91. గుప్తుల పాలనావ్యవస్థలో చివరి భాగమేది ? దాని అధిపతి ఎవరు ? **(గ్రామము - గ్రామికుడు)**

92. గ్రామికుని ముఖ్యవిధులేవి ? **(శాంతి భద్రతలు, గ్రామాభ్యుదయము)**

93. గుప్తుల ముఖ్యరేవు పట్టణము లేవి ? **(తామ్రలిపి , బరుకచ్ఛము)**

94. గల్డులు అంటే ఏమిటి ? **(వ్యాపార సంఘాలు వీటినే శ్రేణులు , నిగమములు అనికూడ అంటారు)**

95. గుప్తులు ఏ మతాభిమానులు ? **(బ్రాహ్మణ మతం)**

96. హిందూ మతమునకు ఏవి ఆధారములైనవి ? **(ఆగమ శాస్త్రములు , పురాణములు)**

97. గుప్తుల కాలంలో ఉజ్జయనీలోని నక్షత్ర పరిశోధనశాలను ఏమని పిలిచేవారు. **(జంతర్ మంతర్)**

98. నలంద విశ్వవిద్యాలయ స్థాపకుడు ఎవరు ? **(కుమార గుప్తుడు)**

99. గుప్తుల 'కుడ్య చిత్రలేఖనమునకు ప్రధాన నిదర్శనమైన అజంతాలోని గుహలు ఏవి? **(16, 17, 19 గుహలు)**

100. సముద్రగుప్తుని విజయములు తెలుసుకొనుటకు ఆధారము **(అలహాబాదు స్తంభ శాసనము)**

## హూణులు

101. హూణులు ఎవరు ? **(చైనా సరిహద్దులలో సంచరించు మంగోలియా ప్రాంత వాసులు)**

102. హుణులెటువంటివారు . **(రణశూరులు, అతి క్రూరులు)**

103. క్రీ.శ. 4వ శతాబ్దంలో రోమ్‌పై దండెత్తి రోమ్ సామ్రాజ్య పతనమునకు కారణమైనవారు ఎవరు ? **(అట్టిలా నాయకత్వంలోని నల్లహూణులు)**

104. హూణులలో ఎన్ని తెగలున్నవి ? **(రెండు 1. శ్వేత హూణులు 2. నల్ల హూణులు)**

105. గుప్తులపై హూణుల దండయాత్రల కాలమేది ? **(క్రీ.శ. 455 -458)**

106. హూణులను మొదట ఎదుర్కొన్న గుప్తులెవరు ? **(కుమారగుప్తుడు ,స్కందగుప్తుడు)**

107. హూణులను ఓడించిన గుప్త రాజు ఎవరు . **(కుమార గుప్తుడు)**

108. హూణుల నాయకుడెవరు ? **(తోరమాణుడు)**

109. తోరమాణుని కుమారుడెవరు ? (మిహిరకులుడు)

110. తోరమాణుడు అవలంభించిన మతమేది? (జైనమతము)

111. మిహిరకులుని రాజధాని ఏది ? ( సాకాల సియోల్ కోట)

112. మిహిరకులుడు ఎటువంటివాడు ? (క్రూర స్వభావుడు, మోసగాడైన నిరంకుశ ప్రభువు)

## బి. ఇక్ష్వాకులు

113. ఇక్ష్వాకుల వంశ స్థాపకుడు ? (శ్రీ శాంతమూలుడు)

114. ఇక్ష్వాకుల చరిత్రకు మూలాధారాలు ? (నాగార్జున కొండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి శాసనాలు)

115. ఇక్ష్వాకులకు గల మరొక పేరేమి ? (శ్రీ పర్వతీయులు)

116. ఇక్ష్వాకులు పాలించిన ప్రాంతమేది? (నేటి గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, కడప,కర్నూలు, నల్గొండ జిల్లాలు)

117. ఇక్ష్వాకుల రాజధాని ఏది? (విజయపురి)

118. ఇక్ష్వాకులు ఆదరించినమతమేది ? (బౌద్ధమతము)

119. హిందూమతాన్ని పోషించిన మొదటి ఆంధ్రరాజు (శ్రీ శాంతమూలుడు)

120. తొలి హిందూ దేవాలయాన్ని కట్టించిన ఆంధ్ర వంశం ? (ఇక్ష్వాకులు)

121. ఇక్ష్వాకుల రాజ్యచిహ్నం ఏది ? (సింహం)

122. ఇక్ష్వాకుల కాలంలోని రాజభాష ఏది ? (ప్రాకృతము)

123. 'దక్షిణ గాను' ప్రసిద్ధి చెందినది? (నాగార్జున కొండ)

124. ఇక్ష్వాక రాజులకు గల బిరుదు ఏది ? (మహాదేవి)

125. శ్రీ పర్వత బౌద్ద కట్టడాలకు కారకురాలైన రాజకుమార్తె ఎవరు ?(మహతలవరి, మహాసేనాపత్ని, మహాదానపత్ని శాంతిశ్రీ)

## చుటు నాగులు

126. చుటునాగుల మూలపురుషుడెవరు ? (విష్ణుస్కంద చుటు శాతకర్ణి)

127. చుటునాగులు పాలించిన ప్రాంతమేది ? (మైసూరులోని బనవాసీ ప్రాంతం)

128. చుటునాగుల రాజధాని ఏది ? (బనవాసీ)

129. ఇక్ష్వాక రాజైన వీరపురుషదత్తుని కుమార్తె కొడబలిశ్రీని వివాహమాడిన చుటునాగరాజు ఎవరు ? (శివస్కంద శాతకర్ణి)

## బృహత్పలాయనులు

130. బృహత్పలాయనుల గురించి తెలియజేసే ఏకైక శాసనం ఏది ? (కొండముది తామ్రశాసనం)

131. ఇక్ష్వాకుల పతనం తరువాత మచిలీపట్టణం ప్రాంతాన్ని పాలించినవారు ఎవరు ? (బృహత్పలాయనులు)

132. బృహత్పలాయనుల వంశంలో ఇప్పటి వరకు తెలిసిన ఏకైక రాజు ? (జయవర్మ)

133. బృహత్పలాయనుల రాజధాని ఏది ? (కృష్ణా జిల్లాలోని కోటూరు)

134. జయవర్మ ఏమతాభిమాని ? (బ్రాహ్మణ మతాభిమాని)

## ఆనంద రాజులు లేదా ఆనంద గోత్రజులు

135. ఆనందరాజుల గోత్రము తెలియజేసే శాసనం ఏది ? (దామోదరవర్మ మట్టెపాడు శాసనం)

136. ఆనంద గోత్రజులు పాలించిన ప్రాంతమేది? (గుంటూరు మండలం)

137. ఆనంద గోత్రజుల రాజధాని ఏది? (కందపురం)

138. కందపురమును బౌద్దులు ఏమని పేర్కొనిరి ? (కపోతికందపురం)

139. ఆనందరాజుల లాంఛనము ఏది ? (వృషభం)

140. ఆనందరాజులలో మొదటివాడు ? **(దామోదరవర్మ)**

141. ఆనందరాజులలో చివరివాడు ? **(కందార రాజు)**

142. త్రికూట పర్వత ప్రస్తుత నామం ఏది ? **(కోటప్పకొండ)**

## శాలంకాయనులు

143. శాలంకాయనులు పాలించిన ప్రాంతమేది . **(వేంగిప్రాంతము)**

144. శాలంకాయనుల రాజధాని ఏది ? **(వేంగీపురం)**

145. శాలంకాయన వంశ స్థాపకుడు ఎవరు ? **(నందివర్మ)**

146. శాలంకాయనుల ఇష్టదైవము ఎవరు ? **(చిత్ర రథస్వామి)**

147. శాలంకాయన పదానికి అర్థం ఏమిటి ? **(నంది)**

148. శాలంకాయనులు ఏ మతస్తులు ? **(వైదిక బ్రాహ్మణ మతస్తులు)**

149. సముద్రగుప్తుని సమకాలికుడైన శాలంకాయన రాజు ఎవరు ? **(హస్తివర్మ)**

150. అశ్వమేథం చేసిన శాలంకాయన రాజు ? **(విజయ దేవవర్మ)**

## విష్ణు కుండినులు

151. ఆంధ్ర దేశంలో శాలంకాయనుల అధికారం తుది ముట్టించినవారు ? **(విష్ణు కుండినులు)**

152. విష్ణు కుండినుల స్వస్థలము **(వినుకొండ ( విష్ణు కుండినపురం)**

153. విష్ణు కుండినుల తొలి రాజధాని **(దెందులూరు)**

154 విష్ణు కుండినుల మలి రాజధాని **(వేంగి)**

155. విష్ణు కుండినుల వంశ స్థాపకుడు **(మొదటి మాధవ వర్మ)**

156. విష్ణుకుండినుల ప్రసిద్ధ గుహాలయము . **(ఉండవల్లి)**

157. విష్ణుకుండినుల చిహ్నము. **(సింహము)**

158. శ్రీ శైల మల్లికార్జునుని భక్తులు **(విష్ణుకుండినులు)**

159. విష్ణుకుండినుల కాలంలోని గుహాలయములు **(మొగల్రాజపురం గుహాలయములు)**

160. విష్ణుకుండినుల కాలంలో బహుళ ప్రచారం పొందిన మతం **(వైదిక మతం)**

161. ఏకాదశ అశ్వమేథములు,వేయి అగ్నిష్టోమములుచేసి జనాశ్రయుడని బిరుదు వహించిన రాజు **(మూడవ మాధవ వర్మ)**

162. విష్ణుకుండినుల శాసనాలలో వాడిన భాష ? **(సంస్కృతము)**

163. రాగిమలాముతో చేసిన ఇనుప నాణాలు వాడినది ? **(విష్ణుకుండినులు)**

164. విష్ణుకుండినులు పతనమైన యుద్ధం ? **(కొల్లేరు)**

## వాకాటకులు

165. వాకాటకులు ఏ కాలం వారు ? **(క్రీ.శ. 4,5 శతాబ్దాల వారు)**

166. వాకాటక రాజ్యస్థాపకుడు ఎవరు ? **(వింధ్యశక్తి)**

167. ఏ వాకాటక రాజు పాలన తరువాత నాకాటక రాజ్యం 'పురీరక','వత్సగుల్మ' శాఖలు గా చీలిపోయింది ? **(మొదటి ప్రవరసేనుడు)**

168. వాకాటక వత్సగుల్మ శాఖలలో ప్రసిద్ధ పాలకుడు ఎవరు . **(హరిసేనుడు)**

169. వాకాటక పురీరక శాఖలో చంద్రగుప్త విక్రమాదిత్యుని కుమార్తె, ప్రభావతీ గుప్తను వివాహమాడిన రాజు ఎవరు ? **(రెండవ రుద్రసేనుడు)**

GRK **కదంబులు**

170. కదంబులు ఏ కాలము వారు ? **(క్రీ.శ. 345 - 580)**
171. కదంబులు పాలించిన ప్రాంతమేది ? **(కర్ణాటకలోని పనవాసీ ప్రాంతం)**
172. కదంబుల రాజధాని ఏది ? **(వనవాసి)**
173. కదంబుల మూలపురుషుడు ఎవరు ? **(మయూరశర్మ)**
174. కదంబ చక్రవర్తులలో పేరెన్నికగన్నవాడు ఎవరు ? అతని కాలమేది ? **(కాకుత్సవర్మ ( క్రీ.శ. 425. - 450)**
175. కదంబ రాజ్యమును అంతం చేసింది ఎవరు ? **(రెండవ పులకేసి)**

## మాతరులు

176. మాతరులు ఏ ప్రాంతాన్ని పాలించారు. ? **( కళింగదేశం )**
177. మాతరుల తొలి రాజధాని ? **( పిఠాపురము )**
178. మాతరుల మలి రాజధాని ? **(దేవపురం)**
179. మాతరుల వంశ మూలపురుషుడు ? **( శక్తివర్మ )**
180. మాతరుల వంశ రాజులు **( శక్తివర్మ, రెండవ శక్తి వర్మ, చండవర్మ, ఉమావర్మ, విశాఖవర్మ)**
10. గుప్తానంతర యుగం **( క్రీ.శ. 500 - 700 )**

## 10. గుప్తానంతరయుగం (క్రీ.శ. 500 - 700) హర్షవర్ధనుడు

1. హర్షవర్ధనుడు ఏ వంశానికి చెందినవాడు ? (పుష్యభూతి )
2. గుప్తుల సాంస్కృతిక వారసత్వమును నశింపనీయకుండా కాపాడి, దానికి మెరుగులుదిద్ది తన వారసులకు అందించిన మహాపురుషుడెవరు ? (హర్షవర్ధనుడు)
3. హర్షుని జీవితము, సాధించిన విజయములకు ముఖ్యాధారము లేవి ? (బాణుని హర్ష చరిత్ర, సి.యు.కి. గ్రంథం, హర్షుని శాసనములు)
4. హర్షుని తండ్రిపేరేమి ? ( ప్రభాకర వర్ధనుడు )
5. హర్షవర్ధుని సోదరుడెవరు ? ( రాజవర్ధనుడు )
6. హర్షవర్ధుని సోదరి ఎవరు ? ( రాజశ్రీ )
7. ప్రభాకరవర్ధనుని రాజధాని ఏది ? ( స్థానేశ్వరం)
8. హర్షుని తల్లి పేరేమి ? ( యశోమతీ దేవి )
9. పుష్యభూతి వంశంలో ప్రసిద్ధ పాలకుడు ఎవరు ? ( హర్షవర్ధనుడు )
10. హర్షుని పాలనాకాలం ఏది? (క్రీ.శ. 606 - 646)
11. హర్షుని సోదరుడైన రాజ్యవర్ధనుడు సింహాసన మధిష్టించిన దెపుడు ? ( క్రీ.శ. 605)
12. రాజ్యవర్ధనుని మాయోపాయముతో హతమార్చిన దెవరు ? ( శశాంకుడు )
13. హర్షుని సోదరి అయిన రాజశ్రీ భర్త ఎవరు ? ( గృహవర్మ (కనోజ్ పాలకుడు )
14. గృహవర్మను వధించి , రాజశ్రీని చెరబట్టిన మాళ్వ రాజు ఎవరు ? (దేవగుప్తుడు )
15. సింహసనమధిష్టించు నాటికి హర్షుని వయస్సెంత ? ( 16 సంవత్సరాలు)
16. సింహాసనం ఎక్కునాటికి హర్షుని బిరుదమేది ? ( రాజపుత్ర )
17. హర్షుడు స్థానేశ్వర, కన్యాకుబ్జ రాజ్యాలను ఏకంచేసి ఏ బిరుదు సంపాదించెను ? (శిలాదిత్య )
18. హర్షుని రాజధాని ఏది ? ( కనోజ్ లేక కన్యాకుబ్జము )
19. హర్షుని ఓడించిన దక్షిణాపథ రాజెవరు ? ( రెండవ పులకేశి)

20. హర్షుని రెండవ పులకేశి ఏ నది వద్ద ఓడించెను ? ( నర్మదానది )
21. హర్షుడు వ్రాసిన గ్రంథాలేవి ? ( నాగానందం, రత్నావళి, ప్రియదర్శిక )
22. హర్షుని ఆస్థానకవి ఎవరు ? ( బాణుడు )
23. హర్షుని మతమేది ? ( శైవ మతము )
24. హర్షుని కాలంలో భారతదేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు ఎవరు? ( హ్యూయన్‌త్సాంగ్ )
25. హూయన్‌త్సాంగ్ రచించిన గ్రంథమేది ? ( సి - యూ - కీ )
26. హూయన్‌త్సాంగ్ బిరుదులేవి ? ( శాక్యముని, యాత్రికులలో రాజు )
27. 'కాదంబరి' రచించినదెవరు ? ( బాణుడు )
28 'సుభాషిత శతక' కారకుడెవరు ? ( భర్తృహరి )
29. ' సూర్య శతకము' గ్రంథకర్త ఎవరు ? ( మయూరుడు )
30. హర్షుడు ఎవరి వలన మహాయాన బౌద్ధ మతమునకు ఆకర్షించబడెను ? ( రాజశ్రీ , హ్యూయాన్‌త్సాంగ్ )
31. హర్షుని కాలంలో ప్రసిద్ధి చెందిన విశ్వవిద్యాలయాలు ఏవి ? ( నలందా, వల్లభి )
32. హర్షుడు పోషించిన విశ్వవిద్యాలయం ఏది ? ( నలందా )
33. నలందా విశ్వవిద్యాలయమున ఉపాధ్యాయులెంతమంది ? విద్యార్థులెంతమంది ?
( ఉపాధ్యాయులు 1,500, విద్యార్థులు - 10,000
34. నలందా విశ్వవిద్యాలయ మందున్న ప్రఖ్యాతి నార్జించిన ఆచార్యులెవరు? ( ధర్మపాల, ఆర్యదేవి, శాలభద్ర )
35. ఐదు సంవత్సరాలకు ఒకసారి హర్షుడు చేసిన దానము పేరేమి ? ( మహామోక్షపరిషత్ లేక సర్వస్వదానవ్రతము)
36. పరిపాలనా సౌలభ్యం కొరకు రాజ్యము ఎలా విభజించబడింది . (భుక్తులు, విషయములు, గ్రామములు )
38. హర్షుని పాలనా కాలంలో పన్ను ఎంత వసూలు చేసేవారు ? ( పంటలో 1/6 వంతు)
39. హర్షుని కాలమున భారతదేశమును విదేశములలో ఏమని పిలిచేవారు ? ( బ్రాహ్మణ దేశము )
40. హర్షుని కాలమున ప్రజల ముఖ్య వృత్తి ? ( వ్యవసాయము)

## వేంగి (లేక ) తూర్పు చాళుక్యులు

41. నాలుగున్నర శతాబ్దాల కాలం ఆంధ్రదేశంలో పరిపాలన సాగించిన చాళుక్యుల శాఖ ? ( తూర్పు చాళుక్యులు (ఆంధ్ర చాళుక్యులు)
42. తూర్పు చాళుక్యుల చరిత్రకు ఆధారభూతాలైన శాసనాలు ?
(ఐహోలు శాసనం, కట్టపర్రు శాసనం, మాట్టూరు శాసనం మొ॥నవి )
43. చాళుక్యుల రాజ లాంఛనం ( వరాహము )
44. బాదామి చాళుక్యరాజులు " పశ్చిమ చాళుక్య సామ్రాజ్యానికి పునాదులు వేసిన రాజన్యులు ? ( 1. జయసింహుడు 2.రణరాగుడు 3. మొదటి పులకేసి 4. కీర్తివర్మ 5. మంగళేశులు)
45. పైవారు వేసిన పునాదులపై పశ్చిమ చాళుక్య సామ్రాజ్య సౌధాన్ని నిర్మించినది? (కీర్తి వర్మపుత్రుడు (రెండవ పులకేశి)
46. తూర్పు చాళుక్య వంశమూల పురుషుడెవరు ? ( కుబ్జ విష్ణువర్ధనుడు)
47. బాదామి చాళక్యుల వంశ కర్త ? ( జయసింహవల్లభుడు)
48. కుబ్జ విష్ణువర్ధనుని బిరుదు ? ('విషమ సిద్ధి')
49. దక్షిణాదిన రెండవ పులకేసి తన తమ్ముని తన ప్రతినిధిగా నియమించి అతనికి స్వతంత్ర ప్రతిపత్తి అంగీకరించాడు ? ఆవ్యక్తి ఎవరు ? ( కుబ్జవిష్ణు వర్ధనుడు )
50. రెండవ పులకేశికి వేంగిని, పిఠాపురములను జయించుటలో ఖడ్గ సహాయుడై తోడ్పడినది ? ( కుబ్జ విష్ణువర్ధనుడు)
51. కుబ్జవిష్ణువర్ధనుని కాలంలో ఆంధ్ర దేశాన్ని పర్యటించి, ఇచ్చటి స్థితిగతుల గూర్చి వ్రాసిన చైనా యాత్రికుడు ? ( యువాన్ చ్వాంగ్)

52. 'సర్వసిద్ది' యను బిరుదు గల కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడు ? ( జయసింహ వల్లభుడు )
53. కుబ్జ విష్ణువర్ధనుడు ఎవరి కుమారుడిగా భావిస్తున్నారు ?
( త్రిలోచన పల్లవునితో పోరాడి మరణించిన విజయాదిత్య చాళుక్యుని కుమారుడు )
54. నాగార్జునకొండ శాసనం, నందంపూడి శాసనంలోని గాధను బట్టి చాళుక్యుల జన్మస్థలం ఏదని తెలియుచున్నది ? ( హిరణ్యా రాష్ట్రం )
55. జయసింహ వల్లభుని మనవడు ఎవరు ? ( మొదటి పులకేశి )
56. మొదటి పులకేశి కుమారులు ఎవరు ? ( కీర్తివర్మ, మంగళేశుడు )
57. కీర్తివర్మ కుమారుడు ? ( రెండవ పులకేశి)
58. బాదామి చాళుక్యులలో గొప్పవాడెవరు ? ( రెండవ పులకేశి )
59. రెండవ పులకేశి విజయాలను తెలియజేసే శాసనం ఏది ? ( ఐహోలు శాసనం)
60. రెండవ పులకేశి బిరుదులేవి ? ( పరమ మహేశ్వర, సత్యాశ్రీ, పృధ్వీవల్లభ )
61. మొదటి జయసింహ వల్లభుని బిరుదులేవి ? ( సకల లోకాశ్రయ, సర్వసిద్ది)
62. ప్రాచీన తొలి తెలుగు శాసనం ఏది ? ( మొదటి జయసింహవల్లభుని విప్పర్ల శాసనం)
63. జయసింహ వల్లభుని అనంతరం రాజ్యాధికారం చేపట్టినది ? ( ఇంద్రభట్టారకుడు )
64. ఇంధ్రభట్టారకుని అనంతరం రాజ్యభారాన్ని వహించినది ? ( రెండో విష్ణువర్ధనుడు )
65. రెండో విష్ణువర్ధనుని కుమారుడు ? ( మంగి యువరాజు )
66. మంగి యువరాజు అనంతరం రాజ్యానికి వచ్చినదెవరు ? ( రెండో జయసింహుడు )
67. 'త్రిభువనాంకుశ' అనే బిరుదు ఎవరిది ? ( మూడో విష్ణు వర్ధనుడు )
68. మూడో విష్ణువర్ధనుని తరువాత సింహాసనం అధిరోహించిన వ్యక్తి ? ( మొదటి విజయాదిత్య)
69. మొదటి విజయాదిత్యుని బిరుదులేవి ? (సమస్త భువనాశ్రయ, త్రిభువనాంకుశ) మహారాజాధి రాజ పరమేశ్వర భట్టారక)
70. మొదటి విజయాదిత్యుని అనంతరం రాజ్యనికి వచ్చిన దెవరు ? ( నాలుగో విష్ణువర్ధనుడు )
71. నాలుగో విష్ణువర్ధనుడు ఎవరికి సామంతుడుగా వ్యవహరించాడు ? ( రాష్ట్రకూటులకు )
72. రాష్ట్రకూట దంతిదుర్గుడు తరువాత రాజ్యాధికారానికొచ్చిన దెవరు ? ( మొదటి కృష్ణుడు )
73. సింహాసనానికై కలహించుకున్న మొదటి కృష్ణుని కుమారులలో ఎవరికి నాలుగో విష్ణువర్ధనుడు సాయపడ్డాడు ? ( గోవిందుడుకి)
74. రాష్ట్రకూట కృష్ణుడు అనంతరం రాజ్యానికి వచ్చినదెవరు ? ( ధ్రువుడు )
75. రాజ్యం కోసం కలహించుకున్న నాలుగో విష్ణువర్ధనుని కుమారులు ? ( రెండోవిజయాదిత్యుడు భీమసలుకి)
76. రెండో విజయాదిత్యుని బిరుదులేవి ? ( నరేంద్ర మృగరాజ, చాళుక్యరాయ, విక్రమధావళి)
77. నరేంద్రేశ్వరాలయం కట్టించిన దెవరు ? ( రెండో విజయాదిత్యుడు )
78. భీమశలునితో యుద్ధకాలంలో రెండో విజయాదిత్యుని రాజధాని ఏది ? ( బెజవాడ)
79. విజయవాడకు ఆపేరు ఏ రాజు వలన వచ్చిందని కొందరు అభిప్రాయ పడుతున్నారు ? ( విజయాదిత్యుడు )
80. రెండో విజయాదిత్యుని ఘన విజయాలను తెలిపే శాసనం ? ( గుణగ విజయాదిత్యుని సాకటూరి శాసనం )
81. రెండో విజయాదిత్యుని తరువాత రాజ్యానికి వచ్చిన దెవరు ? ( ఐదోవిష్ణు వర్ధనుడు )
82. ఐదో విష్ణువర్ధనుని తువాత రాజ్యానికి వచ్చినది ? ( గణక విజయాదిత్య లేదా మూడో విజయాదిత్యుడు )
83. గణక విజయాదిత్యుని ఓడించిన రాష్ట్రకూట రాజెవరు ? ( అమోఘవర్షుడు )
84. గణక విజయాదిత్యుని చేతిలో ఓడిపోయిన రాష్ట్రకూట రాజు ? ( రెండవ కృష్ణుడు )
85. గణక విజయాదిత్యుని సైన్యాధిపతులలో ముఖ్యులు? ( కడేమరాజు, పాండురంగ వినమడి శర్మ రాజాదిత్య ముఖ్యులు
86. రాష్ట్రకూటులను సామంతులుగా చేసికొనిన తూర్పు చాళుక్య రాజు ? ( గణక విజయాదిత్యుడు )
87. గణక విజయాదిత్యుని తరువాత రాజ్యానికి వచ్చింది ? ( చాళుక్య భీముడు లేదా ఆరో విష్ణువర్ధనుడు )

88. చాళుక్య భీముని ఆస్థాన కవి ? ( కవివృషభ భట్టవామనుడు )

89. కావ్యాలంకార సూత్రాలు అనే అలంకార గ్రంథాన్ని రచించిన దేవరు? ( భటవామనుడు )

90. చాళుక్యభీముని ఆస్థానంలో గాంధర్వ, విద్యాప్రవీణులు, తుంబురుడను ఖ్యాతిపొందిన దెవరు ?

( చల్లవ్వ, చల్లవ్వ తండ్రి మల్లవ్వ)

91. చాళుక్య భీముని కాలంలో గణిత శాస్త్ర పాండిత్యాన్ని సూచించేది ? ( గణక సంజ్ఞ )

92. చాళుక్య భీముని కాలంలో నిర్మించిన దేవాలయాలు ఏవి ?

( చాళుక్య భీమవరంలోని చాళుక్య భీమేశర్వఆలయం, ద్రాక్షారామ భీమేశ్వరాలయం )

93. చాళుక్య భీముని తరువాత రాజ్యానికి వచ్చిన దెవరు ? ( నాలుగో విజయాదిత్యుడు )

94. రాజరాజే తనపేరు మీద కొత్త నగరం కట్టించినాడని తెలయజేసే గ్రంథం ఏది ? ( కావ్యాలవారి చూడామణి )

95. రెండో చాళుక్య భీముని కుముదులు ? ( దానార్ణవుడు, అమ్మరాజు )

96. అమ్మరాజును వధించిన దెవరు ? ( దానార్ణవుడు )

97. రెండో చాళుక్యు భీముని అనంతరం రాజ్యానికి వచ్చినది ? ( రెండో అమ్మరాజు లేదా ఆరో విజయాదిత్య)

98. దానార్ధవునికి సాయం చేసిన రాష్ట్రకూట రాజు ( మూడో కృష్ణుడు )

99. దానార్ధవని వధించిన దెవరు ? ( జటాచోడ, భీముడు )

100. జటాచోడ భీముడు ఎవరు ? ( కర్నూలు మండలంలో పెద్దకల్లుని ఏలే తెలుగు చోడుడు)

101. జటాచోడ భీముని చేతిలో మరణించిన గాంగవంశం రాజు ? ( మధుకామార్ణవుడు )

102. జటాచోడ భీముణ్ణి ఓడించిన దెవరు? (శక్తివర్మ)

103. చాళుక్య చంద్రుడు అనే బిరుదు ఎవరిది ? ( శక్తివర్మ)

104. శక్తివర్మ ఎవరి కుమారుడు ? ( దానార్ధవుడు )

105. మొదటి శక్తివర్మ తరువాత సింహాసనాన్ని అధిరోహించినది ఎవరు ? ( విమాలాదిత్యుడు )

106. విమలాదిత్యుని గురువు ? ( జైన సన్యాసి త్రికాలయోగి సిద్ధాంత దేవుడు )

107. విమలాదిత్యుని తరువాత సింహాసన మాక్రమించినది ? ( కుందవై కుమారుడు రాజరాజు )

108. రాజ రాజు మేనమామ ఎవరు ? ( రాజేంద్ర చోళుడు )

109. రాజరాజ నరేంద్రుని భార్య అమంగాదేవి ఎవరి కుమార్తె ? (రాజేంద్ర చోళుడు )

110. రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి ఎవరు ? ( నన్నయ భట్టు )

111. మహాభారతాన్ని రచించడంలో నన్నయకు సాయం చేసినది ఎవరు ? ( నారాయణ భట్టు )

112. రాజరాజ నరేంద్రుని కుమారుడు ? (రాజేంద్రుడు)

113. ఎవరి మరణంతో తూర్పు చాళుక్యుల పాలన అంతమయినట్లయింది ? ( విజయాదిత్యుడు )

114. తూర్పు చాళుక్యుల కాలంలో ప్రభుత్వంలోని సప్తాంగాలు ఏవి ?

( రాజు, మంత్రి, రాజ్యము, దుర్గము, కసము, సైన్యం, మిత్రం )

115. పరిపాలన ఎవరి ఆధీనంలో ఉండేది ? ( తీర్దులు )

116. తూర్పు చాళుక్య కాలంలో తీర్ధులు అనగా ? ( ఉద్యోగులు )

117. తూర్పు చాళుక్యుల ప్రాంతీయ పరిపాలన విభాగాల పేరేమి ? (విషయము, నాటు, కోట్టము, గ్రామము)

118. తూర్పు చాళుక్యుల కాలంలో వర్తక శ్రేణికి ఏమని పేరు? ( నకరమని )

119. హిందూమతం అభివృద్ధి చెంది బౌద్దమతం పూర్తిగా ఎవరి కాలంలో క్షీణించింది ?; ( తూర్పు చాళుక్యుల)

120. 'కవిగాయక' కల్పతరు ఎవరి బిరుదు ? ( అమ్మరాజు )

121. 'కవి పండిత కామధేనువు' అని ఎవర్ని పిలచేవారు ? ( మూడే విష్ణువర్ధనుని )

122. తూర్పు చాళుక్య కాలంలో ప్రసిద్ధ జైన గురువులు ? ( అర్వనందన్ , దిన నందన్ )

123. ఏ తూర్పు చాళక్యరాజు కాలపు శాసనాలలో తొలిసారిగా పద్యాలు కనిపించాయి ? ( గుణగ విజాయదిత్యుని )

124. గణిత శాస్త్రంలో పద్యాలు రచించిన పావులూరి మల్లన ఎవరి సమకాలీనుడు ? ( నన్నయ్య)
125. గుప్తవర్మ తర్కంపై 70 వ్యాఖ్యానాలు వల్లివేసెనని తెలిపే శాసనం ? ( పెదమద్దాలి శాసనం )

## పల్లవులు

126. శాతవాహనుల తర్వాత దక్షిణాపథంలో గొప్ప సామ్రాజ్యం నిర్మించిన వారు ( పల్లవులు)
127. పల్లవ చరిత్రకు ఆధారములైన శాసనములు ? ( మంచికల్లు శాసనం, మైదవోలు శాసనం, హిరగడపల్లి శాసనం మొ॥నవి)
128. పల్లవుల వంశంలో వున్న శాఖలు
1. ప్రాకృత పల్లవులు ( లేక ) ప్రాచీన పల్లవులు 2. సంస్కృత పల్లవులు 3. బృహత్ పల్లవులు. 4.చివరి పల్లవులు
129. ప్రాచీన పల్లవుల మూల పురుషుడు ( వీర కూర్చవర్మ )
130. సంస్కృత శాసనములందుపేర్కొనిన పల్లవులలో మొదటి పాలకుడు ? ( విష్ణుగోపుడు )
131. మహాపల్లవ వంశమునకు మూల పురుషుడు ? ( సింహ విష్ణువు )
132. దక్షిణాపథంలో వైదిక మతంలో వైష్ణవమును పోషించిన వారు ? ( పల్లవులు )
133. సప్త పవిత్ర నగరాలలో, పల్లవ కాలం నాటి రాజధాని ? ( కాంచీపురం)
134. బౌద్ధ వాఙ్మయములో, పల్లవులు నివసించిన మండలానికి ఏమని పేరు? ( వల్ల బోగ్గము )
135. పల్లవుల రాజచిహ్నము ? ( వృషభము )
136. పల్లవ చక్రవర్తులలో సుప్రసిద్ధుడు ? ( మొదటి నరసింహ వర్మ)
137. నవీన పల్లవుల అధికారం నాశనం చేసినది ? ( చోళులు )
138. వీర కూర్చవర్మ బిరుదమేమి ? ( సింహవర్మ)
139. 'మత్త విలాస ప్రహసన ' కర్త ? ( మొదటి మహేంద్ర వర్మ)
140. ' కిరాతార్జునీయం' కర్త భారవి ఎవరి ఆస్థాన కవి ? ( మొదటి నరసింహవర్మ)
141. రెండవ మహేంద్ర వర్మ ఆస్థాన కవి ? (దండి)
142. పల్లవుల రాజధాని ? కంచి ( కాంచీపురం)
143. మొదటి మహేంద్రవర్మ దక్షిణాత్య చిత్ర లేఖనంపై రచించిన గ్రంథం ? ( దక్షిణ చిత్ర )
144. మహాబలిపుర ఏక శిలా రథాల నిర్మాణకర్త ? ( మొదటి నరసింహవర్మ)
145. కంచిలోని కైలాసనాథ ఆలయనిర్మాణకర్త ? ( రెండవ నరసింహవర్మ)
146. పల్లవులు అనుసరించిన శిల్ప సాంప్రదాయము ? ( అమరావతీ శిల్పం)
147. ఎవరి కాలంలో చైనా నుండి హుయాన్ సాంగ్ యాత్రికుడు వచ్చాడు ? ( మొదటి నర సింహవర్మ)
148. పల్లవులు అష్టాదశ పరిహారమన్న శాసనం ద్వారా వారు ఎన్ని రకాల పన్నులు వసూలు చేసినట్లు తెలుస్తుంది? (180 రకాలు
149. భారతీయ తర్క శాస్త్ర పితామహుడు ? ( దిఙ్నాగుడు )
150. బ్రాహ్మణ మతోద్ధరణకై కృషి సల్పిన పల్లవ రాజు ? ( నర సింహవర్మ)
151. దక్షిణాపథంలో తొలిసారిగా గ్రానైట్ రాళ్ళతో నిర్మించిన దేవాలయము? ( తీర దేవాలయము )
152. ఆగ్నేయాసియాలో శిల్పానికి మాతృక ? ( పల్లవ శిల్పకళ)
153. ప్రపంచ దృష్టి నాకర్షించిన " గంగావతరణ " శిల్ప దృశ్యం ఎచ్చటిది ? ( మహాబలిపురం)
154. నలందా విశ్వవిద్యాలయ ఆచార్యునిగా పేర్గాంచిన కంచి నివాసి ? ( ధర్మపాలుడు )
155. వేద శాస్త్రములను, సంస్కృతమును పోషించిన ఆంధ్ర రాజులు ? ( పల్లవులు )
156. పల్లవుల ఇతర ముఖ్య నగరములు ? (1. పలక్కడ 2. దశనపుర 3. తాంబ్రాప)
157. అవనిసింహుడని బిరుదున్న పల్లవ రాజు ? ( సింహవిష్ణువు )
158. పల్లవ రాజ్య పునరుద్ధారకుడు ? ( సింహ విష్ణువు)
159. పల్లవుల కాలంనాటి చిత్ర కళాఖండాలు ఏవి ? (పుదుద్నోట సమీపంలోని చిత్తన వాసల్ గుహకుడ్య చిత్రాలు )

160. నేటి పలనాడును ఏమని పిలిచేవారు ? ( పల్లవబోగ్గి )
161. ఏ పల్లవ రాజు కాలంలో సముద్ర గుప్తుడు దక్షిణ దిగ్విజయయాత్ర చేసినాడు ? ( విష్ణు గోపుడు)
162. పల్లవుల ధ్వజం ఏది ? ( ఖట్వాంగ ధ్వజము )
163. ఆంధ్ర పదము అనే పదప్రయోగం ఏ రాజుల శాసనంలో మొట్టమొదటిసారిగా కనిపిస్తుంది ?
( బళ్ళారి జిల్లాలో చెక్కబడిన పల్లవ రాజుల శాసనంలో )
164. వాతాపి చాళుక్యరాజగు పులకేశిని జయించి, వాతాపి నగరంలో 'జయస్తంభం' నాటిన పల్లవ రాజు ? (మొదటి నరసింహవర్మ)
165. మొదటి మహేంద్ర వర్మ నిర్మించిన గుహాలయములు ? (మహాబలిపురం, మామంటూరు , దళవానూరు, తిరుచ్చిరాపల్లి,)
166. మహేంద్ర వర్మ కాలం నాటి 'సిత్తన్న వాసరా ' చిత్రములలో ఏ ప్రాచీన చిత్రకళా పోలికలగుపడుచున్నవి?
(అజంతా, అమరావతీ చిత్రకళల పోలికలు )
167. మహేంద్రవర్మకున్న బిరుదు ? ( సంకీర్ణ జాతి)
168. నందికంపేశ్వరాలయ నిర్మాణ కర్త ? ( పల్లవ రాజు కంపవర్మ)
169. పల్లవ మల్లుడన్న బిరుదు గల చివరి పల్లవ రాజు ? ( ఇమ్మడినందివర్మ)
170. పల్లవరాజు అపరాజితుని చంపి తంజావూరు చోళ వంశజుడైన ఆదిత్యుడు ఏ రాజ్యాన్ని వశం చేసుకున్నాడు ? ( పల్లవ రాజ్యాన్ని)

## 11. రాజపుత్రయుగం ( క్రీ.శ. 700 - 1200 )

### రాజపుత్ర రాజ్యాలు

1. రాజపుత్ర యుగ కాలము ఏది ? ( క్రీ.శ. 647 - 1206)
2. హర్షుని మరణానంతరం నుండి మహమ్మదీయ సామ్రాజ్య స్థాపన వరకు ఉత్తరాపథ చరిత్రలో అపూర్వమైన అద్వితీయమైన పాత్ర వహించిన వారెవరు ? ( రాజపుత్రులు)
3. రాజపుత్రులలో మొదట విజృంభించిన వారు ఎవరు ? ( ఘూర్జర ప్రతీహారులు )
4. ఘూర్జర ప్రతీహార వంశ స్థాపకుడు ఎవరు ? ( మొదటి నాగభటుడు )
5. ఘూర్జర ప్రతీహారుల తొలి రాజధాని ఏది ? ( బీన్‌మల్ )
6. ప్రతీహారుల మలి రాజధాని ఏది ? ( కనూజ్ )
7. ప్రతీహార పాలకులలో గొప్పవాడు ఎవరు ? ( మిహిర భోజుడు )
8. మిహిర భోజుని కాలమున కనూజ్ రాజ్యమును సందర్శించిన అరబ్బు దేశస్థుడు ఎవరు ? ( సులేమాన్ )
9. ప్రతీహారుల పాలనా కాలమేది ? ( క్రీ. శ. 783 - 1019 )
10. మిహిర భోజుని కుమారుడెవరు ? ( మహేంద్రపాలుడు )
11. ప్రతీహారులు ఏ మతాభిమానులు ? ( హిందూమతం)
12. అరబ్‌దండయాత్రల నుండి ఆర్యావర్తనమును కాపాడిన వారెవరు ? ( ప్రతీహారులు)
13. ప్రతీహారుల అనంతరం కనూజ్‌ను ఆక్రమించి పాలించిన వారు ఎవరు? (గహద్వాలులు)
14. గహద్వాల వంశ మూలపురుషుడు ఎవరు ? ( చంద్రదేవుడు )
15. గహద్వాలలో సుప్రసిద్దుడు ఎవరు? ( జయచంద్రుడు )
16. గహద్వాలులకు గల మరొక పేరు ఏది ? ( రాఠోరులు)
17. జయచంద్రుని కుమార్తె ఎవరు ? ( రాణి సంయుక్త )
18. గహద్వాలు పాలనాకాలమేది ? (క్రీ.శ. 1085 - 1202 )
19. జయచంద్రుని మహమ్మదీయ ఘోరీ ఏ యుద్ధంలో ఓడించాడు ? ( క్రీ.శ. 1193 లోజరిగిన చందార్ యుద్ధంలో)
20. ప్రతీహార వంశ శిథిలములపై వెలసిన రాజ్యమేది ? ( పరమారుల రాజ్యము )

21. పరమారులు ఎవరు? ( మాళ్వాప్రాంతాన్ని పాలించిన రాష్ట్రకూట వంశ శాఖ అయిన రాజపుత్రులు )
22. మరమార రాజ్య స్థాపకుడు ఎవరు ? ( ఉపేంద్రుడు )
23. పరమారుల పాలనా కాలమేది? ( క్రీ.శ. 950 - 1055 )
24. పరమారుల రాజధాని ఏది ? ( ధారా నగరం)
25. పరమారులలో ప్రసిద్దుడు ఎవరు ? ( వాక్పతి రాజు ( ముంజురాజు )
26. పరమారులలో గొప్ప సాహిత్యవేత్త ఎవరు ? ( పరమారభోజుడు )
27. ముంజురాజు ఆస్థానమందలి కవులెవరు ? ( హలాయుధ, ధనంజయ)
28. ముంజురాజు తరువాత పరమారులలో గొప్పవాడెవరు ? ( భోజుడు )
29. కవిత్వము, వాస్తు శాస్త్రము, వేదాంతము, ఆయుర్వేదము, మతము. మొ॥ వానిపై సుమారు 20 గ్రంథములు రచించిన పరమార రాజెవరు ? (భోజుడు )
30. రాజపుత్ర వంశాలలో బలీయమైన వారు ఎవరు. ? ( చందేలులు)
31. చందేలులు ఏ ప్రాంతాన్ని పాలించారు ? ( మధ్యప్రదేశ్‌లోని బుందేల్ ఖండ్ )
32. చందేలుల రాజధాని ఏది ? ( ఖజురాహో )
33. చందేలుల మూలపురుషుడెవరు ? ( జయశక్తి)
34. స్వతంత్ర చందేల రాజ్యస్థాపకుడెవరు ? (యశోవర్మ )
35. చందేలుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 950 - 1202 (252. సం॥లు)
36. చందేలులలో సుప్రసిద్దులు ఎవరు ? ( విద్యాధరుడు )
37. సుప్రసిద్ధ ఖజురహో దేవాలయ నిర్మాతలు ఎవరు ? (చందేలులు)
38. చందేలులను ఓడించి బుందేల్‌ఖండ్‌ను ఆక్రమించింది ఎవరు ? ఎప్పుడు? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ క్రీ.శ. 1309 లో )
39. చందేలుల దుర్భేధ్యములైన, రక్షణ కవచముల వంటి కోటలేవి ? ( గ్వాలియర్ , కలింజర్ )
40. ప్రతీహార రాజ్య శిధిలాలపై గుజరాతు నందు వెలసిన స్వతంత్ర రాజ్యము ఏది ? ( సోలంకి రాజ్యము )
41. సోలంకీల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 945 - 1143 )
42. సోలంకీల రాజ్యమేది ? ( అనిహిల్ వాడ్ గుజరాత్ )
43. సోలంకి రాజ్యస్థాపకుడు ఎవరు ? ( మూలరాజు )
44. ఏ సోలంకి రాజు కాలమున గజనీ మహమ్మదు సోమనాధ్ దేవాలయం ధ్వంసం చేసెను ? ( భీముడు )
45. బిల్హకుడు ఎవరి ఆస్థాన కవి ? (భీముని కుమారుడైన కర్ణుని )
46. బిల్హకుడు రచించిన గ్రంథమేది ? (విక్రమాంకదేవ చరిత్రం)
47. సోలంకి వంశస్థులలో సుప్రసిద్దుడు ఎవరు ? ( కర్ణుని కుమారుడైన జయసింహుడు)
48. సుప్రసిద్ధ జైన పండితుడు హేమచంద్రుడు ఎవరి అనుచరుడు ? ( జయచంద్రుని )
49. సోలంకి రాజ్యాన్ని ఎవరు ఆక్రమించారు ? ( వారి సామంతులైన వాఘేల వంశీయులు )
50. చేది రాజ్య స్థాపకులు ఎవరు ? ( కాల చుర్యులు )
51. చేది రాజ్య స్థాపకుడు ఎవరు ? ( కోకోల్లుడు )
52. కాలచుర్యులలో సుప్రసిద్ధ చక్రవర్తులెవ్వరు ? ( గాంగయదేవుడు, కర్ణదేవుడు)
53. కాలచుర్యులు పాలించిన ప్రాంతమేది ? ( ఒరిస్సా ప్రాంతం )
54. కాలచుర్యుల రాజధాని ఏది ? ( త్రిపుర )
55. కాలచుర్యుల పాలనా కాలమేది? ( క్రీ.శ. 945 - 1212)
56. ఆర్యావర్తమంతయు అధికారము చలాయించిన శతాధిక యుద్ధ వీరుడు ఎవరు ? ( కర్ణ దేవుడు )
57. ఉత్తరాపథ సార్వభౌమత్వమునకై, ప్రతీహారులతోనూ, రాష్ట్ర కూటులతోనూ పోరాడి, బెంగాలు నందు విజృంభించిన వారెవరు? (పాలవంశీయులు )

58. పాలవంశ స్థాపకుడు ఎవరు ? ( గోపాలుడు )
59. పాలవంశీయులలో సుప్రసిద్దుడెవరు ? ( ధర్మపాలుడు )
60. పాలవంశీయుల పాలనా కాలమేది ? ( క్రీ. శ. 750 - 1138 )
61. ప్రతీహారులనోడించిన పాల వంశీయుడు ఎవరు ? ( ధర్మపాలుడు )
62. నలందా విశ్వవిద్యాలయమువలె పాల రాజులు ఏఏ విశ్వవిద్యాలయములను స్థాపించినారు ? ( విక్రమశిల, ఉద్దంతపురి, జగద్దల )
63. పాల వంశీయులను అంతమొందించి బెంగాలునందు అధికారము చేజిక్కించుకొన్న వారెవరు? (సేన వంశీయులు)
64. సేన వంశ స్థాపకుడు ఎవరు ? ( విజయ సేనుడు )
65. సేన వంశీయుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1138 - 1199 )
66. సేన వంశీయుల రాజధాని ఏది ? ( నాడియా )
67. సేన వంశీయులు ఏమతాభిమానులు ? ( హిందూ )
68. సేన వంశీయులలో సుప్రసిద్ధ డెవరు ? ( లక్ష్మణ సేనుడు )
69. సేన వంశీయులలో చివరివాడు ఎవరు? (లక్ష్మణ సేనుడు)
70. లక్ష్మణసేనుని ఆస్థాన కవుల పేరేమి ? ( పంచ రత్నములు )
71. ‘ గీతా గోవిందము ’ ను రచించిన జయదేవుడు ఎవరి ఆస్థాన కవి. (లక్ష్మణసేనుడు)
72. సేన వంశమును అంతమొందించిన మహమ్మదు ఘోరీ సేనాని ఎవరు ? ( భక్తియార్‌ఖిల్జీ)
73. ప్రతీహారుల అనంతరం అజ్మీరు ప్రాంతంలో స్వతంత్ర రాజ్యమును స్థాపించింది ఎవరు ? (చౌహానులు )
74. చౌహానుల మూలపురుషుడు ఎవరు? ( సింహరాజు )
75. చౌహానులలోనే కాక భారతీయులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( పృథ్వీరాజు )
76. పృథ్వీరాజు ఆస్థాన కవి చాంద్‌బరదాయ్ రచించిన గ్రంథమేది ? ( పృథ్వీరాజ్ రాసో )
77. చౌహానుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 956 - 1192)
78. చౌహానుల రాజధాని ఏది ? ( కనూజ్ )
79. పృథ్వీరాజ్ మహమ్మద్ ఘోరీని ఏ యుద్ధంలో ఓడించాడు ? ఎప్పుడు జరిగింది ? (మొదటి స్థానేశ్వర్ యుద్ధం (క్రీ.శ. 1191)
80. మహమ్మద్ ఘోరీ పృథ్వీరాజ్‌ను ఓడించిన యుద్ధం ఏది ? ఎప్పుడు జరిగింది?( రెండవ స్థానేశ్వర్ యుద్ధం ( క్రీ.శ.1192 )
81. రాజపుత్ర యుగంలో కాశ్మీరును పాలించిన రాజవంశాలేవి ? ( కార్కోట, ఉత్పల, లోహర వంశీయులు )
82. కార్కోట వంశ మూల పురుషుడు ఎవరు ? ( దుర్లభవర్ధనుడు )
83. కార్కోట వంశీయులలో సుప్రసిద్దుడు ఎవరు ? ( లలితాదిత్యముక్తాపీటుడు )
84. సుప్రసిద్ధ మార్తాండ దేవాలయ నిర్మాత ఎవరు ? ( లలితాదిత్యముక్తాపీటుడు )
85. కార్కోట వంశీయులను నిర్మూలించిన దెవరు ? ( ఉత్పల వంశీయులు)
86. ఉత్పల వంశీయుల మూలపురుషుడు ఎవరు ? ( అవంతీ వర్మ)
87. మిహిరభోజుని, లల్లియసాహిని ఓడించిన ఉత్పల వంశీయుడు ఎవరు ? ( అవంతీవర్మ కుమారుడైన శంకర వర్మ)
88. ప్రజల తిరుగుబాటుతో పదవీచ్యుతుడైన ఉత్పలవంశ రాజు ఎవరు ? ( శంకరవర్మ )
89. ఉత్పల వంశీయుల తరువాత కాశ్మీరును ఏ రాజులు పాలించిరి ? ( లోహర వంశీయులు )
90. రాజపుత్ర యుగంలో పంజాబు, గాంధార ప్రాంతాలను పాలించింది ఎవరు? ( షాహీవంశీయులు )
91. షాహీ వంశీయులెన్ని శాఖలవారు ? ( రెండు . 1. తురుష్క షాహి 2. హిందూ షాహి )
92. హిందూషాహి వంశీయుల రాజధాని ఏది ? ( ఉదభాండాపురము)
93. తురుష్క షాహి వంశీయుల రాజధాని ఏది ? ( కాబాల్)
94. హిందూ షాహి వంశీయులలో సుప్రసిద్దుడు ఎవరు ? ( జయపాలుడు )
95. రాజపుత్రులు ఎంతకాలం పాలించారు ? ( ఐదున్నర శతాబ్దాలు)

96. రాజపుత్ర యుగంలోని హిందూ త్రిమతాచార్యులు ఎవరు ? (శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు)
97. కుమార భట్టు వ్యాపింపజేసిన హిందూమత సిద్ధాంతమేది ? ( పూర్వమీమాంస)
98. శంకరాచార్యులు వ్యాపింపజేసిన హిందూ దర్శనమేది ? (ఉత్తర మీమాంస)
99. ద్వైతమత స్థాపకుడు ఎవరు ? ( మధ్వాచార్యుడు )
100. అద్వైత మత స్థాపకుడు ఎవరు ? ( శంకరాచార్యుడు )
101 . విశిష్టాద్వైత మతస్థాపకుడు ఎవరు ? ( రామానుజాచార్యుడు )
102. శత్రువుల బారినుండి తప్పించుకొనేందుకు రాజపుత్ర స్త్రీలు సామూహికంగా అగ్నిగుండంలో దూకి చేసుకోనే ఆత్మాహుతిని ఏమందురు ? ( జోహర్ )
103. క్షేమేంద్రుడు రచించిన గ్రంథమేది? (బృహత్కథాకోశము )
104 'గీతగోవిందము'ను రచించింది ఎవరు ? ( జయదేవుడు )
105. భవభూతి ఏమి రచించినాడు ? ( ఉత్తర రామ చరిత్రం, మాలతీమాధవం, మహావీర చరిత్ర)
106. భవభూతి ఎవరి ఆస్థాన కవి ? (కనోజ్ రాజైన యశోవర్మడు )
107. రాజశేఖరుడు ఎవరి ఆస్థానకవి ? ( ప్రతీహార మహీపాలుడు )
108. రాజశేఖరుడు రచించిన గ్రంథాలేవి ? ( కర్పూర మంజరి, బాలరామాయణం )
109. సిద్ధాంత శిరోమణి రచించినది ఎవరు ? ( భాస్కరాచార్యులు )
110. 'చికిత్సా సార సంగ్రహం' గ్రంథాన్ని రచించింది ఎవరు ? ( చక్రపాణిదత్తుడు)

## రాష్ట్రకూటులు

111. కర్ణాటక ప్రాంతాన్ని పాలించిన కన్నడిగులు ఎవరు ? ( రాష్ట్ర కూటులు )
112. రాష్ట్రకూటు రాజ్యస్థాపకుడు ఎవరు ? ( దంతిదుర్గుడు )
113. దంతిదుర్గుని రాజధాని ఏది ? ( ఎల్లోరా )
114. ఎల్లోరా, కైలాసనాథ గుహాలయమును నిర్మించింది ఎవరు ? ( మొదటి కృష్ణుడు )
115. రాష్ట్రకూటుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 753 - 973 )
116. రాష్ట్రకూట రాజులలో గొప్ప కవి ఎవరు ? (అమోఘవర్షుడు)
117. అమోఘవర్షుడు రచించిన గ్రంథాలు ఏవి? ( ' కవి రాజమార్గం', 'ప్రశ్నోత్తర మాల')
118. మొదటి కృష్ణుని తరువాత రాష్ట్రకూట సింహాసనాన్ని అధిష్టించిన ప్రసిద్ధ రాజులెవరు ?
( ధృవుడు, మూడవ గోవిందుడు, అమోఘ వర్షుడు , మూడవ కృష్ణుడు)
119. రాష్ట్రకూట వంశంలో చివరి రాజు ఎవరు ? ( రెండవ కర్కరాజు )
120. రాష్ట్రకూట సామ్రాజ్యాన్ని అంతం చేసింది ఎవరు ? ( కళ్యాణి చాళుక్య రాజైన రెండవ తైలపుడు )

## గాంగులు

121. కర్ణాటక రాష్ట్రంలోని ఉత్తర కెనరా ప్రాంతంవారు ఎవరు? ( (గాంగులు)
122. గాంగులలో ఎన్ని శాఖలు కలవు ? ( రెండు 1. తూర్పుగాంగులు 2. పశ్చిమ గాంగులు )
123. కర్ణాటకలోని ఉత్తర కెనరా ప్రాంతాన్ని పాలించిన గాంగులెవరు ? ( పశ్చిమ గాంగులు)
124. ఒరిస్సాలోని కళింగ ప్రాంతాన్ని పాలించిన గాంగులెవరు ? (తూర్పు గాంగులు)
125. గాంగు శకము ఎప్పుడు ప్రారంభమైనది ? ( క్రీ.శ. 497 )
126. తూర్పు గాంగుల తొలి రాజధాని ఏది ? ( దంతపురం)
127. తూర్పు గాంగులలో పేరెన్నికగన్న మొదటి చక్రవర్తి ఎవరు ? ( ఆధిరాజ ఇంద్రుడు )

128. తూర్పు గాంగులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( అనంతవర్మ చోడ గంగ దేవుడు )

129. సుప్రసిద్ధ పూరీ జగన్నాథాలయము, శ్రీకూర్మం దేవాలయములను కట్టించింది ఎవరు? ( తూర్పుగాంగ చక్రవర్తియైన చోడ గంగదేవుడు )

130. త్రికళింగాధిపతి బిరుదును ధరించిన గాంగురాజు ఎవరు ? ( వజ్రహస్తుడు )

131. ప్రసిద్ధ ఖగోళ గ్రంథమైన "భాస్వతి"ని రచించిన 'శతానందుడు' ఎవరి ఆస్థాన పండితుడు ? ( చోడగంగదేవుడు)

132. ఒరిస్సాలోని ప్రసిద్ధ కోణార్క్ సూర్యదేవాలయాన్ని నిర్మించిన గాంగరాజు ఎవరు ? ( మొదటి నరసింహుడు )

133. గాంగుల తరువాత కళింగను పాలించిన రాజవంశమేది ? ( కళింగ గజపతులు)

134. కళింగ గజపతుల మూలపురుషుడు ఎవరు ? (కపిలేంద్ర గజపతి )

135. తూర్పుగాంగుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 497 - 1434 )

136. గాంగ రాజధానిని 'దంతపురం' నుండి 'కళింగ నగరమున'కు మార్చిన గాంగరాజుఎవరు ? ( హస్తివర్మ)

137. పశ్చిమ గాంగుల మూలపురుషుడు ఎవరు ? ( మొదటి మాధవరాజు )

138. పశ్చిమ గాంగుల రాజధాని ఏది? ( తలకాటు )

139. శ్రావణబెళగోళలోని సుప్రసిద్ధ జైన దేవాలయమును, 56 1/2 అడుగుల గోమటేశ్వర విగ్రహమును నిర్మించిన పశ్చిమ గాంగరాజు ఎవరు ? ( నాల్గవ రాజమల్లుడు )

140. సుప్రసిద్ధ కన్నడ కవిత్రయమైన సంప, రన్న, పోన్నలు, ఎవరి ఆస్థాన కవులు ? ( పశ్చిమ గాంగులు)

## చాళుక్యచోళులు

141. చాళుక్య చోళులు అంటే ఎవరు? ( ఏడో విజయాదిత్యుని మరణం అనంతరం సింహసనం అధిష్టించిన కులోత్తుంగుని సంతతివారు

142. చాళుక్య చోళ యుగాన్ని ఏమని పిలుస్తారు ? ( మాండలిక యుగం )

143. చాళుక్య చోళయుగ పాలనా కాలమేది ? (క్రీ.శ. 1076 - 1215)

144. కులోత్తుంగుని అసలు పేరు ? ( వేంగీ చాళుక్య రాజేంద్రుడు )

145. 1084లో పాండ్యులు తిరుగుబాటు జరిపిన కాలంలో వేంగీ ప్రభువు ? ( కుమార వీర చోడుడు)

146. మొదటి కులోత్తుంగుని తరువాత చక్రవర్తి అయినది ? (విక్రమ చోడుడు)

147. చక్రకూట సోమేశ్వరుని బిరుదు ఏది ? (వీరచోడ సంహారకాము)

148. వెలనాటి చోడుల మూలపురుషుడెవరు ? ( మల్లవర్మ )

149. వెలనాటి రాజధాని ఏది ? ( సనదుప్రోలు - చందోలు)

150. రెండవ వెలనాటి రాజేంద్రచోళుని బిరుదు ఏది ? (దుర్జయకుల ప్రాకార)

151. వెలనాటిచోళులు ఏ వంశస్తులని భావిస్తున్నారు? ( దుర్జయ వంశస్థులు)

152. వెలనాటిచోళుల పూర్వులలో దుర్జయుడొకడుగలడని తెలియజేయు శాసనం ఏది ? ( పిఠాపుర శాసనము )

153. వెలనాటిచోడులకు ఎవరితో వివాహ సంబంధాలు వుండేవి? ( దుర్జయులగు కొండపమటి రాజులతో )

154. పాండ్య దండయాత్రలో వీరచోడునకు సహాయం చేసినది ? ( వెలనాటి వెదురుడు )

155. వీరచోడుడు 1084లో దక్షిణ దేశానికేగినప్పుడు వేంగి పాలనాభారాన్ని వహించినదెవరు ? (ఎదురుని పిన తండ్రియైన గోంకరాజు)

156. గోంకరాజు మంత్రి ఎవరు? ( నాదెండ్ల గోపయామాత్యుడు )

157. గోంకరాజు కుమారుడు ఎవరు? ( కులోత్తుంగ రాజేంద్రచోళుడు)

158. రాజేంద్రచోళుని కుమారుడు ఎవరు ? (రెండవ గోంకరాజు )

159. కవి రాక్షసుడు, తిట్టుకవి అని ప్రసిద్ధుడైనది ఎవరు ? ( వేములవాడ భీమకవి )

160. మంచనకవి రచించిన గ్రంథమేది? ( కేయూర బాహు చరిత్ర )

161. ఏ యుద్ధంలో వేంగిలో పశ్చిమ చాళుక్యుల అధికారం పూర్తిగా తుడిచి పెట్టబడింది ? ( గోదావరీ యుద్ధం 1133 )
162. 'కాకతి ప్రాల నిర్ధహన' బిరుదు ఎవరికి గలదు ? ( వీర రాజేంద్రుడు, కోటచోడయరాజు)
163. వెలనాటి చోడులలో ప్రసిద్దుడెవరు ? ( రెండవ రాజేంద్ర చోడుడు)
164. రెండవ రాజేంద్ర చోడుని మంత్రి ? ( నండూరి కోమ్మన )
165. చౌండరాయ చాణూర మురాంతక బిరుదు ఎవరిది ? ( రాచూరు దారపరాజు )
166. వెలనాట చోళయ నిర్మూలన అనే బిరుదు ఎవరిది ? ( సంకర్షణ దేవుని సేనాపతి కాణవయ్య దండనాయకుడు )
167. వెలనాటి చోడుల ప్రభ ఎవరి మరణంతో అంతరించింది ? (రెండో రాజేంద్రచోడుని)
168. రెండో రాజేంద్రచోడుని మనుమడు ఎవరు ? ( పృథ్వీశ్వరుడు )
169. పృథ్వీశ్వరుడు తిరిగి ఏ సంవత్సరమున వెలనాటును ఆక్రమించెను ? ( 1203 )
170. పృథ్వీశ్వరుని మంత్రి ఎవరు ? (వెన్నయామాత్యుడు )
171. త్రిభువన చక్రవర్తి బిరుదుతో వేంగీలో సింహాసనమధి రోహించినది ఎవరు ? ( ముమ్మడి రాజాధిరాజు)
172. ఎవరి మరణంతో వెలనాటిచోడ వంశం అంతరించినది ? ( ముమ్మడిరాజేంద్ర చోడుని)

## ఆగ్నేయ ఆసియా రాజ్యాలు

173. పురాణములలో శ్రీలంకను ఏఏ పేర్లతో పిలిచేవారు ? ( లంక, తామ్రపర్ణి, సింహళం, నాగలోకం)
174. శ్రీలంకలోని "పోలోన్నరువా"లో శివాలయమును నిర్మించింది ఎవరు ? ( రాజరాజ చోళుడు )
175. భారతీయ చారిత్రక విశేషాలు గల సింహళ బౌద్ధ గ్రంథమేది ? ( దీప వంశం)
176. సింహళములో బౌద్ధమత ప్రచారము చేసిన అశోకుని బంధువులు ఎవరు? ( సంఘమిత్ర, మహేంద్ర )
177. పూర్వం భారతీయులు బర్మాను ఏ పేరుతో పిలిచేవారు ? ( సువర్ణ భూమి )
178. బర్మాను పాలించిన హిందూ పాలకులలో సుప్రసిద్దులు ( బ్రామ్మనులు )
179. బ్రామ్మనుల రాజధాని ఏది ? ( పాగన్ )
180. బ్రామ్మనులలో సుప్రసిద్దుడెవరు ? ( అనిరుద్దుడు )
181. పాగన్‌లోని సుప్రసిద్ధ ష్వజగాన్ బౌద్ధ దేవాలయాన్ని నిర్మించింది ఎవరు? ( అనిరుద్దుడు )
182. ఇండోనేషియాలోని ద్వీపాలు ఏవి ? (మలయా, సుమిత్రా, జావా, బలి, బోర్నియా)
183. మలయా ముఖ్య రేవు పట్టణం ఏది ? (తకువాపా)
184. సుమిత్రాలోని శ్రీ విజయ బౌద్ధరాజ్యంలో ముఖ్యమైన బౌద్ధ కేంద్రం ఏది? ( పాలెంబాగ్ )
185. శ్రీ విజయ రాజ్య పాలకులెవరు ? ( శైలేంద్ర వంశీయులు )
186. జావా ద్వీపం పూర్వ నామమేది ? (యువద్వీపము)
187. కాంబోడియాను పాలించిన రాజులెవరు ? (˘ంబు, స్వయంభు వంశీయులు )
188. కాంబోడియాలో ప్రఖ్యాతి గాంచిన 'అంగర్‌కోల్‌వాట్' వైష్ణవ దేవాలయ నిర్మాత? ( రెండవ సూర్యవర్మ )
189. ఆగ్నేయాసియాలోని నిర్మాణములన్నింటిలో తలమానికము వంటిదైన జావాలోని స్థూపము ఏది ? ( బోరోరుదురు మహాస్థూపము )
190. అన్నాంనకు గల మరోకపేరు ? ( చంపా )

## ముస్లిం దండయాత్రలు

191. భారతదేశంపై దండెత్తిన మహమ్మదీయులలో మొదటి వారు ఎవరు ? ( అరబ్బులు )
192. భారతదేశంపై దండెత్తిన తొలి ముస్లిం ఎవరు ? ( మహమ్మద్ ఖాశిం)
193. మహమ్మద్ గజనీ మొదటిసారిగా భారతదేశంపై ఎప్పుడు దండెత్తినాడు?(క్రీ.శ. 1000 - 1029 మధ్యకాలంలో (17 సార్లు)

194. గజనీ మహమ్మద్ దాడులను తిప్పికొట్టిన ఏకైక రసపుత్ర వీరుడు ఎవరు ? ( చందేల విద్యాధరుడు )
195. ఫిరదౌసి ఎవరి ఆస్థానంలోని వాడు ? అతడు రచించిన గ్రంథమేది ? (మహమ్మద్ గజనీ, షానామా)
196. ఆల్ బెరూని ఎవరి ఆస్థానంలోని వాడు ? అతడు రచించిన గ్రంథమేది? (గజనీ మహమ్మద్, తారీక్ డెల్ హింద్ )
197. మహమ్మద్ గజనీ సోమనాథ దేవాలయమును ఎప్పుడు కొల్లగొట్టాడు ? ( క్రీ.శ. 1029 లో )
198. ఘోరీ మహమ్మద్ అసలు పెరేమిటి ? (షిహబ్ ఉద్దీన్)
199. భారతదేశంలో మహమ్మదీయ రాజ్యాన్ని స్థాపించినది ఎవరు ? ( మహమ్మద్ ఘోరీ)
200. ఘోరీ రాజ్యం ఎక్కడ ఉంది ? (ఆఫ్ఘనిస్తాన్‌లోని జగనీ హీరట్‌ల మధ్య )
201. ఘోరీ దండయాత్ర సమయంలో కనూజ్‌ను పాలించిన గహద్వాల రాజెవరు? ( జయచంద్రుడు )
202. ఘోరీ దండయాత్ర సమయంలో ఢిల్లీ, ఆజ్మీరులను పాలిస్తున్న చౌహాను వంశీయుడెవరు ? ( పృథ్వీరాజ్)
203. ఘోరీ దండయాత్ర సమయంలో గుజరాత్‌ను పాలించు సోలంకీ వంశస్థుడు ఎవరు? ( రెండవ మాలరాజు )
204. ఘోరీ దండయాత్ర కాలంలో బెంగాలునేలు సేన వంశీయుడెవరు ? ( లక్ష్మణసేనుడు )
205. మొదటి స్థానేశ్వర్ యుద్ధం లేక తరైన్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ఎవరెవరికి జరిగింది ? ఎవరు ఓడిపోయారు? ( క్రీ.శ.1191లో మహమ్మద్ ఘోరీ పృథ్వీరాజ్‌ల మధ్య, మహమ్మద్ ఘోరీ ఓడిపోయాడు )
206. రెండవ తరైన్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ఎవరెవరి మధ్య జరగింది? ఎవరు ఓడిపోయారు ? ( క్రీ.శ.1192లో ఘోరీ,పృథ్వీరాజ్‌ల మధ్య పృథ్వీరాజ్ ఓడిపోయాడు )
207. భారతదేశంలో ముస్లిం రాజ్యస్థాపనకు దారి తీసిన యుద్ధమేది ? ( రెండవ తరైన్ యుద్ధం)

## 12. ఢిల్లీ సుల్తానుల యుగం ( క్రీ.శ. 1206 - 1526 )

### బానిస వంశము (1206 - 1290)

1. భారతదేశ చరిత్రలో ఢిల్లీ సుల్తానుల యుగమేది ? ( క్రీ.శ. 1206 నుండి 1526 )
2. ఢిల్లీలో మొట్టమొదట స్వతంత్ర ముస్లిం రాజ్యాన్ని స్థాపించినదెవరు ? ( కుత్‌బుద్దీన్ ఐబక్ 1206 సం॥)
3. ఢిల్లీని పాలించిన మొదటి ముస్లిం వంశము ఏది ? ( బానిసవంశం)
4. బానిసవంశ స్థాపకుడెవరు ? ( కుతుబుద్దీన్ ఐబక్ )
5. బానిసవంశ పాలనాకాలం ఏది ? ఆ వంశ ముఖ్య రాజులెవరు ? ( క్రీ.శ. 1206 - 1290, కుతుబుద్దీన్ ఐబక్, ఇల్‌టట్‌మిష్, బాల్బన్)
6. బానిసవంశానికి మరియొక పేరు ఏది ? ( యెమ్‌లూక్)
7. ఢిల్లీనేలిన మొదటి తురుష్క వంశమేది ? ( బానిసవంశం )
8. భారతదేశంలో ఘోరీ మహమ్మద్ జయించిన రాజ్యాలకు రాజప్రతినిధి ఎవరు ? ( కుతుబుద్దీన్ ఐబక్ )
9. కుతుబుద్దీన్ ఐబక్ బిరుదేమి ? ( లక్షాబక్ష్)
10. కుతుబుద్దీన్ ఐబక్ ఎప్పుడు మరణించినాడు ? ( క్రీ.శ. 1210 (లాహోర్ లో )
11. కుతుబుద్దీన్ ఐబక్ కట్టించిన మసీదులేవి ? ( ఢిల్లిలోని నువట్ - ఉల్ - ఇస్లాం అజ్మీర్‌లోని అర్హదిన్ కా చోప్రా
12. కుతుబ్‌మీనార్‌ను ప్రారంభించినదెవరు ? పూర్తి చేసినదెవరు ? ( ప్రారంభించినది కుతుబుద్దీన్ ఐబక్, పూర్తి చేసింది ఇల్‌టుట్‌మిష్)
13. కుతుబుద్దీన్ ఐబక్ అల్లుడు ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
14. కుతుబుద్దీన్ ఐబక్ తరువాత ఢిల్లీ సింహాసనమును ఎక్కిన అతని కుమారుడు ఎవరు ? (ఆరామ్ షా క్రీ.శ. 1210 )
15. క్రీ.శ. 1211లో ఆరామ్‌షాను చంపి ఢిల్లీ సింహసనమును ఆక్రమించింది ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
16. ఇల్‌టుట్‌మిష్ కాలంలో భారతదేశంపై దండెత్తిన మంగోలుల నాయకుడు ఎవరు. ( చెంగిజ్‌ఖాన్ )

17. ఇల్‌టుట్‌మిష్ ఆస్థానంలోని చరిత్రకారుడు ఎవరు ? ( మినహాజుద్దీన్ )
18. బాల్యంలో ఇల్‌టుట్‌మిష్‌ను అతని సోదరులు ఎవరికి బానిసగా అమ్మారు? ( జమాలుద్దీన్)
19. జమాలుద్దీన్ ఇల్‌టుటమిష్‌ను ఎవరికి బానిసగా అమ్మెను ? ( కుతుబుద్దీన్ ఐబక్‌కు )
20. గ్వాలియర్ దుర్గాన్ని జయించిన మొదటి ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
21. బానిసవంశ సుల్తానులలో అగ్రగణ్యుడెవరు ? ( ఇల్‌టుట్‌మిష్ )
22. స్వతంత్రంగా అరబ్బీ నాణెములను మొట్టమొదట ముద్రించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( ఇల్‌టుట్‌మిష్)
23. ఇల్‌టుట్‌మిష్ ఎప్పుడు మరణించెను ? ( క్రీ.శ. 1236 )
24. ఇల్‌టుట్‌మిష్ యొక్క సాంస్కృతిక ప్రాముఖ్యత ఏమి ? (ముస్లింల అవసరాలకు హిందూ శిల్పరీతులు అన్వయము)
25. మంగోలుల దాడినుండి తనను రక్షింపవలసినదిగా ఇల్‌టుట్‌మిష్‌ను కోరిన క్వారజాల ప్రభువు ? (మంగబార్నీ)
26. భారతదేశమును పాలించిన తొలి ముస్లిం మహిళ ఎవరు ? ( సుల్తానా రజియా (ఇల్‌టుట్‌మిష్ కుమార్తె)
27. తురుష్కేతర ముస్లింలకు ఉన్నత ఉద్యోగాలిచ్చిన సుల్తాన్ ఎవరు ? ( సుల్తానా రజియా)
28. రజియా తరువాత సింహాసనము నధిష్టించిన దెవరు ? (బహరాంషా)
29. బహరాంషా తరువాత ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించిన దెవరు? ( నాసరుద్దీన్ మహమ్మద్ )
30. నాసరుద్దీన్ మహమ్మద్ కాలంలో వాస్తవంగా ప్రభుత్వ కార్యకలాపాలను సాగించిన వ్యక్తి ఎవరు ( బాల్బన్ )
31. బాల్బన్ మొదటి పేరేమి ? ( బహా ఉద్దీన్ )
32. బాల్బన్ ఏ జాతీయుడు ? ( మధ్య ఆసియాలోని ఇల్బారీ తెగకు చెందిన తురుష్క జాతీయుడు )
33. బానిస వంశ రాజుల దర్బారులోని 40 మంది సర్దారుల కూటమి నేమంటారు ? ( చిహల్ గనీ)
34. బాల్బన్ పాలనా కాలమేది ? అతనెప్పుడు మరణించినాడు ? ( క్రీ.శ. 1266 - 1287, 1287లో )
35. చిహల్‌గనీ ప్రాబల్యాన్ని, మియోలనే దారిదోపిడీ దొంగల నణచినది ఎవరు? ( బాల్బన్ )
36. బాల్బన్ కాలంలో తిరుగుబాటు చేసిన బెంగాలు నాయకుడు ఎవరు ? (టుగ్రీల్ ఖాన్)
37. టుగ్రీల్ ఖాన్ మరణానంతరం బెంగాలు ప్రతినిధియైన బాల్బన్ కుమారుడు ఎవరు. ( బుగ్రాఖాన్ )
38. బాల్బన్ బిరుదు ఏది ? ( ఉల్గుఖాన్ )
39. తైమూర్‌తో పోరాడునపుడు ప్రాణాలు కోల్పోయిన బాల్బన్ పెద్దకుమారుడు ఎవరు? ( మహమ్మద్)
40. బానిస వంశ రాజులలో చివరివాడు ఎవరు ? ( కైకుబాద్ )

## ఖిల్జీ వంశము (1290 - 1320)

41. ఖిల్జీలు ఏ జాతి వారు ? ( ఆఫ్ఘన్ జాతివారు )
42. ఖిల్జీ వంశ స్థాపకుడు ఎవరు ? ( జలాలుద్దీన్ ఖిల్జీ )
43. జలాలుద్దీన్ ఖిల్జీ అసలు పేరేమి ? ఏ సంవత్సరంలో సింహసనమధిష్టించినాడు ? ( మాలిక్ ఫిరోజ్ ఖిల్జీ , క్రీ.శ. 1290లో)
44. జలాలుద్దీన్ ఖిల్జీ పాలనా కాలమేది ? (క్రీ.శ. 1290 - 1296 )
45. ప్రజాహిత నిరంకుశ సూత్రాల ప్రకారం ప్రభుత్వాన్ని నడుపుచు ప్రజాభిమానము పొందుటకై ప్రయత్నించిన మొదటి ఢిల్లీ సుల్తాన్ ఎవరు? ( జాలాలుద్దీన్ ఖిల్జీ )
46. మంగోలులు ఏ సుల్తాను కాలంలో ఇస్లాంమతాన్ని స్వీకరించారు ? ( జలాలుద్దీన్ ఖిల్జీ )
47. జలాలుద్దీన్ ఖిల్జీని హత్య చేసింది ఎవరు ? ఎప్పుడు ? ( అల్లా ఉద్దీన్ ఖిల్జీ క్రీ.శ. 1296లో )
48. తన నాణెములపై ' రెండవ అలెగ్జాండర్' అని ముద్రించుకున్న ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )
49. దక్షణాపథంలో మొదటిసారిగా ఇస్లాం విజయానికి కారకుడెవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )
50. రణతంబోర్ యుద్ధమందు రాజద్రోహమునకు పాల్పడి అల్లాఉద్దీన్‌కు సాయపడిన హంవీరదేవుని మంత్రి ఎవరు ? ( రాణమల్ )

51. దక్షిణదేశ దండయాత్ర నిర్వహించిన అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాని ఎవరు ? ( మాలిక్ కాఫర్ )

52. మాలిక్ కాఫర్ దక్షిణదేశమందు ఏఏ రాజుల నోడించినాడు ?

( యాదవ రామ చంద్రుడు ( దేవగిరి రాజు ) , రెండవ ప్రతాపరుద్రుడు (కాకతీయ రాజు ), మూడవ వీర బల్లాలుడు ( హోయసాల రాజు )

53. ఢిల్లీ సామ్రాజ్యానికి క్రమబద్ధమైన పాలనా వ్యవస్థను అందించిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ)

54. రాజ్యమును మతం నుండి వేరు చేసిన మొదటి మహమ్మదీయ చక్రవర్తి ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )

55. అల్లాఉద్దీన్ ఖిల్జీ మరణించింది ఎప్పుడు ? ( క్రీ.శ. 1316 లో )

56. అల్లాఉద్దీన్ ఖిల్జీ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1296 - 1316 )

57. అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంనాటి చరిత్రకారుడెవరు ? ( బరౌని )

58. అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆస్థానములోని పారశీక కవులు ఎవరు ? ( అమీర్ ఖుస్రు , అమీర్ హసన్ )

59. హిందువులపై అవమానకరమైన జయా పన్నును విధించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ )

60. అల్లాఉద్దీన్ ఖిల్జీకి రాచరికంపై యున్న అభిప్రాయమేమి ?

( దైవదత్త సిద్ధాంతం )

## తుగ్లక్ వంశము (1320 - 1413 )

61. తుగ్లక్‌లు ఏ జాతివారు ? ( కరౌనా తెగకు చెందిన తురుష్క జాతీయులు )

62. తుగ్లక్ వంశపాలనా కాలమేది ? ( క్రీ.శ. 1320 - 1413 )

63. తుగ్లక్ వంశ స్థాపకుడెవరు ? ( గియాజుద్దీన్ తుగ్లక్ )

64. తుగ్లక్ వంశంలో ప్రసిద్ధి చెందిన సుల్తానులు ఎవరు?(గియాజుద్దీన్ తుగ్లక్, మహమ్మద్‌బిన్ తుగ్లక్, ఫిరోజ్‌షా తుగ్లక్ )

65. గియాజుద్దీన్ తుగ్లక్ నిర్మించిన కొత్త రాజధాని ఏది ? ( తుగ్లక్ బాద్ )

66. అంచలవారీగా గుఱ్ఱాల మీద వార్తలను పంపే తపాలా పద్ధతిని ప్రవేశపెట్టిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( గియాజుద్దీన్ తుగ్లక్)

67. గియాజుద్దీన్ తుగ్లక్ ఎప్పుడు మరణించాడు ? ( క్రీ.శ. 1325 లో )

68. గియాజుద్దీన్ తుగ్లక్ తరువాత ఢిల్లీ సింహాసనమును అధిష్టించినది ఎవరు? ( మహమ్మద్ బీన్ తుగ్లక్ ( 1325 లో))

69. ' పిచ్చితుగ్లక్ ' గా పేరుపొందిన మహమ్మద్ బీన్ తుగ్లక్ మొదట పేరేమి? ( జునాఖాన్ )

70. విరుద్ధగుణ నిలయునిగా చిత్రీకరింపబడిన ఢిల్లీ సుల్తానెవరు ? ( మహమ్మద్ బీన్ తుగ్లక్ )

71. రాజధానిని ఢిల్లీ నుండి దేవగిరికి మార్చిన సుల్తాన్ ఎవరు ? ( మహమ్మద్ బీన్ తుగ్లక్ )

72. భారతదేశ చరిత్రలో పరమత సహనం ప్రదర్శించిన మొదటి ముస్లిం చక్రవర్తి ఎవరు ? (మహమ్మద్ బీన్ తుగ్లక్ )

73. మహమ్మద్ బీన్ తుగ్లక్ పాలనాకాలం ఏది ? ( క్రీ.శ. 1325 - 1351 )

74. దేవగిరికి తుగ్లక్ పెట్టిన పేరు ఏది ? ( దౌలతాబాద్ )

75. మహమ్మద్ బీన్ తుగ్లక్ ఆస్థానానికి వచ్చిన ఈజిప్టు దేశీయుడెవరు ? ( ఇబాన్ - బటటా )

76. తుగ్లక్ కాలంలో దాడి చేసిన మంగోలు నాయకుడు ఎవరు ? ( టర్మాషిరిన్ )

77. మంగోలు దాడులను నివారించుటకై మంగోలులకు లంచాలనిచ్చుటకు నిర్ణయించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ?

( మహమ్మద్ బీన్ తుగ్లక్ )

78. దక్షిణ ఇండియాకు ఇస్లాం సంస్కృతిలో సాన్నిహిత్యము ఏర్పడుటకు కారణమైన దండయాత్ర

( మహమ్మద్ బీన్ తుగ్లక్ దక్షిణ ఇండియా దండయాత్ర)

79. మహమ్మద్ బీన్ తుగ్లక్ ఏ దండయాత్రలో మార్గమధ్యంలో మరణించినాడు? ( గుజరాత్ మరియు సింధు )

80. మహమ్మద్ బీన్ తుగ్లక్ ఎపుడు ? ఎక్కడ మరణించినాడు ? ( క్రీ.శ. 1351, ధట్టావద్ద )

81. మహమ్మద్ బీన్ తుగ్లక్ తరువాత ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించినది ఎవరు? ( ఫిరోజ్ షా తుగ్లక్ క్రీ.శ. 1351 )

82. 'రైతు బాంధవుడని ', ' ఢిల్లీ సుల్తానత్ అక్బరు'గా పేరుపొందిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( ఫిరోజ్ షా తుగ్లక్ )

83. మీరట్ , తోప్రాలందలి అశోక స్థంభములను ఢిల్లీకి తరలించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? ( ఫిరోజ్ షా తుగ్లక్ )

84. ఫిరోజ్ షా ఆస్థానంలోని చరిత్రకారులెవరు ? ( జయాఉద్దీన్ బరానీ, షామ్స్ ఇసిరాజ్ )

85. ఫిరోజ్ షా తుగ్లక్ ఏ సంవత్సరమున మరణించెను ? ( క్రీ.శ. 1388 )

## సయ్యద్ వంశం ( క్రీ.శ. 1414 - 1451 )

86. తుగ్లక్ వంశం తరువాత ఢిల్లీని పాలించిన వంశమేది ? ( సయ్యద్ వంశం )

87. క్రీ.శ. 1398 లో భారతదేశంపై దండెత్తి ఢిల్లీ సుల్తానత్‌ను చావుదెబ్బ కొట్టిన సమర్ ఖండ్ పాలకుడు ఎవరు? (తైమూర్)

88. తుగ్లక్ వంశంలో చివరివాడు, తైమూర్ దండయాత్ర సమయంలో ఢిల్లీ పాలకుడు అయిన సుల్తానెవరు ? ( నసీరుద్దీన్ మహమ్మద్ )

89. తైమూరు జన్మస్థలమేది ? ( టాన్సోక్షియానా )

90. సయ్యద్ వంశ స్థాపకుడు ఎవరు ? సయ్యద్ వంశీయుల జాతి ఏది ? ( తైమూర్ ప్రతినిధి ఖిజీర్ ఖాన్ , అరబ్బు జాతి )

91. సయ్యద్ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1414 - 1451 )

92. సయ్యద్ వంశంలో చివరివాడు ఎవరు ? ( అల్లాఉద్దీన్ ఆలంషా )

## లోడీ వంశము ( క్రీ.శ. 1451 - 1526 )

93. లోడీ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1451 - 1526 )

94. లోడీ వంశ స్థాపకుడు ఎవరు ? ( బహలాల్ లోడి )

95. లోడీలు ఏ జాతీయులు ? ( ఆఫ్ఘనులు )

96. లోడీ వంశ రాజులు ఎవరు? ( బహలాల్ లోడీ, సికిందర్ లోడీ, ఇబ్రహీంలోడీ )

97. 'ఢిల్లీ సుల్తాన్‌ల పాలనాకాలంలో రూపొందిన క్రొంగొత్త వాస్తు శైలి ఏది ? ( ఇండో - ఇస్లామిక్ )

98. ఢిల్లీ సుల్తానత్ కడపటి చక్రవర్తి ఎవరు ? ( ఇబ్రహీంలోడి)

99. ఢిల్లీ సుల్తానుల పతనము ఏ యుద్ధముతో పూర్తి అయినది ? ఆ యుద్ధము ఎప్పుడు జరిగింది ? ( మొదటి పానిపట్టు యుద్ధం క్రీ.శ.1526 )

100. మొదటి పానిపట్టు యుద్ధంలో ఇబ్రహీంలోడీని ఓడించినదెవరు? ( బాబరు )

101. క్రీ.శ. 14,15, శతాబ్దాలలో భక్తిమార్గం ద్వారా హిందూ మతోద్ధరణకు కృషి చేసిన ఉద్యమమేది ? ( భక్తి ఉద్యమము )

102. రామానందుడు ఏ కాలంవాడు ? అతని జన్మస్థలం ఏది ? ( క్రీ.శ. 14వ శతాబ్దంవాడు, అలహాబాద్ )

103. మీరాబాయి, కబీరు ఎవరి శిష్యులు ? ( రామానందుడు )

104. మీరాబాయి ఎవరు ? ( రాఠోర్ వంశానికి చెందిన రాజవనిత )

105. వల్లభాచార్యుడు ఎప్పుడు ఎక్కడ జన్మించాడు ? ( క్రీ.శ. 1479లో వారణాసిలో )

106. వల్లభాచార్యుడు ప్రబోధించిన మతమేది ? ( శుద్ధాద్వైతము - కృష్ణ భక్తి )

107. బెంగాలులో కృష్ణ భక్తిని ప్రచారం చేసింది ఎవరు ? ( చైతన్యుడు )

108. చైతన్యుడు ఎప్పుడు ? ఎక్కడ జన్మించాడు ? ( క్రీ.శ. 1485లో బెంగాలులోని నాడియాలో )

109. క్రీ.శ. 15వ శతాబ్దంలో మహారాష్ట్ర భక్తి ఉద్యమ ప్రవక్త ఎవరు ? ( నామదేవుడు )

110. సిక్కు మత స్థాపకుడు ఎవరు ? (గురునానక్ )

111. గురునానక్ ఎపుడు, ఎక్కడ జన్మించినాడు ? ( క్రీ.శ. 1469లో పంజాబులోని 'తల్వెండీ'లో )

112. హిందీ, పారశీకం, టర్కీ, అరబ్బీ భాషల మిశ్రమ భాష ఏది ? ( ఉర్దూ)

113. ఉర్దూ భాషలో ఆదికవి ఎవరు ? ( అమీర్ ఖుస్రూ ( అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆస్థాన కవి )

114. మధుర దండయాత్ర సమయంలో మాలిక్ కాఫర్ ధ్వంసం చేసిన హిందూ దేవాలయం ఏది ?(రామేశ్వర దేవాలయం)

115. ఉత్తర హిందూదేశ దండయాత్రను నిర్వహించిన అల్లాఉద్దీన్ సేనానులు ఎవరు ? ( ఉల్లూఖాన్, నుస్రత్ ఖాన్, జఫర్ ఖాన్, అలఫ్‌ఖాన్ )

116. గుర్రముల మార్పిడి నిరోధించేందుకు గుర్రములపై ముద్రలు, అలైదర్వాజా ను నియమించిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? ( అల్లాఉద్దీన్‌ఖిల్జీ)

117. మహమ్మద్ బిన్ తుగ్లక్ వరంగల్లు పేరును ఏమని మార్చినాడు? ( సుల్తాన్‌పూర్ )

118. 'ఆగ్రా' నగరమును నిర్మించిన ఢిల్లీ సుల్తాన్ ఎవరు ? (సికిందర్ షా లోడీ )

119. వ్యవసాయాభివృద్ధికై మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఏర్పాటు చేసిన వ్యవసాయ శాఖపేరు ? ( దివాన్ ఇకోహి )

120. లోడీ వంశీయులలో సమర్ధవంతమైన గూఢచారి శాఖను ఏర్పాటు చేసినది ఎవరు ? ( సికిందర్ షా లోడీ)

121. ఢిల్లీ సుల్తానుల ప్రధానమంత్రి నేమంటారు ? ( వజీర్)

122. ఢిల్లీ సుల్తానుల విదేశాంగ మంత్రి నేమందురు ? ( దివాన్ - ఇ-రసాలత్ )

123. ఢిల్లీ సుల్తానుల సైనిక మంత్రి నేమంటారు ? ( దివాని అర్జి )

124. ఢిల్లీ సుల్తానుల సైనిక రాష్ట్రం పేరేమి ? ( ఇకా)

125. ఢిల్లీ సుల్తానుల కాలంలో 'జకత్' శిస్తు ఎవరి నుండి వసూలు చేసెడివారు? ( ముస్లింలనుండి )

126. ఢిల్లీ సుల్తానులు వసూలు చేసిన యుద్ధ దోపిడీ పన్నును ఏమంటారు ? ( ఖామ్స్)

127. ఢిల్లీ సుల్తానులు ముస్లిమేతర రైతుల మీద వేసిన పన్నునేమందురు ? ( ఖరజ్ )

128. 'చాచ్ నామా ' గ్రంధకర్త ఎవరు ?, చాచ్ నామా ఎవరి చరిత్రను తెల్పుతుంది ? ( మహమ్మద్ ఆలీబిన్‌బక్ , అరబ్బు దండయాత్ర )

129. తారీఖ్ - ఇ - సింధ గ్రంధాన్ని ఎవరు ఎప్పుడు రచించారు ? ( మీర్ మహమ్మద్ మసూమ్, క్రీ.శ.1600లో )

130. 'తబ్ కత్ - ఇ - నజీర్ అనే గ్రంథాన్ని ఎవరు రచించారు ? అది ఎవరి చరిత్రను తెల్పుతుంది ? ( మినహజ్ సిరాజ్, మహమ్మద్ ఘోరీ దండయాత్రలు)

## దక్షిణ భారతదేశ రాజ్యాలు

### (బి) యాదవులు

131. దక్షిణాపథమున కళ్యాణి చాళుక్య శిథిలాలపై వెలసిన మహారాష్ట్ర రాజ్యమేది? ( దేవగిరి యాదవ రాజ్యం )

132. దేవగిరి యాదవ వంశ మూలపురుషుడు ఎవరు ? ( దృడ ప్రహారుడు )

133. ధృఢ ప్రహారుని పాలనా కాలమేది ? ( క్రీ.శ 860 - 880)

134. దృఢ ప్రహారుని రాజధాని ఏది ? ( చంద్రాదిత్య పురం)

135. స్వతంత్ర యాదవ రాజ్యాన్ని స్థాపించినదెవరు ? ( ఐదవ భిల్లముడు )

136. కాకతీయ రుద్రుని వధించిన యాదవ రాజు ఎవరు? ( భిల్లముని కుమారుడు జైతుగి)

137. యాదవ రాజ్యము తెలంగాణా ప్రాంతంలోనికి విస్తరింప చేసిన యాదవరాజు ఎవరు ? ( జైతుగి )

138. యాదవ రాజులలో సుప్రసిద్దుడు ఎవరు ? ( జైతుగి కుమారుడైన సింఘణ)

139. సుప్రసిద్ధ రచయిత, విద్వాంసుడైన హేమాద్రి ఎవరి మంత్రి ? ( యాదవ మహదేవుడు )

140. క్రీ.శ. 1294లో యాదవ రాజ్యంపై దండెత్తి యాదవరాజైన రామచంద్ర దేవుని ఓడించిన ఢిల్లీ సుల్తాను ఎవరు? ( అల్లాఉద్దీన్ ఖిల్జీ)

141. అల్లాఉద్దీన్ సేనానియైన మాలిక్ కాఫర్ చే వధింపబడిన యాదవ రాజు ఎవరు ? (శంకర దేవుడు )

142. యాదవ రాజులలో చివరివాడు ఎవరు? ( హరపాలదేవుడు )

143. యాదవుల రాజధాని ఏది ? ( దేవగిరి)

144. యాదవుల మాతృభాష ఏది ? (మారాఠి)

145. యాదవ హరపాలదేవుని ఓడించి వధించిన ఢిల్లీ సుల్తాను ఎవరు ? (ముబారక్ షా ఖిల్జీ )

146. ప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త, భాస్కరాచార్యుని కుమారుడైన లక్ష్మీధరుడు ఎవరి ఆస్థాన విద్యాపతి ? ( జైతుగి )
147. మరాఠీ భాషలో ఆదికవి ఎవరు ? (ముకుందరాయుడు )
148. వివేక సింధు అను వేదాంత గ్రంథమును వ్రాసినదెవరు ? ( ముకుందరాయుడు )
149. మరాఠీ భాషలో మొదటి గ్రంథమేది ? (జ్ఞానేశ్వరీయము )
150. యాదవులు ఎవరి భక్తులు ? ( విష్ణువు )
151. యాదవుల కాలంనాటి మహారాష్ట్ర భక్తి ఉద్యమ ప్రవక్తలెవరు ? ( జ్ఞానదేవుడు, నామదేవుడు, జనాబామ్ )
152. 'సంగీత రత్నాకరము'ను రచించిన 'సారంగదేవుడు ' ఎవరి ఆస్థాన కవి? ( యాదవ సింఘణ)
153. యాదవ కృష్ణుని సేనాని, ' జల్హన' సంకలనం చేసిన సంస్కృత గ్రంథమేది? (సూక్తి ముక్తావళి )
154. సంస్కృత రచయితలలో మేటి , యాదవ మహదేవుని మంత్రి ' హేమాద్రి' రచించిన గ్రంథాలేవి ? (చతురభర్గ చింతామణి, దానవాక్యావళి )
155. యాదవుల రాజచిహ్నమేది ? ( గరుడుడు )

## హోయసాలులు

156. హోయసాలుల మూలపురుషుడు ఎవరు ? ( సాలుడు )
157. హోయసాలుల ప్రాభవమునకు పునాది వేసినవాడు ఎవరు ? ( భిత్తిదేవ విష్ణువర్ధనుడు )
158. హోయసాలులు ఏ ప్రాంత పాలకులు ? ( కర్ణాటక )
159. హోయసాలుల రాజధాని ఏది ? ( ద్వార సముద్రం ( హలిబేటు )
160. హోయసాల రాజులు పోషించిన భాషలు ఏవి ? ( సంస్కృతము, కన్నడము )
161. స్వతంత్ర హోయసాల రాజ్యస్థాపకుడెవరు ? ( రెండవ బల్లాలుడు )
162. 'బల్లాలకశకం' ను ఎవరు ప్రారంభించెను ? ( రెండవ బల్లాలుడు )
163. ' చోళ రాజ్య పున: వ్యవస్థాపకుడు' అని పేరు పొందిన హోయసాల రాజు ఎవరు? ( రెండవ నరసింహుడు )
164. హోయసాలుల రాజులలో గొప్పవాడెవరు? ( మూడవ బల్లాలుడు )
165. ద్వైత సిద్ధాంత ప్రవక్త మధ్వాచార్యులు ఎవరి కాలంవాడు ? ( హోయసాలులు )
166. కన్నడ భాషలో మొదటి నవల అయిన 'లీలావతి' ని వ్రాసింది ఎవరు ? ( నేమి చంద్రుడు )
167. ' అభినవపంప ' బిరుదాంకితుడైన ' 'నాగచంద్రుడు' వ్రాసిన గ్రంథమేది? ( జైన రామాయణము )
168. భిత్తిదేవ విష్ణువర్ధనుడు నిర్మించిన ఆలయం ఏది ? ( బేలూరులోని చెన్నకేశవాలయము)
169. ద్వార సముద్రం 'హోయలేశ్వర దేవాలయం' నిర్మించింది ' ఎవరు ? ( హోయసాల మొదటి నరసింహుడు)
170. హోయసాలుల కాలంనాటి సంస్కృత గ్రంథాలలో ముఖ్యమైనవి ఏవి ? ( ప్రస్థాన త్రయ భాష్యాలు )

## కాకతీయులు

171. కాకతీయులు ఎవరు ? ( క్రీ.శ. 1000 నుండి 1323 వరకు తెలుగునేలను పాలించిన ఆంధ్ర రాజులు )
172. కాకతీయులని పేరు ఏ దేవతను ఆరాధించుట వలన వచ్చినది ? (కాకతి )
173. కాకతీయుల జన్మస్థలమేది ? ( కాకతిపురము )
174. కాకతీయుల పాలనాకాలమేది ? ( క్రీ.శ. 1000 - 1323 )
175. కాకతి వంశానికి పునాదులు వేసిన వాడు ఎవరు ? ( గుండయ )
176. కాకతీయులు మొదట ఎవరి సామంత రాజులు ? ( తూర్పు చాళుక్యులు )
177. స్వతంత్ర కాకతీయ రాజ్యమును నిర్మించింది ఎవరు ? ( రెండవ ప్రోలరాజు )
178. కాకతీయుల మొదట రాజధాని ఏది ? ( హనుమకొండ )
179. కాకతీయుల మలి రాజధాని ఏది ? ( ఓరుగల్లు )
180. ప్రోలరాజు ఎవరి చేతిలో హతుడయ్యెను ? ( ఛందోలు రాజు )

181. తన తండ్రిని వధించిన వెలనాటి చోడులపై ప్రతీకారం తీర్చుకున్న కాకతీయ రాజు ఎవరు ? ( రుద్రదేవుడు లేక మొదటి ప్రతాపరుద్రుడు )

182. రుద్రదేవుడు రచించిన గ్రంథమేది ? ( నీతి సారము)

183. యాదవ రాజైన జైతుగిచే వధింపబడిన కాకతీయ రాజెవరు ? ( రుద్రదేవుడు )

184. యాదవులకు బంధీగా చిక్కిన కాకతీయ రాజు ఎవరు? ( గణపతి దేవుడు )

185 . కాకతీయ చక్రవర్తులలో అగ్రగణ్యుడు ఎవరు? ( గణపతిదేవుడు )

186. గణపతి దేవుడు ఎప్పుడు రాజ్యమునధిష్టించెను ? ( క్రీ.శ. 1209 లో )

187. హనుమకొండ నుంచి ఓరుగల్లుకు రాజధానిని మార్చిన కాకతీయరాజు ఎవరు? ( గణపతి దేవుడు )

188. గణపతి దేవుడుచే ఓడింపబడిన యాదవ రాజు ఎవరు? ( కృష్ణుడు )

189. గణపతి దేవుని పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1209 - 1262 )

190. గణపతి దేవుడు ఎప్పుడు మరణించెను ? ( క్రీ.శ. 1262 )

191. గణపతి దేవుని అనంతరం కాకతీయ రాజ్యసింహాసనము అదీష్టించిన దెవరు ? ( గణపతి దేవుని పెద్దకుమార్తె అయిన రుద్రమదేవి)

192. రుద్రమదేవిచే ఓడింపబడిన యాదవ రాజు ఎవరు. ( మహాదేవుడు )

193. రుద్రమదేవి కాలమున కాకతీయ రాజ్యమును సందర్శించిన వెనిస్ వర్తకుడు ఎవరు ? ( మార్కోపోలో)

194. రుద్రమదేవి తరువాత కాకతీయ సింహాసనమును అధిష్టించినది ఎవరు? ( ప్రతాపరుద్రుడు )

195. కాకతీయ చక్రవర్తులలో చివరివాడు ఎవరు? ( ప్రతాపరుద్రుడు )

196. ఒరుగల్లుపై ఏ సంవత్సరమున ముస్లింలు మొదటి దండయాత్ర చేసారు? ( క్రీ.శ. 1300 )

197. క్రీ.శ. 1308 లో కాకతీయ ప్రతాపరుద్రుని ఓడించిన అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాని ఎవరు? ( మాలిక్ కాఫర్ )

198. ప్రతాపరుద్రుని ఓడించి బంధీగా పట్టుకొని ఢిల్లీకి తీసుకొనిపోయిన ముస్లిం సేనాని ఎవరు? ( జునాఖాన్ )

199. కాకతీయ ప్రతాపరుద్రుడు ఏ నదీ తీరంలో ఆత్మహత్య చేసుకున్నాడు? (నర్మదా )

200. కాకతీయుల ముఖ్య రేవు పట్టణము ఏది ? (మోటుపల్లి )

201. కాకతీయులు ఆదరించిన మతమేది ? ( వీరశైవ మతము )

202. కాకతీయులు పోషించిన భాష ఏది? ( సంస్కృతము )

203. ప్రతాపరుద్రుని 'యశోభూషణము' అను అలంకార శాస్త్రమును వ్రాసినదెవరు? ( విద్యానాధుడు )

204. జాయపసేనాని వ్రాసిన గ్రంథమేది ? ( నృత్త రత్నావళి)

205. పాల్కురికి సోమనాధుడు రచించిన గ్రంథాలేవి ? ( బసవపురాణము, పండితారాధ్య చరిత్రము)

206. కాకతీయుల కాలంలోని సుప్రసిద్ధ తెలుగు కవి ఎవరు ? ( తిక్కన సోమయాజి )

207. తిక్కన సోమయాజి రచించిన గ్రంథాలేవి ? ( ఆంధ్ర మహా భారతము, ఉత్తర రామాయణము )

208. తిక్కనకు గల బిరుదులేవి ? ( కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు )

209. 'రంగనాథ రామాయణము ' రచించినది ఎవరు ? ( గోనబుద్దారెడ్డి)

210. 'మార్కండేయ పురాణము'ను రచించినది ఎవరు ? (మారన )

## పాండ్యులు

211. క్రీ.శ. 13వ శతాబ్దంలో పాండ్యుల ప్రతిష్టను పునరుద్ధరించినవాడు ఎవరు? ( కడుంగన్ )

121. పాండ్య రాజులలో అగ్రగణ్యుడు ఎవరు? ( జాటవర్మ కులశేఖరుడు )

213. పాండ్య రాజ్యం ఏది? (నేటితమిళనాడులోని తిరుచెనాపల్లి, తంజావూరు, సేలం, కోయంబత్తూరు జిల్లా ప్రాంతం )

214. పాండ్యుల రాజధాని ఏది ? ( మధురై )

215. పాండ్యుల ముఖ్య రేవు పట్టణం ఏది ? ( కమాల్ )

216. కులశేఖర పాండ్యుని కాలంలో పాండ్య రాజ్యమును సందర్శించిన వెనిస్ యాత్రికుడుఎవరు ? ( మార్కోపోలో)

217. సింహళరాజును ఓడించి భుద్ధ ధాతువుని తెచ్చిన పాండ్య రాజెవరు? ( కుల శేఖర పాండ్యుడు )
218. సాండగ్య రాజ్యముపై దేడెత్తిన ముస్లిం సేనాని ఎవరు ? (మాలిక్‌కాఫర్ )
219. పాండ్యులు ముస్లింలలో అవలంభించిన యుద్ధం ఏది ? ( గెరిల్లా యుద్ధపద్దతి )
220. పాండ్య రాజ్యమును ఢిల్లీ సుల్తానత్ సామ్రాజ్యంలో కలిపినది ఎవరు? (మహమ్మద్ బిన్ తుగ్లక్ )

## దక్షిణ భారతదేశంలో స్వాతంత్రోద్యమాలు

### మునుసూరి నాయకులు

221. కాకతీయుల అనంతరం వరంగల్లు ప్రాంతంలో హిందూ స్వాతంత్రోద్యమమునకు నాయకత్వం వహించినది ఎవరు ?
( బెండపూడి అన్నమంత్రి ,రేచర్ల సింగమ నాయకుడు, మునుసూరి ప్రోలయ నాయకుడు )
222. స్వతంత్ర మునుసూరి నాయక రాజ్య స్థాపకుడు ఎవరు ? (కాపయనాయకుడు)
223. కాపయనాయకుని రాజధాని ఏది ? ( ఓరుగల్లు )
224. 'ఆంధ్ర సురత్రాణ' బిరుదు పొందినది ఎవరు ? ( కాపయనాయకుడు )
225. కాపయనాయకుని కుమారుడైన అనపోతానాయకుని వధించిన బహమనీ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ షా )
226. కాపయనాయకుని ఓడించి ఓరుగల్లును జయించినదెవరు ? (రేచర్ల అనపోతానాయకుడు)

### రేచర్ల పద్మ నాయకులు

227. పద్మనాయకులకు మరొక పేరేమి ? (వెలయ)
228. రేచర్ల పద్మనాయక రాజ్యం స్థాపించినది ఎవరు ? ( సింగమ నాయకుడు )
229. రేచర్ల పద్మనాయకులలో అగ్రగణ్యుడు ఎవరు? ( అనపోతానాయకుడు )
230. రేచర్ల పద్మనాయకుల రాజధాని ఏది ? ( రాచకొండ)
231. దేవర కొండ దుర్గమును నిర్మించినది ఎవరు? ( అనపోతా నాయకుడు )
232. రేచర్ల పద్మనాయకులలో చివరివాడు ఎవరు ? ( రెండవ సింగమనాయకుడు )
233. ఓరుగల్లు శాశ్వతంగా ఎవరికాలంలో బహమనీల వశమయినది ? ( సింగమనాయకుడు)

### రెడ్డి రాజులు

234. రెడ్డి రాజులు ఏ వంశీయులు ? ( దేసటి )
235. స్వతంత్ర రెడ్డి రాజ్యమును స్థాపించినది ఎవరు ? ( ప్రోలయవేమారెడ్డి )
236. ప్రోలయవేమారెడ్డి రాజధాని ఏది ? ( అద్దంకి )
237. ప్రోలయవేమారెడ్డి పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1325 - 1353 )
238. ' ధర్మప్రతిష్టాపన గురు' అను బిరుదు పొందిన రెడ్డి రాజు ఎవరు? ( ప్రోలయవేమారెడ్డి)
239. రెడ్డిరాజుల రాజధానిని ' అద్దంకి' నుండి 'కొండవీటి'కి మార్చిన రెడ్డి రాజు ఎవరు ? (అనపోతారెడ్డి )
240. రెడ్డిరాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? ( అనవేమారెడ్డి)
241. 'కర్పూర వసంతరాయలు' గా పేరుపొందిన రెడ్డిరాజు ఎవరు? ( కుమారగిరి రెడ్డి )
242. రెడ్డిరాజులలో అంతర్యుద్ధము ఏ రాజు కాలములో ప్రారంభమైంది ( కుమరగిరి రెడ్డి కాలంలో )
243. కుమారగిరిరెడ్డి కాలములో రెడ్డి రాజ్యంపై దాడి చేసిన విజయనగర చక్రవర్తి ఎవరు ? (రెండవ హరి హరరాయలు)
244. రాజమండ్రి రెడ్డి రాజ్యస్థాపకుడు ఎవరు ? ( కాటయ వేమారెడ్డి )
245. ' సర్వజ్ఞ చక్రవర్తి ' ఎవరు ? ( పెద కోమటి వేమారెడ్డి )
246. కొండవీటి రెడ్డి రాజులలో చివరి వాడు ఎవరు? (వీర భద్రారెడ్డి )
247. ఆంధ్ర మహాభారతాన్ని పూర్తి చేసిన ఎర్రాప్రగ్గడ ఎవరి ఆస్థానకవి ? ( ప్రోలయ వేమారెడ్డి )
248. 'ఆంధ్రమహాభాగవతమున ' ను రచించింది ఎవరు ? (బమ్మెర పోతన)

249. కుమార గిరిరెడ్డి వ్రాసిన నాట్య శాస్త్ర గ్రంథమేది ? ( వసంత రాజీయము )
250. పెదకోమటి వేమారెడ్డి రచించిన గ్రంథాలేవి ? ( సాహిత్య చింతామణి, సంగీత చింతామణి, శృంగార దీపిక)
251. శ్రీనాధ కవి సార్వభౌముడు ఎవరి ఆస్థానకవి ? (పెదకోమటి వేమారెడ్డి )
252. శ్రీనాధుడు రచించిన గ్రంథాలేవి ? ( శృంగార నైషధం, హర విలాసము, కాశీఖండం, పల్నాటి చరిత్రం)
253. శ్రీనాధుడు ఓడించిన విజయనగర ఆస్థాన పండితుడు ఎవరు? ( గౌడ డిండిమ భట్టు)

## 13. విజయనగర బహమనీ రాజ్యాలు

### (బి) విజయనగర రాజ్యము

1. విజయనగర సామ్రాజ్య స్థాపన ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1336 )
2. విజయనగర రాజ్య స్థాపకులు ఎవరు ? ( హరిహరరాయలు, బుక్కరాయలు )
3. విజయనగర సామ్రాజ్య స్థాపనా ప్రేరకులు ఎవరు? ( విద్యారణ్య స్వామి )
4. విజయనగర చరిత్ర వ్రాసిన దెవరు ? ( రాబర్టు సీవెల్)
5. విజయనగర సామ్రాజ్య పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1336 - 1680 )
6. విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాజవంశములేవి ?
( 1. సంగమ వంశము క్రీ.శ. 1336 - 1485, 2. సాళువ వంశము క్రీ.శ.1485 - 1505 3.తుళువ వంశము క్రీ.శ. 1505 - 1576 4. అరవీటి వంశము క్రీ.శ. 1570 - 1680 )

### సంగమ వంశము

7. సంగమ వంశస్థాపకులు ఎవరు? ( హరిహర రాయలు, బుక్కరాయలు )
8. హరిహర, బుక్క రాయల తండ్రి ఎవరు? ( సంగముడు)
9. విజయనగర రాజ్యమును పాలించిన మొదటి రాజు ఎవరు ? ( మొదటి హరి హర రాయలు )
10. బుక్కరాయల కాలంలో జరిగిన ముఖ్య సంఘటన ఏమి ? ( మధురా విజయము )
11. కంపరాయల మధుర జైత్రయాత్రను ఇతివృత్తముగా స్వీకరించి అతని భార్య గంగాదేవి రచించిన గ్రంథమేది? ( మధురా విజయము )
12. బహమనీ - విజయనగర రాజ్యాల మధ్య దీర్ఘకాల పోరుకు ఏ విజయనగర రాజు కాలంలో నాంది పలికింది ? ( బుక్కరాయలు )
13. బుక్కరాయల ఆస్థానంలోని సుప్రసిద్ధ తెలుగు కవి ఎవరు? ( నాచన సోముడు )
14. సంగమ వంశ రాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? ( రెండవ దేవరాయలు (లేక ) ప్రౌఢ దేవరాయలు)
15. ప్రౌఢదేవరాయల సేనాని ఎవరు? (లక్కణ్ణ)
16. ప్రౌఢదేవరాయలు కాలమున విజయనగరమును సందర్శించిన ఇటలీ యాత్రికుడు ఎవరు ? ( నికోలోకాంటి )
17. ప్రౌఢదేవరాయలు కాలమున విజయనగరమును సందర్శించిన పారశీక రాయబారి ఎవరు ? ( అబ్దుల్ రజాక్ )
18. ప్రౌఢదేవరాయలు ఆస్థానంలోని సుప్రసిద్ధ కన్నడ కవి, వీరశైవ రచయిత ఎవరు ? ( చామరసు )
19. ప్రౌఢ దేవరాయలు రచించిన సంస్కృత గ్రంథాలేవి ? ( మహానాటక సుధానిధివృత్తి)
20. శ్రీనాధ కవి సార్వభౌమునకు కనకాభిషేకం చేసిన విజయనగర రాజు ఎవరు ? ( ప్రౌఢ దేవరాయలు )
21. సంగమ వంశంలో చివరివాడు ఎవరు? ( ప్రౌఢ దేవరాయలు )
22. మొదటిసారిగా తురుష్కులను కొలువులో చేర్చుకొనిన విజయనగర రాజు ఎవరు ? ( ప్రౌఢ దేవరాయలు)
23. విజయనగరములోని ‘ విఠలస్వామి ఆలయాన్ని’ నిర్మించింది ఎవరు ? ( ప్రౌఢ దేవరాయలు)
24. ప్రౌఢదేవరాయల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1422 - 1446 )

## సాళువవంశము

25. సంగం వంశం తరువాత విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాజవంశం ఏది ? ( సాళువ వంశం)
26. సాళువ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ.1485 - 1505 )
27. సంగమ వంశాన్ని తుదముట్టించి విజయనగరాన్ని స్వాధీనం చేసుకున్న విజయనగర రాజుల సేనాని ఎవరు? ( సాళువ నరసింహరాజు )
28. సాళువ నరసింహరాయలు ఆస్థానంలోని సంస్కృత పండితుడు ఎవరు ? ( రాజనాథ డిండిముడు )
29. 'సాళువాభ్యుదయము' ను రచించింది ఎవరు ? ( రాజనాథ డిండిముడు )
30. సాళువ నరసింహరాయలు ఆస్థానంలోని తెలుగు కవి ఎవరు? ( పిల్లలమర్రి పినవీరభద్రుడు)
31. పిల్లలమర్రి పినవీరభద్రుడు తెలుగులో వ్రాసిన గ్రంథములు ఏవి ? ( జైమిని భారతం, శృంగార శాకుంతలము )
32. సాళువ వంశంలో చివరివాడు ఎవరు ?( ఇమ్మడి నరసింహరాయలు )

## తుళువ వంశం

33. సాళువ వంశ పాలకుడైన ఇమ్మడి నరసింహరాయలను వధించి, విజయ నగర సింహాసనం ఆక్రమించి తుళువ వంశమును స్థాపించినది ఎవరు? ( తుళువవీర నరసింహరాయలు)
34. తుళువ వంశ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1505 - 1576 )
35. తుళువ వంశంలోనే కాక విజయనగర రాజులలో కూడ అగ్రగణ్యుడు ఎవరు ? ( శ్రీ కృష్ణ దేవరాయలు)
36. శ్రీ కృష్ణ దేవరాయల పాలనా కాలమేది ? ( 1509 - 1529)
37. శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానమును సందర్శించిన పోర్చుగీసు వర్తకుడు ఎవరు? ( డామింగోపేస్ )
38. శ్రీ కృష్ణ దేవరాయల ఆస్థానం పేరేమి ? (భువన విజయము)
39. శ్రీ కృష్ణ దేవరాయల మంత్రి ఎవరు? ( తిమ్మరుసు )
40 . శ్రీకృష్ణ దేవరాయల ఆస్థాన కవుల పేరేమి ? ( అష్ట దిగ్గజములు )
41. ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన రచించిన ప్రబంధమేది ? ( మనుచరిత్ర )
42. నంది తిమ్మన ఎవరి ఆస్థాన కవి ? ఆయన వ్రాసిన గ్రంథమేది ?( శ్రీకృష్ణ దేవరాయలు, పారిజాతాపహరణము)
43. సంస్కృతమున ' సంగీత సూర్యోదయము'ను రచించిన లక్ష్మీ నారాయణ కవి ఎవరి ఆస్థానంలోని వాడు ? ( శ్రీకృష్ణ దేవరాయలు )
44. శ్రీకృష్ణ దేవరాయలు వ్రాసిన తెలుగు ప్రబంధమేది ? ( అముక్తమాల్యద)
45. శ్రీకృష్ణ దేవరాయలు తన తల్లి పేరుతో నిర్మించిన నగరం పేరేమి ? ( నాగలాపురం )
46. విజయనగరంలో శ్రీకృష్ణ దేవరాయలు నిర్మించిన దేవాలయాలు ఏవి ?
( కృష్ణ స్వామి దేవాలయం, హజారా రామాలయము)
47. శ్రీ కష్ణ దేవరాయల బిరుదులేవి ? ( ఆంధ్రభోజ, సాహితీ సమరాంగణ యవన రాజ్యస్థాపనాచార్య )
48. 'పాండురంగ మహాత్మ్యం'ను రచించిన తెనాలి రామకృష్ణుడు ఎవరి ఆస్థానములోని వాడు ? (శ్రీకృష్ణ దేవరాయలు)
49. శ్రీకృష్ణదేవరాయలు చేతిలో దివానీ, కోవిలకొండ యుద్ధాలలో ఓడిపోయిన బీదర్, బీజపూర్, సుల్తానులు ఎవరు?
( మహమ్మద్ యూసఫ్, ఆదిల్ షా )
50. రాయచూర్ యుద్ధంలో శ్రీకృష్ణ దేవరాయల చేతిలో ఓడిన బీజపూర్ సుల్తాను ఎవరు? ( ఇస్మాయిల్ ఆదిల్ షా )
51. శ్రీకృష్ణ దేవరాయల తూర్పు దిగ్విజయ యాత్రకు చిహ్నములుగా విజయస్థంభములు గల ప్రదేశములేవి ?
( సింహాచలము , పొట్నూరు )
52. శ్రీకృష్ణ దేవరాయలుతో సంధి చేసికొని తన కుమార్తె అయిన అన్నపూర్ణా దేవిని అతనికిచ్చి వివాహం చేసిన గజపతి రాజు ఎవరు ? (ప్రతాపరుద్ర గజపతి )
53. శ్రీకృష్ణ దేవరాయలు తరువాత విజయనగర సింహాసనము అధిష్టించింది ఎవరు ? ( అచ్యుత దేవరాయలు )
54. మొగలు సామ్రాజ్య స్థాపకుడైన బాబరుకు సమకాలికుడైన విజయనగర రాజు ఎవరు ? ( శ్రీకృష్ణ దేవరాయలు )

55. శ్రీ కృష్ణ దేవరాయలు ఎప్పుడు మరణించాడు ? ( క్రీ.శ. 1529 లో )

56. దక్షిణ దేశమున విజయనగర సామ్రాజ్యానికి చరమ గీతం పాడిన యుద్ధము ఏది ? ( తళ్ళికోట యుద్ధం ( తేదా ) రాక్షస - తంగడి యుద్ధం)

57. తళ్ళికోట యుద్ధం ఎప్పుడు జరిగింది ? ఎవరెవరి మధ్య జరిగింది ?
(క్రీ.శ. 1565లో రామరాయలు నాయకత్వంలోని విజయనగర సైన్యానికి, బీజాపూర్ సుల్తాను ఆలీ ఆదిల్ షా నాయకత్వంలోని బహమనీ రాజ్యకూటమికి)

58. తుళువ వంశంలో చివరివాడు ఎవరు ? తుళువ వంశం ఎప్పుడు అంతరించింది? **( సదాశివ రాయలు, క్రీ.శ. 1576 లో )**

### ఆరవీటి వంశం

59. ఆరవీటి వంశ స్థాపకుడు ఎవరు ? ( తిరుమల రాయలు )

60. ఆరవీటి వంశీయుల రాజధానులు ఏవి ? (పెనుగొండ, నెల్లూరు )

61. ఆరవీటి వంశీయుల పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1570 - 1680 )

62. 'వసు చరిత్రను రచించిన రామరాజ భూషణుడు ఎవరి ఆస్థాన కవి ? (తిరమలరాయలు )

63. ఆరవీటి వంశస్థులలో గొప్పవాడు ఎవరు ? ( రెండవ వేంకటపతి రాయలు )

64. మొగలు చక్రవర్తియైన అక్బరు పాదుషా సార్వబౌమాధికారాన్ని నిరాకరించిన ఆరవీటి వంశ ప్రభువు ఎవరు ? ( రెండవ వేంకటపతిరాయలు )

65. 'రెండవ ఆంధ్రభోజుడు' అని ప్రసిద్ధి చెందిన విజయనగర రాజు ఎవరు? (రెండవ వేంకటపతి రాయలు )

66. రెండవ వేంకటపతి రాయల ఆస్థానంలోని సుప్రసిద్ధ తెలుగు కవులెవరు? (తెనాలి రామకృష్ణుడు , పింగళి సూరన )

67. ఆరవీటి వంశంలో చివరి పాలకుడు ఎవరు? అతడు ఎప్పుడు మరణించాడు ? (మూడవ శ్రీరంగరాయలు , క్రీ.శ. 1680 లో )

## నాయక రాజ్యాలు

### తంజావూరు నాయకులు

68. తంజావూరు నాయక రాజులలో మొదటివాడు ఎవరు ? ( చెవ్వప్ప నాయకుడు క్రీ.శ. 1535 - 1561 )

69. తంజావూరు చవ్వప్ప నాయక రాజు మంత్రి ఎవరు ? ( గోవింద దీక్షితులు )

70. తంజావూరు నాయక రాజులలో గొప్పవాడు ఎవరు? (రఘునాధరాయలు )

71. పోర్చుగీసువారి దుండగాలను అరికట్టిన తంజావూరు నాయకరాజు ఎవరు? (రఘునాధ రాయలు )

72. రఘునాధరాయలు ఆస్థానంలోని వైదిక విద్వాంసులు ఎవరు ? ( గోవింద దీక్షితులు , యజ్ఞనారాయణ దీక్షితులు )

73. రఘునాధరాయలు ఆస్థానంలోని తెలుగు కవి ఎవరు ? ( చేమకూర వేంకటకవి )

74. రఘునాధరాయలు ఆస్థానంలోని కవయిత్రులు ఎవరు ? ( రామభద్రాంబ, మధురవాణి )

75. రఘునాధరాయలు రచించిన గ్రంథాలు ఏవి ? ( సంగీత సుధ, వాల్మీకి చరిత్ర, పారిజాతాపహరణ నాటకం )

76. తెలుగులో ' యక్షగానములు ' ఎవరి కాలములో ప్రారంభమైనవి ? ( విజయరాఘవుడు క్రీ.శ. 1633 - 1673 )

77. తంజావూరు నాయకరాజులలో చివరివాడు ఎవరు ? ( చంగమలదాసు క్రీ.శ. 1673 - 1676 )

78. చంగమలదాసును తొలగించి తంజావూరు సింహాసనము నాక్రమించిన బీజపూర్ సేనాని ఎవరు? ( వెంకోజి )

### మధుర నాయకులు

79. మధుర నాయక రాజ్యాన్ని స్థాపించినదెవరు? ( విశ్వనాథ నాయకుడు )

80. విజయనగర రాజ్యాన్ని ధిక్కరించి మధుర రాజ్య స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది ఎవరు ?
( ముత్తు వీరప్ప నాయకుడు క్రీ.శ.1602 - 1623)

81. మధుర నాయక రాజులలో అగ్రగణ్యుడు ఎవరు ? (తిరుమలనాయకుడు)

82. తిరుచురాపల్లి నుండి రాజధానిని మధురకు మార్చినది ఎవరు? ( తిరమల నాయకుడు )

83. తిరుమల నాయకుని ఆస్థానంలోని కవులు ఎవరు ? ( నీలకంఠ దీక్షితులు , కామేశ్వరకవి )

84. నీలకంఠదీక్షితులు వ్రాసిన కావ్యాలు ఏవి ? ( శివలీలా వర్ణనము, నీలకంఠ విజయము )

85. రెండవ చొక్కనాధుని అనంతరం మధురను పాలించిన అతని భార్య ఎవరు? ( మీనాక్షి )

86. సత్యభామా స్వాంతన కర్త ఎవరు ? ( కామేశ్వరకవి )

87. రెండవ వేంకటపతినాయకుడు ముత్తువీరప్పనాయకుని ఏ యుద్ధంలో ఓడించెను ? ( పళ్ళంకోట యుద్ధంలో )

88. మీనాక్షీ దేవిని మోసగించి మధురను ఆక్రమించిన కర్ణాటక నవాబు ఎవరు? ( చందాసాహెబ్ )

89. మధుర నాయక రాజులలో చివరివాడు ఎవరు ? ( రెండవ చొక్కనాధుడు క్రీ.శ.1689 - 1739 )

90. మైసూరునాయక రాజ్య స్థాపకుడు ఎవరు? (చామరాజు) (క్రీ.శ.1617-1637)

## మైసూరు నాయకులు

91. మైసూరునాయక రాజులలో సుప్రసిద్ధుడు ఎవరు ? ( చిక్క దేవరాయలు)

92. చిక్క దేవరాయల రాజధాని ఏది? ( శ్రీరంగపట్టణం )

93. ఆధునిక మైసూరు రాష్ట్ర నిర్మాత ఎవరు ? ( ( చిక్క దేవరాయలు )

94. తెలుగు వచన భారత కర్తఐన కళువెవీరరాజు ఎవరి ఆస్థానంలోని వాడు? ( చిక్క దేవరాయలు )

95. క్రీ.శ. 1761లో మైసూరు రాజ్యాన్ని ఆక్రమించిన సేనాని ఎవరు ? (హైదర్ ఆలీ )

## (బి) బహమనీ రాజ్యాలు

96. బహమనీ రాజ్యం ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ. 1347 లో )

97. బహమనీ రాజ్యస్థాపకుడు ఎవరు? ( హసన్ గంగుబహమని)

98. హసన్‌గంగు బహమని ఏ పేరుతో సింహాసనము నధిష్టించెను?
(అబుల్ ముజఫర్ అల్లాఉద్దీన్‌మహమ్మద్ షా బహమిని )

99. బహమిన్ షా రాజధాని ఏది ? (గుల్బర్గా)

100. అల్లాఉద్దీన్ బహమన్ షా రాజ్యస్థాపనలో సహాయము చేసినది ఎవరు? ( కాపయనాయకుడు )

111. తెలంగాణా ప్రాంతాన్ని బహమనీ రాజ్యంలో విలీనం చేసిన బహమనీ సుల్తాను ఎవరు? ( రెండవ అహమ్మద్ షా )

112. రెండవ అరిస్టాటిల్ అని పేరుపొందిన బహమనీ సుల్తాన్‌ఎవరు ? ( రెండవ అహమ్మద్ షా )

113. 'ప్రాచ్యదేశపు నీరో' అని దూషింపబడిన బహమనీ సుల్తాన్ ఎవరు ? (హుమయూన్ )

114. బహమనీ రాజధానిని ' గుల్బర్గా' నుండి ' బీదర్' కు మార్చిన బహమనీ సుల్తాన్ ఎవరు ? ( రెండవ అహమ్మద్ షా)

115. బహమనీ సుల్తానులలో గొప్పవాడెవరు ? ( మూడవ మహమ్మద్ షా)

116. మూడవ మహమ్మద్ షా రాజ్యవైభవానికి కారకుడు ఎవరు ? ( అతని మంత్రి గవాన్ )

117. మహమ్మద్ గవాన్ ఏ దేశస్తుడు ? ( పారశీకము )

118. పంటపొలములను సర్వే చేయించి పంటను బట్టి శిస్తు నిర్ణయ విధానాన్ని ప్రవేశపెట్టిన బహమనీ సుల్తాన్ మూడవ మహమ్మద్ షా ప్రధాన మంత్రి ఎవరు ? ( గవాన్ )

119. బహమనీ రాజ్యపాలకులలో చివరివాడు ఎవరు? ( కాలీముల్లా)

120. పారశీక వాస్తు శిల్ప కళా రీతులు దక్షిణ ఇండియాలో వ్యాపించుటకు కారకులైన సుల్తానులు ఎవరు ? (బహమనీ సుల్తానులు )

121. బహమనీ రాజ్యం విచ్ఛిన్నమై ఏర్పడిన ఐదు ముస్లిం రాజ్యాలు ఏవి ?
( బీదర్, బీరార్, బీజాపూర్, అహమ్మద్ నగర్ , గోల్కొండ )

122. బీరార్‌లో ఇమ్మద్ షాహీ వంశాన్ని స్థాపించిన వాడు ఎవరు? ( ఫతుల్లా )

123. బీరార్ రాజధాని ఏది ? ( ఎలిచ్‌పూర్ )

124. రాక్షసి - తంగడి యుద్ధంలో బీరార్ ఆటస్థలము వహించుటకు కారకుడు? ( తుఫాల్ ఖాన్ )
125. బీదర్‌ను పాలించిన బరీద్‌షాహి వంశ స్థాపకుడు ఎవరు ? ( ఖాసిం బరీద్ )
126. దక్కన్ గుంట నక్క అని ఎవరినందురు ? ( బీదర్ సుల్తాన్ అమీర్ ఆలీ )
127. అహమ్మద్ నగర్‌ను పాలించిన నిజాంషాహీ వంశ స్థాపకుడు ఎవరు ? ( మాలిక్ అహమ్మద్ )
128. మాలిక్ అహమ్మద్ నిర్మించిన నగరము ఏది ? ( అహమ్మద్ నగరము)
129. బహమనీ రాజ్యంనుండి అహమ్మద్‌నగర్ ఎప్పుడు విడిపోయింది ? ( క్రీ.శ. 1490 )
130. బీరార్ అహమ్మద్‌నగర్‌లో ఎప్పుడు విలీనం చేయబడింది ? ( కీ.శ. 1574లో )
131. బీజపూర్‌ను పాలించిన అదిల్ షాహీ వంశ స్థాపకుడు ఎవరు ? ( యూసఫ్ ఆదిల్ షా )
132. బీజపూర్ బహమనీ రాజ్యం నుండి ఎప్పుడు విడిపోయింది ? ( క్రీ.శ. 1490 )
133. బీదర్ బీజపూర్‌లో ఎప్పుడు విలీనమైంది ? ( క్రీ.శ. 1619 లో )
134. బీదర్‌ను బీజపూర్‌లో విలీనం చేసింది ఎవరు ? ( రెండవ ఇబ్రహీం ఆదిల్ షా )
135. గోల్కోండను పాలించిన కుతుబ్‌షాహి వంశ స్థాపకుడు ఎవరు ? ( కులీకుతుబ్ షా)
136. బహమనీ రాజ్యంనుండి గోల్కోండ ఎప్పుడు విడిపోయింది ? ( క్రీ.శ. 1512 )
137. మొగలు చక్రవర్తులు దక్షిణాపథముపై అడగుపెట్టేనాటికి దక్షిణాపథములో మిగిలిన ముస్లిం రాజ్యాలేవి?
( అహమ్మద్‌నగర్, బీజపూర్, గోల్కొండ )
138. అహమ్మద్‌నగర్‌ను మొగలు సామ్రాజ్యంలో విలీనం చేసినది ఎవరు.? ( షాజహాన్ కీ.శ. 1631 లో )
139. గోల్కోండ, బీజపూర్‌లను మొగలు సామ్రాజ్యంలో విలీనం చేసిన చక్రవర్తి ఎవరు ? ( ఔరంగజేబు )
140. బీరార్ ఎవరి కాలంలో మొగలు సామ్రాజ్యంలో విలీనమైంది ? ( అక్బర్ )
141. 'బర్హాన్ ఇమసర్ ' అను గ్రంథమును రచించిన ముస్లిం చరిత్రకారుడు , రెండవ బుర్హాన్ షా ఆస్థాన పండితుడు ఎవరు?
(-తబ-తబ)
142. అక్బరుతో వీరోచితముగా పోరాడి, ఓడిన అహమ్మద్ నగర్ పాలకురాలు ఎవరు ? ( చాంద్‌బీబీ)
143. చాంద్‌బీబీ ఎవరి భార్య ? ( ఆలీ ఆదిల్ షా )
144. ' చాంద్ బీబీ ' మరణానంతరం అహమ్మద్‌నగర చరిత్రలో ప్రముఖ పాత్రవహించినది ఎవరు? (మాలిక్ అంబర్ )
145. అహ్మద్ నగర చరిత్రలో ప్రముఖుడైన మంత్రి ఎవరు? ( మాలిక్ అంబర్)
146. అహమ్మద్‌నగర్‌ను పాలించిన నిజాంషాహీ వంశంలో చివరివాడు ఎవరు? (రెండవ మూర్తజా)
147. శివాజీ సమకాలికుడైన బీజపూర్ సుల్తాన్ ఎవరు ? (మహమ్మద్ ఆదిల్ షా )
148. విజయనగర రామరాయలుతో మైత్రి కొనసాగించి పరమత సహనం ప్రదర్శించి, తన రాజ్యాన్ని, కాపాడుకున్న బీజపూర్ సుల్తాన్ ఎవరు ? ( ఇబ్రహిం ఆదిల్ షా)
149. బీజపూర్‌లోని మహమ్మద్ ఆదిల్‌షా సమాధి పేరేమి ? ( జోల్‌గుంభజ్)
150. బీజపూర్‌వంశ రాజులలో చివరి వాడు ఎవరు ?ఎప్పుడు మరణించాడు? ( సికిందర్ షా, క్రీ.శ.1700 )
151. హైదరాబాద్‌ను నిర్మించిన గోల్కోండ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ కులీకుతుబ్ షా క్రీ.శ. 1580 - 1612 )
152. అనేక మంది తెలుగు కవులను పోషించి 'మల్కిభరాం' అని పేరుపొందిన గోల్కోండ సుల్తాను ఎవరు ?
( ఇబ్రహీం కుతుబ్ షా క్రీ.శ. 1550 - 1580 )
153. చార్మినార్‌ను కట్టించిన గోల్కోండ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ కులీకుతుబ్ షా క్రీ.శ . 1593. )
154. గోల్కొండ మొగలు సామ్రాజ్యంలో ఎప్పుడు విలీనమైంది ? ( క్రీ.శ. 1687లో )
155. గోల్కోండను పాలించిన కుతుబ్ షాహి వంశంలో చివరివాడు ఎవరు ? (అబ్దుల్ హసన్ క్రీ.శ. 1672 - 1687 )
156. అబ్దుల్ హసన్ మంత్రులెవరు ? ( అక్కన్న, మాదన్న )
157. శివాజీ సమకాలికుడైన గోల్కొండ నవాబుఎవరు? ( అబ్దుల్ హసన్ )
158. భద్రాచల రామదాసును బంధించిన తానీషా ఎవరు ? ( అబ్దుల్ హసన్ )

159. గోల్కొండ రాజ్య రాజధానిని గోల్కొండ నుండి హైదరాబాద్ కు మార్చిన గోల్కొండ సుల్తాను ఎవరు ? ( మహమ్మద్ కులీకుతుబ్ షా)

160. ఔరంగజేబు తానీషాను ఏకోటలో బంధించెను ?( దౌలతాబాద్ )

## 14. మొగలు యుగం (క్రీ.శ. 1526 - 1707)

1. మొగలు సామ్రాజ్య స్థాపకుడెవరు ? ( బాబరు )
2. మొగలు సామ్రాజ్యం ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ. 1526 లో )
3. ఏ యుద్ధము మొగల్ సామ్రాజ్య స్థాపనకు దోహదము చేసినది ? ( మొదటి పానిపట్టు యుద్ధము)
4. బాబరునకు విజయ పరంపరలను సాధించిపెట్టిన సైన్య విభాగమేది? ( ఫిరంగి దళము )
5. మొదటి పానిపట్టు యుద్ధము ఎవరెవరికి ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1526 లో బాబరు - ఇబ్రహీంలోడీకి )
6. బాబరు పూర్తి పేరేమి ? ( జహీరుద్దీన్ మహమ్మద్ బాబరు )
7. బాబరు ఏ తెగకు చెందినవాడు ? ( టర్కీ జాతికి చెందిన 'చగ్‌కాషి' తెగకు )
8. బాబరు టర్కీభాషలో రచించిన స్వీయ చరిత్ర పేరేమి ? ( తుజక్ - ఇ-బాబరీ)
9. కాల్వహ యుద్ధం ఎవరెవరికి, ఎప్పుడు జరిగింది ? విజేత ఎవరు?
( క్రీ.శ. 1527 మార్చి 17న బాబరు, రాణా సంగ్రామ సింహుడు మధ్య విజేత బాబరు )
10. బాబరు పాలనా కాలమేది ? (క్రీ.శ. 1520 - 1530 )
11. బాబరు తరువాత రాజ్యమునకు వచ్చినది ఎవరు ? ( హుమాయూన్ )
12. హుమాయూన్ పూర్తి పేరు ఏమిటి ? ( నసీరుద్దీన్ మహమ్మద్ హుమాయూన్ )
13. చౌసా యుద్ధము ఎవరెవరికి మధ్య ఎప్పుడు జరిగింది ? విజేత ఎవరు ?
( హుమాయూన్, షేర్షాల మధ్య 1539లో విజేత షేర్షా )
14. హుమాయూన్ షేర్షా చేతిలో పూర్తిగా ఓడిపోయి అజ్ఞాత వాసమునకు వెళ్ళినది ఏ యుద్ధము తరువాత ? ( క్రీ.శ. 1540లో జరిగిన కనూజ్ యుద్ధం )
15. హుమాయూన్‌ను ఆదరించి సహకరించిన పారశీక చక్రవర్తి ఎవరు ? ( షాతమస్సు )
16. హుమాయూన్ ఢిల్లీ సింహాసనాన్ని ఎపుడు ? ఎవరినోడించి పొందినాడు ? ( క్రీ. శ. 1555 లో సికిందర్ షా )
17. హుమాయూన్ వ్యక్తిత్వమునందు గల విశిష్ట లక్షణమేది ? ( పట్టుదల )
18. అక్బరు తల్లిదండ్రులు ఎవరు ? (హుమాయూన్ - హమీదాబేగం )
19. అక్బరు ఎప్పుడు ? ఎక్కడ జన్మించాడు ? ( క్రీ.శ. 1542. అమర్ కోటలో)
20. హుమాయూన్ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1530 - 40 మరియు 1555 - 56 )
21. హుమాయూన్ తన పఠన మందిరం నుండి దిగుతూ కాలుజారి పడి మరణించింది ఎప్పుడు? ( క్రీ.శ. 1556 జనవరి 26)
22. షేర్షా అసలు పేరేమిటి ? ( ఫరీద్ )
23. అసహాయశూరడై పులిని చంపినందుకు దక్షిణ బీహరు పాలకుడైన ' బహర్ ఖాన్ లోహనీ ' ఫరీద్‌కు ఇచ్చిన బిరుదు ఏది? (షేర్‌ఖాన్)
24. షేర్షా చునార్ దుర్గాధిపతి ఎపుడు అయినాడు ? ( క్రీ.శ. 1553లో )
25. షేర్షా జన్మస్థలమేది ? ( నసరామ్ )
26. షేర్షా ఏ జాతీయుడు ? ( ఆఫ్ఘను )
27. ఏ యుద్ధం తరువాత షేర్షా ఢిల్లీ పాలకుడైనాడు ? (కనూజ్ యద్ధం (క్రీ.శ. 1540 ))
28. షేర్షా ఏకోట ముట్టడిలో మరణించాడు ? ( కలింజర్ ( క్రీ.శ. 1545))
29. ప్రజాభీష్టాన్ని ప్రధానంగా చేసుకొని ప్రభుత్వ యంత్రాంగాన్ని నిర్మించటానికి ప్రయత్నించిన ప్రప్రథమ భారతీయ ముస్లిం చక్రవర్తి ఎవరు ? ( షేర్షా )

30. షేర్షా తన రాజ్యాన్ని ఎన్ని సర్కారులుగా విభజించినాడు ? ( 47 )
31. షేర్షా ప్రవేశ పెట్టిన భూమిశిస్తు విధానం ఏది ? ( రైత్వారీ పద్ధతి )
32. సర్కారును పాలించే అధికార్ల పేరేమి ? ( ప్రధాన షిక్దార్ , ప్రధాన మున్సిఫ్)
33. షేర్షా మంత్రిమండలిలోని సభ్యులెవరు ? (నలుగురువారు 1) వజీర్ 2) అరీజ్ 3) రసాలత్ 4) ఇన్షా )
34. షేర్షా పాలన యందు ' వజీర్ ' అనగానెవరు ? ( ప్రధానమంత్రి )
35. షేర్షా పాలనలోని ' అరీజ్' ఎవరు ? ( రక్షణ మంత్రి )
36. షేర్షా పాలనలోని ' రసాలత్ ' ఎవరు ? ( విదేశాంగ మంత్రి )
37. షేర్షా ఆస్థానంలో రాజశాసనాలను, ఉత్తర ప్రత్యుత్తరాలను పరిశీలించే మంత్రి ఎవరు ? ( ఇన్షా )
38. ప్రభుత్వం పట్ల రైతులకు గల బాధ్యతను తెలియజేస్తూ రైతుల నుండి షేర్షా గ్రహించిన పత్రాలేవి ? షేర్షా రైతులకు ఇచ్చిన పత్రాలేవి? ( కబోలియత్‌లు, పట్టాలు )
39. షేర్షా కాలంలో తాలుకా స్థాయి పాలనా విభాగమేది ? ( పరగణా )
40. పరగణాలోని ప్రధాన ఉద్యోగులెవరు ? ( షిక్దార్ , మున్సిఫ్, పోద్దార్ )
41. షేర్షా పాలనలో గ్రామపాలనలో గ్రామ పెద్దలకు సహకరించే ఉద్యోగులెవరు? ( పట్వారీ - చౌకీదార్ - మక్థన్ )
42. ఢిల్లీలోని 'పురాణఖిలా'ను నిర్మించింది ఎవరు ? ( షేర్షా )
43. పాలనా విధానంలో అక్బరుకు మార్గ దర్శకుడు ఎవరు ? ( షేర్షా )
44. అక్బర్ పూర్తి పేరేమి ? (జలాలుద్దీన్ మహమ్మద్ అక్బర్ )
45. అక్బర్ పూర్తి పేరేమి ? ( జలాలుద్దీన్ మహమ్మద్ అక్బర్ )
46. అక్బరు పాదుషా గా ఎప్పుడు ? ఎక్కడ ? ప్రకటింపబడ్డాడు? ( క్రీ.శ. 1556 ఫిబ్రవరి 4వ తేదిన కాల్‌నూర్‌లో )
47. అక్బరు సంరక్షకుడు ఎవరు ? ( బైరాంఖాన్ )
48. రెండవ పానిపట్టు యుద్ధము ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1556 )
49. రెండవ పానిపట్టు యుద్ధం ఎవరెవరికి జరిగింది ? విజేత ఎవరు ? ( హేయు - బైరాంఖాన్‌లకు, బైరాంఖాన్ )
50. అక్బరును వీరోచితంగా ఎదిరించి అసువులు బాసిన రాజపుత్ర వనిత ఎవరు ? ( రాణీ దుర్గావతి )
51. అక్బరుని వీరోచితంగా ఎదిరించిన రసపుత్ర వీరుడెవరు ? ( రాణాప్రతాప సింహుడు )
52. అక్బరు సేనాని రాజామాన్‌సింగ్ రాణాప్రతాపసింహుని ఏ యుద్ధంలో ఓడించాడు? ( హాల్దీ ఘాట్ యుద్ధం క్రీ.శ.1574 )
53. అక్బరు స్థాపించిన నూతన మతమేది ? ( దిన్-ఇ-ఇలాహి క్రీ.శ.1582 )
54. అక్బరు నూతన మతాన్ని స్వీకరించిన ఒకేఒక హిందువు ఎవరు ? ( బీహారీమల్)
55. అక్బరు కట్టించిన పూజామందిరం పేరేమి ? ( ఇబాదత్ ఖానా )
56. అక్బరు నూతన మతమునకు ప్రధానాధికారి ఎవరు ? ( అబుల్ ఫజల్ )
57. అక్బరు రాజ్యంలో రాష్ట్రమును ఏమందురు ? ( సుబా )
58. అక్బరు తన రాజ్యాన్ని ఎన్ని సుబాలుగా విభజించినాడు ? ( 15 సుబాలుగా )
59. అక్బరు కాలంలోని సుప్రసిద్ధ పారశీక కవి ఎవరు ? ( అబుల్ ఫజల్ )
60. అక్బరు ఆస్తాన గాయకుడు ఎవరు ? ( తాన్‌సేన్ )
61. అక్బరు సమకాలీకుడయిన హిందీ రామాయణ కర్త ఎవరు ? ( తులసీదాస్ )
62. అక్బరు ఆస్థాన చిత్రకారులుఎవరు ? ( బసవన్ , దసవంత్ )
63. సలీమ్ చిస్తీ గౌరవార్ధం అక్బరు నిర్మించిన పట్టణం ఏది ? ( ఫతేపూర్ సిక్రీ )
64. అక్బరు నిర్మించిన కట్టడము లేవి ? ( బులంద్ దర్వాజ - ఆగ్రా, లాహోరు కోటలు -పంచమహల్, జుమామసీదు - దివాన్‌ఇఖాస్, దివాన్-ఇ-ఆమ్, ఇబాదత్ ఖాన్)
65. అక్బరు పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1556 - 1605 )

66. అక్బరు ఏ సం॥లో మరణించినాడు ? ( క్రీ.శ. 1605 )
67. అక్బరు తరువాత సింహాసన మధిష్టించిన వారెవరు ? ( జహంగీరు )
68. జహంగీరు అసలు పేరేమి ? ( సుల్తాన్ మహమ్మద్ సలీం)
69. అబుల్ ఫజల్‌ను హత్య చేయించినది ఎవరు ? ( జహంగీరు )
70. జహంగీరు పై తిరుగుబాటు చేసిన అతని కుమారుడు ఎవరు ? ( ఖుస్రూ )
71. జహంగీరు వ్రాసిన స్వీయ చరిత్ర ఏమిటి ? ( తుజ్ - కే - జహంగీరీ )
72. జహంగీర్ నూర్జహానుల వివాహం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1611 లో )
73. జహంగీర్‌ను లోబరచుకొని పారశీకయువతైన నూర్జహాను ఎన్ని సం॥లు మొగలు సామ్రాజ్యాన్ని పాలించినది ? ( 11 సం॥లు క్రీ.శ.1611-1622)
74. జహంగీరు ఆస్థానానికి వచ్చిన ఇంగ్లండ్ రాయబారులెవరు ? (విలియం హాకిన్స్, సర్ థామస్‌రో)
75. జహంగీరు ఆస్థానానికి రాయబారులను పంపిన బ్రిటీష్ చక్రవర్తి ఎవరు ? ( మొదటి జేమ్స్ )
76. న్యాయగంటను ఏర్పాటు చేసిన మొగలు చక్రవర్తి ఎవరు ? ( జహంగీరు )
77. నూర్జహన్ తన మేనకోడలు ముంతాజ్‌మహల్‌ని ఎవరికిచ్చి వివాహం చేసింది? ( షాజహన్ )
78. జహంగీరుచే నిర్మింపబడిన అక్బరు సమాధి ఎక్కడ ఉంది ? ( సికింద్రా )
79. ఆంగ్లేయులు మొదట వర్తక కేంద్రమును జహంగీరు అనుమతితో ఎక్కడ ఏర్పరచుకొనిరి ? ( సూరత్ లో )
80. జహంగీరు పై షాజహాన్ చేసిన తిరుగుబాటును అణచివేసిన మొగలు సేనాని ఎవరు ? ( మహబత్ ఖాన్ )
81. జహంగీరు ఎప్పుడు మరణించాడు ( క్రీ.శ. 1627లో )
82. జహంగీరు సమాధి ఎక్కడ ఉంది ? ( లాహోర్‌లో )
83. నూర్జహాను అసలు పేరేమి ? నూర్జహాను ఎవరి కుమార్తె ?
( మెహరున్నీసా, ఖోరవాన్ వాస్తవ్యుడు పర్షియా మీర్జా ఘీమాస్‌బేగ్ కుమార్తె)
84. నూర్జహాను మొదటి భర్త ఎవరు ? ( షేర్ ఆఫ్ఘన్ )
85. నూర్జహాన్ తన కుమార్తె అయిన లాడ్లీ బేగంను ఎవరికిచ్చి వివాహం చేసింది? ( జహంగీరు కుమారుడైన 'పెరియారు'కు)
86. నూర్జహాన్ లాహోర్ వెళ్ళి తన శేష జీవితాన్ని దైవ చింతనలో గడుపుతూ ఎప్పుడు మరణించింది ? ( క్రీ.శ. 1645. )
87. మొగల్ వంశీయులలో ఎవరి కాలాన్ని స్వర్ణయుగమందురు ? ( షాజహాను )
88. షాజహన్ మొగల్ సింహాసనాన్ని ఎప్పుడు అధిష్టించినాడు ? ( క్రీ.శ. 1628లో)
89. షాజహాన్ అసలు పేరేమి ? ( ఖుర్రం)
90. షాజహాన్ భార్య ముంతాజ్‌మహల్ ఎప్పుడు మరణించింది ? ( క్రీ.శ. 1633 జనవరి 17 )
91. షాజహాన్ భార్య ముంతాజ్‌మహల్ జ్ఞాపకార్థం నిర్మించిన గొప్ప కట్టడం ఏది ? ( తాజ్ మహల్ )
92. షాజహాన్ పై తిరుగుబాటు చేసిన దక్కను పాలకుడు ఎవరు ? ( ఖాన్ జహన్ )
93. షాజహాన్ అహమ్మద్‌నగర్‌ను ఎప్పుడు ఆక్రమించాడు ? ( క్రీ.శ. 1633లో )
94. షాజహాన్ కాలంలో మొగలు సామ్రాజ్యం సందర్శించిన ఫ్రెంచి యాత్రికుడెవరు ? ( బర్నియర్ )
95. మొగలు చక్రవర్తులలో గొప్ప నిర్మాత ఎవరు ? ( షాజహాన్ )
96. 'భువిపై ఆనందమయ స్వర్గం అంటూ ఉంటే అది ఇదే ' అని ఏ కట్టడం గోడలపై వ్రాసి ఉంది ?
( ఎర్రకోట భవనాలులోని రివానీఖాన్ కట్టడంలోని గోడలపై )
97. ఢిల్లీలోని ' జుమ్మా మసీదు ' ఆగ్రాలోని 'మోతీ మసీదు ' ను నిర్మించింది ఎవరు ? ( షాజహన్ )
98. మయూర సింహాసనాన్ని చేయించింది ఎవరు ? ( షాజహాన్ )
99. షాజహాన్ ఆస్థానంలోని సుప్రసిద్ధ సంస్కృత పండితుడు ఎవరు ? ఆయన వ్రాసిన గ్రంథములేవి ?
( జగన్నాథ పండితుడు, రసగంగాధరము, గంగాలహరి)

100. షాజహాన్ పెద్ద కుమారుడు "దారాయ కోల్ " వ్రాసిన గ్రంథమేది ? ( మహా సముద్ర సంగ్రామం )
101 షాజహాన్ ఆస్థానంలోని చరిత్ర కారులు ఎవరు ? ( అబుల్ హమీద్ లాహిరీ, ఇతియత్ ఖాన్ )
102. షాజహాన్ పాలనా కాలమేది ? ( క్రీ.శ. 1628 - 1656 )
103. షాజహాన్‌ను బందీ చేసిన అతని కుమారుడు ఎవరు ? షాజహాన్ ఎప్పుడు మరణించాడు ? ( ఔరంగజేబు క్రీ.శ. 1666లో )
104. ఔరంగజేబు మొగలు సింహాసనాన్ని ఎప్పుడు ఆక్రమించినాడు ? ( క్రీ.శ. 1658 లో )
105. ఔరంగజేబు అసలు పేరు ఏమి ? (మొహిదీన్ మహమ్మద్ ఔరంగజేబు )
106. భారతదేశాన్ని పూర్తిగా మొగల్ సామ్రాజ్యంలోనికి తీసుకువచ్చిన మొగలు చక్రవర్తి ఎవరు ? ( ఔరంగజేబు )
107. ఔరంగజేబుచే వధింపబడిన శిక్కుల మత గురువు ఎవరు ? ( తేజ్ బహదూర్ )
108. హిందూ దేవాలయాలను, పాఠశాలలను ధ్వంసం చేయడానికి ఔరంగజేబు నియమించిన ప్రత్యేకాధికారి ఎవరు ? ( దరోగా )
109. మధుర పరిసరాలలోని జాటలు ఔరంగజేబుపై ఎవరి నాయకత్వంలో తిరుగుబాటు చేశారు ? ( గోక్లా )
110. ఔరంగజేబుపై తిరగుబాటును చేసిన మహరాష్ట్ర నాయకుడు ఎవరు ? ( శివాజీ )
111. ఔరంగజేబు ఎప్పుడు మరణించాడు ? ( క్రీ.శ. 1707లో )
112. ఔరంగజేబు పాలనా కాలమేది ? ( క్రీ.శ.1658 - 1707 )
113. బుందేల్ ఖండ్ స్వాతంత్ర్యాన్ని ప్రకటించి ఔరంగజేబును ఎదిరించిన బుందేల్‌ఖండ్ నాయకుడు ఎవరు? (ఛత్రసాల్ )
114. రాజపుత్రులు ఎవరి నాయకత్వములో ఔరంగజేబుపై తిరుగుబాటు చేశారు ? ( దుర్గాదాస్ )
115. ఎవరి మరణంతో భారతదేశంలో మొగలుల ప్రాభవం అడుగంటుటతోపాటు మధ్యయుగం అంతరించినది ? (ఔరంగజేబు )
116. ఔరంగజేబు తరువాత మొగలు సింహాసనాన్ని అధిష్టించింది ఎవరు ? ( బహుదూర్ షా (లేక) మొదటి షా ఆలం )
117. మొగలు పాలనా విధానానికి మూల పురుషుడు ఎవరు ? ( అక్బరు )
118. మొగలుల పరిపాలనలో ప్రభుత్వానికి పెద్ద ఎవరు ? ( చక్రవర్తి )
119. మొగలుల ప్రధాన మంత్రి పేరేమి ? ( వకీల్ )
120. మొగలుల సేనాపతి ఎవరు ? (మీర్ భక్షి)
121. మొగలుల ఆర్థిక మంత్రి పేరేమి ? ( దివాన్ )
122. మొగలుల న్యాయశాఖ మంత్రి ఎవరు? (చీఫ్ ఖాజీ )
123. మొగలుల అంతఃపురాధికారి ఎవరు ? ( మీర్ సమన్ )
124. మొగలుల మతాధికారి పేరేమి ? (చీఫ్ సదర్ )
125. పరిపాలనలో అక్బరు ఎవరికి చోటీయలేదు ? ( ఉలేమాలకు )
126. మొగలుల కాలంలో డారోగా -ఇ-టాప్‌కాన్ అనగా ఎవరు ? ( రాజభవనం, కోటల రక్షణాధికారి )
127. మొగలు సామ్రాజ్యంలో రాష్ట్ర స్థాయి పాలనా విభాగం పేరేమి ? దాని పాలకుడు ఎవరు ? ( సుబా - సుబేదార్ )
128. మొగలు పాలనలో జిల్లా స్థాయి విభాగం ఏది ?ఈ విభాగ పాలకుడెవరు ? అతనికి ఏ ఉద్యోగులు సాయం చేస్తారు ? ( సర్కార్ , పౌజుదార్ సహాయకులు అమల్ గుజార్, ఖజానాదార్ )
129. మొగలు పాలనలో తాలుకా స్థాయి పాలనా విభాగం పేరేమి ? దీని ప్రధాన పాలకుడు ఎవరు? అతనికి తోడ్పడే ఉద్యోగులు ఎవరు ? ( పరగణా ( లేక ) మహల్ - షిక్‌దార్, సహాయకులు; అమత్ ఫొద్దార్, కానుంగో )
130. మొగలుల కాలంలో గ్రామపాలనను నిర్వహించేవారు ఎవరు? వారికి సహయము చేసే ఉద్యోగులెవరు ? (గ్రామ పంచాయతీ, మక్‌ధన్, పట్వారీ )
131 మొగలాయిల రాష్ట్రంలో పట్టణాధికారి ఎవరు ? ( కొత్వాల్ )

132. పట్వారీ విధులేవి ? ( పంటపొలములు - శిస్తు గూర్చి లెక్కల తయారీ )
133. మక్‌దిన్ విధులేవి ? ( శాంతి భద్రతల పరిరక్షణ )
134. అక్బరు భూమిశిస్తు విధానంలో అతనికి తోడ్పడింది ఎవరు ? ( రాజాతోడర్‌మల్ )
135. భూమిని కొలవటానికి అక్బరు ప్రవేశపెట్టిన సాధనం పేరేమిటి ? (జరీత్ )
136. మొగలాయిలు భూమిని కొలుచుటకు ఉపయోగించు కొలతత్రాడు ఏది? ( తనబ్ )
137. మొగలాయిల కాలంలో చక్రవర్తి పోషించు సైన్యమునేమందురు ? ( స్థిర సైన్యము )
138. మొగలాయిల సైనిక విధానము ఏది ? ( మున్సబ్‌దారీ విధానము )
139. మున్సబ్‌దారీ విధానం అంటే ఏమిటి ? ( క్రమ బద్దమైన అశ్వికదళ నిర్వహణ )
140. మున్సబ్‌దారులు ఎవరికి బాధ్యత కలిగి ఉంటారు? ( చక్రవర్తికి )
141. అక్బరు ఆస్థాన పండితుడు అబుల్ ఫజల్ బిరుదమేది ? ( కవిరాజు )
142. అక్బరు ఆస్థానంలోని చిత్రకారుడు ఎవరు ? అతని బిరదమేది ? ( అబ్దుల్ సమద్, రమ్యలేఖిని )
143. అక్బరు ఆస్థానంలోని సుప్రసిద్ధ గాయకులలో గొప్పవాడు ఎవరు ? ( తాన్‌సేన్ )
144. అక్బరు కాలంలో తయారుచేయబడిన పారశీక - సంస్కృత నిఘంటువు పేరేమి ? ( పారశీ ప్రకాష్ )
145. అబుల్ ఫజల్ వ్రాసిన పారశీక గ్రంథాలేవి ? ( అక్బరు నామా, దినీ అక్బరీ )
146. 'హుమాయూన్ నామా'ను వ్రాసింది ఎవరు? ( గుల్‌బదన్ బేగం )
147. 'కవిరాయ' అను బిరుదును పొందిన అక్బరు ఆస్థాన కవి ఎవరు ? ( బీర్బల్ )
148. అక్బరు కాలం నాటి సుప్రసిద్ధ హిందీకవి ఎవరు ? ( తులసీదాస్ )
149. ఆగ్రాలోని అంధ గాయకుడు సూరదాసు రచించిన గ్రంథమేది ? ( సూర్ సాగర్ )
150. తబకత్ - ఇ - అక్బరీ అను చరిత్ర గ్రంథాన్ని రచించింది ఎవరు ? ( నిజాముద్దీన్ అహమ్మద్ )
151. ఏ మొగలు చక్రవర్తి కాలంలో వాస్తు శిల్పం మహోన్నత స్థితికి చేరుకుంది ? ( షాజహాన్ )
152. 'చిత్రలేఖనం' మహోన్నత స్థితికి చేరుకొన్నది ఏ మొగలు చక్రవర్తి కాలంలో? ( జహంగీర్ )
153. జహంగీర్ కాలంలో ప్రసిద్ధి గాంచిన హిందూ చిత్రకారులు ఎవరు? ( బిషన్ దాస్, మనోహర్, గోవర్ధన్ )
154. షాజహాన్ ఆస్థానంలోని సుప్రసిద్ధ గాయకుడు ఎవరు.? ( లాల్ ఖాన్ )
155. ఏ మొగలు చక్రవర్తి కాలంలో లలిత కళలకు నిరాదరణ లభించింది ? ( ఔరంగజేబు)
156. 'ఫతావా ఇ అలంఘీరీ అను న్యాయ శాస్త్రమును తయారు చేయించిన దెవరు ? ( ఔరంగజేబు )
157. పారశీక చక్రవర్తి నాదిర్షా భారతదేశంపై ఎప్పుడు దండెత్తినాడు ? అప్పటి మొగలు చక్రవర్తి ఎవరు ? ( క్రీ.శ. 1739 లో, మహమ్మద్ షా )
158. మొగలు చక్రవర్తుల చివరి వాడెవరు? ( రెండవ బహదూర్ షా )
159. రెండవ బహదూర్‌షా ఎప్పుడు ఎక్కడ మరణించినాడు ? ( క్రీ.శ.1862 రంగూన్‌లో, ఆంగ్లేయుల బందీగా )

**శిక్కులు**

160. శిక్కు మత స్థాపకుడెవరు ? ( గురునానక్ )
161. నానక్ శిష్యులనేమందు? ( శిక్కులు )
162. శిక్కుల పుణ్య క్షేత్రమేది ? ( అమృతసర్ లోని స్వర్ణ దేవాలయము )
163. శిక్కుల పవిత్ర గ్రంథమేది ? (' ఆదిగ్రంథ్ ' లేక గ్రంథ సాహెబా .)
164. గురునానక్ ఏ మొగలు చక్రవర్తి సమకాలికుడు ? ఆయన జీవిత చరిత్రను వ్రాసిన శిక్కు గురువెవరు ? ( బాబరు, గురుఅంగదుడు )
165. గురు నానక్ ఎప్పుడు ? ఎక్కడ జన్మించినాడు ? ( క్రీ.శ. 1469లో పంజాబులోని తల్వెండి గ్రామములో )
166. శిక్కుల పుణ్యక్షేత్రమైన అమృతసర్‌లోని స్వర్ణ దేవాలయ నిర్మాణాన్ని అమృత సరస్సును త్రవ్వించిన శిక్కు గురువు ఎవరు ( గురు రామదాస్ )

167. 'ఆధిగ్రంధ్' - శిక్కు మత గ్రంథాన్ని వ్రాసిన శిక్కు గురువు ఎవరు ? ( గురు అర్జున్ సింగ్ )
168. శిక్కుల ప్రథమ పాలకుడైన శిక్కు గురువు ఎవరు ? ( గురు అర్జున్ సింగ్ )
169. గురు అర్జున్ సింగ్ ను మొగలు ఆస్థానంలో వధించిన చక్రవర్తి ఎవరు? ( జహంగీర్ )
170. రాజలాంచనాలతో గురుపీఠాన్ని అలంకరించిన శిక్కుగురువు ఎవరు ? (గురు హర గోవింద సింగ్ )
171. శిక్కులను యుద్ధ వీరులుగా మార్చిన శిక్కు గురువు ఎవరు ? ( గురు హరగోవింద సింగ్ )
172. ఔరంగజేబుచే వధింపబడిన శిక్కు గురువు ఎవరు ? ( తేజ్ బహదూర్ )
173. శిక్కు మత గురువులలో చివరి వాడుఎవరు ? ( గురు గోవింద సింగ్ )
174. 'ఖల్సా' అనే శిక్కు సైన్యాన్ని నిర్మించిన శిక్కు గురువు ఎవరు ? ( గురు గోవింద సింగ్ )
175. ఖల్సాలో చేరిన శిక్కులనేమంటారు ? ఇందులో చేరిన శిక్కులు ధరించ వలసిన పంచ క' కారములేవి ?
( సింగ్, కంఘీ (దువ్వెన), కబ్(పొట్టిలాగు),కర్ద్ ( చాకు), కేశ ( జుట్టు), కృపాల్ ( ఖడ్గము )
176 గురుగోవింద సింగ్ తరువాత శిక్కులకు నాయకత్వం వహించినది ఎవరు? ( బందా బహదూర్ )
177. బందా మరణం పిమ్మట ఏర్పడిన శిక్కులలోని చీలికలు ఏవి ? (బందాఖాల్సా, తాత్ ఖల్సా)

## మహారాష్ట్రులు

178. స్వతంత్ర మహారాష్ట్ర రాజ్య నిర్మాత ఎవరు ? ( శివాజీ )
179. శివాజీ ఆధ్యాత్మిక గురువు ఎవరు? ( సమర్ధ రామదాసు )
180. శివాజీ తల్లిదండ్రులు ఎవరు? శివాజీ ఎప్పుడు ఎక్కడ జన్మించాడు ?
( జిజియాబాయి, షాజీ భాన్స్లే, క్రీ.శ. 1630లో శివనేర్ దుర్గంలో)
181. శివాజీకి యుద్ధ విద్యలను నేర్పించిన గురువు ఎవరు ? ( దాదాజీ ఖాండదేవ్ )
182. శివాజీ ఆక్రమించిన మొదటి దుర్గము ఏది ? ( తోరణ దుర్గం క్రీ.శ.1646 )
183. శివాజీ స్వాతంత్ర్యమును ఎప్పుడు ప్రకటించెను ? ( క్రీ.శ. 1653లో )
184. శివాజీని అణచడానికి ఎవరెవరు ఏఏ సేనానులను పంపినారు ?
( బీజపూర్ సుల్తాన్ - అఫ్జల్‌ఖాన్, ఔరంగజేబు - షయిస్తాఖాన్ )
185. శివాజీకి చెందిన కొండ నాగిరి దుర్గాన్ని పట్టుకొనుటలో విఫలుడయిన మొగలు సేనాని ఎవరు? ( జస్వంతసింగు )
186. క్రీ.శ. 1665 లో మొగలు సేనాని రాజా జయసింగ్ తో శివాజీ చేసుకున్న సంధి ఏది ? ( పురందర సంధి )
187. శివాజీకి గల బిరుదేమి ? శివాజీ స్థాపించిన స్వతంత్ర రాజ్యం పేరేమిటి? ( ఛత్రపతి, స్వరాజ్యం )
188. శివాజీ పట్టాభిషేకం ఎప్పుడు, ఎక్కడ జరిగింది? ( క్రీ.శ. 1674 జూన్ 16, రాయగఢ్‌లో )
189. శివాజీ స్వరాజ్యానికి రాజధాని ఏది ? ( రాయగఢ్ )
190. శివాజీ ఇలవేలుపు ఎవరు? ( తుల్జా భవానీ దేవి )
191. శివాజీ ఏ కోటను జలదుర్గంగా మార్చాడు ? ( సదాసివఘడ్ )
192. మొట్టమొదట మనదేశంలో జాతీయ ప్రభుత్వ స్థాపన చేసినది ? ( శివాజీ )
193. శివాజీ ఎప్పుడు మరణించాడు ( క్రీ.శ. 1680లో )
194. ఆధునిక మహారాష్ట్ర జాతి నిర్మాత ఎవరు ? (శివాజీ )
195. శివాజీ మంత్రి మండలి పేరు ఏమిటి ? ( అష్ట ప్రధానులు )
196. శివాజీ రాజ్యంలో ప్రధాన మంత్రి నేమందురు ? ( పీష్వా )
197. శివాజీ అష్టప్రధానులు ఎవరు? ( పీష్వా, అమాత్య, మంత్రి, సచివ, సేనాపతి, పండిత రావ్, సుమంత, న్యాయాధీశ)
198. శివాజీ కాలంలో సర్‌కాబత్ అనగా నెవరు ? (అశ్వదళాధిపతి )
199. శివాజీ రాజ్యంలో రాష్ట్రాలెన్ని ? రాష్ట్ర పాలనాధికారి ఎవరు ? ( నాలుగు, రాష్ట్రాధిపతి )
200. పొరుగు రాజ్యాల నుండి శివాజీ వసూలు చేసిన పన్నులేవి ? (చౌత్, సర్దేశ్ ముఖి)
201. ఎవరి అనుమతితో ఫ్రెంచివారు పాండిచేరిలో వర్తకం చేసుకొనుటకు అధికారము సంపాదించారు ? ( శివాజీ)

203. శివాజీ కాలం నాటి మొగలు చక్రవర్తి ఎవరు ? ( ఔరంగజేబు )
204. శివాజీ నిర్మించిన కోటల సంఖ్య ఎంత ? ( 280 )
205. శివాజీ అనంతరం మహారాష్ట్ర సింహాసనం అధిష్టించిన వారు ఎవరు . ? ( శంభూజీ 1680 )
206. శంభూజీ ఎప్పుడు ఎవరిచే చంపబడ్డాడు ? ( క్రీ.శ. 1689లో ఔరంగజేబుచే )
207. శంభూజీ తరువాత మహారాష్ట్ర పాలకుడెవరు ? ( రాజారాం 1689 )
208. రాజారాం భార్య ఎవరు ? ( తారాబాయి )
209. రాజారాం ఎప్పుడు, ఎక్కడ మరణించాడు ? ( క్రీ.శ. 1700 మార్చి 12న సింహఘడ్ దుర్గంలో )
210. రాజారాం అనంతరం మహారాష్ట్రులకు నాయకత్వం వహించిన మహిళ ఎవరు ? ( తారాబాయి )
211. శివాజీ అనంతరం విచ్ఛిన్నమైన మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని పునరుద్ధరించింది ఎవరు ? ( పీష్వాలు )
212. పీష్వాలలో మొదటివాడు ఎవరు? ( బాలాజీ విశ్వనాథ్ ( 1713 - 1720 )
213. మహారాష్ట్ర సామ్రాజ్యానికి రెండవ వ్యవస్థాపకుడు ఎవరు? ( బాలాజీ విశ్వనాథ్ )
214. ' హింధూ పద్ పద్ షాహీ ' ఆదర్శంగా గల పీష్వా మరియు బాలాజీ విశ్వనాథ్ తరువాత మహారాష్ట్ర నేలిని పీష్వా ఎవరు? ( బాజీరావు 1720 - 1740 )
215. హిందూ పద్ పద్ షాహీ అంటే ఏమిటి ? ( అఖిల భారత హిందూ సామ్రాజ్యం )
216. బాజీరావు తరువాత పీష్వా ఎవరు ? ( బాలాజీ బాజీరావు 1746 - 1761)
217. మూడవ పానిపట్టు యుద్ధం ఎప్పుడు జరిగింది ? అప్పటి పీష్వా ఎవరు?(క్రీ.శ. 1761 జనవరి 14న, బాలాజీ బాజీరావు)
218. మూడవ పానిపట్టు యుద్ధం ఎవరెవరికి జరిగింది ?
(ఆఫ్ఘను రాజైన అహమ్మద్ షా అబ్దాలీకి మొగలు చక్రవర్తి రెండవ షా ఆలం రక్షణ బాధ్యత తీసుకున్న మహారాష్ట్రులకు)
219. మూడవ పానిపట్టు యుద్ధ విజేత ఎవరు? ( అహ్మద్షా అబ్దాలీ )
220. ఏ యుద్ధంలో మహారాష్ట్రుల 'హిందూ పదపద్ షాహీ ' ఆశయం నేలకూలింది ? ( మూడవ పానిపట్టు యుద్ధం )
221. మూడవ పానిపట్టు యుద్ధంలో మహారాష్ట్ర సైన్యానికి నాయకత్వం వహించింది ఎవరు ? ( సదాశివరావు )
222. మూడవ పానిపట్టు యుద్ధంలో పాల్గొన్న జాట్ నాయకుడు ఎవరు ? ( సూరజ్ మల్ )
223. మూడవ పానిపట్టు యుద్ధంలో మహారాష్ట్రులు ఓడిపోవుటకు కారణము ఏమి ? ( గెరిల్లా యుద్ధ రీతులను అనుసరించకపోవటం)
224. బాలాజీబాజీరావు లేదా నానా సాహెబు ఎపుడు మరణించాడు ? ( క్రీ.శ.1761లో )
225. బాలాజీ బాజీరావు తరువాత అధికారములోనికి వచ్చిన వారు ఎవరు? ( మాధవరావు )

## 15. యూరోపియన్ల రాక - ఆంగ్ల రాజ్య స్థాపన

### క్రీ.శ. 1707 -1856

1. ఆటోమాన్ టర్క్‌లు కాన్‌స్టాంటినోపుల్‌ను ఎప్పుడు ఆక్రమించారు? ( క్రీ.శ.1453లో )
2. భారతదేశానికి నూతన సముద్ర మార్గమును కనిపెట్టిన పోర్చుగీసు నావికుడు ఎవరు? ( వాస్కోడిగామా )
3. వాస్కోడిగామా కాలికట్‌కు ఎప్పుడు చేరాడు ? ( క్రీ.శ. 1498 లో )
4. వాస్కోడిగామా సందర్శించిన కాలికట్ రాజు ఎవరు ? ( జమోరిన్ )
5. భారత దేశానికి వర్తకానికి వచ్చిన తొలి యూరోపియన్లు ఎవరు? వారు ఏ దేశస్థులు ? (పోర్చుగీసువారు, పోర్చుగల్ )
6. పోర్చుగీస్ వారి మొదటి స్థావరాలేవి ? ( కాలికట్, కొచ్చిన్, కన్ననూర్ )
7. ఇండియాలోని పోర్చుగీస్ స్థావరాలకు మొదటి గవర్నరు ఎవరు? ( ఆల్‌మీడా )
8. పోర్చుగీస్ వ్యాపారాన్ని విస్తరింప చేయడానికి ఆల్‌మీడా అనుసరించిన విధానానికేమని పేరు ? (బ్లూవాటర్ పాలసీ )
9. పోర్చుగీసు వారికి శత్రువులు ఎవరు? ( మొగలు చక్రవర్తులు, మహారాష్ట్రులు, బహమనీ సుల్తానులు )
10. పోర్చుగీసు వారికి వర్తకంలో మొదటి పోటీదారులు ఎవరు ? ( అరబ్బులు )

11. ఇండియాలో రెండో పోర్చుగీస్ గవర్నర్ ఎవరు ? ( అఫ్సాన్ - సో- డి-ఆల్బూక్లర్క్ )
12. ఇండియాలో పోర్చుగీసు వారి వలస సామ్రాజ్య నిర్మాత ఎవరు ? ( అల్బూక్లర్క్ )
13. ఇండియాలో పోర్చుగీసు వారి వలస సామ్రాజ్యానికి రాజధాని ఏది ? (గోవా )
14. ఇండియాకు మొట్టమొదటగా వచ్చి చిట్టచివరిగా వెళ్ళిన ఐరోపావారు ఎవరు? ( పోర్చుగీసువారు )
15. డచ్చివారు ఐరోపాలో ఏ దేశస్థులు ? ( హాలెండ్ )
16. భారతదేశంలోనూ, తూర్పు ఇండియా దీవులలోనూ వర్తకం ప్రారంభించిన డచ్చి సంఘం పేరేమిటి ? ( యునైటెడ్-ఈస్టిండియా కంపెనీ )
17. యునైటెడ్ ఈస్టిండియా కంపెనీ ఎప్పుడు స్థాపించబడినది? ( క్రీ.శ. 1602 )
18. డచ్చివారి భారతదేశ స్థావరములకు కేంద్రము లేవి ? ( పులికాట్, సూరత్, నాగపట్టణం )
19. ఇండియాలో పోర్చుగీస్‌ల అధికారాన్ని విచ్ఛిన్నం చేసిన వారెవరు? (డచ్చివారు )
20. డచ్చివారు అంబాయిన్ హత్యలు జరిపినదెప్పుడు ? ( క్రీ.శ. 1623లో )
21. ఇంగ్లీష్ తూర్పు ఇండియా కంపెనీ ఎప్పుడు స్థాపించబడినది ? ( క్రీ.శ. 1600 )
22. ఆంగ్లేయులు భారతదేశంలో తమ మొట్టమొదటి వర్తక కేంద్రాన్ని ఎక్కడ ఎప్పుడు స్థాపించారు? ( క్రీ.శ. 1613లో సూరత్ వద్ద)
23. క్రీ.శ. 1615లో ఇంగ్లండు రాజైన మొదటి జేమ్స్ జహంగీర్ కొలువుకు ఎవరిని రాయబారిగా పంపాడు? (సర్ థామస్‌రో )
24. దక్షిణ ఇండియాలో ఇంగ్లీషువారు తమ మొదటి ఫ్యాక్టరీని ఎప్పుడు ఎక్కడ నెలకొల్పారు ? ( 1611లో, మచిలీపట్టణంలో)
25. మద్రాసులోని సెయింట్ జార్జి కోటను ఆంగ్లేయులు ఎప్పుడు నిర్మించారు? ( క్రీ.శ.1641 లో ).
26. క్రీ.శ. 1639లో ఫ్రాన్సిస్‌డే అనే ఆంగ్ల ఉద్యోగి ఎవరి వద్ద నుండి మద్రాసును అద్దెకు తీసుకున్నాడు ? ( చంద్రగిరి పాలకుడైన శ్రీరంగరాయలు )
27. 1661లో పోర్చుగీసువారు బొంబాయిని ఎవరికి అరణంగా ఇచ్చారు? ( రెండవ చార్లెస్ కు )
28. 1687లో సూరత్‌కు బదులు ఏది ఇంగ్లీషు వారి వర్తక కేంద్రమయ్యింది ? ( బొంబాయి )
29. కలకత్తాలోని సెయింట్ విలియం కోటను ఆంగ్లేయులు ఎప్పుడు నిర్మించారు? ( క్రీ.శ. 1699లో)
30. ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ ఎప్పుడు స్థాపితమయ్యింది ? ( క్రీ.శ.1664లో )
31. ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ ప్రారంభించినదెవరు? ( 14వ లూయీ మంత్రి కోల్ బర్ట్ )
32. 1666లో ఔరంగజేబు ఫర్మానాను పొందిన వారెవరు ? ( ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీవారు )
33. వర్తకం కోసం భారతదేశానికి చివరిగా వచ్చిన ఐరోపా వారు ఎవరు ? ( ఫ్రెంచివారు )
34. భారతదేశంలో ఫ్రెంచివారు మొట్టమొదటి వర్తక కేంద్రం ఎక్కడ స్థాపించారు? (సూరత్ క్రీ.శ. 1668 )
35. ఇండియాలోని ఫ్రెంచి వలసలకు ప్రధాన కేంద్రం ఏది ? ( పాండిచేరి )
36. ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీవారు రక్షణ కోసం నిర్మించికొన్న కోట ఏది? ( పోర్టు లూయీ కోట )
37. ఫ్రెంచి గవర్నర్లలో ప్రసిద్ధి పొందినవారు ఎవరు ? ( ఫ్రాన్సిస్ మార్టిన్, లేనాయర్,డ్యూమాస్, డూప్లే )
38. డూప్లే ఎవరు ? (ఫ్రెంచి డైరెక్టర్ కుమారుడు )
39. కోరమండల్ తీరమునకు ఐరోపా వారు పెట్టిన పేరేమి ? ( కర్ణాటక )
40. మొదటి కర్ణాటక యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది? (క్రీ.శ. 1796 - 48 మధ్య ఆంగ్లేయులకు ఫ్రెంచి వారికి)
41. మొదటి కర్ణాటక యుద్ధం సమయంలో కర్ణాటక నవాబు ఎవరు? ( అన్వరుద్దీన్ )
42. ఫ్రెంచి గవర్నరైన డూప్లే కర్ణాటక నవాబుసైన్యాన్ని ఏ యుద్ధంలో ఓడించాడు? ( క్రీ.శ. 1746లో జరిగిన శాంథామ్ లేదా అటమార్ యుద్ధంలో )
43. మొదటి కర్ణాటక యుద్ధం ఎప్పుడు ఎలా ఆగింది ? ( క్రీ.శ. 1748లో ఆక్సులా - షాపెల్ సంధివల్ల )
44. రెండవ కర్ణాటక యుద్ధం ఎప్పుడు, ఎవరెవరి మధ్య జరిగింది ? (క్రీ.శ. 1749 - 54 మధ్య, ఆంగ్లేయులకు - ఫ్రెంచి వారికి
45. రెండవ కర్ణాటక యుద్ధమునకు ప్రధాన కారణమేమిటి ? ( దక్కను వారసత్వ తగాదాలు )

46. రెండవ కర్ణాటక యుద్ధంలో ఫ్రెంచి వారు ఎవరి పక్షం వహించారు ? ( ముజఫర్ జంగ్ - చందాసాహెబ్ పక్షం )
47. రెండవ కర్ణాటక యుద్దంలో ఆంగ్లేయులు ఎవరి పక్షం వహించారు ? ( నాజర్ జంగ్ - మహమ్మదాలీ )
48. రెండవ కర్ణాటక యుద్ధ సమయంలో ఫ్రెంచి గవర్నరు ఎవరు ? ( డూప్లే )
49. రెందవ కర్ణాటక యుద్ధసమయంలో ఫ్రెంచి ఇంగ్లీష్ గవర్నర్లు ఎవరు ? ( ప్లాయరు - సాండర్స్ )
50. మొదటి కర్ణాటక యుద్ధ ప్రధాన ఫలితమేది ? ( భారతీయ సైనిక బలహీనత బహిర్గతమయినది)
51. రెండవ కర్ణాటక యుద్ధ ప్రధాన ఫలితమేది ?
(దక్కనులో ఆంగేయులు ప్రాబల్యం వృద్ధి చెందింది , ఫ్రెంచి ప్రాబల్యం క్షీణించింది )
52. మూడవ కర్ణాటక యుద్ధ ఎప్పుడు జరిగింది ? మూడవ కర్ణాటక యుద్ధానికి ప్రధాన కారణమేది ? ( క్రీ.శ. 1756 - సం॥ - 63 సం॥ల మధ్య , ఐరోపాలోజరిగిన సప్తవర్ష సంగ్రామం )
53. మూడవ కర్ణాటక యుద్ధ సమయంలో ప్రెంచి, ఇంగ్లీషు గవర్నర్లు ఎవరు?
( కౌంట్-జ-లాలీ - ఫ్రెంచి, రాబర్టు క్లైవ్ - ఇంగ్లీషు)
54. మూడవ కర్ణాటక యుద్ధ ప్రధాన ఫలితమేది ? ( ఆంగ్లరాజ్య స్థాపన -ఫ్రెంచి పరాజయం )
55. క్రీ.శ. 1760లో జరిగిన వందవాసి యుద్ధం ఎవరెవరి మధ్య జరిగింది ? విజేత ఎవరు?
( ఫ్రెంచి, ఆంగ్లేయులకు మధ్య, విజేతలు - ఆంగ్లేయులు)
56. భారతదేశంలో బ్రిటీష్ సామ్రాజ్యానికి పునాదులు వేసిన వాడెవరు? ( రాబర్ట్ క్లైవ్ )
57. 'ఆర్కాట వీరుడ ' నే బిరుదెవరికి గలదు ? (రాబర్ట్ క్లైవ్ )
58. రాబర్ట్ క్లైవ్ ఫ్రెంచి వారి పై సాధించిన మొట్టమొదటి విజయమేది ? ( ఆర్కాటు ముట్టడి క్రీ.శ. 1752 )
59. ప్లాసీ, యుద్ధం ఎప్పుడు, ఎవరెవరి మధ్య జరిగింది?( క్రీ.శ. 1757లో, బెంగాలు నవాబైన సిరాజ్ ఉద్దౌలాకు, ఆంగ్లేయులకు)
60. 'ప్లాసీ విజేత బిరుదెవరికి గలదు? ( రాబర్ట్ క్లైవ్ )
61. ప్లాసీ యుద్ధానంతరం బెంగాలు గవర్నరెవరు ? ( రాబర్ట్ క్లైవ్)
62. ఇండియాలో డచ్చివారి ప్రాబల్యం నశించటానికి ప్రధాన కారణమేమి ?
( క్రీ.శ. 1759లో రాబర్ట్ క్లైవ్‌చే చిన్సురా ఆక్రమణ )
63. బక్సార్ యుద్ధం ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ.1769 అక్టోబర్ 22న )
64. బక్సార్ యుద్ధం ఎవరెవరికి మధ్య జరిగింది ? విజేత ఎవరు ?
( మీర్ ఖాసిం, షుజా ఉద్దౌలా, రెండవ షాఆలం కూటమికి, ఆంగ్లేయులకు విజేతలు -ఆంగ్లేయులు )
65. బక్సార్ యుద్ధంలో ఆంగ్లేయుల విజయానికి కారణమైన ఆంగ్లసేనాని ఎవరు? ( మేజర్ మన్రో )
66. అలహాబాద్ సంధి ఎవరెవరికి, ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1765లో రాబర్ట్ క్లైవ్ రెండో షా ఆలంకు )
67. బెంగాలులో ద్వంద్వ పాలన ఎప్పటి నుండి మొదలైంది ? (అలహాబాద్ సంధి తర్వాత నుండి )
68. అలహాబాద్ సంధి ప్రకారం కంపెనీ ఏమి సంపాదించింది ? ( బెంగాల్, బీహార్ , ఒరిస్సాల పై దీవానీ అధికారం )
69. రెవిన్యూ అధికారం వేరుగా, ప్రభుత్వ పాలన నిర్వహించే అధికారం వేరుగా ఉండేదానినేమంటారు ? (ద్వంద్వపాలన)
70. బ్రిటీష్ కంపెనీవారు స్థానిక ఉద్యోగులకు ఇచ్చే లైసెన్స్‌నేమందురు ? ( దస్తక్ )
71. ఇండియా లో యుద్ధాలలో మరణించినా లేక అంగవైకల్యం పొందిన బ్రిటీష్ సైనికుల సహాయార్థం ఏర్పరచిన నిధి ఏది ? ( క్లైవు నిధి )
72. ఇండియాలో మొదటి బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( వారన్ హేస్టింగ్స్ ( 1774 - 1785))
73. ఇండియాలో సివిల్ పాలనా విధానానికి పునాదులు వేసిన మొదటి గవర్నరు జనరల్ ఎవరు? ( వారన్ హేస్టింగ్స్ )
74. హేస్టింగ్ కాలంలో హిందూ ధర్మ శాస్త్రాన్ని 'సంక్షిప్త హిందూ ధర్మ శాస్త్రం ' పేరు తో ఆంగ్లంలోకి అనువదించినది ఎవరు ? (హాల్ హెడ్ )
75. రాబర్ట్ క్లైవ్ నెలకోల్పిన ద్వంద్వ ప్రభుత్వాన్ని రద్దు చేసినది ఎవరు? ( వారన్ హేస్టింగ్స్ )

76. భారతీయ సంస్కృతి పరిరక్షణకు వారన్ హేస్టింగ్స్ స్థాపించిన " ఆసియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాలు" అధ్యక్షుడు ఎవరు ?
( సర్ విలియం జాన్స్)

77. వారన్ హేస్టింగ్స్ కాలంలో జరిగిన ప్రధాన యుద్ధమేది ? ( మందటి మహారాష్ట్ర యుద్ధం )

78. వారన్ హేస్టింగ్స్ ప్రవేశపెట్టిన సంస్కరణలేవి ? ( రెవిన్యూ న్యాయ సంస్కరణలు )

79. మొదటి మహారాష్ట్ర యుద్ధ ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1778 - 82 మధ్య నానాఫట్నవీస్ నాయకత్వంలోని మహారాష్ట్ర కూటమికి, ఆంగ్లేయులకు)

80. మొదటి మహారాష్ట్ర యుద్ధం ఏ సంధితో ముగిసింది . ( సాల్బే సంధి )

81. మొదటి మైసూరు యుద్ధ ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది?
( క్రీ.శ. 1767 - 69 మధ్య, మైసూరు నవాబు హైదరాలీకు, ఆంగ్లేయులకు మధ్య )

82. రెండవ మైసూరు యుద్ధం ఎప్పుడు ,ఎవరెవరికి జరిగింది ? ఆ సమయంలో బ్రిటీష్ గవర్నరు జనరల్ ఎవరు ?
( క్రీ.శ. 1780 - 84 మధ్య, వారన్ హేస్టింగ్)

83. మూడవ మైసూర్ యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి మధ్య జరిగింది ?
( క్రీ.శ. 1790లో టిప్పు సుల్తానుకు - ఆంగ్లేయులకు మధ్య )

84. నాల్గవ మైసూర్ యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ? (టిప్పు సుల్తాన్ ఆంగ్లేయులకు , క్రీ.శ. 1799 లో )

85. మొదటి మైసూర్ యుద్ధ ఏ సంధితో ముగిసింది ? ( మద్రాసు సంధి )

86. రెండవ మైసూర్ యుద్ధ ఏ సంధితో ముగిసింది ? ( మంగుళూరు సంధి )

87. మూడవ మైసూర్ యుద్ధం ఏ సంధితో ముగిసింది ? ( శ్రీరంగ పట్టణ సంధి )

88. ఇండియాలో పోలీసు శాఖకు పునాదులు వేసింది ఎవరు ? ( కారన్ వాలీస్ )

89. సైన్య సహకార పద్ధతిని ప్రవేశ పెట్టిన బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( వెల్లస్లీ )

90. సైన్య సహకార పద్ధతికి అంగీకరించిన మొదటి స్వదేశీరాజు ఎవరు ? ( హైదరాబాద్ నిజామ్ )

91. వెల్లస్లీ కాలంలో జరిగిన యుద్ధాలేవి ? ( నాల్గవ మైసూరు యుద్ధం, రెండవ మహారాష్ట్ర యుద్ధం )

92. భారతదేశంలోని బ్రిటీష్ రాజ్యాన్ని బ్రిటీఫ్ సామ్రాజ్యంగా మార్చింది ఎవరు? ( వెల్లస్లీ )

93. మద్రాసు ప్రెసిడెన్సీ నిర్మాత ఎవరు ? ( వెల్లస్లీ )

94. కలకత్తాలోని ఫోర్టు విలియం కళాశాలను స్థాపించింది ఎవరు ? (వెల్లస్లీ )

95. రెండవ మహారాష్ట్ర యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ? విజేతలు ఎవరు ? ( క్రీ.శ. 1802 - 1805 లోసింధియా, భాణ్స్లేలలో కూడిన మహారాష్ట్ర కూటమికి - ఆంగ్లేయులకు )

96. రెండవ మహారాష్ట్ర యుద్ధము తరువాత జరిగిన సంధి ఏది ? (బేసిన్ సంధి)

97. మూడవ మహరాష్ట్ర యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1818లో మహారాష్ట్ర నాయకులైన పీష్వా బాజీరావు, అప్పారావు హోల్కారులకూ, ఆంగ్లేయులకూ మధ్య

98. పీష్వా పదవిని రద్దు చేసినదెవరు ? (హేస్టింగ్స్ ప్రభువు )

99. 'సామంత సంబంధ నిరోధ విధానము'ను ప్రవేశ పెట్టినది ఎవరు ? ( మార్క్వస్ ఆఫ్ హేస్టింగ్స్ )

100. 1775 - 1818 మధ్య ఆంగ్లేయులకు, మహారాష్ట్రులకు మధ్య ఎన్ని యుద్ధాలు జరిగినాయి ? ( 3 )

101. నేపాల్ యుద్ధం లేక గూర్ఖా యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
(క్రీ.శ.1814 - 16లో పృథ్వీ నారాయణ నాయకత్వంలోని గూర్ఖాలకు - ఆంగ్లేయులకు )

102. సగాలీ సంధి ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ? ( క్రీ.శ. 1816లో ఆంగ్లేయులకు గూర్ఖాలకు మధ్య )

103. పిండారులనే దారి దోపిడి దొంగల నణచిన గవర్నర్ జనరల్ ఎవరు ? ( మార్క్వస్ ఆఫ్ హేస్టింగ్స్)

104. పఠానుల బెడద నుండి భారత దేశాన్ని రక్షించింది ఎవరు? ( హేస్టింగ్స్ )

105. థగ్గులను దారి దోపిడి దొంగలను అణచింది ఎవరు? ( విలియం బెంటింక్ )

106. బ్రిటీష్ సామ్రాజ్యానికి స్వదేశీ సంస్థానాలు చేర్చి సామ్రాజ్య విస్తరణ కార్యక్రమాన్ని పూర్తి చేసిన వాడెవరు ? ( డల్హౌసీ )

107. డల్హౌసీ ప్రవేశపెట్టిన సిద్ధాంతమేది ? (రాజ్య సంక్రమణ సిద్ధాంతం )

108. భారత దేశంలో తంతి తపాలా పద్ధతి, ఏ గవర్నర్ జనరల్ కాలంలో ప్రవేశపెట్టబడినది ? ( డల్హౌసి)

109. భారత దేశంలో మొదటి రైలు మార్గం ఎప్పుడు ? ఎక్కడ నుండి ఎక్కడకు ఎవరి కాలంలో వేయబడింది ?
( క్రీ.శ. 1853 లో బోంబాయి నుండి థానాకు డల్హౌసీ కాలంలో )

110. బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టింది ఎవరు? ( మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్ )

111. భారత దేశంలో ఆంగ్లభాష రాజభాష ఎప్పుడు అయినది ? ఎవరు చేశారు ? (క్రీ.శ. 1835 మార్చి 7 విలియం బెంటింక్ )

112. సతీసహగమనమును ఎవరు, ఎప్పుడు నిషేధించిరి ? ( క్రీ.శ. 1829లో విలియం బెంటింక్ )

113. ఏ బ్రిటీష్ గవర్నరు జనరల్ కాలంలో ఇంగ్లండు, ఇండియాల మధ్య ప్రప్రథమంగా పొగ ఓడలు ప్రవేశపెట్టబడినవి?
(విలియం బెంటింక్)

114. సతీ సహగమన నిషేధం ప్రవేశపెట్టటంలో బెంటింక్‌కు సహకరించిన భారతీయుడు ఎవరు? (రాజా రామమోహన రాయ్)

115. భారతదేశంలో ఆంగ్లభాషను ప్రవేశపెట్టటానికి విలియం బెంటింక్‌కు సహకరించిన ఆంగ్లేయుడు ఎవరు?(లార్డ్ మెకాలే)

116. బొంబాయి, కలకత్తా, మద్రాసు విశ్వ విద్యాలయాలు ఎవరి కాలంలో స్థాపించబడినవి ? ( డల్హౌసీ )

117. ' రాజస్థాన్ కథావళి' రచించింది ఎవరు ? ( కర్నల్ టాడ్ )

118. 'మధ్య ఇండియా గాథలు ' రచించింది ఎవరు ? ( మాల్కామ్ )

119. శిక్కులకు జాతీయ రాజ్యం నిర్మించి పంజాబు సింహంగా పేరుపొందింది ఎవరు ? ( రంజిత్ సింగ్ )

120. రెగ్యులేటింగ్ చట్టం ఎప్పుడు ప్రవేశపెట్టబడింది ? ( క్రీ.శ. 1773 )

121. రెగ్యులేటింగ్ చట్టం ప్రాముఖ్యత ఏమిటి ? ( కంపెనీ రాజ్యం క్రమబద్దం చేయబడింది )

122. పిట్ ఇండియా చట్టం ఎప్పుడు చేయబడింది ? (క్రీ.శ. 1784లో )

123. చార్టర్ చట్టము లెన్ని ? అవి ఏ సంవత్సరాలలో చేయబడినవి ? ( నాలుగు 1793, 1813, 1833,1853 )

124. మొదటి శిక్కు యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1845లో లాల్ సింగ్, తేజ్ సింగ్ నాయకత్వంలోని శిక్కులకు, ఆంగ్లేయులకు )

125. మొదటి శిక్కు యుద్ధ సమయంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( హార్డింజ్ )

126. రెండవ శిక్కు యుద్దం ఎప్పుడు,ఎవరెవరి మధ్య జరిగింది ? ( క్రీ.శ. 1849 లో శిక్కులకు, ఆంగ్లేయులకు )

127 రెండవ శిక్కు యుద్ధ సమయంలోబ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( డల్హౌసీ )

128. మొదటి ఆఫ్ఘన్ యద్ధ ఎప్పుడు,ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1838 - 42 మధ్య, ఆఫ్ఘన్ రాజైన దోస్త్ మహ్మద్‌కు - ఆంగ్లేయులకు )

129. రెండవ ఆఫ్ఘన్ యుద్దం ఎప్పుడు , ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1878 లో ఆఫ్ఘన్ రాజైన షేర్ ఆలీకి - ఆంగ్లేయులకు )

130. మొదటి, రెండవ ఆఫ్ఘన్ యుద్ధ సమయంలోబ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( లిట్టన్)

131. మూడవ ఆఫ్ఘన్ యుద్దం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
(క్రీ.శ. 1919లో ఆఫ్ఘన్ రాజైన హబీబుల్లాకు - ( ఆంగ్లేయులకు )

132. మూడవ ఆఫ్ఘన్ యుద్ధ సమయంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( మాంటేగ్ చెమ్సుఫర్ట్ )

133. మొదటి బర్మా యుద్ధ ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ.1824 - 26 మధ్య, బర్మా చక్రవర్తి పాగ్విదోవాకు, ఆంగ్లేయులకు అమ్‌హరెస్ట్ )

134. రెండవ బర్మా యుద్ధం ఎప్పుడు ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1852లో బర్మా రాజైన ధెరావడేకి - ఆంగ్లేయులకు ( డల్హౌసీ )

135. మూడవ బర్మా యుద్ధం ఎప్పుడు, ఎవరెవరికి జరిగింది ?
( క్రీ.శ. 1886 - 1897 మధ్య, బర్మా రాజైన ధీబాకు, ఆంగ్లేయులకు ( డఫ్రిన్ )

# 16. భారత జాతీయోద్యమము (క్రీ.శ. 1857 – 1947)

1. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ( లేక ) సిపాయిల తిరుగుబాటు ఎప్పుడు జరిగింది ? ( క్రీ.శ. 1857లో )
2. సిపాయిల తిరుగుబాటు ఎక్కడ ప్రారంభమైంది ? ( మీరట్‌లో )
3. సిపాయిల తిరుగుబాటు సమయంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు ? ( లార్డ్ కానింగ్ )
4. సిపాయిల తిరుగుబాటుకు గల రాజకీయ కారణం ఏది ? ( డల్హౌసీ అనుసరించిన దురాక్రమణ విధానం )
5. సిపాయిల తిరుగుబాటుకు గల ఆర్థిక కారణం ఏమి ? ( బ్రిటీష్ వారి నూతన ఆర్థికవిధానం)
6. సిపాయిల తిరుగుబాటుకు గల సాంఘిక కారణం ఏది ? ( హైందవ సాంఘిక వ్యవస్థను ఖండించుట )
7. సిపాయిల తిరుగుబాటుకు గల సైనిక కారణం ఏమి ? ( ఇండియా , ఐరోపా సైనికుల మధ్య ఉన్న తారతమ్యం )
8. సిపాయిల తిరుగుబాటు సమయంలో ఢిల్లీ ముట్టడిలో ఆంగ్లేయులు సాగించిన దారుణ హింసాకాండను వర్ణించిన ఉర్దూ కవి ఎవరు ? (గాలిబ్ )
9. సిపాయిల తిరుగుబాటుకు కాన్పూర్‌లో ఎవరు నాయకత్వం వహించారు? ( నానాసాహెబ్ )
10. సిపాయిల తిరుగుబాటుకు అయోధ్యలో నాయకత్వం వహించింది ఎవరు? ( రాణీబేగం హజ్రత్‌మల్ - బాలాసాహెబ్ )
11. సిపాయిల తిరుగుబాటుకు ఝాన్సీలో నాయకత్వం వహించింది ఎవరు ? ( ఝాన్సీ లక్ష్మీబాయి )
12. మధ్య ఇండియాలో సిపాయిల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన దెవరు? ( తాంతియాతోపే )
13. సిపాయిల తిరుగుబాటు కాలంలో ఢిల్లీ సైనికులు ఎవర్ని పాదుషాగా ప్రకటించారు ? ( మొగల్ చక్రవర్తి రెండో బహదూర్ షాను )
14. సిపాయిల తిరుగుబాటు ఫలితంగా 1958లో బ్రిటీష్ పార్లమెంటు ఆమోదించిన చట్టం ఏది ? ( ఆక్ట్ ఫర్ బెటర్ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా )
15. సిపాయిల తిరుగుబాటును అణచివేయడంలో ప్రముఖపాత్ర వహించిన బ్రిటీష్ సేనానులు ఎవరు? ( సర్ జేమ్స్, అవుట్రామ్, హ్యావ్‌లాక్, నికల్‌సన్, నెయిల్‌లారెన్స్, సర్ రోజ్‌వుడ్ )
16. సిపాయిల తిరుగుబాటు అనంతరం చేయబడిన భారత ప్రభుత్వ చట్టమేది? ( 1858 భారత ప్రభుత్వ చట్టం)
17. విక్టోరియా మహారాణి ప్రకటన ఎప్పుడు వెలువడింది ? ( క్రీ.శ. 1858 నవంబరు 1 )
18. విక్టోరియా మహారాణి ప్రకటనను ఎవరు ఎక్కడ చదివారు ? (లార్డ్ కానింగ్ - అలహాబాద్‌లో )
19. భారతదేశపు మొట్ట మొదటి బ్రిటీష్ రాజప్రతినిధి ( వైశ్రాయ్ ) ఎవరు ? (లార్డు కానింగ్ )
20. ఈస్టిండియా కంపెనీ పాలన ఏ తిరుగుబాటుతో అంతమైంది ? ( సిపాయిల తిరుగుబాటు )
21. భారత ప్రభుత్వ వ్యవహారాలకు బాధ్యత వహించే బ్రిటీష్ ప్రభుత్వ విధానాన్ని ఏమందురు ? ( గృహ ప్రభుత్వం )
22. కార్యనిర్వాహక శాఖ నుంచి శాసన నిర్మాణశాఖను వేరు చేసిన చట్టం ఏది? ( 1861 శాసన సభల చట్టం )
23. బోర్డ్ ఆఫ్ డైరెక్టర్సు, బోర్డు ఆఫ్ కంట్రోలు ఏ చట్టం రాకతో రద్దయినవి? ( 1858 భారత ప్రభుత్వ చట్టం )
24. గవర్నర్ జనరల్ అధికారాలను విస్తృతం చేసిన చట్టం ఏది ? ( 1870 చట్టం)
25. బెంగాల్ గవర్నర్ జనరల్ , ఇండియా గవర్నర్ జనరల్‌గా మారింది ఏ చట్టం వల్ల ? అలా మారిన మొదటి గవర్నరు జనరల్ ఎవరు.? ( 1833 చార్టరు చట్టం, విలియం బెంటింక్ )
26. గవర్నరు జనరల్ సలహా సంఘంలో న్యాయసభ్యుడు ఏ చట్టం వల్ల నియమింపబడ్డాడు ? అలా నియమింపబడిన మొదటి న్యాయ సభ్యుడు ఎవరు ?( క్రీ.శ. 1833 చార్టరు చట్టం వల్ల, లార్డ్ మెకాలే )
27. బ్రిటీష్ గవర్నర్ జనరల్, బ్రిటీష్ రాజప్రతినిధిగా ఏ చట్టం వల్ల మారాడు? ( 1858 భారత ప్రభుత్వ చట్టం )

28. మనదేశంలో తొలిసారిగా ఏ బ్రిటీష్ గవర్నరు జనరల్ కాలంలో జనాభా లెక్కల సేకరణ జరిగింది ? ( లార్డు మేయో - 1871లో )

29. కార్మికుల సంక్షేమం కోసం మనదేశంలో కర్మాగార చట్టం ప్రప్రథమంగా ఎప్పుడు చేయబడింది? అప్పుడు రాజప్రతినిధి ఎవరు? (క్రీ.శ. 1881లో, లార్డు రిప్పన్ )

30. భారత పౌర ఉద్యోగ చట్టం ఎప్పుడు చేయబడింది ? (క్రీ.శ. 1862లో )

31. చట్ట బద్ధ ఉద్యోగ వ్యవస్థను ఎప్పుడు ప్రవేశ పెట్టారు? ( క్రీ.శ. 1879లో )

32. ఎర్ర సముద్రం గుండా కేబుల్ ద్వారా ఇంగ్లండ్‌కు వార్తలు పంపే సౌకర్యం తొలిసారిగా ఏ బ్రిటీష్ రాజప్రతినిధి కాలంలో ఏర్పడింది. ( లార్డు మేయో )

33. మనదేశంలో పౌర ధర్మశాస్త్రాన్ని ఎప్పుడు ప్రచురించారు ? (క్రీ.శ. 1858లో )

34. మనదేశంలో నేర ధర్మశాస్త్రాన్ని ఎప్పుడు ప్రచురించారు ? ( క్రీ.శ. 1860లో )

35. భారతదేశంలో స్థానిక స్వపరిపాలన చట్టాలు ఎప్పుడు చేయబడినవి? (కీ.శ. 1880 - 84 )

36. మనదేశంలో స్థానిక పరిపాలనా పితామహుడు ఎవరు? ( లార్డు రిప్పన్ )

37. భారతీయ మేజిస్ట్రేట్‌కు యూరోపియన్ నిందితులను విచారించటానికి అధికారాన్నిచ్చే బిల్లు ఏది ? ( ఇల్బర్టు బిల్లు )

38. ఇల్బర్టు బిల్లును ఎవరు ప్రవేశపెట్టారు ? (లార్డు రిప్పన్ )

39. 'ఇల్బర్టు బిల్లు'ను ఎవరు రూపొందించారు ?( గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక మండలిలోని న్యాయశాఖ సభ్యుడైన ఇల్బర్టు)

40. దేనికి నిరసనగా లార్డ్ రిప్పన్ తన పదవికి రాజీనామా చేశాడు ? ( ఇల్బర్టు బిల్లు సవరణకు నిరసనగా )

41. రెండో కర్మాగార చట్టం ఏ గవర్నర్ జనరల్ కాలంలో అమలులోకి వచ్చినది? ( లార్డు లాన్స్‌డౌన్ )

42. భారతదేశంలో యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషన్ ఎప్పుడు నెలకొల్పబడింది? ( క్రీ.శ. 1866లో లార్డ్ డఫ్రిన్)

43. ఏ బ్రిటీష్ రాజప్రతినిధి పాలనా కాలం 'కమీషన్ల కాలం' గా పిలువబడింది? ( లార్డు కర్జన్ )

44. 'రైతబాంధవుడు' అని పేరు పొందిన వైస్రాయ్ ఎవరు.? ( లార్డు కర్జన్ )

45. ' Do Quick Viceroy 'గా పేరొందిన వైశ్రాయ్ ఎవరు ? ( లార్డు కర్జన్ )

46. భారతదేశంలో ప్రత్యేక పురావస్తు శాఖను ఏర్పాటు చేసిన వైశ్రాయ్ ఎవరు? ( లార్డు కర్జన్ )

47. భారత దేశంలో పురావస్తుశాఖ మొట్టమొదటి డైరెక్టర్ జనరల్ ఎవరు? ( సర్ జాన్ మార్షల్ )

48. బెంగాల్ భూమిశిస్తు చట్టాన్ని ఎప్పుడు ప్రవేశపెట్టారు ? ( క్రీ.శ. 1859 )

49. పూనాలో వ్యవసాయ పరిశోధనా కేంద్రం ఎప్పుడు స్థాపించబడింది ? ( క్రీ.శ. 1901 )

50. మనదేశంలో ఆధునిక విద్య ప్రవేశపెట్టడానికి ఎవరు సూచన చేశారు ? ( లార్డు మెకాలే )

51. మనదేశంలో ఆధునిక విద్యను ప్రవేశపెట్టినది ఎవరు? ( విలియంబెంటింక్ )

52. దేశ భాషా పత్రికల చట్టాన్ని అమలు జరిపిన గవర్నర్ జనరల్ ఎవరు? ( లార్డు లిట్టన్ )

53. 1862లో స్వదేశ సంస్థానాదిపతులు బ్రిటీష్ రాజ్యాధిపతి సామంతులని ప్రకటించిన దెవరు ? (లార్డు కానింగ్ )

54. విక్టోరియారాణి 'భారత చక్రవర్తి'ని అనే బిరుదు ధరించినదెప్పుడు ? ( క్రీ.శ. 1877లో )

55. స్వదేశ సంస్థానాలు ఆంతరంగిక వ్యవహారాలలో చురుకుగా జోక్యం చేసుకొన్నదెవరు? ( లార్డు లాన్స్‌డౌన్ )

56. శాశ్వత కౌలు పద్ధతి ద్వారా నిజామ్ నుంచి బీరార్ ప్రాంతాన్ని వేరు చేసి బ్రిటీష్ పాలిత ప్రాంతాలలో విలీనం చేసినదెవరు? (లార్డు కర్జన్ )

57. ఆఫ్ఘనిస్థాన్ - పాకిస్తాన్ మధ్య నున్న ' డ్యూరాండ్ సరిహద్దు రేఖ ' ఎప్పుడు ఏ రాజ ప్రతినిధి కాలంలో నిర్ణయించబడింది ? (క్రీ.శ. 1892, లార్డు లాన్‌డౌన్)

58. చైనా - భారతదేశం మధ్య నున్న మెక్‌మోహన్ సరిహద్దు రేఖ ఎప్పుడు, ఏ రాజ ప్రతినిధి కాలంలో నిర్ణయింపబడింది? ( లార్డు రెండవ హర్డింజ్ )

59. వహాబీ తిరుగుబాటును అణచివేసినదెవరు ? ( మొదటి ఎల్జిన్ )

60. గడతేరిన ఉపేక్షావిధానం లేదా కుశలస్తబ్ద విధానం అనుసరించిన దెవరు? ( జాన్ లారెన్స్ )

61. భూటాన్ ను ఆక్రమించిన గవర్నర్ జనరల్ ఎవరు ? ( జాన్ లారెన్స్ )
62. బ్రిటీష్ ఇండియా, భూటాన్‌ల మధ్య జరిగిన సంధి ఏది ? ( సించులా సంధి )
63. భారతదేశంలో తొలిసారిగా సి.ఐ.డి. లను ప్రవేశపెట్టినదెవరు? ( లార్డు కర్జన్ )
64. విశ్వ విద్యాలయాల చట్టాన్ని రూపొందించిన దెవరు? ( లార్డు కర్జన్ )
65. బెంగాల్ ను విభజించిన బ్రిటీష్ రాజ ప్రతినిధి ఎవరు? ( లార్డు కర్జన్ )
66. బెంగాల్ విభజన ఎప్పుడు జరిగింది ? (క్రీ.శ. 1905 )
67. బెంగాలులోని 'పూసా' ఇంపీరియల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూట్‌ను నెలకొల్పింది ఎవరు ? ( లార్డు కర్జన్ )
68. ప్రత్యేక రైల్వే బోర్డు ఎవరి కాలంలో నెలకొల్పబడింది ? ( లార్డు కర్జన్ )
69. అఖిల భారత ముస్లింలీగ్ స్థాపన ఎప్పుడు జరిగినది ? ( క్రీ.శ. 1906లో )
70. మింటోమార్లే సంస్కరణలు ఎప్పుడు ప్రవేశ పెట్టబడినవి ? ( క్రీ.శ. 1909లో )
71. భారత జాతీయ కాంగ్రెస్ ఎప్పుడు ఆవిర్భవించింది ? ( క్రీ.శ. 1885లో )
72. జాతీయ కాంగ్రెసును, ముస్లింలను సంతృప్తి పరచడానికి బ్రిటీష్ ప్రభుత్వం 1909లో ప్రవేశపెట్టిన సంస్కరణ చట్టం ఏది ( మింటోమార్లే సంస్కరణలు )
73. విభజించు పాలించు విధానానికి నాంది పల్కిన సంస్కరణలు ఏవి ? (మింటోమార్లే సంస్కరణలు )
74. కలకత్తా నగరం ఏఏ గ్రామాల కలయిక వలన ఏర్పడింది ? (సుతమతి, కాశీ ఘట్టం, గోవిందపూర్‌లు )
75. భారతదేశ రాజధాని కలకత్తా నుండి ఢిల్లీకి ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో మార్చబడింది ? (క్రీ.శ. 1911 లార్డు రెండవ హార్డింజ్ )
76. కేంద్ర వ్యవసాయ శాఖను ఎప్పుడు ఏర్పాటు చేశారు ? ( క్రీ.శ. 1906లో )
77. దేశ వ్యవసాయాభివృద్దికి అనేక ముఖ్య సూచనలు చేసిన లార్డ్‌లిన్‌బిర్‌గో కమీషన్ ఎప్పుడు నియమించబడింది. (క్రీ.శ. 1923 లో )
78. మింటో మార్లే సంస్కరణలకు గల మరో పేరేమిటి ? ( 1909 శాసన సభల చట్టం )
79. ఇంగ్లండు చక్రవర్తి ఐదవ జార్జి భారతదేశాన్ని ఎప్పుడు సందర్శించాడు ? నాటి బ్రిటీష్ రాజ ప్రతినిధి ఎవరు. ? ( క్రీ.శ. 1911, లార్డు రెండవ హార్డింజ్ )
80. ఢిల్లీలోని ఇండియా గేటు ఎందుకు నిర్మించబడింది ? ( మొదటి ప్రపంచ యుద్ధ మృత వీరుల స్మారక చిహ్నంగా )
81. ప్రథమ ప్రపంచ యుద్ధ కాలంలో బ్రిటీష్ గవర్నర్ జనరల్ ఎవరు? ( లార్డ్ ఛెమ్స్‌ఫర్డ్ )
82. మాంటేగు - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు దేనికి సంబంధించినవి ? (నూతన రాజ్యాంగ సంస్కరణలు)
83. మాంటేగు - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు ఎప్పుడు ప్రవేశపెట్టబడినవి ? (క్రీ.శ. 1919 )
84. స్వయం పరిపాలనా ఉద్యమం లేదా హోంరూల్ లీగ్ ఎప్పుడు స్థాపించబడింది ? ( కీ.శ. 1916లో )
85. హోమ్ రూల్ ఉద్యమం ప్రారంభించిన దెవరు? ( డా॥ అనిబిసెంట్, బాల గంగాధర తిలక్‌లు )
86. గాంధీజీ నాయకత్వంలోని సహాయ నిరాకరణోద్యమం ఎప్పుడు ప్రారంభమైంది ? ( క్రీ.శ. 1920లో )
87. బ్రిటీష్ ప్రభుత్వం లార్డ్ సైమన్ కమీషన్‌ను ఎప్పుడు నియమించినది ? ( క్రీ.శ. 1927లో )
88. భారతదేశంలో సైమన్ కమీషన్ పర్యటన నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు ఇర్విన్ )
89. భారతజాతీయ కాంగ్రెస్ దేశానికి సంపూర్ణ స్వాతంత్రం కావాలని ఎప్పుడు తీర్మానించింది ? ( డిశంబరు 1929లో )
90. గాంధీజీ నాయకత్వంలో శాసనోల్లంఘనోద్యమం ఎప్పుడు ప్రారంభమైంది? (క్రీ.శ. 1930 లో )
91. సైమన్ కమీషన్ నివేదిక ఆధారంగా రూపొందించిన భారత ప్రభుత్వ చట్టాన్ని బ్రిటీష్ పార్లమెంటు ఎప్పుడు ఆమోదించింది ? (క్రీ.శ.1935లో )
92. కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌కు గల మరో పేరేమిటి ? (ఎగువసభ లేదా రాజ్యసభ)

93. కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌లో మొత్తం సభ్యుల సంఖ్య ఎంత ?
( 260 మంది 156 మంది బ్రిటీష్ పాలిత ప్రాంతాలకు, 104 మంది స్వదేశీ సంస్థానాలకు చెందిన వారు )

94. ఫెడరల్ అసెంబ్లీకి గల మరోక పేరేమిటి ? ( దిగువ సభ లేదా శాసన సభ)

95. ఫెడరల్ అసెంబ్లీలో మొత్తం సభ్యుల సంఖ్య ఎంత ? ( 375 మంది )

96. మనదేశంలో ద్వి సభ విధానానికి పునాదులు వేసిన చట్టం ఏది ? ( 1919 భారతప్రభుత్వ చట్టం )

97. కేంద్ర కార్య నిర్వాహక మండలిలో భారతీయునికి ప్రాతినిధ్యం ఏ చట్టం వల్ల కల్పించబడింది ? ( 1909 ఇండియా కౌన్సిల్ చట్టం )

98. కేంద్ర కార్యనిర్వాహక మండలిలో సభ్యుడైన ప్రప్రథమ భారతీయుడు ఎవరు ? ( ఎస్.పి. సిన్హ )

99. రాష్ట్రాలలో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వం ఏ బ్రిటీష్ ప్రభుత్వ చట్టం వల్ల వచ్చింది ? ( 1935 భారత ప్రభుత్వ చట్టం )

100. మొదటి రౌండు టేబుల్ సమావేశం ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగింది ? ( క్రీ.శ. 1930, లార్డు ఇర్విన్ )

101. రెండు, మూడు అఖిల పక్ష సమావేశాలు ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగినవి ? ( క్రీ.శ. 1931, 32 - లార్డు విల్లింగ్‌టన్ )

102. మొదటి ప్రపంచ యుద్ధం (1911 -16 ) కాలం నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు రెండవ హార్డింజ్ )

103. రెండవ ప్రపంచ యుద్ధం ( 1939 - 45 ) కాలం నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు లిన్‌లిత్ గో)

104. బెంగాల్ విభజన రద్దు ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగింది ? ( క్రీ.శ. 1911లో, లార్డు రెండవ హార్డింజ్ )

105. ఢిల్లీ దర్బారు ఎప్పుడు, ఏ రాజప్రతినిధి కాలంలో జరిగింది ? ( క్రీ.శ. 1911లో, లార్డు రెండవ హార్డింజ్ )

106. నేటి భారత రాజ్యాంగానికి ప్రాతిపదిక అయిన బ్రిటీష్ ప్రభుత్వ చట్టం ఏది ? (1935 భారత ప్రభుత్వ చట్టం )

107. శాసన సభ్యులకు పరోక్ష ఎన్నికల విధానం ప్రప్రథమంగా ఏ బ్రిటీష్ చట్టం వల్ల ప్రవేశపెట్టబడింది ? (క్రీ.శ. 1892 భారత కౌన్సిల్ చట్టం)

108 . క్విట్ ఇండియా ఉద్యమం ( 1942 ) నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు లిన్‌లిత్‌గో )

109. మంత్రి త్రయ రాయబారం ( 1946 ) నాటి బ్రిటీష్ రాజప్రతినిధి ఎవరు? ( లార్డు వేవెల్ )

110. మన దేశానికి వచ్చిన చివరి రాజప్రతినిధి ఎవరు? ( లార్డు మౌంట్ బాటన్ 1947 - 48 )

111. సివిల్ మారేజ్ యాక్ట్ ఎప్పుడు చేయబడింది ?; ( క్రీ.శ. 1872లో )

112. బాల్య వివాహాలను నిషేదించే శారదా చట్టం ఎప్పుడు వచ్చింది ? ( క్రీ.శ. 1930 )

113. ఉమన్స్ ఇండియా అసోసియేషన్ ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? ( క్రీ.శ. 1923 - మద్రాసు )

114. కుటుంబ నియంత్రణ లీగ్ ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? ( క్రీ.శ. 1923 - బోంబాయి )

115. బర్మా ఆంగ్ల సామ్రాజ్యంలో భాగంగా బ్రిటీష్ - ఇండియాలో ఎప్పుడు విలీనమైంది ? ( క్రీ.శ. 1897లో )

116. బ్రిటీష్ ఇండియా నుండి బర్మా ఎప్పుడు విడదీయబడింది ? ( క్రీ.శ. 1937లో )

117. బర్మా ఎప్పుడు స్వాతంత్ర్యం పొందింది ? ( క్రీ.శ. 1948 జనవరి 4న )

118. ఏ చట్టం ద్వారా సమాఖ్య న్యాయస్థానం ఏర్పడింది ? ( 1935 చట్టం )

119. కేంద్ర విద్యా సలహా సంఘాన్ని ఎప్పుడు స్థాపించారు ? ( క్రీ.శ. 1920లో )

120. అంతర్విశ్వవిద్యాలయ బోర్డు ఎప్పుడు ఏర్పాటయింది ? ( క్రీ.శ. 1924లో )

121. మొట్టమొదటి ఆంగ్ల విద్యాలయం ఎప్పుడు, ఎక్కడ స్థాపించబడింది ? (క్రీ.శ. 1818, కలకత్తాలో )

122. హంటర్ కమీషన్ ఏ బ్రిటీష్ రాజ ప్రతినిధి కాలంలో నియమించబడింది? ( కీ.శ. 1883, రిప్పన్ )

123. సర్ చార్లెస్ ఉడ్ పథకం ఎప్పుడు తయారైంది ? నాటి రాజప్రతినిధి ఎవరు ? (క్రీ.శ. 1854 - డల్హౌసీ )

124. బోంబాయిలోని ఎలి ఫిన్ స్టన్ కళాశాల ఎప్పుడు స్థాపించబడింది ? (క్రీ.శ. 1834 )

125. 1834లో 'ధర్మసభ' అనే సంస్థను స్థాపించినదెవరు ? ( కాశీప్రసాద్ ఘోష్ )
126. హైదరాబాద్, లక్నో, కాశీ, ఆలీఘడ్ విశ్వవిద్యాలయాలు ఎప్పుడు స్థాపించబడినాయి ? (క్రీ.శ. 1920 లో )
127. అలహాబాద్ విశ్వవిద్యాలయం ఎప్పుడు స్థాపించబడింది ? ( క్రీ.శ. 1921లో )
128. ఢిల్లీ విశ్వవిద్యాలయం ఎప్పుడు స్థాపించబడింది ? (క్రీ.శ. 1922లో)
129. రవీంద్రనాథ్ ఠాగూర్ శాంతినికేతన్ ఎప్పుడు స్థాపించాడు ? (క్రీ.శ. 1921లో)
130. ఏ న్యాయస్థానాల చట్టాన్ని అనుసరించి పాట్నాలో హైకోర్టు స్థాపించారు? ( 1911. న్యాయస్థానాల సవరణ చట్టం )
131. ఆధునిక భారతీయ పునరుజ్జీవన ఉద్యమానికి పునాది వేసినదెవరు ? (రాజారామమోహన రాయ్ క్రీ.శ. 1774 - 1833)
132. 'బ్రహ్మ సమాజ' స్థాపకుడు ఎవరు ? అది ఎప్పుడు స్థాపించబడింది ? ( రాజారామమోహన్ రాయ్ క్రీ.శ. 1828)
133. సతీసహగమన నిషేధానికి కృషి చేసిన సంఘ సంస్కర్త ఎవరు? ( రాజారామమోహనరాయ్ )
134. సతీసహగమన నిషేధాన్ని అమలు చేయాల్సిందిగా రామమోహనరాయ్ ఎవరికి విజ్ఞప్తి చేశారు ? (గవర్నర్ జనరల్ విలియం బెంటింక్ )
135. వర్ణ భేదాలు కూడదని, పరమత సహనం పాటించాలని అన్ని మతాల సారమొక్కటేనని ప్రచారం చేసిన సమాజం ఏది ? (బ్రహ్మసమాజం )
136. 'సాధారణ బ్రహ్మ సమాజం' నాయకుడు ఎవరు ? ( పండిత శివనాథ శాస్త్రి)
137. ' రాజారామమోహన రాయ్ ' స్థాపించిన బెంగాలీ వారపత్రిక ఏది ? ( సంవాద కౌముది )
138. రాజారామమోహనరాయ్‌కు 'రాజా' అనే బిరుదు నిచ్చినవారు ఎవరు? ( మొగలు చక్రవర్తి ఐన రెండవ అక్బరు)
139. రాజారామమోహనరాయ్ మరణించిన తరువాత బ్రహ్మ సభకు ఆధిపత్యం వహించినదెవరు? (మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ )
140. బ్రహ్మ సమాజంలో ఏర్పడిన శాఖలేవి ? ( 1. ఆదిసమాజము 2. అఖిల భారత సమాజము 3. సాధారణ బ్రహ్మ సమాజము )
141. 'ఆది సమాజం' నాయకుడు ఎవరు ? ( దేవేంద్రనాథ్ ఠాగూర్ )
142. 'అఖిల భారత సమాజం ' నాయకుడు ఎవరు ? ( కేశవ చంద్రసేన్ )
143. ' బ్రహ్మధర్మము ' అనే గ్రంథాన్ని రచించిన దెవరు ? ( మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ )
144. 'తత్త్వ బోధిని' అనే పత్రికను స్థాపించినదెవరు ? ( మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ )
145. 'తత్త్వ బోధినీ' పత్రికా సంపాదకుడు ఎవరు ? ( అక్షర కుమార దత్తు )
146. 'తత్త్వబోధినీ' సభను స్థాపించింది ఎవరు ? అది ఎప్పుడు స్థాపించబడింది? (దేవేంద్రనాథ్ ఠాగూర్, క్రీ.శ. 1839లో)
147. ఆంధ్రలో బ్రహ్మ సమాజ నాయకులెవరు ? ( రఘుపతి వెంకటరత్నం నాయుడు , కందుకూరి వీరేశలింగం పంతులు)
148. 'ఆర్య సమాజం' స్థాపకుడు ఎవరు ? అది ఎప్పుడు స్థాపించబడింది ? ( స్వామి దయానంద సరస్వతి, క్రీ.శ. 1875లో)
149. ' Go back to vedas ' అనే నినాదాన్ని ఇచ్చింది ఎవరు ? ( స్వామి దయానంద సరస్వతి )
150. స్వామి దయానంద సరస్వతి రచించిన గ్రంథమేది ? ( సత్యార్థ ప్రకాశిక )
151. మతైక్యత సాధించాలన్న లక్ష్యంతో ' శుద్ధి' అనే సంస్కారాన్ని ప్రవేశపెట్టినదెవరు ? ( దయానంద సరస్వతి )
152. స్వామి దయానంద సరస్వతి గురువు ఎవరు ? ( విరజానందుడు )
153. ఆర్య సమాజానికి కేంద్రం ఏది ? ( పంజాబు )
154. స్వామి దయానంద సరస్వతి అసలు పేరేమిటి ? ( మూలేచంద్ )
155. ఆర్య సమాజం ప్రసాదించిన ప్రముఖ జాతీయ నాయకుడు ఎవరు ? (లాలా లజపతిరాయ్ )
156. స్వామి దయానంద సరస్వతి ఎప్పుడు జన్మించాడు ? ( క్రీ.శ. 1824 )
157. ప్రార్థనా సమాజాన్ని ఎవరు స్థాపించారు ? అది ఎప్పుడు స్థాపించబడింది? ( ఆత్మారాం పాండురంగ క్రీ.శ. 1867లో )
158. మహారాష్ట్ర లో మత సంస్కరణ ఉద్యమ నిర్వహణ కోసం వెలసిన సంఘం ఏది ? ( ప్రార్థనా సభ, 1849 )
159. ప్రార్థనా సమాజాన్ని అభివృద్ధి చేయడంలో ప్రముఖ పాత్ర వహించినది ఎవరు ?( ఆర్.జి. భండార్కర్, మహదేవ్ గోవింద రనడే )

